శ్రీరస్తు Acc No: 2836

# మహాభారత ధర్మశాస్త్రము

## శాంతి, అనుశాసనిక పర్వములు - వచనము

కవి బ్రహ్మ తిక్కన సోమయాజి రచించిన ఆంధ్ర మహాభారతభాగమును
అనుసరించి వ్రాసినది

రచయిత

కవిశేఖర, భారతీ ప్రసన్న కొండేపూడి సుబ్బారావు

ప్రచురణ

ప్రసన్న భారతీ గ్రంథమాల

47-10-5, ద్వారకానగర్, విశాఖపట్టణము 530 016,
ఆం. ప్ర. ఇండియా

Abridged Prose version of
"Santi - Anusasanika Cantos
from the great Epic. Maha Bharata

మహాభారత ధర్మశాస్త్రము
శాంతి, అనుశాసనిక పర్వములు-

ప్రచురణ 2001
ప్రతులు 750

మూల్యము. రు. 100/- U.S. $ 20/-


ప్రాప్తి స్థానము
47-10-5, ద్వారకానగర్
విశాఖపట్టణము - 16

ముద్రణ
టైపు సెటింగు "ప్రసన్న భారతి"
ఆఫ్‌సెట్ ప్రింటింగ్ - జి.కె. ప్రింట్ హౌస్ - విశాఖ

# మహాభారత ధర్మశాస్త్రము

## శాంతి, అనుశాసనిక పర్వములు - వచనము

## తొలి పలుకు

మహాభారతమున గల శాంతి, అనుశాసనిక పర్వములు రెంటిని సామాన్యులకు గూడ తెలియు నట్లు సులభమగు భాషలో వ్రాయుట యందు నాకు ప్రేరణ కల్పించిన విషయమును, ఈ రెండు పర్వములలోనున్న విశేషములు ప్రజలకెందులకు కావలయును అను అంశమును గూర్చియు ఈ మాటలు వ్రాయుచున్నాను. కవి బ్రహ్మ తిక్కన సోమయాజి వ్రాసిన భారత భాగములోని యీ రెండు పర్వముల ననుసరించి ఈ గ్రంథము వ్రాయ బడినది.

ప్రభుత్వ ఉద్యోగమునుండి 1974లో నేను విరమణ నందినప్పటినుండియు, నా చిన్ననాటి భాషా భ్యాసమే ప్రోత్సాహముగ ఎన్నియో పద్య గద్య గ్రంథములను వ్రాసితిని. ఇవియన్నియు చాలవరకు ధార్మికములే. అయినను ఏదియో యింకను జనుల జీవనమునకు ప్రయోజనకరమైన గ్రంథము వ్రాయవలెనని తలంపు గలిగినది. నా మనస్సు మహాభారతముపై పడినది. మహాభారతము సర్వధర్మ సారము. అది ధర్మ శాస్త్రము, వేదాంతము, నీతి శాస్త్రము, మహాకావ్యము అన్నియుఅదే.

వ్యాసభగవానుడు సంస్కృతమున వ్రాసి లోకక్షేమమున కందించిన పంచమవేదమది. మొత్తము 18 పర్వములు 94,756 శ్లోకములు గలది. దానిని తెనుగున వ్రాసిన వారు నన్నయ, తిక్కన, ఎఱ్ఱా ప్రగడ మహాకవులు. మహాభారతమున శాంతి, అనుశాసనిక పర్వములు అతిము ఖ్యమైనవి. ఈ రెండు పర్వములలో సంస్కృతమున శ్లోకములు 26525, తెనుగున 5241 గద్య, పద్యములున్నవి. ఇహపరసుఖ సాధకులకు మానవ జీవన పరమార్థము నెఱిగించు ధర్మములు నీతులు ఇందున్నవి. ఇందులేనివి మఱి యెచ్చటను లేవు.

మహాభారతమున ఎందులకు చదువవలయును. చదివి నందులకు ఫలమేమి? ఒక్క మాటలో చెప్పవలయునన్నచో ఉత్తమ మైన మానవ జన్మను పొందినందులకు అన్ని వర్ణముల వారు, అన్ని వృత్తులవారు, పరిపాలకులు (పూర్వమున రాజులు) ప్రజలు, ఎట్టి సద్వర్తనమున దైన ందిన లోక వ్యవహారమునందును ఆధ్యాత్మిక సాధన యందును ప్రవర్తించి ఎట్లు జన్మమును సార్థక మొనరించు కొనగలరో ఆ విషయములన్నియు స్పష్టముగ ఇందున్నవి. ఇవి యెల్లరును తెలిసికొని ఆచరింపవలసిన జీవన ధర్మములు. భారతమునందున్న ప్రధాన విశేషమిది. ఈ ధర్మములాచ రించుట వలన ప్రతివ్యక్తియు తన్ను తానుద్ధరించుకొని సమాజమునకు ఉపయోగము కాగలడు.

శాంతి, అనుశాసనిక పర్వములు గొప్ప ధర్మశాస్త్రము. ప్రస్తుత గ్రంథమునందా పర్వము లందలి విశేషములు క్లుప్తముగ వ్రాయబడినవి. ఎందేని భావలోపముగాని, దానికి తోడు అచ్చు తప్పులును కనుపడవచ్చును. సహృదయ పాఠకులు తెలియ జేసినచో సవరించుకొందుము.

గ్రంథారంభమున నున్న ప్రస్తావనలో మహాభారత ప్రాధాన్యము విపులముగ వివరింపబడినది.

బహు వ్యయ ప్రయాసలతో ప్రజోపయోగము కొఱకు సంతరింపబడిన ఈ గ్రంథమును ఆంధ్ర ప్రజలాదరించి అందలి ప్రయోజనము నందగలరని విశ్వసించుచున్నాను.

గ్రంథకర్త

# కృతజ్ఞత

మహా భారతమునందలి శాంతి అనుశాసనిక పర్వములు మానవునికి ఇహపర సౌఖ్యములను చేకూర్చు ధర్మ శాస్త్రములు. సామాన్యులకు కూడ తేటతెల్లమగు నట్లు సులభమైన వచనములో వ్రాయబడిన ఈ గ్రంథము, ఉదారులు, సద్గుణ సదా చార వర్తనులు, సంపన్నులు, భగవద్భక్తి తత్పరులు, అయిన శ్రీ ఉప్పలపాటి అప్పల నరసింహరాజు గారొసగిన ద్రవ్య సహాయమున ముద్రింపబడినది. పూర్వమునుండియు ఆంధ్ర రాజన్యులెందఱో సాహిత్యపోషకులై ఆంధ్ర భారతికి చేసిన సేవ నిరుపమాన మైనది. ఆ కోవలో వచ్చిన వారే శ్రీ నరసింహ రాజుగారు. ఎన్నో విధముల ఎన్నో సంస్థలకు సహాయమొనర్చిన వదాన్యులు వీరు. శ్రీ కృష్ణ పరమాత్మ శ్రీ రాజుగారికి వారి కుటుంబ మెల్లరకు సంపూర్ణ ఆయురారోగ్య సంపదలిచ్చి ఎల్లవేళల రక్షించును గాక యని నా ప్రార్థన.

వారు, వారి సతీమణి కలిసి యున్న ఛాయాచిత్రము గౌరవ పూర్వకముగ ఈ వెనుక పుటలలో ముద్రింపబడినది.

మధురవచస్వి, ప్రవచన శిరోమణి, ఉభయ వేదాంత ప్రవర్తకులు, మహా పండితులు మహా పౌరాణికులైన శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్య స్వామి వారు, నివేదనము అను పేర ఈ గ్రంథమునకు వ్రాసియిచ్చిన ఆశీః పూర్వక అనుగ్రహ వాక్యము లిందున్నవి. ఇతః పూర్వమే నా పొత్తము లెన్నింటికో ఆ ముఖములు వ్రాసి యిచ్చిన మహనీయులు వారు. ఆరోగ్య మంత బాగుగా లేకున్నను నా విన్నపమును మన్నించి ఈ భూమికను వ్రాసి యిచ్చిన శ్రీ మాన్ అప్పలాచార్య స్వామివారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియ జేయుచున్నాను.

ఈ గ్రంథ రచన సందర్భమున, తమ సహాయమునిట్లొనర్చి ఎంతయో ప్రోత్సాహము నొసగిన శ్రీ ఉప్పలపాటి అప్పల నరసింహ రాజుగారికిని, శ్రీమాన్ శ్రీ భాష్యం అప్పలాచార్య స్వామి వారికిని మఱియొకసారి నా కృతజ్ఞతాభివందనములు సమర్పించుచున్నాను.

కొండేపూడి సుబ్బారావు

గ్రంథకర్త.



ఈ గ్రంథ ముద్రణకు
సహాయము చేసిన వదాన్యులు
**శ్రీ ఉప్పలపాటి అప్పలనరసింహరాజుగారు**

వారి సతీమణి
**శ్రీమతి రాధాయమ్మగారు**

# నివేదనము

**శ్రీ భాష్యం అప్పలాచార్యులు**

మాన్య శ్రీ కొండేపూడి సుబ్బారావుగారు "మహాభారత ధర్మశాస్త్ర" మను పేరున వ్రాసిన శాంతి అను శాసనిక పర్వములు వచన గ్రంథమును చదివి ఆనందించితిని.

శ్రీ సుబ్బారావుగారు మహాకవి. వారి మనోభావములో ఆ భారతి సర్వదా విహరించు చుండును. వారి హృదయమునుండి వెల్వడిన భారతి సుప్రసన్న. ఆర్ష సంస్కృతికి వారెన్నో గ్రంథములు సమర్పించిరి. రామాయణ ఉత్తర రామాయణ భారతములు, కృష్ణ భాగవత దేవీ భాగవతములు, గీతామృతము, వేంకటేశ్వర కర్ణామృతము ఈశ్వరార్పణము మున్నగు పెక్కు పద్యకావ్యములు, విజయగీత, పరమేశ్వరి భక్త మందారము వంటి వచన కావ్యములు, ఎన్నో శతకములు అనువాదములు బహు సంఖ్యగా వారి లేఖిని నుండి వెల్వడినవి. హనుమ వారి ఆరాధ్య దైవమై వారి నుండి ఒక మహాకావ్యము హనుమత్ప్రబంధము వెలయింపజేసికొనినాడు. వీరి కావ్యములు పెక్కింటికి తిరుమల తిరుపతి దేవస్థానము వారి ద్రవ్యసహాయమేకాక, పెక్కు సంస్థల నుండి పురస్కారములు లభించినవి. కవిశేఖర, మధురకవి, భారతీ ప్రసన్న, ఆంధ్రదండి అభినవపోతన మున్నగు ప్రసిద్ధ బిరుదములతో ఆంధ్ర ప్రజానీకము వారిని గౌరవించినది. వారు ఆర్ష ధర్మమునకు చేసిన సేవ అపరిమితము.

భారతము పంచమవేద మని ప్రసిద్ధి నొందినది. ప్రత్యక్షము చేతగాని అనుమానము చేతగాని తెలియని దానిని తెలియచేయునది వేదము. వేదయతి ఇతి వేదః ఎఱిగించునది అని అర్థము. మనము మానవులమై జన్మించినను, జ్ఞానము కలవారమే అయినను దేనిని పొందవలెనో ఎట్లు పొందవలెనో, అట్టి జ్ఞానమును ప్రసాదించిన వేదములో ప్రధానమైన పర్వములనుండి మనమెఱుగగలము. భారముకలదిగనుక భారతము అనిపేరు. ఆ భారమే విజ్ఞాన భారము. దానిని ప్రధానముగ మనకందించినవి భారతములోని శాంతి అనుశాసనిక పర్వములు. ఆర్షవాఙ్మయములోని రహస్యము లెన్నియో ఇందు పొందుపఱుపబడినవి. సామాన్య ధర్మములు తెలిసి కొనుటకు గాని, విశేష ధర్మములు తెలిసికొనుటకుగాని ఈ పర్వములే ఆధారము.

మనము తెలిసికొనవలసినదేది. తెలియజేయు సాధనమేది. తెలిసికొనుటకు ఆటంకమేమి. తెలిసికొని నందువలన ఫలమేమి. ఈజ్ఞానమును పొందుతానెవరు? అను విషయములనెరుంగ జేయునది వేదము; దాని రూపాంతరము భారతము. దానిలో శాంతి అనుశాసనిక పర్వములను తెనుగులో కవిబ్రహ్మ తిక్కనగారు పద్యగద్య రూపమున అందించిరి. ఈ పర్వములను తెనుగు వారికి సులభముగా బోధపడునట్లు వచనమున వ్రాసిన భాగ్యము శ్రీ సుబ్బారావుగారిది. తెనుగులోనున్నను తిక్కనగారి భాష మనకు సులభగ్రాహ్యము కాదు. దానిని తేటతెల్లమగు తెనుగులోనికి తెచ్చి ఆంధ్ర పాఠక లోకమునకు అందించి మహోపకారము నొనర్చినారు శ్రీసుబ్బారావుగారు. ఇది అసామాన్యమైనపని.

మిగిలిన మహాభారత పర్వములు వ్రాయుట ఒక యెత్తు 'శాంతి అనుశాసనిక పర్వములు వ్రాయుట ఒకయెత్తు' ఈ పర్వములు అంతఃకరణ నైర్మల్యమును కలిగించి మానవులు సన్మార్గమున ధార్మికముగ ప్రవర్తించుటకు సాయపడును. ఈ రెండు పర్వములలో ఏ ఒక్క అంశమును వదలి పెట్టకుండ సులభమగు తెలుగు భాషలో వ్రాసి, అనుబంధముగా శ్రీ విష్ణు సహస్రనామములు గూడ చేర్చుట ఈ గ్రంథమున ఒక ప్రత్యేకత. ఇట్టి మహా గ్రంథమును తెలుగువారికందించిన మహోపకారులు శ్రీ సుబ్బారావుగారు. వారు చేసిన మహోపకారమునకు ఆంధ్రదేశము ఋణపడియున్నది. ఇతర గ్రంథములెన్నో వ్రాసినను, ఈ రెండు పర్వములు వ్రాయనిచో మానవ జీవితమున చిత్తశాంతి ఏర్పడి ఆత్మ దర్శనము చేయుట సాధ్యపడదు. అట్టి భారతములో మహోదాత్తమైన రెండు పర్వములను తెనుగు వారి కందించిన శ్రీ సుబ్బారావుగారు ధన్యజీవనులు.

నాకు వారిని గూర్చిగాని, ఆ పర్వములను గూర్చిగాని వ్రాయుటకు అధికారము లేక పోయినను వారి గ్రంథములు నాకు ప్రేరణ నిచ్చిన ఈ కొద్ది మాటలతో కృతజ్ఞతను తెలియ జేసికొను భాగ్యము లభించినది.

శ్రీ సుబ్బారావుగారు దీర్ఘ ఆయురారోగ్యములతో ఎందరికో ఆదర్శ భూతులై తమ సద్వర్తనముచే ఎందరికో మార్గదర్శకులుగా నిండుగా నూరేండ్లు ఉండునట్లు శ్రీ సీతారామచంద్ర ప్రభువు అనుగ్రహించుగాక అని ప్రార్థించుచున్నాను.

# మహాభారత ధర్మశాస్త్రము

## శాంతి అనుశాసనిక పర్వములు : వచనము

## విషయసూచిక

**షష్ఠాశ్వాసము :-**



అనుశాసనిక పర్వము - **పుటలు 1-125**

**విషయ సూచికకు 158వ పుట తరువాత చూడుడు**

# నతి

1. భూరి తపో విశేష మహిమోజ్జ్వల మూర్తి, సనాతనార్ష సం
స్కార మహామనస్వి, మనుజావళికిన్ సుఖశాంతి హేతువౌ
భారత ధర్మ నిర్వచన భారము నూనిన మౌనియున్ మహా
భారత కర్త, వ్యాస భగవానుని కంజలి బెట్టి మ్రొక్కెదన్.

2. వేదనిగూఢధర్మపదవిన్ సుగమమ్మొనరించి, బ్రహ్మసూ
త్రోదయ తత్త్వదర్శనమధుద్రవసారము పంచిపెట్టి, సం
పాదిత భక్తిభావపరమార్థము లైన పురాణ వాఙ్మయ
స్వాదువులన్ జగత్తున కొసంగిన వ్యాసమహర్షికిన్ నతుల్.

3. అలనన్నయ్యయు, తిక్కయజ్వయును ఎఱ్ఱన్నార్యు డాంధ్రోక్తిని
ర్మల దుగ్ధాబ్ధులు, వేద శాస్త్ర వివిధార్థజ్ఞాన సంపత్సుధీ
విలసన్మూర్తులు వ్యాస భారతము నుర్విన్ తెల్గు తీయమ్ములం
దలరంజేసిన వాఙ్మహేశ్వరులు సాంద్రస్వచ్ఛ కీర్తీశ్వరుల్.

4. పాలకులెట్లు న్యాయపరిపాలన చేయుటయో, సమాజ మే
చాలున ధర్మజీవనము సల్పుటయో వచియించు విద్య కా
వాలము భారతాగమము, భవ్యగుణప్రతిబోధనమ్ములై
గ్రాలుచు నున్న వం దిహపరార్థ ఫలమ్ములు, ధర్మ మార్గముల్.

5. మనుజాలకున్ ధరిత్రిని సమంచిత జీవన ధర్మమార్గపున్
వినుత విధానమున్ దెలుపు విశ్వజనీన విధమ్ము భారత
మ్మునకును మిన్నయైన పరమోత్తమ గ్రంథము కానరాదు, దీ
విని విని, యెల్లరున్ జదివి నేర్వదగున్ భువి జీవనార్థముల్.

6. ఆ వాల్మీకియు వ్యాసమౌనియును దివ్య ప్రాభవుల్ భారత
క్ష్మావిఖ్యాతికి మూల కారణులు, లోకక్షేమ కార్యైక దీ
క్షావేశ ప్రథమాన మూర్తులు, జగత్ సంపూజ్యు లామౌని రాట్
సేవా సంస్మృతి కీపురాణ రచనల్ చిహ్నమ్ములై పొల్చుతన్.

శ్రీరస్తు

# శ్రీ మహాభారత ధర్మశాస్త్రము

## మహాభారతము - శాంతి, అనుశాసనిక పర్వములు

## ప్రస్తావన

శ్రీమద్భారత భూభాగము సత్కార్మములకు నిలయమైన పుణ్యభూమి. వర్ణాశ్రమ నియమాచరణకు స్థానమయిన ధర్మక్షేత్రము. కులపర్వతములలో నొకటియు అతి ముఖ్యమైనదియు అగు మేరువునకు దక్షిణ మందున్న జంబూద్వీపమున గల ఈ భరత వర్షము, శైల కానన నదీ కాంచన మణి మయాది ధాతు సంపన్నను. సర్వ ప్రకృతి సంపత్ సమృద్ధము. మనువు మొదలు మహా మహీపతులెందరో ప్రజలను కన్నబిడ్డలుగా ఏలి కీర్తిగాంచిన ప్రసిద్ధ దేశము. వేద శాస్త్రజ్ఞులు, నిస్స్వార్థులు, త్యాగపురుషులు అయిన ఋషీంద్రులు కవీంద్రులు ఉద్భవించిన పవిత్ర భూమి. వేదోపనిషద్ధర్మము లాధారముగ వారు వ్రాసి భారత ప్రజకందిచ్చిన పురాణములు, కావ్యములే ఈ నాటికిని భారతీయ సంస్కృతికి మూలాధారమై మానవ ధర్మ మెట్టిదో సర్వ ప్రంచమునకుచాటి చెప్పిన జ్ఞాన భాండారములు.

సూర్య వంశీయులు చంద్ర వంశీయులు అయిన చక్రవర్తులు రాజులు, రారాజులు ఎందరెందరో వేదోపనిషద్ధర్మముల ననుసరించి న్యాయ మార్గమున ధరణి నేలి ప్రఖ్యాతి వడసిరి. సాక్షాత్తు నారాయణుడే ఈ భూమిపై అనేకావతారములనెత్తి ధర్మమునకు హాని జరిగినప్పుడు దుష్ట శిక్షణ శిష్టరక్షణ గావించిన కథలున్నవి. దేవి, కాళీ దుర్గా రూపములను ధరించి దుష్ట రాక్షసులను దునుమాడిన చరిత్రలున్నవి. దేవతా వ్యవస్థలో ఇంకెందరెందరో ఘన కార్యముల నిర్వర్తించిన సందర్భములున్నవి. దైవ స్వరూపులేమి, చక్రవర్తులేమి ఇతరమహా పురుషులేమి, వారు చేసిన పనుల వలన వారి వర్తనము వలన చూపిన నీతులు ధర్మములు, ఋషులు కవులు వారు రచించిన గ్రంథములందు తెలిపిరి. వ్యాస మహర్షి మానవులకు సుబోధకములుగా నుండునట్లు వేదములను నాలుగు భాగములుగా వేరు చేసినాడు. మహా పురాణములను పదునెన్మిదింటిని రచించినాడు. చంద్ర వంశమున జన్మించిన పూరువు భరతుడు, కురు, పాండువు మున్నగు మహా రాజులు హస్తిన రాజధానిగా ఈ భరత వర్షము నేలిన రాజ వతంసులు. అందు ధృతరాష్ట్ర పాండు భూపతులు సోదరులు. ధృత రాష్ట్రుని సుతులు దుర్యోధనాదులు నూర్గురు కౌరవులు, పాండు రాజు కుమారులు ధర్మరాజాదు లయిదుగురు పాండవులు. ఈ కౌరవ పాండవుల చరితమే మహా భారత గ్రంథము. ఇది బహుపురాణ సముచ్చయముగా కీర్తికెక్కినది. వ్యాస మహర్షి ఎవరో కాదు. కౌరవ పాండవులకు తాతయే. తాను స్వయముగా విని కని వ్రాసిన చరిత్రమీ భారత పురాణము.

కౌరవులు దుష్ట స్వభావులు. పాండవులు న్యాయవర్తనులు. ఇరువురును దాయాదులు. న్యాయముగ పాండవులకు రావలసిన అర్ధరాజ్యము నీయక దుర్యోధనుడు వారిని అష్టకష్టముల పాల్జేసి మాయ జూదము నందోడించి వనవాసమునకంపెను. పండ్రెండేడ్లు వనవాసము, ఒక యేడజ్ఞాత వాసమున అన్ని బాధలు పాండవులు సహించిరి; వనవాసమునుండి తిరిగి వచ్చి తమరాజ్య భాగము తమకిమ్మని దుర్యోధనునకు వార్త నంపిరి. తుదకు అయిదుగురన్నదమ్ములకు అయిదూళ్ళు చాలుననిరి. విష్ణ్వవ తారుడయిన శ్రీ కృష్ణుడే రాయబారము జరిపినాడు. ఆ ప్రయత్నము విఫల మైనది. ఫలితము ఇరుతెగలకును మహా యుద్ధము కురుక్షేత్రమున జరిగినది. అదియే మహా భారత యుద్ధము. చతురంగ బలసమేతములయిన ఏడక్షౌహిణులు పాండవ బలము. ఏకాదశక్షౌహిణులు కౌరవ సైన్యము.

పాండవ మధ్యముడు వీరాధి వీరుడు అయిన అర్జునునకు శ్రీకృష్ణుడు రథ సారథిగా సంగ్రామము నడచినది. ఇరుతెగల సైన్యములు పోరిపోరి నశించిరి. కౌరవులెల్లరు మడిసిరి. పాండవులకు విజయమబ్బినది. కాని అది యెట్టి విజయము. పెద్దలు, పిన్నలు, బంధువులు మిత్రులు పరివార మెల్లరు తన మూలమున గదా రణ నిహతులైరని ధర్మమూర్తి యగు ధర్మరాజు మనస్తాపము చెంది దురంత దుఃఖము నందెను. దుర్మార్గులగు వైరుల నణచినాడు. హస్తినాపుర సామ్రాజ్య సింహాసనము నెక్కి ధరణి నేల వలసిన తరుణము. ఈతనికీ విచారమేలయని బంధువులు మిత్రులు ఋషులు, తుదకు కౌరవుల పక్షమూని నేలగూలి శరతల్పగతుడైన జ్ఞానయోగి, తాత భీష్ముడును ఎన్నియో నీతులను కర్తవ్య ధర్మములను బోధించి శాంతపరచిరి. ధర్మజుని మనస్తాపముడిగినది. సామ్రాజ్యాధిపతియై తన సోదరులు నలువురితో కలసి ప్రజా శ్రేయోదాయకముగ మహినేలెను. భీష్ముడు ధర్మజునకు ఉపదేశించిన జీవన ధర్మములు నీతులు శాంతి అనుశాసనిక పర్వములందున్నవి. భారతము నందు ముఖ్య ఘట్టములగు ధర్మోపదేశములీ పర్వములందున్నవి.

మహా భారత ప్రశస్తి యెట్టిది? ఈ మహా గ్రంథమును వ్యాసమహర్షి సంస్కృత భాషలో వ్రాసెను. ఈ గ్రంథము ప్రపంచము నందనేక భాషలలో అనువదింప బడినది. ఆంధ్రదేశమున రాజ మహేంద్రి రాజధానిగా క్రీ.శ 11వ శతాబ్దమున రాజ్యమేలిన రాజరాజ నరేంద్రుడు తన యాస్థాన కవియగు నన్నయ భట్టారకునిచే వ్యాస భారతమును తెనుగు జేయించెను. ప్రారంభించి మొదటి రెండున్నర పర్వములనే వ్రాసి నన్నయ దివంగతుడయ్యెను. తరువాత రెండు వందలయేండ్లకు దక్షిణాంధ్రమున నెల్లూరు చోడ అధిపతి మనుమసిద్ధి యాస్థానముననున్న కవిబ్రహ్మ తిక్కన తుది పదునైదు పర్వములను తెనుగొనర్చి మహా కీర్తి మంతుడయ్యెను. ఈ శాంతి అను

శాసనిక పర్వములు తిక్కన కవీంద్రుడు వ్రాసిన భారత భాగములోనివి. మూడవ పర్వము అరణ్య పర్వములో నన్నయ వ్రాయగా మిగిలిపోయిన కొంత భాగము ఎఱ్ఱా ప్రగడ పూరించెను. అద్దంకిరాజధానిగ కొండవీటి నేలిన వేమారెడ్డి ఆస్థాన కవి ఎఱ్ఱా ప్రగడ (14వ శతాబ్దము). ఇట్లీ ఆంధ్ర భారతమునకు రూపరేఖలు దిద్దిన వారీ కవిత్రయము. ప్రపంచమున ఇంతటి గొప్ప గ్రంథము, మఱియొక్కటి లేదు. భారతమును తెలుగు వారికిచ్చిన ఋషి కల్పులీ ముప్పురు కవులును. భారతమునకు గల ప్రశస్తి యెట్టిదో ఆదికవి నన్నయ భట్టారకుడు6 ప్రారంభమునందొక పద్యమున వ్రాసినాడు.

ఆ పద్యమే యిటనుదహరింప బడినది. పద్యార్థము సుబోధకమే.

సీ॥ ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని, అధ్యాత్మ విదులు వేదాంత మనియు,
నీతివిచక్షణుల్ నీతి శాస్త్రం బని, కవి వృషభులు మహా కావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహ మని, యైతిహాసకు లితిహాసమనియు,
పరమ పౌరాణికుల్ బహు పురాణసముచ్చయం బని మహిఁగొనియాడు చుండ,

వివిధ వేద తత్త్వ వేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశ రాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగు చుండఁ జేసె భారతంబు.

మహాభారత మనగా ధర్మశాస్త్రము, వేదాంతము, నీతిశాస్త్రము, మహాకావ్యము ఇతిహాసము, పురాణముల సమూహము, సర్వలక్ష్య సంగ్రహము అన్నియు అదే అనిన పొగడ్తగన్నది. కర్త వ్యాసమహర్షి కేవల విష్ణు సమానుడు. సర్వజన జాతికి సంబంధించినది అయిదవ వేదమేయిది. ఇది మహా భారత ప్రశస్తి. సాటిలేని మహాగ్రంథము. ఇంతేకాదు, మానవాభ్యుదయమునకు వలసిన ధర్మము లిందున్నవి. ఇందులేనిది విశ్వమున మరియెచ్చటను లేదు. అందుచేతనే విశ్వజనీనము అనగా సర్వజనులకు హితవైనది అనినారు. ఎంత గొప్పతనము!

శాంతివర్వము 6 ఆశ్వాసములు 286 పుటలలో మొత్తము 3093 గద్య పద్యములకును, అనుశాసనిక పర్వమును 5 ఆశ్వాసములు 201 పుటలలో మొత్తము 2148 గద్య పద్యములకును ఈ ప్రస్తుత గ్రంథము సంక్షిప్త వచన రూపము.

చదువరులు ఇందుగల ఒక ముఖ్య విషయమును గమనింపవలయును. మహా భారతమున శాంతి అనుశాసనిక పర్వములు చాల ముఖ్యమైనవి. అన్ని వర్గముల వారికిని వలయు జీవన ధర్మము లిందున్నవి. మానవ జన్మ సర్వోత్తమమైనది. తమ జన్మములను

సార్థకమొనరించి ముక్తిని పొందుటకు, సముచితమైన ధర్మములు సదాచారము, చిత్తశుద్ధి, శాంతి, శమదమనియమ నిష్ఠ అందఱికిని సమానమే అందఱికిని కావలసినవే.

ఇవిగాక శాంతిపర్వమున రాజధర్మము, రాజనీతి, పరిపాలనాక్రమమున రాజులకు వలయు లక్షణములు ప్రధానముగ చెప్పబడినవి. భారతము ద్వాపర యుగమునాటి కథ. ఈనాటి క్రీ.శ. 18,19 శతాబ్దముల వరకును భరతవర్షమున రాజులే పాలకులు. వారికి చెప్పిన ధర్మములు ఇప్పటి ప్రజాప్రతినిధులయిన పరిపాలకులకు అన్వయించు కొనవలయును. అనుశాసనిక పర్వమున జనులకు సర్వవృత్తుల వారికి దైనందిన వర్తనమునకు హితములైన ధర్మములున్నవి.

ఆనాడు వర్ణాశ్రమ ధర్మములు ముఖ్యము. ఈనాడు అవి సడలి వివిధములైన వృత్తి విద్యలతో సమాజము నడచుచున్నది. ఇదియంతయు ప్రవృత్తి మార్గము. ఇహలోక ప్రవర్తనము.

ఇవిగాక, పరమ పద ప్రాప్తికి కావలసిన ఆధ్యాత్మిక చింతన, యోగ సాంఖ్య విధానముల నివృత్తి మార్గములిందున్నవి.

ఇట్లు ఇహపర సుఖములు మానవుడెట్లు పొందగలడో అవి యన్నియును కల సంపూర్ణ ధర్మశాస్త్రము, శాంతి అనుశాసనిక పర్వములు.

తాను సర్వ ధర్మవిదుడైనను, భీష్ముడు తానెఱిగినవి వినినవే కాక ఎందఱో మునులు, మహాత్ములు చెప్పినవియు కథారూపమున నుడివెను. అవి ధర్మ విషయములను తేటతెల్లమొనరించుటకే. ఏ మునియో తానుపదేశించిన ధర్మమును గూర్చి నుడివిన నియమనిష్ఠలు మఱియొక ధర్మోపదేశమునకును ఆవశ్యకములై చెప్పవలసివచ్చును. వానిని సూక్ష్మముగ పరిశీలింపవలయునే గాని, పునరుక్తియని కొట్టి వేయరాదు.

శాస్త్రపరమగు సాంకేతికపదములు మధ్యలో తరుచుగ వచ్చుచుండును. వాని వివరణము గూడ ఆ పాఠములయందే కలదు.

సార్వ జనీనము శాశ్వతము విశ్వ శ్రేయోదాయకమగు నీ మహాభారత ధర్మ శాస్త్రమును పఠితలు శ్రద్ధాభక్తులతో చదివి అందున్న ప్రయోజనములందుదురుగాక.

కొండేపూడి సుబ్బారావు
గ్రంథకర్త



# మహాభారత ధర్మశాస్త్రము

## శాంతి పర్వము - ప్రథమాశ్వాసము

### శ్రీకృష్ణుడు, వ్యాస నారదాది మునులు చేసిన ఉపదేశము : ధర్మరాజు సందేహములు

భారత మహా సంగ్రామమున దుర్యోధనాదుల నెల్లరను దునుమాడి ధర్మరాజు లబ్ధ విజయుడైనాడు. భార్యతో సోదరులతో నేగి గంగా తీరమున జ్ఞాతి జనులకు యథా విధి శ్రాద్ధ కర్మల నొనర్చి ఒక నెలపాటు అచ్చటనే విడిదియున్న సమయమున, కణ్వాది మహా మునులు తమ శిష్య గణముతో వెంటరా నారదుండే తెంచి ధర్మజుడొనరించిన అర్ఘ్య పాద్యాది సద్విధులకు సంతృప్తుడై అతనితో ''ధర్మరాజా! మహా బాహుబల సంపన్నులయిన నీ యనుజులు భీమార్జునుల సాయమున కౌరవుల నోడించి సామ్రాజ్యమును చేజిక్కించుకొన్నావు. నీ యభిలాష ఫలించినది'' అనగనే ధర్మరాజొకింత చిన్న బుచ్చుకొనిన మొగమున ''మునీంద్రా! ఇదియేమి సంతోషము? ఆత్మీయులను, కుల పెద్దలను, పోగొట్టుకున్నాను. అనుగు కొమరులు ద్రౌపదేయులు అభిమన్యుడును రణ రంగమున ప్రాణము లర్పించినారు. మరియొక పెద్ద దుఃఖ భారమే ఉన్నది. శ్రాద్ధ విధులారంభమగు సమయమున మా జనని కుంతి వచ్చి కర్ణుడు సూర్య వరమున తన తొలి చూలనియు తొల్దొల్త వానికి కర్మవిధి నెరవేర్పుమనినది. ఆ మాటవిని నా గుండె తల్లడిల్లినది, అన్న గారిని చంపించిన దుష్టమతిని, ఆయనను జూచినపుడెల్ల నాకేదో అనురాగ భావమే యుండెడిది. కర్ణుడు సూతుడెట్లయి నాడు, ఆతని మరణమునకు మూలము లయిన, శాపము లెట్లు సంభవించినవి. ఈ వివరములు వినగోరెద'' నని పొంగి పొరలు కన్నీరు దుడుచుకొనెను.

నారదుడంతట ''ధర్మజా! జరిగిన దంతయు విధి విధానము మఱచి పొమ్ము. దీనికై యింత మనస్తాపము కూడదు. ఇక కర్ణుని విషయమా, నిజముగ నతడు మహా తేజస్వి, నిరుపమాన శౌర్య ధూర్వహుడు. ఆతని చరిత్రము వినుము, వీరాధి వీరుడయ్యు కర్ణుడెన్నియో అగచాట్ల పాలయి యాతని మృతి కాతడే కారణమైనాడు.

కుంతి భోజుడను నృపతి పెంచుకొనిన కొమరిత కుంతి. దుర్వాస మహా ముని ఆ రాజు నింటికి వచ్చిన సమయమున కుంతి ఆ మునికి పరిచర్య చేసినది.

తనకు జరిగిన పరిచర్యకు దుర్వాసుడు సంతృప్తుడై కుంతికొక మంత్రముపదే శించెను. ఆ మంత్ర ఫలమున కుంతి సూర్యుని ప్రత్యక్షము జేసికొని సూర్య తేజస్వియైన పుత్రుని కనినది. ఈ బాలుని పుట్టుక వలన కుంతికి కన్యాత్వ భంగము లేదని సూర్యుడు వరమిచ్చి చనెను. ఆ శిశువు పుట్టుకతోడనే కాంచన కుండల ములుండుటచే కర్ణుడైనాడు. పుట్టుకతో కవచమును వచ్చినది. తన కన్యాత్వ భంగమునకు భయపడి కుంతి ఆ పసికూనను ఒక తొట్టెలో పెట్టి నదిలో విడువగా, ఆ పెట్టె నదిపై దేలుచు బోయి ఒక సూతునకు దొరకినది. ఆతని భార్య రాధ ఆ ముద్దుపాపని అల్లారు ముద్దుగా బెంచి పెద్దవానిని జేసెను. అతడు రాధేయుడై నాడు. తాను స్వయముగ మహా తేజో వంతుడు. మీ అయిదుగురు సోదరుల పేరు ప్రఖ్యాతులు, సద్భావము విని అసూయ జెంది ద్రోణుని వద్దకేగి బ్రహ్మాస్త్ర ముపదేశింపుడని ప్రార్థించెను. హోమ వ్రతుడైన విప్రునకు, సుక్ష త్రియునకు గాని తానస్త్రోపదేశము చేయనని ద్రోణుడు తిరస్కరించెను. పగపడి కర్ణుడు పర శురాముని వద్దకేగి తాను భృగువంశ బ్రాహ్మణుడనని అనృత మాడి అన్ని విద్యలు బ్రహ్మాస్త్రమును పొందెను. ఆ యుద్ధ విద్యాభ్యాసమున కర్ణుని బాణము తగులగా ఒక విప్రుని గోవత్సము మృతి జెందెను. ఆ విప్రుడు కోపించి ఓ వీరాధమా నీ యెదుట నున్నదేదో నీవు చూడకున్నావు. యుద్ధసమయమున నీ రథ చక్రము భూమియందు క్రుంగిపోవుగాక అని శాపమిచ్చెను. ఒకనాడు పరశురాముడు తన శిష్యుడగు కర్ణుని తొడ యందు తలనుంచి నిదుర బోవ ఒక దుష్ట కీటము వచ్చి ఆ తొడను కరచినది. ఆ ప్రదేశము రక్త సిక్తమై పరశు రామునకు మెలకువ వచ్చి యిదేమని అడుగగా తమకు నిద్ర భంగమౌనని మిమ్ములను మేల్కొలుపలేదు, అనిన కర్ణుని మాటలకు కినిసి ఆ గురు సత్తముడు కర్ణా! విప్రున కింత సహనము ఉండదు, నీవొక విప్రుడనని అనృతమాడి నావద్ద శిష్యునిగ జేరినావు. ఈ యప చార ఫలముగ నేనిచ్చిన అస్త్ర శస్త్రములు నీకు అక్కఱ యగునపుడు నిష్ఫల ములగునని శాపమిచ్చి పంపెను. కర్ణునికికనేమియు తోచక దుర్యోధనుని జేరి తన యుద్ధ విద్యా లాభములు జెప్పెను. కళింగ రాజపుత్రి శుభాంగి స్వయంవర సమ యమున తక్కిన రాజ పుత్రుల నోడించి దుర్యోధనుని మన్ననలందుకొనెను. జరాసంధుని కూడ నోడించి అతని నుండి మాలినీ నగరమును గొన్న వీరుడు కర్ణుడు. మీకును కౌరవులకును యుద్ధ మాసన్నమైనది. కర్ణుని శౌర్యమునకు భయపడి విప్రవేషమున అర్థియై వచ్చి ఇంద్రుడాతని కవచ కుండలములను భిక్ష

గా గొనెను. ద్యూత సమయమున, ధర్మరాజా! కర్ణుడు మంచి చెడ్డలెరుగుక ద్రౌప ది నవమానించి దుర్భాషలాడెను. దుష్టులగు దుర్యోధనాదుల వీడి మీ పక్షము జేరి గౌరవము నందుమని తల్లియగు కుంతియు, శ్రీ కృష్ణుడును ఎంతయో చెప్పిరి. కర్ణునికా సదుపదేశము చెవికెక్కలేదు. ఏది యెట్లున్నను అర్జునుడు మహేంద్ర మహేశ్వర వరములందుకొనిన వీరుడు. శ్రీకృష్ణుని చెలిమి యున్నది. ఈ మహత్త్వముచే భీష్మ ద్రోణ కర్ణాదుల నిర్జించి నీకు రాజ్యమొసగెనని నారదుడు నుడివి తనదారి నేగెను.

ధర్మరాజీ మాటలన్నియు వినెను. తన ఆత్మ వేదన యెక్కువయ్యెనే గాని తగ్గలేదు. ఇదియంతయు కుంతి తన రహస్యము దాచినందువలన కదాయని కోపించి సమీపముననున్న కుంతిని బిలిచి స్త్రీల కెన్నడును రహస్యము గోపన మనునది లేకుండుగాక యని శపించెను.

ధర్మజుని మనస్తాపమున కంతులేకుండెను. ఉభయ పక్షబంధు మిత్ర కోటుల మరణంబునకు దానుగదా కారణంబను తలంపు మనమున కలంత గొలుప అర్జునుని జూచి, సోదరా! ఆత్మీయుల నెల్ల జంపుకొనిన వెనుక మనకేల యీ రాజ్యము. దుర్యోధనుని దుష్టత్వమును సైరింప జాలమిచే యింతకీడు మూడినది. వారి చావుతో ఆ కోపముడిగి ఈ శోకము నన్నావరించినది. రాజ్య పరిగ్రహణ వాంఛ గదా నన్నీ పాపమునకు దించినది. దానిని వదలు కొనుటచే పాప నిర్మూలమునకు మార్గము. ఈ రాజ్యమును మీరేలుకొనుడు. నేను భిక్షావృత్తి జీవింతును లేక అడవుల తపస్సొనరింప పోదుననిన మాటలు అర్జుననకు ఆశ్చర్యము కలిగింపగా నతడు, రాజేంద్రా! నరపాలురు శత్రువులనోడించి దేవతలను తృప్తి నొందింతురు గదా పూర్వ నృపతులు దిలీప నృగ నహుష అంబరీషులిట్టి వారేయని నుడువుట విని, భీముడన్నను జూచి, అన్నా నీవు ధర్మమూర్తివి వేద విజ్ఞత నెఱిగిన వాడవు క్షాత్ర ధర్మము వీడి విపినములందు తపస్సునకేగుచో నీవెనుకన వచ్చు మమ్ములను లోకులు వెఱ్ఱులని నిందింతురు. నీరాజ్య పాలనము కర్మ హీనత్వము నందవల దనెను.

అంతట మరల నర్జునుడు, సోదరా వినుము నేనొక కథను నుడివెదను. ఒకప్పుడు కొందరు బ్రాహ్మణులు తమ విహితాచారములు అనుష్ఠానములు వీడి తపస్సునకై అడవులకేగుట జూచి ఇంద్రుడు పక్షియై వచ్చి మీకేల నయ్యా! ఇపుడీ తాపస వృత్తికి సన్యాసమునకిది కాలము కాదు ముందు మీ బ్రాహ్మణ ధర్మము

నిర్వర్తింపుడు. అందువలన పరమార్థమున్నది. లేనిచో అకాల వర్తనమున గృహస్థ సన్యాస ధర్మములు రెండును చెడి భ్రష్టులగుదు రనగా ఆ విప్రులు తమ అవివేకమును వీడి వెనుక కేగిరి.

పిమ్మట నకులుడును చేతులు మోడ్చి అగ్రజుముందునకు జని, నరనాధా! భీకర సంగ్రామమున రిపుల నడచిన వాడవు నీకీయుమ్మలి కమ్మేల, నాలుగాశ్రమములందును గృహస్థ ధర్మము ముఖ్యమైనదిగా పెద్దలు నుడువుదురు. ధర్మయుద్ధమున శత్రువులను నిర్జించిన వాడవు. అందులకు దగిన దాన ధర్మాదులొనర్చి ధన్యతను గాంచుటుడిగి భైక్షుక తపో వృత్తిగైకొనుటుచితముగాదు. మాకు తల్లి, గురువు, దైవము నీవే. నా పలుకులను సైరింపుమనియెను.

తమ్ముల పలుకులు విని ధర్మ రాజూరక యుండుట గని ద్రౌపదియు వినయమూర్తియై ముందునకు వచ్చి, మనో వల్లభా! నీకన్నను తెలిసిన వారలెందును లేరు. నీకొరకు పలు పాట్లు బడి వైరుల ద్రుంచి రాజ్యమును నీకర్పించిన నీయనుజుల కింత వేదన కల్పింతురేల. పృథివీ పతులు విష్ణ్వంశ సంభూతులు. దండార్హుల దండించి, ప్రజలకు హితముగ పాలనమొనర్చుట వారి ధర్మము. కౌరవులు నన్నెన్నియగచాట్ల పాలొనరించిరో మీరెఱుగుదురు గదా. వారికిల్బిషమే వారిని ధ్వంసము చేసినది. దుర్మార్గుల యెడల రాజు చూపదగిన దండనీతి అహింస గాదు. దుష్టశిక్షణము హింస కానేరదు. హరి హరులు, ఇంద్రుడు కుమార స్వామి మున్నగు వారిట్టి దుష్ట నిర్మూలనము గావించుట తమరు విన్నారు కదా. కావున దుర్మార్గులగు శత్రువర్గమును ద్రుంచి కైకొనిన ధరణిని ధర్మయుతముగ పాలించి, లోకమునందు గల మీకీర్తిని నిలుపు కొనుడు.'' అనిన మాటలు వినియు ధర్మరాజు తన మనసు మార్చుకొనక మౌనముగ నుండుట గనునించి భీముడు మరల లేవగా వారిసంభాషణ మిట్లు సాగెను.

**భీముడు :** అగ్రజా! తమముందు మేమేమి చెప్పగలము. మొదటి నుండియు కష్టపడిన వారము మనము. మన రాజ్య భాగము నపహరింప జూచిన వారు వారు. వారికి తగిన బుద్ధి చెప్పి గడించినది విడచి మీరే వేవియో విరాగ భావములతో వెడలినచో ప్రజలు మిమ్ము దుర్బల మనస్కుడందురు. మమ్ములను మరింత హీనముగా జూతురు.

**ధర్మరాజు :** భీమా! నా మార్గము మంచిదైనపుడు నాకు సంశయమేల. మహారాజైన జనకుడేమనెనో తెలియునా, ఈ రాజ్య సుఖములతో మనశ్శాంతి లేదు సన్యాసినై బయటికి పోవుదును. అని నిశ్చయించెను, నా కింకను సందేహమేల అట్లే నేనును చేయుదును.

**అర్జునుడు :** ఔనౌను సోదరా, జనకుడట్లు బయలుదేరగా వారిదేవేరి అడ్డువచ్చి చెప్పిన మాటలు గూడ జ్ఞప్తికి తెచ్చుకొనుడు. ఆమె యిట్లనినది ''రాజేంద్రా! అన్నియును తెలిసిన వారు మీరేదియో సన్యాసము, విరాగము అనుచున్నారేమి. విచిత్రముగా నున్నది. తుదకు సన్యాసియు భిక్షకొరకు గృహస్థు వద్దకు రావలసి నదే కదా. నరపతులును తమ క్షాత్ర ధర్మము నవలంబించి, న్యాయపరిపాలనము చేయవలెను. వేద విదులు గూడ తమ మనుగడకు మీ యాశ్రయము పొంద జూడగా మీరు మీ విహిత ధర్మము విడచి యేగుదు ననుట ఉచితము కాదు. ఈ ఆలోచన మానుడు.'' ఇవి ఆమెనుడివిన మాటలు.

**ధర్మరాజు :** అర్జునా ఒకమాట వినుము. వేదములు కర్మ ప్రధానములు. వైరాగ్య ము మోక్ష ప్రదము. కలుషమైన జీవనము వలన సద్గతులు రావు. జ్ఞానులుపదేశిం చిన శమము దమము అనగా కర్మేంద్రియ విషయ నిగ్రహము శాశ్వతానంద దాయ కములు. వివేకుల మార్గమిదియే. భీముడు వాయునంశజుడు నీవు ఇంద్రునంశ గలవాడవు. మీరిర్వురు సంగ్రామ విద్యా విశారదులేగాని తత్త్వజ్ఞాన మతులుగారు. తత్త్వ వేదియే శాశ్వత శాంతి కాముకుడు.

అంతట అచట నున్న దేవస్థానుడను ముని ధర్మజుంజూచి, మానవ నాధా! అర్జునుడనిన మాట సముచితము. ధనార్జన శ్రేయో దాయకము. అది భోగ విలా సములకు పోవుచో దోషము, దాన ధర్మ యాగాదులకైనచో న్యాయ మార్గము. నీవనిన యోగారోహణము క్రమముగ రావలయును. విహిత కర్మానుష్ఠానము మొదటి మెట్టు. హరుడు సర్వమేధ మొనర్చినాడు. యజ్ఞ పూజ్యులు. ధర్మ పాలనము జరిపి కదా దిక్పతులు, పెక్కుమంది నృపులు సార్థక జన్ములైరి. ఇం ద్రున కొకనాడు బృహస్పతి ఉపదేశించినది వినుము. కామ క్రోధముల ద్రుంచి, ఇంద్రియ నిగ్రహము కలిగి ఎవరికిని హాని జేయక ధర్మ పాలన మొనర్చుట ఉత్తమ మార్గము. అనిన మాటలు విని ఖిన్నుడైన యగ్రజుంజూచి మరల అర్జునుడు సోదరా! ధర్మజా! నీవు జగత్పూజ్యుడవు. రాజ ధర్మము నెఱపి దుష్ట శత్రువుల పరిమార్చితివి. ఈ కారణమున రణమున జచ్చిన వారును సద్గతుల నందిరి. నీ చింతకు కారణము కనుపట్టదు. రాజ ధర్మము ననుసరించి నీ సామ్రాజ్యమును నీవు పాలించుకొను ముని చెప్పిన మాటలను విని ధర్మరాజు మౌనముగ నుండుట జూచి వ్యాసుడిట్లనెను.

పాండవాగ్రజా! అర్జునుని మాటలు సత్యములు. నరపతులకు గృహస్థ ధర్మమే ముఖ్యము. అది వీడినచో ప్రజారక్షణ మెట్లు సాగును. దండనీతి వలన ముక్తి పథమందిన ఒక పార్థివుని కథ యున్నదని యిట్లు చెప్పెను.

### శంఖుడు – లిఖితుడు

బాహుదా నదీ తీరమున శంఖుడు లిఖితుడు అను విప్రవర్యులిరువురు అన్నయు దమ్ముడు నుండిరి. వారు సదాచారులు, ధర్మతత్పరులు. వారి ఆశ్రమ ప్రాంతములందు అనేక జాతుల ఫల వృక్షములున్నవి. ఒక చెట్టున ఆర ముగ్గిన పండ్లను జూచి నోరూరి లిఖితుడొంటరిగ బోయి రెండు పండ్లను కోసి తినబోవు చుండగా అన్నయగు శంఖుడేతెంచి, ఈ పండ్లెక్కడివి ఎవరి అనుమతియు లేకుండ కోసితివి. ఇది దొంగ తనము. మహా దోషము. మన రాజవర్యుడు సుద్యుమ్నుని వద్దకేగి తగిన శిక్షననుభవింపుము నీ పాపము అంతరించు ననెను. ధర్మ తత్పరు డయిన లిఖితుడా మాటలకు తలయొగ్గి సుద్యుమ్నుని వద్దకు పోయి తన తప్పును చెప్పి తన రెండు హస్తములను నరకి వేయవలసినదని వేడెను. మొదట సందే హించి, లిఖితుని పట్టుదలకు అంగీకరించి సుద్యుమ్నుడాతని రెండు హస్తములు నరకించి తనరాజ కర్తవ్యమును నెరవేర్చెను. లిఖితుడు వెనుకకేగి తన మొండి చేతులను శంఖునకు చూప అతడు మిక్కిలి సంతోషించి తమ్ముడా నీవు మంచి పని చేసితివి. నీవనుసరించినధర్మమార్గము వలన మన కులమునకు కీర్తి తెచ్చితివి. రాజుకూడ చోరులను శిక్షించు కర్తవ్యమునెఱపి ధన్యుడయ్యెను. బ్రాహ్మణుని జంపుట, కల్లుద్రావుట, గురుపత్నిని కాంక్షించుట తమ సొమ్మయినను దొంగి లించుట మహా పాతకములు. దండనార్హములు. ధర్మము తప్పించుకొన వీలులేదు. నీ ధర్మము నీవు నెరపితివి, నదీ జలముల స్నానమొనర్చి దేవతలకు పితృులకు తర్పణమొనర్చి శుచిర్భూతుడవగుమని పంపెను. లిఖితుడును అట్లే స్నానమొ నర్చి లేవగానే వికసించిన పద్మముల వలె తన చేతులెప్పటియట్లనున్నవి. లిఖితు డాశ్చర్యపడి అన్నకు జూపెను. శంఖు డాతని ధర్మ దీక్షకు మెచ్చి, తన తపఃఫలమున యిట్లయినదని కూడ వచించి తమ్ముని దీవించి పంపెను.

తన పలుకులు వినుచున్న ధర్మజునకు మరల వ్యాసుడిట్లనియె. ధర్మరాజా అర్జునుని మాటలు అంగీకారార్హములు. ప్రజాపరిరక్షణ నీవును విడనాడక సేయుము. రాజనీతి దండనమునందే ప్రజలు జాగరూకులై మెలగుదురు. ధరణీ నేలి పెక్కు జన్నములొనర్పుము.

వనములందున్నపుడు నీ తమ్ములకెన్నియో వాంఛితములుండి యుండును. వారిని సంతృప్తి పరచు అవకాశము నీకు లభించినది. ప్రజల సంపాదనమునం దాఱవ పాలు కప్పముగా గొని కరుణ గలిగి పాలించుట పరమ పద ప్రాప్తినొసగును. భయ సంశయములు పోవును. కామ క్రోధములతో గర్వించినడచు రాజునకు ప్రజలు సేయు పాపములంటును. పాపకర్ములగు శత్రువులతో సంధి దోషమగును. కౌరవ పతి తోడ సంధి కాలేదను విచారము మానుము. రాజులకు రణములు చెడ్డపను లెంత మాత్రమును కావు. మున్ను హయగ్రీవుడు వైరి వర్గము నిర్జించి ధర్మ పాలనము నెఱపి ఉత్తమ స్థితి బడసెను. యుద్ధమున చంపుటో చచ్చుటో; ప్రజలను పాలించుట దుష్టుల దండించుట క్షత్ర ధర్మంబులు. హింస యను సందేహము విడచి అన్వీక్షకి త్రయి వార్త దండనీతి యను రాజ విద్యల ప్రవీణులగు వారి సహాయమున రాజ్యపాలన నెఱపుము.

ఇంతగా వ్యాసమహర్షి వచించినను ధర్మజుని సందియము విడినట్లు లేదు. దానిని గ్రహించి అర్జునునకొకింత కినుక దోచినది. దానిని కప్పి పుచ్చుకొనుచున్నట్లు అతని మొగమే చెప్పుచున్నది. అవును, సర్వ కష్టములు పడి సామ్రాజ్యమును సంపాదించి అన్నగారికిచ్చిన వీరాధి వీరులు భీమార్జునులు. వారికది సహజమే రాజ్య పాలన బాధ్యతలను విడచి పోదునని ధర్మరాజు తనపట్టు విడువక ఇట్లు వాపోయెను.

తాతా! వ్యాసమౌనీంద్రా! మీ మాటలన్నియు మనసా వినుచున్నాను. అందలి విశేషములను గ్రహించుచున్నాను. కాని నా మది నలమి కొనిన సందేహ ములు విడివడుట లేదు. నా బాధ మరి యొకసారి మనసు విప్పి చెప్పనిమ్ము.

నేను కారణముగ ఎందఱో స్త్రీలు వారి పతులను సుతులను పోగొట్టు కొనిరి. రాజ్య భోగములతో నేను పరిపాలన సాగించుచో వారి వ్యధ మఱింత ఎక్కువ చేసిన వాడినే కదా. పదపడి నా వైపు వారలకును ఎంతటి విపత్తు ఘటింప జేసితినో వినుడు. యుద్ధ కారణమ్ముగనేను మఱవజాలని అభిమన్యుడు, ద్రౌపది కుమారులు మరణించిరి. ద్రుపదుడు ధృష్టకేతుడు మరణించిరి. తండ్రి సుఖ మునకు తన సౌఖ్యము త్యాగము చేసిన వాడు, నన్ను తొడలపై నిడుకొని లాలించినవాడు భీష్ముని నొప్పించితిని. అశ్వత్థామ చావక పోయినను ఒక చచ్చిన ఏనుగు మిషగా చచ్చెనని ద్రోణునకు అనృత మాడిన గురు ద్రోహిని. ఇంతకన్న పాపమున్నదా అన్నగారును మహాత్ముడు, మహాదాత, మహావీరుడు అయిన కర్ణుని చంపించిన దనుక నేను నిదుర పోలేదు. నేను గృహస్థ ధర్మము కొనసాగించినను

అటు తండ్రిని, ఇటు వర్ధిష్ణువులైన కుమారులను పోగొట్టుకొనిన ద్రౌపది గృహ భారము నెట్లు నిర్వహింపగలదు. మా సైన్య పరివారము ఏడక్షౌహిణులు యుద్ధాగ్ని కాహుతియై నారే! ఇంతటి ఘోరమునకు కారకుడనైన నాకు గతులెక్కడివి. ప్రాయోపవేశమున ఆత్మ హత్య చేసి కొందును. నా దృఢ వ్రతమునకు అడ్డు రావలదు. నన్ను పోనిండు, పోనిండు అని యా మునీంద్రునకు నమస్కరించి ధర్మజు డూరకుండెను.

అంత వ్యాస మహర్షి కుమారా! ధర్మరాజా! నీవు ధైర్యవంతుడవు ఇంత శోకమెందులకు పొందెదవయ్యా. పుడమియందున్న వస్తు సముదాయమునకు ఒడుదుడుకులు సహజము సామాన్యమే గదా! మిత్రుల వలన సుఖము శత్రువుల వలన దుఃఖము అనునది మిథ్య. నిన్ను సుక్షత్రియునిగా బ్రహ్మ సృజించి నందులకు నీ కర్తవ్యమును నీవు నెఱపవలసి యున్నది. నీవు ఆసించినపుడు సుఖము వచ్చునా. వలదనుకొనునపుడు విషాదము పోవునా. రెండును జరగవు :మంచి చెడ్డలు, సుఖ దుఃఖములు, శీతోష్ణ వర్షములు, తరులతలు పూవులు పండ్లు, ఇవియవి యన నేల మనము జూచుచున్నవి అనుభవించుచున్నవి అన్నియు కాల కల్పితములు. పూర్వము సేన జిత్తు అను నృపుడు విధి వశమున శోకార్తుడై తుదకు జీవన సత్యము లెఱిగి సజ్జన సన్నిధినిట్లు వచించెను. బుద్ధి మంతుడు అశాశ్వతములగు శోకమునకు భయమునకు తావీయడు. విచారించినంత మాత్రమున కీడు ఆగదు. శాంతి గోరు జనులెప్పుడును ఇట్టి ద్వంద్వములకు తావీయక తమ కర్తవ్యమును విధి హితముగ నెరవేర్తురు. అవివేకులీ విచక్షణ నెఱుగక శోకార్తులగుదురు.

ధర్మజా మరియొక ఉదాహరణమును వినుము, మున్నొకప్పుడు విదేహాధీశుడగు జనకుడు బంధు వియోగమున శోకార్తుడై యిల్లువదలి పో నిశ్చయించు కొనిన యప్పుడు అశ్మకుడు అను ముని సత్తము డేగు దెంచి యిట్లు బోధించెను. కాల వశమున గలుగు సుఖ దుఃఖములు మనుజుని మనస్సును, గాలి మబ్బులను తరుమునట్లు వెంటాడి లోగొనును. వీనిని తప్పించుకొనువాడు లేడు. ప్రపంచమున అంతయు సుఖములు గలవాడు, అంతయు దుఃఖమయమైన వాడు లేడు. పరమ సుఖములుగాని, విచారములు గాని కాల వశమున వచ్చుచు పోవుచుండును. వైద్యుడెంత నేర్పుగల చికిత్స జేసినను రోగములు తగ్గకుండ ప్రబలుట లేదా, ఆరోగ్య శాస్త్ర మెఱింగిన వైద్యులకే వ్యాధులు వచ్చుట లేదా, ఇష్టానిష్ట ప్రాప్తులు దైవ కృతములు వానికి కారణములమాహ్యములు. ఆత్మీయులు బంధు వర్గము

ఎల్లకాలముందురా. జరామరణములను ఎవ్వడైన తప్పించుకొన గలడా. కావున శోకము విడచి కుల్వార్థ ధర్మంబును నిర్వర్తింపుము. కల్మష రహితము శుచి, సజ్జన సంగతి కలిగిన జీవనంబుత్తమము. అనిన మాటలు వినిన జనకుడు తాను పోవ లసిన త్రోవ గ్రహించి జగత్పూజ్యుడైన నృపాలుడు కాగలిగెను.

## రాజధర్మము నెఱిగిన రాజులు

ఇంతలో శ్రీకృష్ణుడచటికి వచ్చెను. అందరును లేచి సముచిత మర్యాద లొనర్చి సుఖాసీను జేసిరి. అర్జునుడంత శ్రీకృష్ణుని జూచి బంధు మిత్రుల మర ణము కారణముగా ధర్మరాజు చింతాక్రాంతుడై ఒక విరాగ మందుట తెలిపెను. శ్రీకృష్ణుడును ధర్మజుని మనో వైకల్యమునకు కలత జెంది, ధర్మజుని సమీపించి ఆప్యాయముగ నతని చేయి గ్రహించి మృదు భాషణముల నిట్లనెను.

ఏమీ ధర్మరాజా! సర్వజన ప్రియముగ హస్తిన రాజ్య పట్టాభిషిక్తుడవై ప్రకా శించు సమయమున, సమరమున మరణించిన వారికై నీకీ విచారమేల. వారు వీర స్వర్గమున నున్నారు. నరనాధులకిట్టి విషమ భావము కూడదు. వారి విధి వారు నెరవేర్పవలసినదే. ఈ పగిది విషాద మగ్నులయిన నృపతులు సృంజయ మరుత్తు సుహోత్రాదులకు నారదుడు నుడివి కర్తవ్య సుముఖులను జేసెను. అ కారణముగ ప్రయోజన శూన్యమైన ఈ మనస్తాపమును మాని నీ వారి కెల్లరకు సంతోష కరముగనీ రాజ్యమేలుకొనుము. ప్రజలను సుఖింప జేయుము. ఎవరికిని ఏదియు శాశ్వతము గాదు. మహా మహులైన పూర్వరాజుల చరితములను వినుము.

మరుత్తుడను నృపతి హిమగిరి వద్ద సకల దిక్పతులకు సురలకు ప్రియ ముగ సంవర్త మహా ముని అధ్వర్యమున నెన్నియో యాగములొనర్చెను. ఆతడేడీ.

సుహోత్రుడను రాజు, తనకేటేట వరుణుడొసగు అపార ధన కనక రాశులతో భూసురులను పూజించి ఎన్నియో దాన ధర్మములు రాజార్థక్రతువులొనర్చెను అతడును మడిసెను.

అందుడను రాజు హయ గజ గోగణములను, రత్నరచితాభరణములను విరివిగ దాన ధర్మములొనరించెను. శిబియను మహారాజు ఫాలాక్షుని యను గ్రహ మున అక్షయ ధనమును బడసి సప్త ద్వీపములందును శత్రువను మాటేలేక అనేక దానములొనర్చి ప్రజా రంజకముగ రాజ్యమొనరించెను. తండ్రి మాటవలన యౌ వన మందే అడవులకరిగి పెక్కు రక్కసులను జంపి జలధిపై వారధి గట్టి దశ ముఖ రాక్షసుని జంపి జనహితముగ రాజ్యమేలి అనేక అశ్వమేధములను అధ్వర

ములను దశరథ రాముడు కావించెను. తన పూర్వులకు సద్గతులు లభించు కొరకు దివిజ గంగను భువికిందెచ్చి, ఇంద్రుడు మెచ్చిన పరాక్రమ వంతుడై భూరి దాన ములనేకములొనర్చి కీర్తి నందిన వాడు భగీరథుడు. అతనికీర్తికి మెచ్చి అచ్చరలు గంధర్వులు కీర్తించి నృత్యమాడ, మునులు సన్నుతింప, భూరి దానములొనర్చి ఇంద్రునికి నూరవ యజ్ఞమున యాగాశ్వమునిచ్చి ప్రఖ్యాతి గనిన చక్రవర్తి దిలీపుడు. చిన్న నాటి నుండియు ఇంద్రుని ఆలన పాలన లంది పది రెండు వత్సరముల ప్రాయ ముననే రాజ్య పాలకుడై రాజ సూయములు, అశ్వమేధములు జేసి దాన ధర్మ నిర తుడయిన రాజు మాంధాత. దేవదానవుల యుద్ధమున రక్కసుల నుక్కడించి, వివిధములయిన యధ్వరంబులొనర్చి తనకు మాలిన ధర్మంబులొనర్చి, శుక్రా చార్యుని అల్లుడై కీర్తి శాశ్వతుడైన సమ్రాట్టు యయాతి, తన్నెదిర్చిన వైరుల నణంచి, అభయము వేడిన వారిని రక్షించి, నిరంతరము షడ్ర సోపేత భోజనములతో మునులను జనులను తృప్తులనొనర్చిన దాత అంబరీషుడు- వేలాది భార్యల వలన పెక్కుమంది పుత్రుల బడసి వారిని సద్వర్తనులుగా దిద్ది తీర్చి తానేగాక తన కుమా రులచే గూడ అనేక క్రతువులు దాన ధర్మములు నెరవేర్చిన మహనీయుడు శశి బిందు మహారాజు. అగ్ని నారాధించి ప్రత్యక్షముగావించుకొని వేద తత్వము అహింస శమము దమము మున్నగు సద్గుణములు బ్రహ్మ చర్యమును అలవరచుకొని 36 యోజనముల వెడల్పు పొడుగు గల వేదికను మహా యాగము చేసి భూరి దానము లొనర్చి తన పేరు మీద గయయందు పవిత్ర వట వృక్షమును పెంపుచేసిన యతడు గయుడు. ఇరువదయిదుగురు వంట వారితో రేబవలు వచ్చిన వారికెల్ల ప్రీతిగదుర భోజనంబు లిడి మహా సత్ర యాగమున సుర భూసురులను తృప్తి నొందించిన అన్నదాత రంతి దేవుడు. బాలుడై కణ్వాశ్రమంబున సింహ శార్దూలాది ఉగ్ర మృగ ముల బట్టి యాడించు మహా సాహసుడై, గంగా యమునా సరస్వతీ నదుల సమీ పమున అశ్వమేధాది క్రతువులొనర్చి భూరి దానములిచ్చిన పుణ్యుడు భరతుడు. పృథివిని చాలవరకు మిట్ట పల్లములు తొలగించి సస్యానుకూల సమతలము జేసి గోరూపయగు పుడమి నుండి పాడి పంటలు పండించి నానాధ్వరములొనర్చి తన రాజ్య మంతయు దాన మొనర్చిన ఘనుడు పృథువు. బ్రహ్మద్వేషులైన నృపతుల పరిమార్చి, ధర్మోజ్జ్వలముగ ధరను పాలించి కాశ్యపునకిచ్చిన మహాత్ముడు పరశు రాముడు. ధర్మజా నేనిపుడు చెప్పిన వీరందరును, రాజ ధర్మము నెఱిగి రాజక ర్తవ్యముల జగద్విదితముగ నిర్వహించిన వారే. దుఃఖ ప్రదములగు సంఘటనలు పొడమినను తమ కరణీయమును వదలక నిర్వర్తించిన వారే. వారెవ్వరును పుడ మిపై శాశ్వతులుగా లేరు. వారికీర్తి నలు దెసల ప్రసరించి ప్రకాశించుచున్నది.

## పర్వత నారదుల వృత్తాంతము సువర్ణష్ఠీవి కథ

శ్రీకృష్ణుని వచనములందు కొంత ఆసక్తి జూపిన ధర్మరాజు సృంజయుని కుమారుడు సువర్ణష్ఠీవి పునర్జీవితుడైన కథ వినగోరగా నా పుండరీ కాక్షుడిట్లు ఉపన్యసించె.

ధర్మజా! మొదటి నుండియు ఆ కథ వినుము.

నారదునకు పర్వతుడు మేనల్లుడు. ఇరువురును కలిసి దేశాటన మారంభించిరి. ఒకరి రహస్యము నింకొకరివద్ద దాచ గూడదనియు, దాచినచో శాపమీయ సమర్థత కలుగుననియు వారి నియమము. మార్గ మధ్యమున సృంజయ మహీ పతిని జూచి తగు సత్కారములంది అతని యనుమతి నచటనే కొన్ని నాళ్ళు వసించిరి. సృంజయుడు తన పుత్రిక సుకుమారిని వారి సేవకై నిర్దేశించెను. ఆ బాలిక యౌవన సౌందర్యమంతయు తనయందే యున్న అందకత్తె. అపూర్వమైన యా బాలిక అణకువ అందము రెండును జూచి నారదుడామె యందు మరులు గొని, యా మన్మథ భాధను పర్వతునకు జెప్పక తనలో తాను కుమిలి కృశించు చుండెను. తన దివ్య దృష్టిని పర్వతుడది గ్రహించి, నారదా! నాయెడ నీ యపరాధమునకు పెండ్లియనంతరము వానరుడవగుదువని శపించెను. నారదుడు కోపించి నీవు దివ్యలోకార్హుడవు కావని పర్వతునికి ప్రతిశాపమిచ్చెను. పర్వతుడు తన దారి తానేగెను. సృంజయుడును నారదుని తపననెఱిగి కూతునాతనికిచ్చి వివాహమొనరింప నా మునియు వానరముఖుడయ్యేను. సుకుమారియు తన దుర దృష్టమునకు కలిగిన బాధ నణచుకొని తన పతివ్రతా ధర్మమును నెఱవేర్చు చుండెను. నారదుండొక నాడడవికి బోగా పర్వతుండెదురై యిరువురును సమాధానపడి, ఒకరికొకరు తమ శాపములనుప సంహరించుకొనిరి. నారదుడు యథా పూర్వ రూప వంతుడై వచ్చిన కథ విని సుకుమారి పరమానందము నందెను.

ఇరువురి మునుల వరమున సృంజయున కొక పుత్రుడు జనించెను. ఆ బాలుని మూత్ర పురీష స్వేదాదులు బంగారముగా నుండుట నతనికి సువర్ణష్ఠీవి యను పేరు వచ్చినది. ఈ విశేషము నలు దెసల ప్రాకినది. ఆ కుమారుడు అల్ప వయస్సులోనే మరణించునని పర్వతుడు నుడువగా సృంజయుడు మనస్తాపము న నుండుట జూచి నారదుడోదార్చి యా బాలుని యోగక్షేమములు తాను చూచు కొందునని నుడివి మరల యా బాలునికి ఇంద్రుని వలన భయమున్నది గాని బెగడొందకుడని చెప్పి వెడలెను. బంగారము సులభముగ సంపాదింప వచ్చునని ఆశించి

రణములును ప్రాయశ్చిత్తముగ నుడువ బడినవి. ధర్మజా నీకు సహజముగ ఆస్తికతా శ్రద్ధా వినయంబులున్నవి, అంతకన్నను రణ నిహతులయిన వారిని గూర్చి నీ యంతః కరణమున కరుణయు పశ్చాత్తాపము గల్గుట నీవు శుద్ధుండ వైతివి. ఇక కురుకుల చూడామణివై మహీ పాలనము నెఱపుము.

## అపేయములు, అభోజ్యములు, అపాత్ర పురుషులు

పై జెప్పిన చేయరాని పనుల వంటివి మఱికొన్ని యున్నవి. ధర్మరాజా! వినుము. త్రాగరాని పానీయములు తినరాని పదార్థములు, దానమిచ్చుటకు అర్హులు కాని పురుషులు, ఇట్టివే నిషిద్ధ కార్యములు.

అభోజ్యములు అపేయములు- గుఱ్ఱపు పాలు, ఒంటె పాలు, గాడిద పాలు త్రాగరానివి. స్త్రీ పాలు, గోవు ఈనిన పదిదినములలోని పాలు, ప్రేత కర్మల అన్నము జాతమృతాశౌచ అన్నము తినరానివి; తలవరి, కులట, స్త్రీ వలన బ్రదుకు వాడు పూవులమ్ము వాడు, జూదరి దానమిచ్చుటకు అర్హులు కారు పూవులమ్ము వాని యన్నము, మద్యముతో కలిసినది మాంసమును తినరాదు. అతిథి పితృ దేవతలకు పూజలయిన తర్వాతనే గృహస్థులు భుజింప వలయును.

అపాత్ర పురుషులు అనగా అయోగ్యులు, దుర్జనులు. ఇట్టి వారికి దానమిచ్చుట తప్పు. దాతకును అపాత్ర దానము కీడొనరించును. పుచ్చుకొను వాడర్హుడై శాస్త్ర విధిగ చిత్త శుద్ధితో చేసిన దానము ఇచ్చు వానికి పుచ్చుకొనువానికిర్వురకును మేలు. ఆట పాటల బ్రతుకు వారు, హాస్యగాడు, దొంగ, పిచ్చివాడు త్రాగుబోతు, అవయవ హీనుడు దుర్వ్యసనుడు నపుంసకుడు తప్పుడు మాటలు చెప్పువాడు, వేదాలు చదువనివాడు, కులవృత్తి చేయని వాడు, దానమునకు అనర్హులు. దీనులు, పెద్దలు, ఆపద నున్న వారును దుర్గుణములు కలవారైనను దానమునకు అనర్హులే. అనర్హులకిచ్చిన దానము వ్యర్థము. బూడిదలో పోసిన నేయి వంటిదే. కావున దానమిచ్చునపుడును మంచి చెడ్డలు చూచుట ధర్మ విధులలో నొకటి. ధర్మజా, అనవసరముగచింతాక్రాంతుడవయిన నీకు సంక్షేపముగా నీతి మార్గంబులుపదేశించితిని. వీనిని తెలిసికొని నీ కర్తవ్యమును నీవు నిర్వహింపు మని వ్యాసమహర్షి తన ప్రసంగము వినిపించెను.

శ్రీకృష్ణుని ఉపదేశము వ్యాసుని మాటలు అంతకంతకు ధర్మజుని మనసున నాటినవి. అందున్న ధర్మము, లోక కర్తవ్యముల యొక్క ప్రాముఖ్యము అవగతమైనది. విప్పారిన మొగము నందొక యింత హర్షము దోప వ్యాస మహర్షిని

చూచి, తాతా, నీ యుపదేశముతో నాకు కొంత కనువిప్పైనది. అయినను ఒక విషయమును విశదముగ వినవలయునని యున్నది. దయ యుంచి ఆలకింపుడు. నాకేమో రాజ్యము ధర్మచర్య పరస్పర విరుద్ధములని తోచుచున్నది, ఏ విధముగ ధర్మ మార్గమవలంబించి రాజ్య తంత్రము నేవిధముగ దోషము లేకుండ నిర్వర్తింప గలనో సెలవిండు. వర్ణాశ్రమ ధర్మములు ఆపద్ధర్మమును గూర్చిగూడ వినదలతు నని నుడివెను. శ్రీకృష్ణుడు నారదుడు మున్నగు తక్కు వారికిని ధర్మజు మాటలు సంతృప్తి కరముగ తోచినవి. వ్యాసుడు నరేంద్రా! నీకు వలసిన విషయములన్నియు వచించుట కర్హుడు నేడు రణభూమియందు శరతల్పగతుడయిన శాంతనవుడొ క్కడే మహా శాంత మూర్తి త్యాగధనుడు రాజ్య తంత్ర సర్వజ్ఞుడు వేదవేదాంత ధర్మవేది. మీ చిన్ననాటి నుండియు అనురాగముతో మిమ్ము పెంచి విద్యలనేర్పిం చినవాడు. ఇంతేకాదు చ్యవన మార్కండేయ వసిష్ఠాది మహా మునుల నుండి ధర్మ ప్రపంచమును తెలిసికొనిన వాడు అని నుడివినంత.

ధర్మరాజున కొక్కింత మనసున ముల్లునాటి నట్లైనది. అయ్యో, మునీంద్రా! కృష్ణా! ఉత్తమోత్తముడు భీష్ముడెక్కడ నేనెక్కడ. కృత్రిమ సమరమున నా మహాత్ముని గూల్చితిమి. బహు బంధు వధ పాతకము నా తలపై నున్నది. నా మొగమెట్లు ఆతనికి చూపగల్గుదును. నాకు ధర్మంబుపదేశింపవే యని యడుగ గలనాయని నుడువ, శ్రీకృష్ణుడు ధర్మజా! ఎందులకిట్లు నీకు నీవు కట్టడులను పెట్టుకొనుచున్నావు. ధరణీజనులు వర్షమును కోరునట్లు, నీ తమ్ములు, విప్రులు నినుగోరుచున్నారు. కృపా దృష్టితో వారి వాంఛితము సఫలమొనర్పుము. ఇదియే నీకిపుడు పరమార్థమైన కర్తవ్యము లెమ్ము. భీష్ముని కడకేగుదము. ఈ మార్గమే నీకు అభ్యుదయ ప్రదము. అనిన శ్రీకృష్ణుని వచనములతో ధర్మజుని సందేహ నివృత్తి యైనది. మొగము కలక బాసి, భానూదయ సమయ కమలమువలె వెలిగినది. ధర్మజుడు అటనున్న మునీంద్రుల కెల్లరకు శ్రీకృష్ణునకును వందన ములాచరించి ఆశీస్సుల నందెను. ప్రక్కనున్న తమ్ములును ద్రౌపదియు సంతోష పరిపుల్లవదనులై ధర్మజునకు మ్రొక్కులాచరించిరి. వ్యాస నారదాది మునులు మఱి యొకసారి వారికి తమ శుభాకాంక్షలను తెలిపి వెడలిరి.

## ధర్మరాజు బంధుమిత్రులతో హస్తిన కేగుట

విజయ హర్షమున పాండవులు హస్తినా పురమునకేగు ప్రయత్నములు పూర్తి యయినవి. భరత వర్షమున నున్న రాజు లెల్లరును మణి హేమ, కుంజ రాశ్వములు,

నూత్నాంబర భూషణమ్ములు, కానుకలు దెచ్చి ధర్మరాజును సబహుమానముగా దర్శించిరి. పదునారు ధవళాశ్వముల బూన్చిన రథమును సర్వ లాంఛనాలంకృత మొనర్చి కొనివచ్చిరి. భీముడు సారథ్యము వహించి, ఛత్రమును అర్జునుడు ధరించి, నకుల సహదేవులు చామరములు బూని సేవలొనర్చు రథముపై ధర్మరాజు ఆసీను డైన ఆ రథము అగ్ని పంచకము ప్రకాశించు పవిత్ర వేదివలె భాసిల్లెను. గాంధారీ ధృత రాష్ట్రులొక ప్రత్యేక రథమున నుండిరి. శ్రీ కృష్ణ సాత్యకులు, యయుత్సుడు, కుంతీ ప్రముఖ కురుస్త్రీలు విదురుడు వారివారి అందలంబుల నారోహించిరి. రాజు లెల్లరును తమతమ సేనలగూడి వెనుక వరుస నుండిరి. కులగురువగు ధౌమ్యుడు తక్కువిప్రవర్యులును శుభ ముహూర్త క్షణ మరుదెంచగానే ధర్మరా జును వేద స్వస్తి వచనములతో నాశీర్వదించిరి. హస్తినకు పాండవుల విజయ ప్రయాణ మారంభమైనది. సముద్ర ఘోష వలె మంగళ తూర్యనాదము లొక్క పెట్టున మ్రోగినవి.

ధర్మరాజు విజయుడై హస్తినాపుర సామ్రాజ్య పీఠము నధిష్ఠించుటకు సపరి వారుడై బంధు మిత్రులతో వచ్చుచున్నాడను వార్త తెలిసినది. పుర వాసుల సంత సమునకు మేరలేదు. ఏ న్యాయ మూర్తి తమకు రాజు కావలెనని కోరుకొనిరో ఆ మహాత్ముడరు దెంచు చుండెను. పురము నలు ప్రక్కల వీధి వీధులు వాడవాడలు అలంకరింపబడినవి. కర్పూరపు ముగ్గులు, కస్తూరి జల్లులు కదళీస్తంభ పూర్ణ కుంభ స్థాపనములు పుష్ప తోరణములు మణి దీప స్తంభములు వెల్లివిరిసినవి. ఆబాల వృద్ధము తీరి రాజ మార్గమున నిలిచి స్వాగత వచనము లిట్లు పలికిరి.

సంగ్రామ విజయ తేజస్వి యయ్యు ఈతడజాత శత్రుడు, రాజసూయ యాగమున భూరిదానము లొనర్చిన దాత, సత్య వచన నిష్ఠా వ్రతుడు, ధర్మము న్యాయము సుస్థిరమగునటుల శత్రువుల జయించి వచ్చిన మహాత్ముడు ఈ మహా రాజునకు స్వాగతమనిరి. సౌధములనుండి పుణ్యాంగనలు ముత్తయిదువులు సేసలను విరజిల్లిరి. రాజ మందిర ద్వారమున ధర్మరాజునకు భూసురులును పుణ్యాంగనలును శోభన ద్రవ్యంబులతో స్వాగతమిడిరి. ధర్మరాజు రాజ వాసమున గృహదేవతలను, నగరదేవతలను పూజించి ధర్మశాస్త్రజ్ఞులను బ్రాహ్మణ సంఘం బులను, మందిరమునకు బిల్చి ధన ధాన్య వివిధ వస్తువులు, కనకములు గోవులను దాన మొసగు వేళ విప్రాశీర్వాద నాదంబులు శంఖ భేరీ ప్రముఖ తూర్య రవంబు లును భూనభోంతరములు నిండినవి.

## మాయా బ్రాహ్మణుడుగ వచ్చి చార్వాకుడను రాక్షసుడు చచ్చుట

బంధు మిత్రులతో సర్వ విప్ర జనములతో గూడి యున్న సమాయోగము ఒక్క నిముసము నిశ్శబ్దమైనది. ఆ క్షణమున దుర్యోధన మిత్రుడైన చార్వాకుడను రాక్షసుడు బ్రాహ్మణ వేషమున త్రిదండియై ఆ విప్రులతో కలసి వచ్చి సభా మధ్యమున నిలిచి ''రాజా! నన్నీ విప్రసంఘముతో కలిపి పంపించి మీతో ఇట్లని నుడువు మనినారు. ఏమని, వినుము.'' నీ పేరు మాత్రము ధర్మరాజు గాని నీయందెట్టి ధర్మము నీతియు లేవు. కేవలము రాజ్య కాంక్షచే దాయాది సోదరులను, బంధువులను, గురువులను, సకల సైన్యమును చంపించినావు. రాజ్య పాలన కనర్హుడవు. మహా పాపివి. కొంకు బుద్ధివి. నీ బ్రతుకు కాల్పనా యనుచు నానాదుర్భాషలాడెను. అచటనున్నవారు నిర్ఘాంత పడిరి. బ్రాహ్మణ జనము తల్లడిల్లిరి. ఏ బ్రాహ్మణుడు వీనికిట్లు దుర్బోధ చేసి పంపెను. అని వెలవెల బోవుచుండిరి. వారిలో వేద శాస్త్ర మహితులైన వారు దివ్య దృష్టిని వాడొక రాక్షసాధముడని గ్రహించి ఆగ్రహమున వాని వైపు జూడగా ఆ నీచుడచ్చటనే నేల గూలి చచ్చెను. ధర్మజుండును ''అయ్యా విజ్ఞులైన సభాసదులారా, వ్యాసాది మహర్షులు నన్ను రాజ్య పాలన కర్తవ్యమునకు ప్రేరేపించి పంప వచ్చితిని గాని నాకీ రాజ్యకాంక్షలేదు. మీకును వేఱుతలంపు భీతి మాని నుడువుడు. నేను రాజ్యమును వదలి పోయెదను'' అనగా శ్రీకృష్ణుడు ధర్మజుని జూచి ''రాజా! వాడు దుష్టుడు, బ్రాహ్మణుడు గాడు, దుర్యోధన మిత్రుడైన చార్వాకుడు, రాక్షసుడు, ఇట్లు కారులు ప్రేలినాడు. ఇంత మాత్రమున నీకు కలంతయేల అతడు తపశ్శాలియై బ్రహ్మవరమున ఏ భూతము వలనను ఆపదలేక, దేవతలను గూడ పీడింప సాగెను. దేవతల మొఱవిని విరించి ఆ దుష్టుడూరక చావడు. బ్రాహ్మణుల కనిష్టములయిన దుర్భాషలాడి నపుడు బ్రహ్మదండ ప్రభావమున జచ్చును.'' అని వేల్పులను వెనుకకంపెను. వాడట్లే చచ్చినాడని యాపీనుగును బయట కీడ్పించెను. ధర్మరాజునకు విషయమంతయు అవగతమై తన కర్తవ్యమునకు బూను కొని సభాసదులకు వినతుడై నమస్సులాచరించెను.

## ధర్మరాజు పట్టాభిషేక మహోత్సవము.

ఈ శుభ సందర్భమున అన్ని పనులును శ్రీకృష్ణుడే స్వయముగ జూచి ధర్మజా! నీవిక రాజ్యాభిషేక శోభనమనుభవించి, అఖిల బంధుజనులను ఆశ్రితులను గోబ్రాహ్మణులను సాదరముగ బ్రోచి సుఖ వృత్తి నుండుమని మఱియొకసారి యుద్బోధించెను.

విశాలమగు బహిః ప్రాంగణమున చలువ పందిరు లేర్పఱచిరి. మధ్యగా నొక్క అలంకృత వేదికపై మహోన్నత మణిహేమ మయ సింహాసన మేర్పఱచిరి. దేవేంద్ర సమ వైభవమున ధర్మరాజా పీఠమున స్వస్తి వాచన మంగళ గీత తూర్య రవములు మ్రోగుచుండ ఆసీనుడయ్యెను. సమీపమున ధౌమ్యకృపులు వారి ప్రక్క ప్రత్యేకాస నముల గాంధారీ ధృతరాష్ట్రులు కుంతి, విదురుడు తక్కుంగల బంధు మిత్రులు యయుత్స సంజయులు, మఱియొక ప్రక్క సచివులు వివిధ దేశాధిపులు, దండ నాధులు, ఇంకొక ప్రక్క పుర ప్రముఖులు, వైశ్య హాలికాది జనులు, వైణిక గాయ కులు వినోదకరులు, వారాంగనలు పరిచారక జనులు వీరలెల్లరుకు సముచితా సనములు సౌకర్యములు నలువురు సోదరులు భీమార్జున నకుల సహదేవులేర్పర చిరి. ధర్మజ పట్టాభిషేక సభ కన్నుల పండుగుగా నిండుగ నున్నది. ఏ యెడ జూచి నను ఉత్సాహోల్లాసములే.

ముహూర్తమునకు ముందే అభిషేచనిక ద్రవ్య సామగ్రిని సర్వము సిద్ధము చేసినారు. శ్రీకృష్ణుననుమతిని పాండవుల కులగురువు ధౌమ్యుడు అధ్వర్యుడుగా పట్టాభిషేకోత్సవమారంభమైనది. ఈశాన్య దిశకు ఒకింత పల్లముగానున్న వేదికా తలమున కనకరత్నమయము, దృఢము నయిన భద్రపీఠము ప్రతిష్ఠించి, పెద్ద పులి చర్మంబును గప్పి యలంకరించి పూజించి, బంగరు పూసల దండ చుట్టబ డిన మహా శంఖమును సమప్రదేశమున నుంచి యర్చించి, దాని చుట్టును మట్టి, బంగారు, వెండి, రత్నములతో గూడిన పాత్రలలో గంగాజలముల నింపి వానికి శుభ ప్రదములగు చెట్ల బెరడులు చివుళ్ళు పూవులు పంచ గవ్యంబులను మంత్ర యుక్తముగ సంస్కార మొనర్చి, వీర్యవంతములైన మంత్రముల వేదవిదులు చదు వుచు తోడురాగ, ధర్మరాజును తోడ్కొని వచ్చి, ఆసీను జేసి ఎడమవైపున రాజ్ఞీ లాంఛ నాలంకృత యయిన ద్రౌపదిని గూర్చుండ బెట్టి అగ్ని హోమ తంత్రమును పూర్తిగావించు సరికి పట్టాభిషేక క్షణము వచ్చినది. శ్రీకృష్ణుడు శంఖ చక్ర ధారి యైవచ్చి అటనున్న శంఖమును పూరించి పృథివీ పతివి కమ్మని ధర్మరాజునభిషే కించెను. పిమ్మట, ధృత రాష్ట్రుడరుదెంచి తనకందించిన రత్న కలశమున నున్న జలములతో ధర్మజునభిషేకింప, అటకేగు దెంచిన రాజులు పెద్దలెల్లరును అభిషే కించి దీవించిరి. శంఖానక దుందుభి ప్రభృతి మంగళ తూర్యంబులు గంభీర నాదం బుల విలసిల్లినవి. సర్వజన హృదయము లానందింప ఈ రీతి ధర్మజుడు సామ్రాజ్య పదస్థుండై అచటి పెద్దల కెల్ల నమస్కృతులు గావించెను.

పట్టాభిషేకోత్సవ వైభవమును ధర్మరాజు కీర్తియు కొనియాడి బ్రాహ్మణ సంఘము తిరుగు ప్రయాణోన్ముఖులయిరి. ధర్మరాజు వారెల్లరకును యోగ్యులు దీనులు ఆర్తులగు సర్వ వర్ణముల వారికిని సంతృప్తి కరముగ భూరి దానము లొనర్చి ''ఆర్యులారా మీ సహృదయ భావన వలన మేము ధన్యులమైతిమి. మా కుల పెద్దయు కురు రాజ్యక్ష్మాపతియగు ధృతరాష్ట్రుని మీరెల్లరు విధేయతతో జూడుడు. ఆ మహాత్ముడే మనకు గురువు దైవము. వారి యెడల జూపిన గౌరవమే మాకు వేయి విధముల సన్మానము.'' ధర్మజుని యా పలుకులు వినిన వారెల్లరును ఆహా, ధర్మరాజు, నిజముగ ధర్మదేవతయే తమకుపకారమొనర్చిన వారినే నిర్మల ప్రేమ తో సంభావించు చుండెను గదాయని ఒకరికొకరు చెప్పుకొనుచు సెలవు దీసికొని వెడలిరి.

ధర్మరాజు దృష్టి రాజ్య తంత్రముపై మరలెను. భీమసేనుని యువరాజు నొనర్చెను. పరిపాలనా వ్యవహారములందుపదేశము కొరకు విదురుని వేడెను. కరణీయములగు వానినాలోచించి ఆయవ్యయముల జూచుటకు సంజయుని, సేనలకు భృత్యులకు జీతబత్తెములు చెల్లించు పని నకులునకు అప్పగించెను. ఎదురు తిరుగు వారి దర్పమణచి రాజ్య విస్తృతి జేయుటకు అర్జును నియమించి, తన యొద్ద రాజకీయ గోపన కార్యమునకు సహదేవుని బెట్టుకొనెను. యుయుత్సు విదుర సంజయులను, రాచ కర్జము లెట్లెట్లు నడప వలసినదియు, ప్రజానీకము యొక్క అభిప్రాయములు అభిలాషలు ఏవిధముగ నున్నదియు అనుదినము తెలిసికొని తనచే ఆయా కార్యముల విధి విధానము చేయించునట్లు వేడెను. తానొనర్పవలసిన వైదిక కార్యములు అనుష్ఠానములు నిర్వర్తింప జేయుటకు ధౌమ్యుడు కులగురువు తనవద్దనే యుండెను. యుద్ధమున మరణించిన పెద్దలు వీరులు రాజులు అభిమన్యాది యువకులు వీరందరికిని యథావిధి ఎవరికి తగినట్లు వారికి శ్రద్ధా విధులు దాన ధర్మములాచరింప జేయుటకు ధౌమ్యునే ప్రార్థించెను. ప్రతి గ్రామము నందు చలి పందిరులు, చెఱువులు, దేవాలయములు, గో భూసురులకు వలయు సౌకర్యములు సమకూర్చి ధర్మజుడు, సర్వజనములకు హితకార్యములొనర్చి కృతకృత్యుడయ్యెను.

ధర్మరాజునకింకను ఒకటి రెండు ముఖ్య కార్యములు మిగిలి యున్నవి. తమ యోగక్షేమము లెల్లవేళల కనుచున్న శ్రీకృష్ణునకు తమ కృతజ్ఞత నెఱుగ జేయుట. సముచిత సమయమున గోవిందు విడిదలకు జని చేతులు మోడ్చి

''మహాత్మా మాకీ రాజ్య ప్రాప్తి నీ యనుగ్రహ ఫలము. బావలు మఱదులు నను మమ్ము ఆత్మీయులు గనే సంభావించితివి. కష్టములనుండి గట్టెక్కించితివి. నీ కరుణయు నీకృపాతిశయమును అపారములు. నారాయణుడు ఆది పురుషుడ నియు, పాప నివారకములు శుభ ప్రదములు నయిన నామములతో నిన్ను సకల సజ్జనులు వినుతించుటెంత! వేదములే వేనోళ్ళ నిన్ను గీర్తించును. భక్తి యుక్తము గ నిను స్మరించి, నీ కథలు పఠించు సజ్జనులకు భుక్తి ముక్తి దాతవు నీవే. మాకెల్ల వేళల శరణ్యమునీవే'' యనిన ధర్మరాజును కనుగొని సహజ మందస్మిత వదను డగు దేవకీ నందనుడు ధర్మరాజు సద్వర్తనమును, పాండవులందరి ధైర్య బలాతి శయములు న్యాయ బుద్ధియు మనసార అభినందించి, నీ రాజ్య పాలనము ధర్మ పాలనమగు గాక యని శుభాకాంక్షలు దెలిపి ధర్మజుని పంపెను.

తన మందిరమున కరిగిన వెంటనే ధర్మజుడు తన తమ్ములు నలువురిని బిలిపించి, చెమ్మగిలు నయనములతో వారిని వేర్వేర కౌగిలించ కొని, సోదరులారా! విరోధులను ఒక్క పెట్టున విదళింప గలుగు అజేయ బలాఢ్యులయ్యు నా కొఱకు మీరెన్నయిన కష్టముల ననుభవించిరి. దుర్యోధనాదులు చేసిన దురితముల సహించిరి. అడవుల వెంటదిరిగిరి. విరటుని సేవలొనర్చిరి. యుద్ధమున శత్రు వుల శరాఘాతముల పాలయి ఇంతింతన రాని ఉత్కట దుఃఖము అంది నన్నీ యుద్ధమున కృతకృత్యుని జేసినారు. కృష్ణుని ప్రసాద లబ్ధము. మీరిక సర్వ సౌఖ్య ముల ననుభవించుచు రాజ్యాంగ నిర్వహణము నిర్దోషముగ నిర్వహింపుడని నుడివి, మహా వైభవముతో, ధన ధాన్య రత్న కాంచన వస్తువులతో, సకల విధ పరిజన స మూహములతో సర్వ సౌకర్యములతో నొప్పుచున్న హర్మ్యములు దుర్యోధనునిది భీమునకు, దుస్స సేను గృహము అర్జునునకు, దుర్ధర్షుని గృహము నకులునకు దు ర్ముఖుని యిల్లు సహదేవునకిచ్చి దీవించి పంపెను. విదురయుయుత్సు సంజయ ధౌమ్యులకు వారివారి గృహములు వారి కనువగునట్లు ఏర్పఱచెను. యథా పూర్వము ధృతరాష్ట్రుడుండు పెద్దమేడ యందాతని నునిచి గౌరవించెను. అర్జునుని హర్మ్యమందే కృష్ణ సాత్యకుల నివాసము.

ఈ విధమున ప్రాప్త సామ్రాజ్యుడై ఎవరి నెట్లు జూడవలయునో అట్లు జూచి తన విధ్యుక్త ధర్మముల నిర్వర్తించుచు ప్రజా రంజకుడై పరిపాలన సాగించుచు ధర్మ రాజు విరాజిల్లెను.



# మహాభారత ధర్మశాస్త్రము

## శాంతి పర్వము - ద్వితీయాశ్వాసము

### ధర్మరాజు శ్రీకృష్ణునితో కలిసి భీష్మునికడ కేగుట

ధర్మనందనుడు సామ్రాజ్యాధిపుడై సహజ సుగుణ తేజస్వియై యింతవరకు కని విని యెఱుగ నంతటి ధర్మపాలకుడను కీర్తినందెను. భూసురులను అర్థులను ఆశ్రితులను ఆదరించెను. తల్లి యగు కుంతికి శుశ్రూష, భార్యయగు ద్రౌపది యెడల ప్రియము, సంజయ యుయుత్సుల యెడ మన్నన, ధౌమ్యునెడ గౌరవము, సమస్త పౌర జానపదకోటులకు ప్రమోద మాపాదించు ఆదరణ, అమాత్యుల యెడ సుహృద్భావము నెఱపుచు, దేవపితృ పూజలు అతిథి సంతర్పణములు విప్రార్చనలు భక్తి తాత్పర్యములతో సలుపు చుండెను. పెద్దలయిన ధృతరాష్ట్ర గాంధారీ విదురులకు రాజ్యము సమర్పించి ''మహాత్ములారా! ఈ రాజ్యమున కధిపతులు మీరు. మీ యాజ్ఞానుసారము మెలగు వాడను మాత్రమే'' యని నిత్యము వారల అనుమతి ప్రకారము వర్తించు చుండెను.

ఈ విధమున తన కర్తవ్యము నెఱపుచు ధర్మజుడొకనాడు శ్రీకృష్ణుని దర్శనార్థమతని మందిరమునకేగెను. కౌస్తుభ రత్న విభాసితుడు, పీత కౌశేయధారి, మేఘ శ్యాముడు, ఉదయ భానూదయ కిరణ వికాస సన్నిభుడు, ఇంద్రనీల మణి దేహుండయిన శ్రీకృష్ణుడు బంగరు తల్పమున నున్న తరి సమీపమునకేగి నమస్కరించి'' దేవా! రాత్రి సుఖముగా గడచినదా, నీ ప్రభావమున గదా నేను సర్వజన సంభావితుడనై రాజ పదము నొందితిని. అని వినయ విధేయతలొలుక పలికెను కాని శ్రీకృష్ణుడు మాఱుపలుకక ధ్యాన నిష్ఠుడై యుండె. ధర్మజుడు శ్రీకృష్ణుని నిశ్చల ధ్యానముద్రను గ్రహించి ''ఉచ్ఛ్వాస నిశ్వాసములు బంధింపబడినవి, మనసు ఇంద్రియములు నిగ్రహము నొందినవి, బుద్ధికి లోబడిన పరిశుద్ధ రాగరహిత భావమున లోనున్న అంతరాత్మయందు కూడియున్న యీ పరమ ధ్యానముద్ర ఎందుకొరకు స్వామీ. లోకము నేడు ఏయుపద్రవము లేక శాంతముగనే యున్నది. సర్వము నీదయిన విశ్వాత్మ కుడవు నీకేల యీ దీక్ష దేవా, ప్రసన్నుడవై, నా సందేహము తీర్పుమనిన యాతనిమాటలొకింత విని పద్మాక్షుడు, ధ్యాన ముద్రను చాలించి చిర్నగవున ధర్మజా! పరమ పవిత్ర గంగాజనని కుమారుడు, పరశురాముని శిష్యుడు, పరశురామునే యెదిరించి నిల్వగలిగిన మహా వీరుడు, సత్యవతి

కుమారుడు, విచిత్ర వీర్యుని వివాహ సందర్భమున అనేక నృపుల నోడించినవాడు. వేదవిదుడు, ధనుర్వేద విజ్ఞాన ముసు మహాస్త్ర సిద్ధిగలిగిన భీష్ముడిపుడు నన్ను దలంచుచున్న హేతువున నామనస్సతనియందు లగ్నమైనది. ఆతడును నిశ్చల సమాధినున్నవాడు. అతడు వసిష్ఠుని శిష్యుడు, భూత భవిష్యద్వర్త మానము తెలిగిన జ్ఞాని ఉత్తరాయణము కొరకు వేచుచు శరతల్పగతుడైన యతడస్తమించిన చో లోకమున ధర్మమే రూపుమాయును గాన ధర్మజా! నీవతని కడ కేగి సకల ధర్మంబులెఱిగి సంశయ నివృత్తి నొందు'' మనియెను.

అంతట ధర్మరాజు శ్రీకృష్ణుని జూచి తడబడుచున్న మాటలతో ''భక్త వత్సలా, కృష్ణా! శాంతనవుని పేరు కీర్తులు నేను మున్నే వినియున్నాను. నా కారణ మునగదా, ఆతడిప్పుడు శరతల్పగతుడై యున్నాడు. నేనొక్కడను పోజాలను. నీవు మున్ముందేగినచో నీ వెంట బడి వత్తుననగా శ్రీకృష్ణుడంగీకరించెను. సాత్యకి యాదేశమున రథమాయత్త పఱుపబడినది. రత్నాలంకార కాంతులతో ఉదయ భానుని బోలి వెలుగొందు రథముపై శ్రీకృష్ణునితోడ తక్కువారంఐరును కలసి భీష్ముడున్న చోటికి ప్రయాణమైరి.

* * * * *

## భీష్ముడు శ్రీకృష్ణుని స్తుతించుట.

భీష్ముడు అష్ట వసువులలో నొకడు. దేవతాంశసంభూతుడు అజేయవీరుడు. అంతేకాదు పరమాత్మనెఱిగిన జ్ఞాని. న్యాయ నిరతులయిన పాండవులనిన ఆయనకు ప్రీతి. తన మరణమునకు తానే దారి చూపించినాడు. తన మరణము తానే నిర్ణయించుకొనిన పుణ్య కాలము ఉత్తరాయణము కొలది దినములలో రానున్నది. దానికై వేచి శరతల్ప గతుడైనాడు. ఈ మహాత్ముని దర్శనార్థము నారద దేవళ దేవస్థాను వాత్స్య దేవరాత ప్రభృతులు వచ్చి దగ్గఱనున్నారు. పరమార్థ చింతనుల కవసాన దశ యందు భగవద్ధ్యానమే శరణ్యము. శ్రీకృష్ణుడు సాక్షాద్విష్ణ్వంశ సంభూతుడని భీష్ముడెఱుగును. పరమధ్యాన సమాధి గతుడై ఆ నంద నందనునిపై తలపు లన్నియులగ్నముచేసి యిట్లు నుతించెను.

జ్యోతిర్మూర్తియు పరమాత్మయు పరమేష్ఠియునయిన దేవుని సేవింతును. మునులు దేవతలు గూడ తెలియ జాలని మహాత్ముని, దుఃఖ పరిహారమునకు హేతువైన వానిని విశ్వసృష్టి పోషణ లయములు తనయందున్న మహోత్తరుని,

వేద సన్నుతుడు నైన వానిని కొలుతును. పక్షికి పంజర మాశ్రయమైన యట్లు సర్వ విశ్వమున కాతడే యాధారము. చిన్న వారిలో కడు చిన్నవాడు పెద్దలకు పెద్దయయిన దయాళుడు. ద్వాదశాదిత్య రూపమైన సూర్యాత్మకుడు. వేదోప నిషత్తులు సన్నుతించు పురుషోత్తముడు. వేయి పాదములు, వేయి శిరములు, వేయి కన్నులు గలవాడు. సత్యమైనవాడు. సహస్ర వత్సర కృత మహాధ్వరమున కశ్యప బ్రహ్మకన్నవాడు. సురపితృ కోటులకు జీవన దాత, ఈ దేహమున అవ్యక్త ముగ నున్న అంతరాత్మ, ప్రకృతి వికృతులగు గుణములు తానే అయి మరల ఆ గుణములు లేని సాంఖ్య యోగి. ప్రాణవాయువులు బంధించి, శమ దమముల ధ్యాన ముద్రలో నున్న వారు చూడగలుగు రూపరహితుడు అట్టి ఆనంద రూపు డైన విష్ణుని భజింతును. భూ నభోంతరములు తానయి దశదిశలు సూర్యాగ్ను లును తానయిన హరిని కొలుతును. సర్వలోకములను జలమయమొనర్చి అందు శయనించు యోగ నిద్రా పరులైన బాలుని కీర్తింతును. మేఘములు శిరోజములుగ శరీర సంధులు నదులుగ సముద్రము ఉదరమంచుగల దేవకీ తనయుని వినుతింతు. వదనమునుండి విప్రులను, బాహువులనుండి క్షత్రియులను, జఘనము నుండి వైశ్యులను, పాదములనుండి శూద్రులను ప్రభవింపజేసిన సర్వాత్మకుడు. ఆది త్యులు మరుత్తులు వసువులు రుద్రులు మున్నగు దేవతలను తన అవయవముల ందుద్భవింపజేసిన దేవుడు సర్వము తన వలన రూపమొంది, సర్వము తనయందు, సర్వము నందు తానయిన సర్వాత్మకుడు, సురలు మునులు అనంతుడని నుతించిన జగదాధారుడు శేషాత్మకుడు అయిన వృష్ణికులోద్భవుని కొలుతును.

దుష్ట శిక్షణ ధర్మరక్షణ సేయుటకై భువిపై నవ తారములు దాల్చిన శ్రీహరి రూపములను, చేసిన సుకృతులను వర్ణింప నలవికాదు. వేదములపహరించి జలధిలో దాగిన సోమకాసురుని మత్స్యాకృతి నేగి వధించి వేదములను బమ్మకొసగిన హరిని దలంతును. కూర్మమై మంధర నగమును ధరించి క్షీరాబ్ధిని అమృతోత్పాదనకు తోడ్పడిన శౌరిని స్మరింతును. హిరణ్యాక్షుడు భూమండలమును సముద్రమున ద్రోయగా వరాహమై యేగి ఆరక్కసుని జంపి, తనముట్టెతో పుడమిని పైకెత్తి నిలిపిన పురుషోత్తముని సంభావింతును. నరసింహాకృతినుద్భవించి, భక్త విరోధి యగు హిరణ్య కశిపుని గోళ్ళతో చీల్చి చంపిన హరిని నుతింతును. వామన రూప మున బలగర్వితుడైన బలి నడంచి త్రివిక్రమాకృతి గొన్న దేవదేవుని కీర్తింతును. పరశు రాముడనగ జమదగ్ని సుతుడయి, దుర్జనులైన ధరణీపతుల నిరువదియొక్క

మారు దునిమిన శౌరిని దలతును. దశరథ పుత్రుడై శ్రీరాముడనగ జనించి లోక కంటకుడైన రావణుని వధించిన దేవ దేవుని స్మరింతును. శౌర్యధనుడై హల మును ధరించి విపక్షుల నెల్లనుక్కడించిన బలరాముని దలతును. యదువంశ మున వాసుదేవుడనగా లీలాత్ముడై జన్మించి దుర్మద దైత్యావళిని గూల్చి, అర్జును నకు సారథియై యుద్ధమున విజయుని జేసి, భూ భరము బాపి జనులకు సమ్ము దము గూర్చిన శ్రీకృష్ణుని పూజింతును. తురగ వాహనుడై ఆయుధము ధరించి ధర్మము నిలుపుట కొరకు మ్లేచ్ఛులను కీటడంచు కల్క్యవతారుని తలంతును.

నాశవంతములైన సకల భూత సంతతిలో అవినాశియై వెలుగుచు వారివారి కర్మలకు సాక్షిగానున్న ముకుందునికి మ్రొక్కెదను. భక్తవత్సలా, పురుషోత్తమా నన్ను కరుణింపవే అని నిన్ను మనసార నీ దివ్య నామములతో పిలిచి మ్రొక్కిన వారికి, పసుపు వర్ణ పీతాంబరము ధరించు నీ రూపమునెమ్మది నుంచిన వారికి ఎప్పుడు ఏ భయము వాటిల్లదు. నీ రూపము శుభ మంగళ మందిరము. విష్ణు దేవా! నీ నిత్యమంగళ స్వరూప నారాయణ నామతత్పరులకు బ్రహ్మము, పరము, సత్యము, తపము కరతలామలకములు. సర్వము కల్మష రహితమైన విష్ణు మయముగా చూచుచున్నాను. దేవదేవా, కమలాక్షా! శ్రీహరీ! నేను నీ భక్తుడను శరణాగతుడను పరమపదము కాంక్షింతును. నాకెయ్యది మేలో అది యీయుము. తపమునకు విద్యకు స్థానము జననరహితుడు, యజ్ఞాత్ముడు అయిన శ్రీహరిని సంస్తుతి రూపమైన యజ్ఞముతో వేడుచున్న నా ప్రార్థనలకు ప్రీతి బొందును గాత. అని పలు విధముల స్తుతించి భీష్ముడు తన మదిలో నమః కృష్ణాయ అని మరల మరల స్మరించుచు భక్తి పరవశుడై శిరము వాల్చి మ్రొక్కెను.

విష్ణువును గూర్చి చేసిన ఈ స్తవ రాజము, మునీంద్రస్తవ నీయము; దీనిని పఠించిన వారికి ఐహికాముష్మిక సౌఖ్యములు సుగతులు లభించును.

## ధర్మరాజునకు శ్రీకృష్ణుడు పరశురాముని చరిత్ర చెప్పుట

భీష్ముని వేద వేదాంత విజ్ఞానము, దేవుని యెడల గల భక్తి తాత్పర్యములు కని అటనున్న నారదాదులెంతయో ఆశ్చర్య చకితులయిరి. పాండవేయులతో కలిసి శ్రీకృష్ణుడు వచ్చుచున్న వార్తవిని వారిరాక కొఱకెదురు చూచుచుండిరి.

వేగము గల ధవళాశ్వములు బూనిన రథములపై శ్రీకృష్ణుడు ధర్మరా జాదులు కృప సంజయయుత్సువులు బయలుదేరిరి. మృత దేహములతో ఖండిత

గజాశ్వములతో శిధిల రథములతో నిండి కురుక్షేత్రము భీభత్సముగానున్నది. మార్గమధ్యమున నున్న శమంత పంచకమును జూపి శ్రీకృష్ణుడు ధర్మరాజా! ఇచ్చోట నేమున్ను పరశురాముడు ఇరువదియొక్క మారు దుర్జనులగు నరపతులను వధింపగా వారి రక్తములు మడుగులు గట్టిన ప్రదేశమిదియే అనెను. ఆ మాటలకాశ్చర్య పడిన ధర్మజుడు, కృష్ణా! పరశురాముడు విప్రుడే జమదగ్ని మహర్షి కుమారుడు, హింస యను శంకలేక క్షాత్రమును వహించి వసుధేశులను జంపునంతటి ఆవశ్యకత పరశు రాముని కేమి వచ్చినదని అడుగగా శ్రీకృష్ణుడిట్లు వచించెను.

ధర్మజా వినుము. పూర్వము జహ్నుడను రాజుగలడు. పల్లవుడాతని పుత్రుడు. అతని తనయుడు కుశికుడు ఘనతపశ్శాలి. ఇంద్రుని మెప్పించి గొప్పవాడగు సుతుని కోరగా కౌశికుడుదయించెను ఆతడే గాధి. అతడు తన కుమార్తె సత్యవతిని ఋచీకుడను మునికిచ్చి వివాహము జేసెను. సంతానేచ్ఛ గల ఋచీకుడు తన అగ్ని హోమ హవ్యమును పూర్తిజేసి హవ్యమును సత్యవతికి కొంతయిచ్చి నిచ్చి దీని వలన నీకు మహాతపశ్శాలి యగు వాడుదయించునని చెప్పి ఇచ్చి క్షత్రియోత్తముడుదయించునని యామె తల్లికీయమని కొంతయు, నెడలెను. ఇంతలో సత్యవతి జననీ జనకులు వచ్చిరి. సత్యవతి తన తల్లికీయుదంతము జెప్పెను. ఇరువురును పావన స్నానంబులాచరించి గుర్తు తెలియక ఒకరి భాగము మరియొకరు సేవించిరి. అంతలో గాధి వచ్చి దివ్య దృష్టిని జరిగిన అపచారము నెఱిగి భార్యను జూచి నీకు క్షత్రియాంతకుడగు వీరుడును, మీ తల్లికి బ్రహ్మభూతుడగు తపో ధను డుదయించునని నుడివెను. సత్యవతి తన తప్పునకు పశ్చాత్తాపపడి భర్తను ప్రార్థింప నతడు కరుణించి నీ కుమారుడు మహా తపశ్శాలియే యగును గాని మనుమనికి నామాట వర్తించునని భార్య నోదార్చెను. సత్యవతి జమదగ్ని యను మహా తపశ్శాలిని కనెను. గాధి పత్నికి బ్రహ్మర్షి తుల్యుడగు విశ్వామిత్రుడుదయించెను. జమదగ్నికి సర్వ విద్యా సముపేతుడు ఉదార స్వభావుడు, యుద్ధ విద్యా నిపుణుడగు పరశురాముడుదయించెను. ఆ కాలమున హైహయ వంశీయులు ప్రఖ్యాత నృపులు కలరు. వారియందు కార్తవీర్యార్జునుడు, వేయి బాహువులు కల మహా వీరుడు, లోకములనెల్ల శాసించుచుండెను. అగ్నియే వచ్చి తన కాహారమేది యనుచు వినయమున నడుగ గిరి నగరారణ్య గ్రామముల నీవు దహించి ఆహారముగొనవచ్చునని కార్త వీర్యుడు నుడివెను. మొదట అగ్ని హోత్రుడట్లే చేయుచు నొకనాడు మిత్రావరుణ నందనుని యాశ్రమంబు కాల్చదొడగ అతడా

గ్రహమున అగ్నికి రక్షకుడైన కార్తవీర్యుని జూచి పరశురాముడు నీ సహస్ర బాహువులు నఱికి వేయునని శాపంబిచ్చెను. ఆ శాపమునకు భయపడి కార్త వీర్యార్జునుడు సదాచార పరాయణుడై యుండెను గాని, ఆతని కొడుకులు అవినీతులు దుర్మార్గులునై జమదగ్నియు పరశురాముడు లేని తరి వారి యాశ్రమ ధేనువును లేగలను అపహరించి కొనిపోయిరి. ఈ యుదంతము కార్తవీర్యు డెఱుగడు.

ఆశ్రమమునకు మరలి వచ్చిన రామునకీ దుండగము తెలిసినది. హైహయులపై ఆగ్రహమున ఘోర శస్త్రాస్త్రములను తన గండ్ర గొడ్డలిని ధరించి కార్త వీర్యునిపై కరిగెను. అతడును కయ్యమునకు సిద్ధము కాగా పరశురాముడాతని పైకురికి తన మహాయుధముచే కార్తవీర్యుని గూల్చి ఒక్కపెట్టున నతని సహస్ర బాహువులు ఖండించి, సంహరించి సమిధలకై అరణ్యమునకేగెను. కార్తవీర్యుని సుతులకిది యవమానముగ దోచి నూర్గురును కలిసి వచ్చి ఆశ్రమమును ధ్వంస మొనర్చి పరశురాముని తండ్రి జమదగ్ని శిరమునరకి పారిపోయిరి. రాముడింటికి వచ్చుసరికి భర్త దారుణ మృతికి తల్లి బోరున నేడ్చుచు కొమరున కంతయు వివరించి చెప్పెను. పరశురాముడు కోపాటోపముననేగి తన కుఠారమునెత్తి కార్త వీర్య సుతులను వారికి తోడైన రాజులను మహాఘోర క్రీడగ సంహరించి తపో వనమున కరిగెను. పరశు రామునిపై క్షత్రియ కులమున ద్వేష రోషములు ప్రజ్వరిల్లుచునే యుండెను. కొన్ని దినములిట్లేగెను. అంత నొక్కనాడు విశ్వామిత్రుని మనుమడు పరావసు వసురాజు రాముడున్న అడవికి పోయి పరశురామా, నీ తండ్రి హతుడైనపుడు నీ పరశువేమైనది. బాలురను జంపి పిరికి పందవై పారిపోయి వచ్చి యిట దాగిన సరిపోయినదా. వెలుపలికి రమ్ము. నీ గర్వమడంచుటకు నీ కొరకు ప్రతర్ద నాదులగు నృపులు వేచియున్నారు. అని పరిహాసము చేసి వెడలి, పరశు రామునిచే హతులు గాక మిగిలియున్న నృపతులను రెచ్చగొట్టుట నారంభించెను. నిజమునకు పరశురాముడు బాలురు, వృద్ధులు అసమర్థులు అనుభావముతో ఎందరినో ఉపేక్షించి వదలెను. ఆ మంచితనము గ్రహింపక ఒక రాజాధము డట్లు వచ్చి తనను నిందించుటతో పరశురాముడు మహోదగ్రుడయి శస్త్రాస్త్ర కుఠారాది మహాఘోర ఆయుధముల బూని కరుణయనునది లేక తనకడ్డు వచ్చిన వారిని బాలురనక, శిశువులనక వృద్ధులనక ఇరువది యొక్క మారు వెదకి వెదకి రాజన్యులను సంహరించెను. పుడమి సర్వము తన వశమైనది. తనకిది కావలెననియా? తాను చేసిన పని. తపశ్శాలులపై హింసకు బూనుకొనిన దుర్మద రాజవంశీయులకు బ

హ్మదండ ప్రాభవము చూపుటకే. తాను కైవసము చేసి కొనిన వసుధను కశ్యప మహర్షికి దానమొనర్చెను. అశ్వమేధమహా యాగమొనర్చెను. అందుచే భూమికి కాశ్యపియను పేరు వచ్చినది. కశ్యపుడు తాను స్వీకరించిన భూమిని తిరిగి బ్రాహ్మణ సమూహములకిచ్చి తాను తన తపోమార్గమునకేగెను. కాలక్రమమున వైశ్య శూద్ర ప్రముఖులు దర్పితులై విప్రుల ధనధాన్యాదుల నపహరింప సాగిరి.

పదపడి విప్రులును తమకుగల ధనాధిక్యతచే దుర్మదులై హింపకు మద్య పానమునకు సాధుజనధనాపహరణకు గడంగి, తమ నిర్ణీత పదము దప్పిరి. ఈ దురిత బాహుళ్యము నోపలేక భూమి అధోలోకమునకు దిగబడు చుండగా కశ్యపుడు తన ఊరువు (తొడ)తో దాపు చేసి పైకెత్తెను. ఈ కారణముచే భూమికి ఉర్వియనియు పేరు వచ్చినది. ఒక ప్రక్క బ్రాహ్మణ సంఘములు దురాచారుల గుటయు బాధాకరముగా నుండుటచే భూదేవి కశ్యప మహర్షి యొద్దకు బోయి మహర్షీ నీవు సర్వ సమర్థుడవు. నీ చేతకాని దేదియులేదు. నీ వశముననున్న భూమి సమస్తము ఇప్పుడు అరాజకమై పోవుచున్నది. ఈ దుస్థితి నుండి రక్షించుటకు నిన్నొకటి వేడుచున్నాను. నన్ను కరుణింపుము. దివ్యాంశ సంభూతుడు అజేయుడైన రాముని ధాటికోడి పెక్కు మంది నృపతులు నశించిరి. అటనట కొలది మంది ఏ పుణ్యాశ్రమమునందో, ఏ ఋషీంద్రు సన్నిధినో, ఏ క్రతు నిర్వహణ సహాయకులుగనో ఉండి రాము బారి నుండి తప్పించుకొనిరి. వారు సద్గుణులు. వారికైనను వారి పెద్దల రాజ్యము లిప్పించి భూమిపై రాజధర్మము నిలబెట్ట వలసిన సమయము వచ్చినది. ఈ సత్కార్యమునకు నీవే పూనుకొనవలయునని వేడెను. కశ్యపునకీ మాట నచ్చినది. వెంటనే ఆ రాజన్యులనందరిని రప్పించి పాలనా ధర్మమును బోధించి వారికి వారి పెద్దల రాజ్య భాగముల పంచి పట్టాభిషిక్తుల నొనర్చెను. భూ మండలమున శాంతి నెలకొనినది. వర్ణాశ్రమ ధర్మములు నెగడినవి. భూపాలురు మునులకు ముని వాటికలకు ఏ యాపద రాకుండ గౌరవముగ జూచు చుండిరి. సన్మార్గవర్తనులైన యా రాజ వంశీయులు వర్ధిల్లి వారి వారి పాలనమును ధర్మయుతముగ నడపు చున్నారు.

## ధర్మజునకు ధర్మబోధసేయుటకు శ్రీకృష్ణుడు భీష్ముని నియోగించుట

శ్రీకృష్ణుడును ధర్మజాదులును రథములపై భీష్ముడున్న నదీ తీర సమీపమునకేగి రథములనందుంచి భీష్ముని సమీపించి యతనికిని అటనున్న ఋషివర్యులకును నమస్కృతులర్పించిరి. శ్రీకృష్ణుడంతట భీష్ముని జూచి, తాతా! యుద్ధమున దగిలిన బాణముల వలనను, ఇపుడీ శరతల్పము వలనను బాధ లేనట్లుగ నుంటివి. పితృవరము వలన ఈ సహనమునీకే సాధ్యమైనది. దేవతలకు బోధింప సమర్థుడవు. భూత భవిష్యద్వర్తమానములు నీ వశముననున్నవి. నీవు రాజువు. సుందరాకారుడవు. సర్వసంపదున్నతుడవు. నీకు రావలసిన రాజ్యము త్యజించి బ్రహ్మచర్య దీక్షకైకొన్న మహాత్ముడవు. ధన్యమైన యిట్టి జన్మ నీకుగాక ఎవరికి వచ్చును. విరోధి భూపతుల విమర్దన మొనరించు ధనుర్విద్యా పరాక్రమములు తపము, దానము, సత్యము, వేద పాండిత్యము ధర్మవిధిజ్ఞత సంపూర్ణముగా గలిగిన మహత్త్వముతో అవతరించిన వాడవు. శరతల్పమున నుండి కూడ నీ మరణమును వెనుకకు నెట్టిన వాడవు. వసువు లందరిలో గొప్పవాడవు. నిన్ను బోలు వానిని భూమిపైని చూడము.

ఇదిగో కనుగొనుము. మనుమడు ధర్మజుడు తమ్ములగూడి నీదు దర్శనార్థము వచ్చి యున్నాడు. బంధుమిత్రుల మృతికి కారణమైతిని గదా అను శంకతో వీని మనస్సు కలత బొంది యున్నది. నీవు దివికేగిన తరువాత ధర్మార్థబోధమును నుడువు వారు కనుపడరు. వర్ణాశ్రమ ధర్మములు, యోగ దర్శనములును నీకు విదితములు. పురాణేతిహాస ధర్మశాస్త్రములు సర్వము నీకవగతము. తమవంటి మహాత్ములు చేయదగినది, శోకమోహగ్రస్తులైన వారిని సముచిత ఉపదేశములతో ధర్మమార్గమునకు మరలించుటయే. తాను వర్తించ వలసిన ధర్మాధర్మ నిర్ణయములు ధర్మజుడు మీనుండి యెఱుగగోరు చున్నాడు. కరుణింపుడు. అను మాటలు విని భీష్ముడు మొగమొకింత యెత్తి గోవిందా! నీవు యోగీశ్వరేశుడవు. నీవెఱుగని ధర్మము లేదు. నీవచోవైభవ మనన్య సాధ్యము. నీ మధుర భాషణములు నా చెవుల కమృత ధారలు. నా మేలెయ్యేదియో వచింప సమర్థుడవు. నీ యెదుట బ్రహ్మయు వచింప నేరడు. అదిగాక శరఘాతలకు నా దేహము ఓర్వలేకున్నది. నా వాక్కు నీరస పడినది. ప్రశ్నోత్తర సంభాషణములు సేయలేని స్థితి యందున్నాను. నీ వాచార్య వర్యుడవు. నీ వెదుట నుండగా నేను చెప్పుట, గురువుండగా శిష్యుడుపదేశించు నట్లుండును. ప్రసన్నుడవై ధర్మజునకెయ్యది హితమో

దానిని నీవే చెప్పుమనగా శ్రీకృష్ణుడు, మహానుభావా భీష్మా! నీకు బాణహతి బాధయున్నదను చున్నావు. నీ కిదియే మూడు వరములిచ్చుచున్నాను. శరముల బాధ అణువంతయును నీకుండదు. యథాపూర్వ శక్తితో నుందువు. ఆకలి దప్పులు అసలే కలుగవు. దివ్య బోధమలవడి నీ బుద్ధి బలము వర్ధిల్లును. నా యను గ్రహమున నీకీ శక్తులనిచ్చుచున్నాను. నాయందు నీకచల భక్తి విశ్వాసములున్నవ నిన పలుకులను విని ఇటనున్న వారందరు హర్షపులకితులయిరి. అని నుడువు నంతలో వారి సంభాషణములు విని, శ్రీకృష్ణ భీష్మ ధర్మజులపై దేవతలు కుసుమ వృష్టిగురిసిరి. అచ్చరలు గానమాధురులు వినిపించిరి.

సూర్యుడస్తమించు సమయమాసన్నమైనది. భీష్ముని పరివేష్ఠించి యున్న మునులు వెనుదిరిగి వెళ్ళుటకు పయనమైరి. వారికెల్లరకు భీష్మునకును ప్రణామ ములర్పించి, శ్రీకృష్ణుడును ధర్మజాదులును వారి వారి రథములెక్కి హస్తినా పురికి బోవుటకు లేచిరి.

మఱునాడుదయమున సమయ కృత్యంబులు దీర్చి అర్చనలు పూర్తి గావించి శ్రీకృష్ణుడు సాత్యకితోడ భీష్ముని వద్దకేగ పయనమయ్యెను. తమ్ములతో గూడి ధర్మజుడును పయనమై ధృతరాష్ట్రునొక్కని మాత్రము వెంటనిడుకొని, భీష్ముడు నుడువు ధర్మ రహస్యములు వినుటకు బయనమయ్యెను. కృప యుయుత్సు సం జయులు దక్క ఇతరులెవరును తమవెంట రానవసరము లేదని ధర్మజుడు అర్జునుని కాదేశించెను. వారందరు గమ్యమును చేరు కొనునంతటికి నారదాది మునులు, ఆహూతులగు కొందరు రాజన్యులును అచటికి చేరిరి. పరస్పరకుశల గౌరవ మర్యా దలయిన వెనుక నారదుడు వారినెల్లరను, ధర్మజుని పరికించి బుధజనులారా, మన భాగ్యమై మనమధ్య నింత దనుకనున్న జ్ఞాన భాస్కరుడు అస్తమింపనున్నాడు. మీమీ ప్రశ్నలు సందేహములున్న యెడల సకల ధర్మ ప్రకారములను తెలిసికొ నుడు అనినంత తక్కిన వారెల్లరును ప్రశ్నలడుగు పాటవము లేక ఒకరిమొగ మొక రు చూచుకొనుట గ్రహించి ధర్మజుడు శ్రీకృష్ణుని జూచి పుండరీ కాక్షా ధర్మవే దులకు నీవు గురుడవు భీష్మునితో భాషింప సమర్థుడవని విన్నవించెను. శ్రీకృ ష్ణుడంత భీష్ముని దరికేగి, శాంతనవా! నీదేహమనస్సు లెట్లున్నవని కుశల ప్రశ్నచే సినంతనే అతడు దేవా, నా అలసట అంతయు తీరినది. దేహమున ఏ విధమగు బాధయులేదు. మనస్సు నిర్మలముగ నున్నది. పరతత్త్వము వేద విద్యయు మన స్సున పరిస్ఫుటముగ నున్నది. ముదుకనయ్యు నీ వరముల వలన యువకుని స్థైర్యము వచ్చినది. చెప్పవలసిన దెల్ల చెప్పెదను. అయినను సర్వజ్ఞుడవు నీవేల

చెప్పవు. అని అడిగిన భీష్ముని జూచి శ్రీకృష్ణుడు దేవవ్రతా నీ మాట నిజము. జగచ్ఛ్రేయమునకు కీర్తికి నేను మూలము. ఇంకను ఈ ప్రబోధములొనర్చిన గొప్పతనము నాకేల. నీవు పెద్దవు. అన్నిట అనుభవజ్ఞుడవు. నాభావములు నీ మనసునందు చొప్పించితిని. నీ మాటలు వేద తుల్యములగును. నీ కీర్తి భూమి ఉన్నంత వరకు సుస్థిరమై యుండును. నీ ధర్మ వేదిత్వము పాండవేయులకు సవిస్తరముగ తెలుపుము. వారును ఇటనుండి నీ యుపదేశముల విను వారును కృతార్థజన్ములగుదురు. నీ ప్రబోధముల నవగతము చేసికొను ప్రజలు ఉభయ జగత్సిద్ధి నందగలరు. భీష్మునకీ మాటలు ప్రసన్నత నిచ్చినవి. కృష్ణా! ధర్మరాజు పుట్టిన తోడనే ప్రజలకు ప్రమోదము కలిగినది. అతడు శమ దమ సత్య శాంత గుణ సంపన్నుడు. దాన ధర్మనిరతుడు. అతని కిపుడు గల సందియము లేమి. వలసిన విషయములడుగ వచ్చుననగా శ్రీకృష్ణుడు. తాతా, ధర్మరాజునకు సందేహమే కాదు రాజ్య కాంక్షచే గురులను బంధుమిత్రులను లక్షలాది నరులను రణమున జంపించినాను అను మనస్తాపముతో నీ యెదుటకు వచ్చుటకే భయపడుచున్నాడు. అనిన పలుకులు విని భీష్ముడు ధర్మవేది యయిన ధర్మజుడట్లేల తలపవలయును. వేద పఠనము యజ్ఞకర్మవిప్రులకెట్టి ధర్మవిధులో, పాపకర్ములైన గురువులనుబంధు మిత్రులయినను వారిని నిర్మూలించుట రాజులకు విధి. అన్యాయపరుల నణచుట పుణ్య కార్యమే యగును. అట్లు చేసిన రాజు ధర్మవిదుడగునని చెప్పగనే ధర్మరాజొకింత విప్పారిన మొగమున జగత్పూజ్యుడగు భీష్ముని సమీపించి వారి దివ్య పాద పద్మములకు ప్రణతులర్పించి నిలిచెను.

## ధర్మరాజు సందేహములను భీష్ముడు సాదరమ్ముగ వినుట రాజధర్మ వివరణము

తన పాదములందు శిరమువాల్చి మ్రొక్కిన ధర్మ నందనుని సప్రేమముగ భీష్ముడు దగ్గరకు దీసికొని అభినందించి మూర్కొని నాయనా! ధర్మరాజా, నా సమీపమున ఉపవిష్టుడవగుము, శంకింపక నీ మనమునున్న విషయములు స్వేచ్ఛగ అడుగుమని నంత, ధర్మజుడు అటనున్న శ్రీకృష్ణునకు ముని వర్యులకు పెద్దలకు నమస్కృతులర్పించి, పితామహున కభిముఖుడై యిట్లనెను.

లోకమున ధర్మార్థకామములు రాజ ధర్మమునకు ప్రాపయి మోక్షమార్గమునకు దారి చూపును. ధర్మబుద్ధిగల ధరణీశుడు లోకమున ధర్మస్థితిని రక్షింపగలడు. రాజునకు గల యీ కర్తవ్యము విశదీకరింపుము మహాత్మా! అనగా, భీష్ముడు, ముందుగ శ్రీకృష్ణునికిని మునివర్యులకు నమస్కరించి ధర్మజా వినుమని యిట్లు చెప్పెను.

తనకు మేలుగోరు రాజు తొలుత దేవతలకును, జ్ఞానులైన బ్రాహ్మణ సంఘములకును పూజలిచ్చి తన యత్న మారంభింప వలయును. దైవము తోడ్పడినప్పుడా యత్నములు ఫలవంతములగును. ఫలసిద్ధి కలుగని యెడ దానిని దైవ విధిగ భావింపవలయు. శాంతము దాంతి, పవిత్ర శీలము, మనోనిగ్రహము రాజున కావశ్యకములు, సప్త ప్రకృతులయిన వానిని స్వామి, అమాత్యుడు, స్నేహితుడు కోశము, రాష్ట్రము, యుద్ధము, బలములను, సత్యము సౌమ్యభావములు గలిగి నడపవలయును. అన్నిటికిని రక్షయయిన దండనీతిని ( శిక్షించుట) మెలకువతో పాటింపవలెను, దానిని బ్రాహ్మణులపై ప్రయోగింపరాదు. ఇది నిజము. విప్రులపై నాగ్రహము చెంది వర్తించుట రాజులకే చేటు. శాంతులైన విప్రుల పలుకు బ్రహ్మము. విప్రుడు దైవము అను సూత్రములు నీవు చిత్తమునందుంచుకొనుము.

ఇట్లున్నను, కోపిష్ఠియయిన విప్రుడు, ఆయుధములు ధరించి మీదికి వచ్చిన బ్రాహ్మణుడు, శిశు హంతకుడైన వాడు, గురు భార్యనాసించువాడు దండనార్హులని శుక్రుడు తెలిపెను.

ప్రజలను తన వశమునందుంచుకొనుటయు ధరణీశునకొక దుర్గమమైన విషయమే. మదపుటేనుగును గూడ మావటీడు ఎక్కి ఆడించినట్లు రాజు మఱీ మెత్తని వాడైనచో ప్రజలు నెత్తికెక్కి త్రొక్కుదురు. కఠినుడైనచో ఎదురు తిరుగుదురు. నాలుగు వర్ణముల వారిని కడు చతురతతో చూడవలయునని బృహస్పతి నుడివెను. దండనీతియు సత్యాసత్యము లెఱిగిన తరువాతనే పాటించుట మంచిది. కేవలము తన ఆలోచన ప్రకారము తొందరపడి వర్తించుట తగదు. శిశువునకు దగిన యాహారము తల్లిసమకూర్చునట్లు ప్రజల మనుగడ బాగుగ సాగునట్లు చూచుట రాజు కర్తవ్యము.

పరిచారకులతో, సేవకులతో, రాజు అతిచనువుగా సంతోషమును వెలిబుచ్చుచు వర్తింపరాదు. అంత చనువు చూపినచో చెప్పిన మాట వినరు. పనిలో మోసము చేయుదురు. సమానముగ వేష భాషలు పూనుదురు. తుదకు యజమాని పదవికి చేటు దెత్తురు.

సప్తాంగముల యందు విరోధము కట్టి చెట్టనొనర్చిన వాడు గురువైనను వర్జనీయుడు. గర్వమున అవినీతిని బోవువానిని తక్షణము దండించి విడువవలెను.

ఈ సూత్రము లన్నియు మరుత్తుడను మహారాజునకు మున్ను బృహస్పతి నుడివినవే. కావున తప్పుగలిగిన యప్పుడు గురుడని మిత్రుడని బంధువని శంకిం

చుట తగదు. వారు దండ నార్హులే. తన కొడుకు అసమంజసుడు, పురజనులను బాధ పెట్టుట విని, సగరుడు పరిత్యజించి నాడు. అట్లే ఉద్దాలకముని పుత్రుడు శ్వేతకేతు విప్రులను మోసగించి త్యజింపబడి నాడు. రాజునకు ముఖ్య కర్తవ్యము ప్రజా రంజకత్వము, దయ జూప వలసిన చోట చూపి సైరణ గలిగి యుండు రాజునకు మేలు కలుగును.

## రాజ ప్రవృత్తి

రాజ వృత్తి యెట్లుండ వలయునో వినుము. వైదిక వర్తనముల వలన తన కాలము గడపుకొనుట భూపతి కనువగు మార్గము. వర్ణాశ్రమ ధర్మ రక్షణ, న్యాయ ముగ ధనార్జన, సంధి విగ్రహము, ఆసనము యానము ద్వైధము ఆశ్రయమను ఆఱుషడ్గుణముల పాలన రాజునకు ముఖ్యము. పొగడ్త మాటలు విన రాదు. దుర్వి నీతుల ద్రవ్యమును గొని సుజనులకీయవలయు. పెర వారి మాటలు ఎక్కువగా నమ్మరాదు. మంచి చెడ్డలు తెలిసికొని తగినంత వరకే నమ్ముట మంచిది. ధనమే సర్వముగా తలచి గ్రహించు లుబ్ధుడయిన రాజునకు, శత్రువులకంటె ముందు, ప్రజల వలననే చేటు గలుగును. ధర్మనిరతులు, ప్రయోజన మొనర్చువారు, విష యాసక్తి లేని వారు, అణకువతో మాటవినువారు. మంచి వంశము కల పరిజనులనే రాజు తనవద్ద నుంచుకొనవలె. ఏనరపాలుని యందు కపటము లేని విశ్వాసమున పరిజనులు మెలగ జూతురో ఆ రాజే నిజమగు రాజు అని పెద్దలందురు. ప్రజల ధన ధాన్యాది భాగ్యములు రక్షించు వాడు రాజేకదా యని శుక్రుని మతము. వేద విద్యలేని ఋత్విజునట్టి వాడే ప్రజల రక్షణ జేయలేని నరపాలుడని మనువనెను. రాజధర్మమును రాజనీతిని బృహస్పతి ఇంద్రుడు భరద్వాజుడు గూడ ఈ రీతిగనే వచించిరిగాన ప్రజారక్షణమే రాజునకు ముఖ్యకర్తవ్యము. శత్రువు అల్పుడైనను ఎప్పటికైనను చేటు చేయువాడే, సైరణచే నైన అన్య విధమున నైనను శత్రువును అణచి వేయుటుత్తమము. పెక్కుమంది వైరులు రాజ్యము నపహరింప జూతురు. అప్రమత్తుడై రాజు తన రాజ్యమును కాపాడుకొనవలెను.

ధర్మరాజా! రాజధర్మ విధానము సూక్ష్మముగ నీకు వచించితిని. ఏదయిన సందియమున్నచో అడుగు మనగా ధర్మనందనుడు భీష్మునకు నమస్కరించి సాయం కాలమగుటచే సెలవు గైకొని పురమునకు నేగెను. శ్రీకృష్ణుడును అటనున్న మునులును అట్లే తమనెలవుల కరిగిరి.

## దండనీతి విధానము

మఱునాడు శ్రీకృష్ణునితో కలసి ధర్మజాదులు భీష్మని కడకు వచ్చుసరికే నారదుడు దేవళుడు మున్నగు ఋషి వర్యులేతెంచిరి. అందరును శాంత నవునకు మ్రొక్కులిడిరి. పరస్పర కుశల ప్రశ్నలయిన వెనుక ధర్మజుడు ముందునకు వచ్చి తన సందేహము నిట్లు నుడివెను. మహాత్మా శాంతనవా! నీవు వచించిన రాజ ధర్మము, రాజ ప్రవృత్తి శ్రద్ధగా వింటిని. ఈ పాలనా నియమముల పాటించిన నృపాల వర్యుల నామములను మీరు తెలియజేసిరి. కాని ఒక మాట. ధర్మపాలకులు, దండనీతిజ్ఞులు అని పేరు గాంచిన ఈ నృపాలకులకు మేలుబంతిగా ఆది యం దొక మహాత్ము డయిన భూపతి యుండి యుండవలెను గదా. ఆ రాజ వర్యు డెవరు తక్కిన వారికీ పాలనా క్రమ మెట్లలవడినది. తెలియగోరెదను తాతా! అని ముగించెను.

ధర్మజా! ఇది మంచి ప్రశ్న. ఈ వివరములు వినుము. తొల్దొల్త కృతయు గమున దండనీతి మంతుండగు రాజనువాడు లేడు. ప్రవర్తన సిద్ధాంతము ధర్మమత మని అనువారు. ప్రజలు పరస్పర సంరక్షకులై సహాయుకులై సుఖముగ కాలముగ డుపు చుండిరి. రానురాను స్వార్థలోభములు మెండై విచ్చలవిడి గర్వించి ధర్మమును విస్మరించిరి. లోకమున ఈ వైపరీత్యమును గనిన ఇంద్రుడు ముఖ్యదేవతలు ముని వర్యులు పద్మ సంభవుకడకేగి దేవా! లోకమున వేదధర్మము నశించుచున్నది. సత్క ర్మములు లేవు. క్రతువు లాచరించుట మానుటచే మేము దుర్బలులమైతిమి. ప్రజల వర్తనము లిట్లున్నవి. ఈ ధర్మ విధ్వంసక మరికట్టవే, యని మెఱ పెట్టిరి. విరించి వారి భయమ్ముడిపి మీరు ఆందోళన పడవలదు దానికి తగిన ఉపాయ మాలోచింతునని చెప్పి పంపెను. చతుర్ముఖుడిట్లు నుడివి - తానే స్వయముగ

జన్మమును ధన్యమొనర్చు ధర్మ అర్థ కామ మోక్షములనెడి పురుషార్థములను సాధించుటకు వలయు ప్రబోధకములను ఇట్లు తెలియ పరచెను.

1. స్వామ్య అమాత్య రాష్ట్ర కోశ సుహ్రుత్ బలములు
2. అన్వీక్షకీత్రయి వార్త దండ నీతులు
3. అరి మిత్ర ఉదాసీనము మున్నగు పన్నెండు రాజ మండలము
4. సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావ సమాశ్రయంబులు పన్నెండు రాజ మండలము

వీని వివరములుగల నూఱువేల అధ్యాయములలో మహానీతి శాస్త్రము రచించి ఇది లోక చరిత్రమును నిర్మలినము చేయునని యిచ్చెను. అంతటి బృహద్ధర్మ శాస్త్రమును చదివి, అవగతమొనర్చు కొనుటకు మర్త్యులకు ఆయుర్బుద్ధులు చాలవని తోచి బ్రహ్మముఖమున విశాలాక్షుడను విరూపాక్షుడావిర్భవించి ఆ మహా నీతి శాస్త్రమును, 10,000 అధ్యాయములతో వైశాలాక్షంబను పేర సంక్షేపించెను. హరుని వల్ల పొంది దానిని 5000 అధ్యాయములతో ఇంద్రుండు రచించె, మరల దానినే బృహస్పతి 2000 అధ్యాయములలో పొందుపఱచెను. దానిని పఠించి శుక్రుడు 1000 అధ్యాయములతో రచించినాడు.

అట్లు సంక్షేపింప బడిన గ్రంథ సారమును మరల మునులు క్లుప్తముగ అనేక గ్రంథములుగ వ్రాసి లోకమున కిచ్చిరి. సురలెల్లరు ఈ నీతి శాస్త్ర గ్రంథమునకు సంతసించి శ్రీ విష్ణువు కడకేగి, ఈ నీతి శాస్త్ర ప్రకారము నడప సమర్థుడగు వానిని కోరగా విష్ణుదేవుడు ఒక మానస పుత్రుని విరజుండనా వాని నిర్మించెను. కాని యాతడు భూమికి ప్రభువుగా వచ్చుట కొప్పుకొనలేడు. అతని సుతుడు కర్దముడు రాజ్య మక్కరలేదని, తపమున కేగెను. అతని పుత్రుడు అనంగుడు దండనీతి ననుసరించి భూమినేలెను, అతని పుత్రుడు విషయలోలుడై ప్రజలచే నిరాకరింప బడెను. మునులది చూచి యతని ఊరువును సమిధలచే మధింప నల్లని మఱుగుజ్జు పుట్టె. అతని సంజాతులు నిషాదులైరి. మరల మును లేగుదెంచి వేనుని కుడి చేయిని కుశ సమిధాదులచే మధింప ఒక మహా తేజస్వి ధర్మతత్త్వ ప్రవీణుడు వేదవేదాంగ విదుడై వైన్యుడను పేర బరగి మునివర్యుల దర్శించి నీతి శాస్త్ర ప్రకారము ధరణి నేలెదనని విన్నవించి వారియనుగ్రహము నందెను.

## వైన్యుడను రాజు చరిత్రము

వైన్యుడు వినయంబున నచ్చటి ఋషి వరుల సమీపించి మహనీయులారానా మనస్సు ధర్మార్థ తత్త్వములపై బోవుచున్నది. మీ యాదేశానుశారము ప్రవర్తింతునని వచించెను. అంత నా ఋషి వరులు వైన్య నృపాలా! నీ సద్బుద్ధి నీకు మేలొనరించును. సర్వ ప్రాణుల యెడ సమాన బుద్ధితో, కామ క్రోధలోభాభి మానములు లేక దండనీతి ధర్మమున జనరంజకుడవై బ్రాహ్మణ భక్తి గలిగి వర్తింపుమనగా, వైన్యుడును విజ్ఞానులయిన భూసురులు నాకు తోడ్పడు చుండినచో ధర్మమార్గము తప్పగ అట్లే చేయుదునని ప్రతిజ్ఞ నొనరించెను. ఆ నృపుని మాటలకెల్లరును సంతసించిరి. సాక్షాత్ విష్ణువు బ్రహ్మయు దివి నుండి వచ్చి పరమ వా

త్సల్యమున వైన్యుని సకల భువన సామ్రాజ్యాభిషిక్తుని జేసి దీవించిరి. ఆ రాజున కు శుక్రుడు పురోహితుడు పండితులైన వాలఖిల్యులు మంత్రులు. గర్గుడు జ్యోతిష్యుడు- ఎత్తుపల్లములున్న భూమి నతడు సమతలముగావించి, ప్రయోజన కరములగు నదీ పర్వతముల నట్లేయుంచెను. మేరువు బంగారమును, ఇంద్రుడు వైభవమును, కుబేరుడు సంపదయు నిచ్చి యాతనిని సర్వ సంపన్నుని జేసిరి. వైన్యుడు శాస్త్రోక్త మార్గమున ధర్మము తప్పక పరిపాలనము సాగించెను. ఆతని వంశీయులును అతని వలెనే ధర్మ మార్గానుసారులై పాలించిరి. దేశము సుభిక్షముగ నున్నది. ప్రజలు శాంతి సౌఖ్యములతో వర్థిల్లిరి.

బ్రాహ్మణులకెట్టి యిబ్బందియు రాకుండ కాపాడుట వలన క్షత్రియ నామము, ప్రజా రంజకుడగుట వలన రాజనామము పరిపాలకునకు కలిగెను. పరిపాలనా దక్షత రాజులకేగాని ఇతరులకు రాకుండట జేసి, విష్ణువు నంశ రాజ వర్యుల తేజము నందుండెను. బ్రాహ్మణత్వము ధర్మము సంపద యను మూడును రాజు నెల్లప్పుడు ఆశ్రయించి యుండుటచే నిజముగ నరపాలుడు దివ్యాంశగల వాడు. కేవలము వాసుదేవుడే రాజు నభిమానించుట జేసి, వర్ణాశ్రమ ధర్మములు సదాచారములు రాజున కధీనము లై యుండును. రాజెప్పుడును సౌందర్య శౌర్య చాతుర్య గుణ శోభితుడయి యుండవలెనని ప్రజలు తలచుచు అతనికి లోబడి యుందురు. కాన రాజు దేవ సముడు.

## వర్ణాశ్రమ ధర్మములు.

శాంతనవుడు చెప్పిన విషయములు వినిన ధర్మరాజు మఱికొన్ని విషయములు సవిస్తరముగ తెలియగోరి రాజు దేవ సముడెట్లైనదియు వర్ణములకు ఆశ్రమము లెట్టివి వాని వర్తనము వేర్వేరుగ తెలియజేయుడని అడుగగా భీష్ముడిట్లు చెప్పెను.

ధర్మజా! సర్వవర్ణములకు సమాన ధర్మములు సత్యము, శుభ్రత, నిజ పత్నీ పరత్వము రహస్యము ముఖ్యములు. కోపము ద్రోహము విడనాడ దగినవి.

బ్రాహ్మణుడు కడునిష్ఠతో, ఇంద్రియ నిగ్రహము, ఓర్పు, అగ్ని విధులు వేదాధ్యయనము నడపవలెను. కరుణ శాంతి, పాటించుచు అహంకారము వదలి, ధనము కల్గిన యెడల ధర్మబుద్ధి సత్సంతతి పడయవలెను.

రాజునకు యజ్ఞము, దాన కర్మము, వేద పఠనము, శత్రు చోర దండనము, యుద్ధమున ధైర్యము, న్యాయ పరిపాలన గురు భక్తి కావలయును.

వైశ్యునకు వేద పఠనము, దానము యజ్ఞములు, పశురక్షణ, న్యాయ సమ్మత మగు సంపాదన కరణీ యములు.

ఈ మూడు వర్ణములకు యజ్ఞము అతి ముఖ్యము

శూద్రులు పై మూడు వర్ణములకును వలయు పనులు నిర్వర్తించుట ముఖ్యములు, శ్రద్ధ గలిగినచో ఉన్నంతలో ధర్మము లాచరింపవచ్చును.

## ఆశ్రమ ధర్మములు

బ్రహ్మచర్యము, గృహస్థము వాన ప్రస్థము, సన్యాసము అని ఆశ్రమములు నాలుగు విధములు. బ్రహ్మ చర్యమునకు గురు శూశ్రూష, వేద పఠనము భిక్షాశనము, వృధా సంభాషణమున కాలక్షేపము చేయక పోవుట ఎవరి తోడను పగలేకుండుట, తన కార్యముల యందు రాగ ద్వేషములు లేకపోవుట నియత విధులు.

సత్యము ఓర్పు సజ్జనుల సాంగత్యము, దేవతలు పెద్దలు అతిథులకు పూజలు, యజ్ఞమునందు మిగిలిన పదార్థ బోజనము, కరుణ, పత్నీ వ్రతము ఇతరాశ్రమవాసులెల్లరకు ఆధారము. ఇవి గృహస్థ ధర్మములు.

బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకీ నాలుగాశ్రమములు తగును. చిత్తశుద్ధి శ్రద్ధ కలిగినచో పెద్దల అనుమతిని మొదటి మూడాశ్రమములు శూద్రుడు పొంద వచ్చును. యతి అగుట తగదు.

ధర్మవర్తనుడగు బ్రాహ్మణుడు యజ్ఞములందు దానముల కర్హుడు. అట్లు రాజులు తమధనము దానమొనర్చుట ఉత్తమము.

ఇట్లు నాలుగు వర్ణముల వారిని తమతమ ధర్మమార్గములందు నడపింప గల నృపునకు ఇంద్రుండును సరికాడు.

ఏనుగు పాద ముద్రలో అన్ని ప్రాణుల పాదములు అడగినట్లు అన్ని ధర్మములు రాజధర్మమునకు లోనగును. రాజు దండనీతి వదలినచో యజ్ఞములు వేదాచారము మున్నగు సత్కర్మలు నశించును. భూ జనులకు సంస్కారము ఉండదు. చేటు సంభవించును. కనుక రాజ ధర్మము శ్రేష్టము, రాజు ఉత్తముడు. రాజ నిజముగ ధర్మదేవతయె. మఱియును వినుము.

## మాంధాత చరిత్రము

రాజధర్మము అన్నిటికన్న ఉత్తమమని చెప్పుట కుదాహరణముగ భీష్ముడు మాంధాత చరిత్రము నిట్లు చెప్పెనను. ఇక్ష్వాకు వంశ చక్రవర్తి మాంధాత ప్రజా రంజకముగ పాలన మొనర్చి బహుళ ప్రసిద్ధి నందిన వాడు ఆతడొక సమయమున శ్రీ విష్ణుదర్శనమందగోరి ఒక మహాధ్వరము శాస్త్రోక్త విధిగ నొనర్చెను.. ఇంద్రుడు సంప్రీతుడై ప్రత్యక్షముగ వచ్చి ఆ నృపాలుని మన్ననలంది, రాజా! విష్ణుని దర్శనము గోరు నీ మనో వాంఛ నే నెఱుగుదును. బ్రహ్మకును నాకును గూడ అది దుర్ల భము. మఱియొకడేదేని కోరిక యున్న అడుగు మనగా, ఆ రాజు మహేంద్రా! నేనీ సంసారమును విడచి సన్యాసినై భిక్షాశనమున బ్రతుకుచు దైవ చింతనతో కాలము గడపెదను. ఆ వరము నాకు దయసేయుమనెను. ఇంద్రుడు, చిరునవ్వు నవ్వి,

రాజా! ఏమిది యిట్లు పలుకుచున్నారు సకల సద్ధర్మములందు రాజ ధర్మ ముత్తమము. కామ క్రోధములు రాగద్వేషము లడంచి సర్వ సమత్వ దృష్టితో దం డనీత్యుపాయమున ప్రజారంజకుడై పాలించు నరపాలునకు లభించు సిద్ధి మఱి యొందును లేదు. పదపడి ఇంద్రుడు యజ్ఞమును చూడ అరుదెంచిన తక్కిన నృపాలుర నవలోకించి, లోక పాలకులారా! మీకు భిక్షవలన బ్రదుకుట తగునా? తక్కిన వర్గముల వారికెల్ల రక్షణ నీయవలసిన వారు, ఆశ్రమ ధర్మములు కాపాడ వలసిన వారు మీరు. నరపాలురు వారి వారి ధర్మ విధులెఱిగి రాజ్యము పాలించుట లెస్స. తక్కిన ధర్మములు తమంత అవియే అలవడును. అతిథులు దీనులు, యతులు, ప్రజలెల్లరును మీ ప్రాపుకై వేచి యుందురు. అని చెప్పి దేవేంద్రుడ మర లోకమున కేగెను. మాంధాతయు తన మనసు మార్చుకొని రాజ ధర్మ నిర్వ హణ ప్రవీణుడై అపార కీర్తి నార్జించెను.

## రాష్ట్ర జనులు ఆచరించవలసిన ధర్మములు

రాజ ధర్మము సర్వోత్తమ ధర్మమను విషయము, మొదట నారదాది మునులు, శ్రీకృష్ణుడు చెప్పినదే కాక, భీష్ముడు విశదముగా వివరించుట, ఇం ద్రుడే దివి నుండి వచ్చి మాంధాత మహీపతికిచ్చిన ఉపదేశమును వినిన తరువా త ఆ విషయములందున్న పరమార్థము ధర్మజున కవగతమైనది. ఆయన మొగ ము ఉత్సాహ పూరితమైనది. రాష్ట్ర ప్రజలు అనుసరింప వలసిన ధర్మములెట్టివి అను విషయము తెలిసికొనగోరి అడుగగా భీష్ముడు తన యుద్బోధము నిట్లు సాగించెను.

కుమారా! ప్రజల విషయము కూడ వినుము. ఉత్తమ గుణ సంపన్నుని పాలకునిగా అభిషిక్తుని జేసి ప్రజలు సుఖము లందెదరు. అట్టి భూ పాలకుడు లేనిచో జనులు ఎవరికి వారే స్వార్థ చిత్తులై దుశ్చేష్టితులై అన్యోన్య ధన దారాప హర్తలై చెడిపోవుట తథ్యము. ఈ సత్యమును గ్రహించిన ఆలోచనగల మానవులు కొందరు తమలో తాము సత్ప్రవర్తనకు అంగీకారము కుదుర్చుకొని బ్రహ్మవద్ద కేగి, స్వామీ! మనుష్యులలో దుష్ప్రవర్తన మెండైనది మమ్ములను శాసించి సన్మార్గమున నడుపు పరిపాలకుని నియోగింపుడనగా విరించి యా కార్యము మనువునకు జెప్పెను. నరులు అసత్య వాదులు వారికి పాలకుడగుటకు మనువు తనకిష్టము లేదనెను. ఆ జనులంతతో పోక, మహాత్మా నీకు సందియము వలదు నీ చెప్పినట్లు వర్తింతుము, మాకు గల పశుసంపద యందు ధనమునందు సగపాలునీ కిచ్చెదము. శిష్టజన రక్షణము, దుష్ట విధ్వంసము కావింపుడు ధర్మవర్తనులైన జనుల ధర్మమున ఆరవ పాలు మీకు చెందును అని ప్రార్థింప మను వియ్యకొని నీతి విధమున భూమిని పాలించెను. జనులన్ని విధముల సుఖులైరి.

కావున జగజ్జనులు రాజునాజ్ఞ ప్రకారము వర్తించుచో మేలగును. రాజు నిట్లు గౌరవించి వర్తించుట దేవుని పూజించుటయే. రాజునెడల ప్రజలు ఆనుకూల్యము చూపనిచో శత్రువులు వచ్చి మీద పడుదురు. నీతి పరుడైన రాజునకు వలయు సౌకర్యములు, బలము ప్రజలు సమకూర్పవలయును. సత్యము, సమభావము, కృతజ్ఞత, ఇంద్రియ నిరోధము, ప్రసన్నతగల భూ పాలుడు విరోధి భయంకరుడై ప్రజలకు తండ్రివలె ప్రియముగల వాడగును.

ధర్మనందనా మఱి రెండు మాటలను వినుము. ఒక సమయమున దేవ గురుడు బృహస్పతియే వసుమనుండను రాజునకు రాజ ధర్మము నిట్లునుడివెను. లోకములు లోక ధర్మములు రాజ మూలములు. సూర్య చంద్రులు లేని ఆకసమెట్లో రాజు లేని రాష్ట్ర మట్లుండును జనులు ఒక కట్టుబాటు నియమములేక విచ్చలవిడి దుర్భర దురితములకు పాల్పడుదురు. గృహములందు శుభకార్యములు చేసికొనుటకే ధైర్యము చాలదు. రాజ్యము నం దేమూల ఏ ఉపద్రవము కలిగినను చారుల వలన విని తొలగింపగలిగినవాడు రాజే. ప్రజలు రాజునకు శరీరము. ప్రజలకు రాజు ఆత్మ. ఒకరి కొకరు గౌరవ, ఆశ్రయములై మనుట జగజ్జన శ్రేయమునకు మూలము. ఈ మాటలు విని సంతుష్టుడైన ధర్మజుడు, జన పరిపాలనము శత్రు నిరోధములందెట్లు వర్తింప వలయునని అడుగగా శాంతనవుడిట్లు నుడివెను.

## జనపద పాలనము శత్రువధ

శత్రు భయము లేనపుడే జన పరిపాలనము బాగుగ సాగును. తనను గెలువ గలిగిన రాజే, శత్రువును గెలువగలడు. తనకు తాను గెలుచుటనగా, విషయ లోలుడు గాక ఇంద్రియములను వశమునందుంచుకొనుటయే. శత్రువు ఎప్పుడును తగిన సమయము చూచి దాడి చేయుటకే చూచుచుండును. కావున రాజు తన నివాసమునకు విహార భూములకు దుర్గములకు పుర ద్వారములకు సరిహద్దులకు తగిన రక్షణ కల్పించుకొనుట కర్తవ్యము. శత్రువులకడ సోదరాది బంధువులకడ వారెరుగకుండ గూఢ చారులను నియమించుట మంచిది. నియమింపబడిన గూఢచారులు ఒకరి కొకరు ఎరిగినవారు కాకూడదు. తనకన్న బలవంతుడైన శత్రువుపైకి కయ్యమునకు పోరాదు. సామ భేదోపాయము లెఱుగుట మంచిది. మత్తుడు దుర్జనుడునైన శత్రువు నెట్లైన లోబరచుకొను మార్గము చూడవలయును. మిథిలేశుడైన జనక చక్రవర్తి వలె ప్రజలనుండి ఆరవ భాగమే కప్పము గొని అన్ని వేళల సర్వవిధముల జనులకు రక్షణ నొసగుట రాజ కర్తవ్యము. కోట యందు పశుగ్రాసము, గుఱ్ఱముల దాణా సామగ్రి, ధాన్యము, వంట కట్టెలు నేయి నూనె ఆయుధములు బలమైన యంత్రపు బావులు సమగ్రములు సమృద్ధములుగ ఉంచి శౌర్య ధైర్యములు గల నరపాలున కే భయమును లేదు. శత్రువులు మీద పడినచో దయా దాక్షిణ్యములు లేక, మిత్ర బలముల కూడ సమకూర్చుకొని వాని నణగ ద్రొక్క వలెను. ఉత్తముడైన నృపునకు ముఖ్య లక్షణములు.

రక్షించుకొనవలసినవి :- రాజ్యాంగ సప్తాంగములు అనగా అధికారము, మంత్రులు, జనులు, పదవి, ధనాగారము, సైన్యము, మిత్ర దుర్గములు.

చూడవలసినవి :- సంధి, విగ్రహము (యుద్ధము) యానము (దండెత్తుట) ఆసన (దండెత్తక నిలుచుట) ద్వైధీ భావ, సమాశ్రయంబులను షాడ్గుణ్యములు

నడపవలసినవి :- ధర్మ అర్థ కామములు త్రివర్గము

పాటింపవలసినవి :- మంత్రము (సమాలోచన) ప్రభుత్వము, ఉత్సాహములను శక్తి త్రయము.

వశము చేసుకొనవలసినవి :- సత్వరజస్తమములు త్రిగుణములు

ఆచరింపవలసినది. ధర్మ సేవ

జయింపవలసినవి :- బుద్ధీంద్రియములు - దేహము, కన్ను, చెవి, నాలుక, ముక్కు.

కర్మేంద్రియములు :- వాక్కు చేయి, పాదము, స్త్రీ పురుష మర్మస్థానములు, మనసు

వదలవలసినవి :- జూదము, వేట, వ్యభిచారము, మద్యము, ఆశ, ధనాశ, దూషణము. అనుసప్త వ్యసనములు

చేయగూడనివి : దురాలోచన, కుటిలము

అణచవలసినవి : వాక్పారుష్యము, దండపారుష్యము

అభ్యసింపవలసినవి : యజ్ఞము, వేద పఠనము, దానము, దేవ బ్రాహ్మణ తర్పణము

చేయవలసినవి : శుభా ధానము

కావలసిన వారు : నయ విక్రమ క్రమాభిజ్ఞులైన అమాత్యులు.

ఈ సుగుణముల నవగతము చేసికొని ధర్మసేవాతత్పరుడై ప్రజలను పాలించు భూపతికి ఇహపర లోక సౌఖ్య సిద్ధి లభించును. ఈ ధర్మసూత్రములన్నియు, ఆంగిరసు భార్గవాదులు చెప్పినవే అనిన విని మరల ధర్మజుడు, తాతా! నేను గ్రహించి నంతవరకు పాలనా ధర్మము, దండనీతి ఈ రెండును ప్రశస్తములైనవే. ఇవి కార్య సిద్ధిగావించు విధము లెట్టివి అని అడిగెను.

ధర్మజా, రాజు ధర్మగతిని దండనీతిని నడపును గాన అతడు కాలమునకు కారణము - కృతయుగమున నీవనిన కార్య సిద్ధి సంపూర్ణముగ నుండును. తత్ఫలము, ధర్మవర్తనము, వైదిక కర్మములు వసంతాది ఋతువులు ప్రజలకు సంతోషకరములగుట సంపూర్ణ స్థితిలో నుండును. ఆ కార్య సిద్ధి త్రేతాయుగమున మూడు భాగములు, ద్వాపరమున రెండు భాగములు. కలియుగమున స్వార్థపరులయి ధర్మము నుపేక్షింతురు. వర్ణాశ్రమ ధర్మములు నశించును, పాలకుని ధర్మవృత్తి సకల జన సంతోషమునకు మూలము. చేయవలసిన కార్యము లెఱిగి, తప్పును తెలిసికొని, శూరుడు ధీరుడు నయి మదలోభావేశములు నశింపజేసికొని మూర్ఖుడు, కోపకాడు, స్త్రీలోలుడు కాని రాజునకు శుభములు తమంత వచ్చును. పురోహితుడు వేదవేదాంగవేది కావలయును. అమాత్యుడు నిపుణుడై కప్పములు గొనవలయునే గాని కఠినుడై ప్రజలను బాధించుచో పాలిచ్చుచున్న ఆవు పొదుగు కోసినట్లే యగును. తపములు అధ్వరములకన్న మిన్నగా రాజునకు సంపదలు కీర్తి సంపాదించునది, ప్రజా రక్షణయే.

ఈ విధముగ రాజ ధర్మము రాజనీతి గూర్చి భీష్ముడు ధర్మరాజునకు అమృతోపమానమైన ధర్మబోధ నొనర్చి సంతుష్టు జేసెను. ధర్మజుడును మఱింత శ్రద్ధా సక్తులతో వినుట గ్రహించి మఱికొన్ని విశేషములను ఉదాహరణ సహిత ముగ భీష్ముడు నుడివెను.

## పురూరవునకు వాయుదేవుడు చెప్పిన ధర్మ ప్రకారము. పురోహితుని ప్రాముఖ్యము

పూర్వము పురూరవుడను చక్రవర్తి, వసుధకు అధికారులు విప్రులా క్ష త్రియులా అని వాయుదేవునడిగెను. బ్రాహ్మణుడు చతుర్ముఖుని ముఖమునుండి ఉద్భ వించినవాడు. స్వాభావికముగ శ్రేష్ఠ జన్ముడు గాన భూమి ధన ధాన్యముల ననుభవించుట కర్హుడు. కాని పాలనా శక్తి దండనీతి క్షత్రియునందున్నది. బ్రాహ్మణుడు శాంతి పరుడగుట వలన ఆధిపత్యము లేదు. కావున నరపాలుడు విద్వాంసుడు ధర్మవేది శాంతుడు అయిన పురోహితుని ఉపదేశము వలన సర్వ సంపదలు సంపాదించి భూమినేలుట శ్రేయః ప్రదము - భయమును బాపుటకు సమర్థుడు క్షత్రియడు గాన ప్రభుత నరపాలునకు దక్కినదని వాయుదేవుడు నుడివెను.

ఎట్టి వర్తనమున పురోహితుడు మాన్యుడగునని ధర్మరాజడుగగా శుక్రాచా ర్యుడు చెప్పిన విషయములను భీష్ముడిట్లు చెప్పెను. యజ్ఞ యాగాదులొనర్చి భూ వరుడు పొందగలుగు శుభములకు మూలము పురోహితుని బుద్ధి. పురోహి తుని మంత్ర రక్షలేనిచో నృపుడు రక్షః పిశాచ బాధలకు కీడులకు, ప్రమాదములకు లోనగును. ఆ బాధలనుండి రక్షించి, సామర్థ్యము శాంతి సౌఖ్యములు శత్రునాశనము కలిగించువాడు పురోహితుడేనని బృహస్పతియు మున్ను నుడివెను. కావున నీవును పండితుడు పరిశుద్ధ వర్తనుడగు పురోహితుని పొందుము. కుత్సితుడు, అపవిత్రు డయిన పురోహితుని వలన నీచ దశలే ప్రాప్తించును. బ్రహ్మ క్షత్రములు కలిసి న్యాయముగ పాలించుట వలన దేవతలును హర్షింతురు. క్షత్రియుల జన్మమునకు పట్టు బ్రహ్మమే. బ్రాహ్మణ క్షత్రియులకలయిక పుడమి జనులకెల్లరకు సమ్మద ప్రదము.

## కుబేర ముచికుందుల సంవాదము

పురోహితుని ప్రాభవము వీరిరువురి వాదము నందును విశదమైన విష యము వినుము. ముచికుందుడను రాజు అన్ని దిక్కులను జయించి పదపడి

తన బలము జూపగా కుబేరునిపైకి దండెత్తెను గాని కుబేరుడంపిన రాక్షస సైన్యములధాటికాగలేక యేమిగతియని తన పురోహితుని ప్రార్థించెను. తపో మంత్రములు దేవతా పూజల జేయించి పురోహితుడు రాజ సైన్యములను బలవంతములుగ జేసెను. కుబేరుడంతట రాజా బ్రహ్మ శక్తి వలన నీవింత వాడవయినావు. నీతో నాకు యుద్ధమేల. నా సైన్యమును నీమీదకు పంపను. ఏకచ్ఛత్రముగ భూమి నేలు కొనుమని చెప్పెను. ఆ పలుకులకు ముచికుందుడు. చిరునవ్వు నవ్వి కుబేరా! నీ దయా దాక్షిణ్యములు నాకెందులకు. నా శక్తి వలననే నేను పాలింపగలనని అజేయుడై భూమిని పాలించెను. ధర్మరాజంతట, శాంతనవా! రాజ ధర్మములు అనేక విధములు, ఐశ్వర్య ప్రీతియు, పుణ్య లోకములను కలుగ జేయు విధమెద్ది అనగా, భీష్ముడు ధర్మజా వాయువు సకల ప్రాణులకెట్లో, పండ్లు నిండియున్న వృక్షము పక్షులకెట్లాశ్రయమో అట్లే నరపాలుడు సజ్జనుల భయము బాపి వారి క్షేమము జూచుట శ్రేయః ప్రదమనెను. ధర్మజునకు మఱొక ˝ందేహముదయించినది. విప్రులు మున్నగు వారికి నిజ ధర్మ వర్తన సాధ్యముకాని యెడల పరిణామమెట్లగుననగా భీష్ముడు, ఆపదలో నున్న వారికి ఇతర ధర్మములు తప్పుగావు, అట్లయినను ఇతర వర్ణ సమానులే అగుదురు. కేవలము స్వార్థులై ధనలోభ తాత్పర్యమున నిజ ధర్మమును విడిచినచో తిరిగి వారి వారి ధర్మాచరణకు పాత్రులుగారు. అందుచే ధర్మజా, నరపాలురకు వర్ణాశ్రమ ధర్మ రక్షణము ముఖ్యవిధి.

ఇంతవరకు ఈ మాటలన్నియు వినివిని ధర్మనందనుడు మరల మొదటికి వచ్చి, తాతా! ఇంతకష్టమయమైన రాజ ధర్మమును నిర్వహింపలేను. దండనీతి కాఠిన్యము నాకువలదు. రాజ్య వైభవము నాకక్కరలేదు. తపస్సున కడవులకేగ సెలవిమ్మని మ్రొక్కెను. భీష్ముడచ్చెరు వంది, ధర్మజా! మరల నీకీ వింత చెయిదమేమి. నీకు నచ్చునట్లు చెప్పుటకు నీ పితరులు పాండురాజు, విచిత్ర వీర్యుడు, శంతనులు లేరు. నాకు తెలిసినది చెప్పుచున్నాను. వినుము. పూర్వ రాజులెందరో వారివారి ధర్మ ప్రకారము నడచి ప్రసిద్ధులయినారు. దానము, వేద పఠనము, దేవతా పూజ చేయుచు తన ధర్మము వీడని నృపునకు ఏ లోపములేదు. వర్ణాశ్రమ రక్షణము రాజునకు ఉభయ తారకము. ఇట్టి ధర్మము విడచినచో నరపాలునకు నరకమే గతి. కావున ఉర్వీజన రక్షణము నీ ధర్మమును వీడకుము.

కుమారా! ఈ సందర్భమున నీకొక యితి హాసము, కొన్ని విశేషములు నుడివెద వినుము. మున్నొక సమయమున పరమ నిష్ఠా గరిష్ఠుడయిన కేకయ భూపతి

వేదాధ్యయనమున్కై అరణ్యమున కేగ అచట నొక రాక్షసుండతనిని పట్టుకొని విడువ కుండెను. రాక్షసుని వారించు బలము చాలక ఆ రాజు, దానవేంద్రా! నా రాజ్యమును నేను ధర్మ నియతితో పాలించు చున్నాను. అందరును సుఖ శాంతులతో సంపదలతో నున్నారు. వర్ణాశ్రమ ధర్మములు వీసమెత్తు పార పొచ్చెము, లేక సాగుచున్నవి. నన్నేల పట్టి బాధింప నున్నావు అనగా ఆ రాక్షసుడు రాజా, నీవు ధర్మపాలకుడవని యెఱు గుదును. అందుచేతనే నిన్నాపి కలిసికొనినాను. నీకే కీడును తలపక వదలెదను ధర్మనిరతునకెట్టి కీడును రాదు. నీ న్యాయ పాలన కొనసాగనిమ్ము అని స్నేహ భావమున వదలెను.

ధర్మజుడడిగెను. క్షత్రియ కర్మానుష్ఠానమునకు శక్తిలేని విప్రుడెట్లు బ్రదు కునని భీష్ముడద్దానికి సమాధానముగా, నేను ముందే చెప్పితినిగదా ఇతర జాతి వృత్తి న్యాయ ప్రకారము జరిగిన తప్పులేదు. అయినను విప్రుడు వైశ్య వృత్తి నవలం బించినచో ఉప్పు, నువ్వులు, మాంసము, గోవు, ఎద్దు, అన్నము, నేయి, కల్లు, నూనె, రంగుతేనె అమ్ముకొని జీవించ గూడదు.

మరల ధర్మజుడు యజ్ఞము లేవిధముగానున్న అంగీకారములగునని యడుగగా భీష్ముని సమాధానము.

యజ్ఞ కర్తకు ముఖ్యముగ వలయునవి. శ్రద్ధ, వేదములందు విశ్వాసము. మంత్ర ప్రయోజనము కూర్చు దక్షిణలు. నాస్తికత్వము పనికి రాదు. యజ్ఞ ఫలము, మహా సుఖ యోగమగు చంద్రలోక ప్రాప్తి నిచ్చును. యజ్ఞము కన్న తపము ఫల ప్రదము. తపస్సు అనగా శరీరమును కృశింప జేయుట గాదు. అహింస సత్యము జితేంద్రియత్వము దయ ఉండవలెను.

## మిత్రుడు

మరల ధర్మజుని ప్రశ్న. రాజునకు తన కార్య నిర్వహణమందు, ఒక తోడు కావలెను గదా. నిజమైన మిత్రుడు ఎట్టి వాడు అనగా భీష్ముడు - ధర్మజా! తనకు మేలొనరించు మిత్రుడే రాజునకు తగినవాడు. మెలకువ గలిగి అతనికి పనులు నియోగింపవలెను. ఒకప్పుడు కోపపడినను మఱొకప్పుడు పొగడినను పాపబుద్ధి లేని మిత్రుడు, మంత్రియు కామ క్రోధ లోభములు విడచి శ్రేయము చేకూర్తురు.

## సోదరులు

సోదరులుండుట పాలకునకు మేలు. వారిని రాజు సాదరముగ చూడవలెను. భూపాలునకు బలగమున్నపుడే పగతురు భయపడి గౌరవములతో చూతురు. లేని యెడల చుల్కనగ చూతురు. కొందరు లోపల లోపల అసూయ బెంచుకొని సమయమునకు వేచి యుందురు. వారిని కనిపెట్టి దూరమునందే ఉంచవలయును.

**కాలకవృక్షీయు క్షేమ దర్శిల కథః ధనార్జన మెట్లని అడిగితివి.** అదియును వినుము. కప్పములు గొను అధికారి నేర్పుగల వాడు కావలెను. జనులాతని ఆటలు సాగకుండ జూతురు. ఇందులకొక కథ గలదు వినుము.

కోసల దేశమున క్షేమదర్శియను రాజొకడుండెను అతని యొద్దనున్న అధికారులు లంచగొండులై రాజకోశమునకు నష్టము కలిగించు చుండిరి. ఈ విషయము రాజెఱుగడు. అచటికి సమీపారణ్యమున నున్న కాలక వృక్షీయుడను తపసి ఒక కాకిని పంజరమున బెట్టి ఆ రాజనగరునకు బోయి ఈ కాకి ఎచ్చటెచ్చట ఏమి జరిగినదియు తెలుపగలదని జనులను నమ్మించెను. తుదకొక నాడు ధైర్యముగ రాజునొద్దకు బోయి రాజా యీ కాకి దూరదృష్టి రహస్య దృష్టి కలది. నీకు చాల ఉపకారము చేయగలదు నీవద్దనుంచుము. నీ అధికారులు నీకు తెలియ కుండ చేయు అపచారములను నీకు మఱునాడే నుడువగలదనగా ఆ కాకిని రాజాదరించి చేకొనెను. ఆ రాత్రి యందే ఆస్థాన అధికారులెట్లో ఆ కాకిని చంపి పడవైచిరి. ఆ విషయమును వినిన వెంటనే మునీంద్రుడు వచ్చి రాజును చూచి రాజా! చూచితివా నీ యధికారులెట్టి దారుణమొనర్చిరో. వారి అపచారము తెలియునని ఈ కాకిని జంపిరి. రేపు నీకేదైన కీడు తలపెట్టగలరు కావున నీవు వెనుకాడక వారిలో వారికి పరస్పర కలహములు పుట్టించి నేరస్థులను వెడలగొట్టుము. నేను మీ తండ్రి స్నేహితుడను. నీ మేలు గోరి యింత చెప్పితిని. ముని మాటలకు రాజు సంతసించి సమయము జూచి దుర్మతులను దూరము చేసి ఆ మునీంద్రునే మంత్రిగా నియమించుకొని న్యాయ బద్ధముగ ధన సంపాదన చేసి మహాభివృద్ధి నందెను.

## అమాత్యుడెట్టివాడు కావలెను అను ప్రశ్నకు భీష్ముని హితవు

ధర్మజా ఈ విషయమిదివరకు కొంత ముచ్చటించితిని. అమాత్యుడు విశాల బుద్ధియు, రాజునెడల భక్తి విశ్వాసములు కలవాడు కావలెను. జ్ఞాన పరుడు ప్రజలకిష్టుడు లౌక్యము తెలిసినవాడు ధైర్య శౌర్యాలు కలవాడు సాధు మనస్కుడు, కఠినుడు కానివాడు, భూవిభుని పల్కులు కష్టములైనను ఓర్పు గలిగి

యున్న మంత్రి సత్తముని వలన మేలు కలుగును. తరువాత రాజవరుడు కూడ, తన అమాత్యులతో ప్రజలతోడను మాట్లాడునపుడు ఇచ్చి పుచ్చుకొను సమయ ములను చిరునవ్వుతో ప్రసన్నముగ నుండుట శ్రేయస్కరము.

## కలహములు తీర్పులు

ప్రజలమధ్య కలహములు తీర్చునపుడు, నింద, పాపము లేకుండ ప్రవర్తిం చుటెట్లు అనిన ప్రశ్నకు భీష్ముని హితవచనము. కలహములు పరిష్కరించుసం దర్భమున వ్యవహారజ్ఞానము ప్రజాప్రియము ముఖ్యము. ధనాశతో ధనవంతుల పక్షమూనుట తగదు. ధర్మనిర్ణయము ఎక్కువ తక్కువలు లేకుండ వస్తువులను తూచు త్రాసువలె నుండవలెను. శిక్ష సేయునపుడు నేరమునకు అనుగుణమైన విధాన మవసరము. చంపుటగాని, చెఱబెట్టుట గాని జుల్మానావేయుటగాని, కట్టి కొట్టుట గాని నేర నిర్ణయమునునుసరించి యుండును.

<u>రాజ దూతను చూచు విధము</u> :- కులము సత్శీలము, హితవాక్య నైపుణ్యము తన కార్యమును సఫలముగ జేయు వాదిత్వ శక్తి, సమర్థత. ఇవి మంచి దూతకు లక్షణములు. దూత స్వతంత్రుడు కాడు. మఱియొకరి ప్రతినిధిగా వచ్చిన వాడు. కావున మొగ మాటము లేక పలికినను కోపింపదగదు. కోపించి దూతను కొట్టుట చంపుట అనునవి నరక హేతువులే.

నమ్మకము విషయములో భూపతులు అన్యులమాట దనుక ఎందులకు తన పుత్రులనే నమ్మి యుండరాదు. నమ్మినటులుగా నటించి నమ్మక ఉండవలెను.

<u>రాజధాని నగరమేవిధమున నుండవలయునని</u> ధర్మజుడడుగగా భీష్ముడు చెప్పిన విశేషములు. వెడల్పు లోతుగల అగడ్తతో కోటగోడలు ఎత్తుగా మంచి కట్టు దిట్టముగా నుండవలెను. లోపల విశాలమగు వాకిళ్ళు, తీర్చిన వీధులు, రమ్య మైన గృహములు, అంగళ్ళు, సమృద్ధిగ ధాన్యాది వస్తువులు, ఆయుధముల నెల వులతో ఒప్పి యుండవలెను. అన్నిటికిని సమర్థులయిన కావలి వాండ్ర నియోగించుట అవశ్యకము. యోధులు, పండితులు, కళాకోవిదులు, దూతలు, పరిజనములు, బంధుగులు వీరెల్లరకు తగిన నివాసములనేర్పాటు చేయవలెను. వీరందరి రక్షణయు రాజుదే బాధ్యత. ముఖ్యములైన గ్రామములకు సమర్థులు విశ్వాస పాత్రులైన వారిని అధికారులుగ నియమింపవలయును. చోరులు జారులు క్రూరులైన హంతకుల బాధ లేకుండ సంరక్షణము నీయవలయు. వ్యాపారము, కృషీవలత్వము ఎట్లు జరుగుచున్నవియు నిత్య పరిశీలనమవసరము. పశువులను

కాచుకొని యుండు కాపరులకు ప్రత్యేక రక్షణమవసరము. ప్రజలను పీడించి పన్ను వసూలు సేయుట ఆవుల పొదుగులను పీల్చి పిప్పి జేయుటయే. ప్రజలనుండి తగిన రీతినే పన్నులు వసూలు సేయుట అర్థము.

<u>బండారమును వృద్ధి చేయు విధము</u> గూడ ధర్మరాజా వినుము. ధన మన్నిటికిని మూలము. కోశమునకు ధనమును గూర్చు ముఖ్య స్థలములు వాణిజ్యము కృషి పశుపాలన. వీనికి ఎట్టి హాని కలుగ కుండ చూడవలయును. ఎవరికిని బాధలు లేని విధమున పన్నులను క్రమక్రమముగ అభివృద్ధి చేయు ఉపాయములు నేర్పవలయును. శిక్షింప దగిన వారిని శిక్షించి వారి ధనము కోశమున జేర్పవలయు. అందులకని ధనవంతుల ధనము అసూయతో బలిమిని చేకొనరాదు. మాయ జేసి ధనమును గొనుట అసలే పనికి రాదు. దేనికైనను ధర్మమార్గమే అనుసరణీయము. అపాత్ర దానములందు ధనమును వెచ్చించి ప్రయోజనము లేదు. ముఖ్య వ్యయములైనను కడు జాగరూకతతో చేయవలెను. విరోధులనడచి అఖిల ప్రజా రక్షణ నెఱపుచు పేదవారిని దయతో జూచుట విధి.

## మాంధాతకు ఉతథ్యుడు నుడివిన హితవు – ధర్మఫలము

ఈ ధనార్జన విషయమునే ఒక సమయమున మాంధాత మహారాజునకు ఉతథ్యుడిట్లు విశదీకరించెను. ప్రజాభివృద్ధి ధనలాభము ధర్మ మార్గ ఫలితములు. కావున ప్రభువెప్పుడును కోపము లోభము లేకుండ ఉండవలయును. బ్రాహ్మణ జనము ధర్మమునకు స్థానము. అసూయ లేక వారిని గౌరవింపవలెను. బలి చక్రవర్తి బ్రాహ్మణులను దేవతలను అసూయతో చూచినందువలననే గదా తన సంపద పోగొట్టుకొని నాడు. తుదకు భక్తుడై తన సిరి సంపదలను ఆర్జింప గలిగెను. అసూయ ఉన్నచో దేవతలును చెడుదురు. భూపాలునకు పరస్త్రీల యందాశ యున్నచో అది అన్ని విధముల నతనికి నాశకారణమే. దాని వలన అతని రాజ్యమున వర్షము లేక ప్రజలు బాధపడుదురు. ఈ ధర్మమార్గమున ప్రవర్తించి మాంధాత మహా ప్రసిద్ధుడై విరాజిల్లెను.

ధర్మజుడంతట తాతా! నీవు నుడువుచున్న యీ ధర్మ మార్గ ప్రవర్తనమందాసక్తి యెట్లు గలుగుననగా భీష్ముడు తొలి వామదేవ మహాముని కోసల రాజన్యుడగు వసుమనునకు చెప్పిన విశేషములిట్లు నుడివెను.

అర్థసిద్ధికన్న ధర్మసిద్ధి ఉత్తమమైనది. సకల సిద్ధులను కీర్తియు, కలిగింప

జేయునది ధర్మ ప్రవృత్తియే. ధనమునకాసించి ధర్మము విడనాడినచో భూపతు లకది నాశనహేతువే. ధార్మికత యందాసక్తి కలుగుటే యొక పవిత్ర సంకల్పము. సామదాన భేద దండముల గూర్చి గూడ వామదేవుడా విభునకిట్లుపదేశించెను.

## శత్రువులను లోగొనుట

తన మూల బలము సంతుష్టులై యున్నపుడు శత్రువుల బలహీనత కని పెట్టి దండోపాయముపయోగించుట శుభ ప్రదము. యుద్ధము సాహసోపేత మయినది. ఆ విధమున సంపదను కూడబెట్టుట మంచిపనికాదు. కోపము అహం కారము తగ్గించుకొనజాలు నృపునకు శత్రువులుండరు. తనయంతటి వాడయినను ఎదుటి వానియందు సామోపాయము చూపుట మేలు. తన సైన్యము కలత జెం దినపుడు విరోధిని ధనమిచ్చి యైనను శాంతుని జేయవలయు. అధికుడైన వానిని అట్లే దానము చేత తృప్తుని జేయవలెను. ఈ మూడు ఉపాయముల వలన తనపని సాధ్యము కాకపోయినచో వేగుల వారి వలన విరోధి దోషము తెలిసికొని భేదము పాటింపవలెను. శుక్రుడు తన మతమున ఉపేక్ష అను అయిదవ ఉపాయమును బోధించెను. శత్రువులు పిశాచములవలె తమలో తాము కలహించు చున్నెడల దానిలో కలుగజేసికొనక ఉపేక్ష వహించుట మంచిది. ముల్లును ముల్లుతో తీసి నట్లు మంత్రుల అతిశయమును ఆ విధముగనే అంతమొందించుట మంచిది.

## యుద్ధనీతి

ధర్మజుడీ విషయమును గూడ అడుగగా భీష్ముని హితోపదేశము.

శత్రువు సైన్యముల బంపుచో తానును సైన్యముల బంపి, ఒంటిగా యుద్ధము చేయవచ్చినచో తానును ఒంటిగా చేసి, మాయలు పన్నినచో మాయలు పన్ని గెలువ వలెను. వెనుదిరిగి పారిపోవు వానిని, శరణన్న వానిని, ఆయుధములు విరిగిన వానిని, రథము విడిచి అశ్వములు తప్పుకొనినవానిని విడువవలెను. వారి పైకి పోరాదు. అధర్మ యుద్ధమున గెల్చుట కంటె ధర్మయుద్ధమున ఓడిననుమేలే. శత్రువుపై దాడి చేయునప్పుడు అతని పట్టణము గాల్చి ప్రజలను హింసించుట పాపములలో పాపము. అట్టిపని అవసరమే అయినచో దేవ బ్రాహ్మణ గృహము లు వదలిపెట్టవలసినది. అయితే రాజ ధర్మము పాపమని తలంతు వేమో శరణా గతరక్షణము, రణమున గాయపడిన వారి ఆదరణ, యజ్ఞ కార్యములు నిర్వహిం చుట అను సత్కారములతో ఆ పాపములు హరించును. రణమున చనిపోయిన వారిగతిని గూర్చి ఇంద్రాంబరీషుల సంవాదమున్నది వినుము.

## రణమున మరణించిన వాని గతి

అంబరీషుడు పెద్దయజ్ఞములొనర్చి శత్రువుల జయించి ప్రజలకు సుఖము గూర్చిన చక్రవర్తి. ఒకనాడతడు ఇంద్రుని జూడనేగి అచట తన భృత్యుడైన సుదేవుడు భోగభాగ్య విలాస విహారములతో నుండుట గని ఆశ్చర్యపడి, సురేంద్రా ఇతడింతటి వాడెటులయ్యెనని అడిగెను. ఇంద్రుడప్పుడు మహా రాజా పూర్వము శత శృంగుడను క్రూర దానవుడొకడుండెను. ఆతని పుత్రులు సదముడు విదముడు దముడు అను ముగ్గురును మహా క్రూరులు - నీ ప్రసిద్ధి యశము జూచి అసూయ పడి దర్పోద్ధతులై దానవసైన్యముతో నీ పై బడిరి. ఆ సమయమున వారిపై నేగి హతమార్చుటకు నీవు సుదేవుని పంపితివి. చారుల వలన ఆ దైత్యుల మదోద్ధతిని రణ ప్రావీణ్యమును విని మనసు చలించి ఈ యుద్ధ క్రీడ నాకేల, పరుల చేతిలో పడుటకన్న నా యంతట నేనే చత్తునని మహేశ్వరుని ధ్యానించుచు తన కంఠమును వాడి కత్తితో పొడుచుకొను నంతలో ఈశ్వరుడే ప్రత్యక్షమై సుదేవుని వృత్తాంతము నెఱిగి, సుదేవా! నీ సాహసము ప్రశంసనీయము. కానియీ దుడుకు తనమేల. ఇదిగో ఒక దివ్యాయుధమును రథమును నీకిచ్చుచున్నాను అని ఆ ఈశ్వరుడంతర్ధానుడయ్యెను. ఈశ్వర వరములందిన బలోత్సాహములతో సుదేవుడా రథముపై నేగి దైత్యులతో మహా యుద్ధమొనర్చెను. అతని ధాటికి దైత్య సైన్యములు చెల్లా చెదరైనవి. సదముడు, దముడు యిరువురును యుద్ధమున జచ్చిరి. ఇంకను మిగిలిన విదముని పై కేగ సమకట్టి యాయుద్రేకమున రథమును వీడి నేలపైనేగి సుదేవుడా రాక్షసుని దాకి ఘోర యుద్ధమొనర్చెను. ఒకరొకరి ఆయుధ హతిని ఇరువురును మడిసిరి. మహారాజా నీకు జయమబ్బినది. ప్రజలు హర్షించిరి. ప్రాణములకు తెగించి రణ నిహతుడైన సుదేవుడిట్లు వీర స్వర్గ ఫలమనుభవించు చున్నాడు. సంగ్రామ యజ్ఞమునకు ఏ యజ్ఞములును సరికావు. సమరమున చావవలయునను సూత్రమును లేదు. వెను చూపు లేక ధైర్య సాహసముల వెన్నీయక శత్రువులతో అచంచల ధైర్యమున పోరాడుట చేతనే నేనీ దేవేంద్ర పదవి యందుంటిని. చూడుము ఆ కనపడు వారందరును వీర స్వర్గ మందిన మహా యోధులు బహుముఖ విలాసములతో నున్నారు. యుద్ధమున పిరికి పందలై వెన్నిచ్చిన వారలరుగో నరకమున బడి యున్నారని ఇంద్రుడంబరీషునకు జెప్పిన కథ భీష్ముడు ముగించెను.



# మహాభారత ధర్మశాస్త్రము

## శాంతి పర్వము - తృతీయాశ్వాసము

ధర్మజుడు తన మనమున నున్న సర్వ సందేహములను నుడువుచుండ భీష్ముడు ఆయా అంశములగూర్చి హితవాక్యములిట్లు పలికెను.

<u>యుద్ధమునకు తగిన కాలము మున్నగు విషయములు</u> :- శత్రువులపై దండెత్తుటకు వర్షములు, చలి, మండు వేసవి గాని కాలము, పైరు పంటల సమయము అనుకూలము. నీరు, పచ్చిక, కట్టెలు లభించు మార్గము అనుకూలము. రథగజ హయములు, ఆయుధములు శంఖ కాహళ పటహాది వాద్యములు శత్రువులకు భయము గొల్పునవియై యుండవలయును. శత్రువులు వచ్చుతీరులు చారుల వలన గ్రహించి వారు విడిది సేయు సమయమునకు, నిదుర పోవు చోట, నీకు దూరముగ నున్నపుడు, ఆకలికి దప్పి గొనినపుడు వారిపై బడ వలయును. సమతలమగు ప్రదేశము చతురంగ బలములకు అనుకూలము. ఎండకు చలిగాలికి ఎదురుగ సైన్యముల నడిపించరాదు. డాలు ధరించిన వారు ముందు, వారి వెనుక విలు కాండ్రు, ఆ తరువాత గజహయ రథముల నమర్చి రాజేగవలయును. యెదుట భీకరముగ బొబ్బలిడుచు శత్రువులను కలత నొందింప వలయును.

### యోధుల కుండదగిన లక్షణములు

అవయవ పుష్టిగలిగి వీరు పులులు సింహములనిపించు ఉగ్రాకారములు గల యోధులుండవలయును. ఒక్కొక్క ప్రాంతమువారు ఒక్కొక ప్రత్యేకత కలిగి యుందురు. గాంధార సింధు సౌవీరులు (పంజాబు ప్రాంతము) జౌశీనరులు ఖడ్గాది ఆయుధములందు నేర్పరులైన పరాక్రమ వంతులు. తూర్పు ప్రాంతము వారు ఏనుగుల నుపయోగించి మాయలు పన్నగలరు. యవనులు పశ్చిమ ప్రాంతము కాంభోజ దేశవాసులు అశ్వదళ నిపుణులు. ఘూర్జరులు (గుజరాతు) వైరులను విడదీసి లోబరచు కొనగలరు. మాళవులు (రాజస్థానము) రథాది చతురంగ బలముల నడిపించగల సమర్థులు. ఇట్లే తక్కిన ప్రాంతములవారు తమ తమ వైశిష్ట్యము గలవారగుట భూపతులు సమయోచితముగ సైన్యము నందు వారి నుపయోగించుట ముఖ్యము.

## శకునాపశకునములు

దండయాత్ర చేయబోవునపుడివి జయాప జయములు సూచించును. సైనికులందుత్సాహము. అశ్వఘోషలు గజ ఘీంకారములు జయ సూచకములు. జంతువులు పక్షులు ఆరోహణ క్రమమున నేగుట, వెనుకనుండి చల్లని గాలి వీచుట శుభ ప్రదములు. అగ్నులు వెలుగుట తూర్యములు గంభీర నాదముల చెలగుట ప్రోత్సాహకరములు. అయినను తనంత తాను కయ్యమునకు కాలు ద్రవ్వరాదు. మృగములు చెదరి పర్వెత్తినను, సైన్యములు కలత జెంది చలించినను అశుభము. కొలది మంది ధైర్యవంతులైనను ఫలము ఉండదు. ఓర్పు కావలయును. అపరిమితమైన ఓర్పు, దైన్యము దెచ్చును. ఎదిరి గర్వించి వచ్చినచో వానిని గెలిచి దయ క్షమ చూపుట మంచిది.

## శత్రువులను జూచు విధము

మున్ను బృహస్పతి మహేంద్రున కుపదేశించిన విధ ము భీష్ముడు నుడివెను.

శత్రువును నశింపజేయ వలసినదే. కాని గర్వితుడై ఎత్తి పొడుపు మాటలతో మోసము చేసి కీడు గావింప జూచుచో తన ప్రయత్నమునకే మోసము. నమ్మినట్లుగా పైకి కనబడి నమ్మకుండ ఉండుటమేలు. శత్రువుపై జనునప్పుడు వాని అనుచరులు వినునట్లు మెత్తని తీయని మాటలు చెప్పినచో దగ్గరకు రాగలరు. అప్పుడు వారిపని పట్టవచ్చు. శత్రువును మరల మరల పరిభవించుట కేవలము కలహము కొరకై కలహమునకు బోవుట తప్పు. కాలము కలిసి రాకపోయినచో కొన్ని నాళ్ళు మంచిగనే ఉండి తగిన తరుణమున పగతీర్చుకొనవలెను. అల్పత్వము, పారుష్యము లేకుండ క్రమముగ శత్రువును లోబరచుకొనవలయును. పెక్కుమంది శత్రువులతో ఒక్కసారి విరోధము తగదు. ముందు లోకువ అయిన వాని ని లొంగదీసి తక్కువారలతో బంధు భావము పాటించ వలయును.

## ఆపన్నివారణము

పరులచేత గాని నిజపరివారము చేతగాని సంపద పోగొట్టు కొనినపుడు కలుగు దుఃఖము నివారించు విధమును భీష్ముడిట్లు నుడివెను.

పూర్వము కోసల పతియగు క్షేమ దర్శి తన శత్రువగు విదేహ పతి వలన తన రాజ్యమును గోల్పోయి, ఒకప్పుడు తనకు మంత్రియై వనముల తపస్సునకు వెళ్ళిన కాలక వృక్షీయు నాశ్రయింపగా ఆ ముని యిట్లు చెప్పెను.

రాజు తాననుభవించుచున్న భోగములు శాశ్వతమని తలపరాదు. అవి పోయి నప్పుడు వగ జెందరాదు. బంధువులు మిత్రులు తుదకు నశింతురు గదా. మన మేమియు చేయలేము. ధన సంపద లంతకన్ననా. పోయిన దానికై వగవకుము, రాని దానికై ఆస వలదు. దైవ మెపుడెంత యిచ్చిన దానికే ప్రీతి బొందవలయును. మనకు తెలియకనే సిరి పోవును. కోరక పోయినను దైవ కారుణ్యమున సిరి సంప దలు రావచ్చును. సిరి మనుజుని విడిచి పోవును, మనుజుడే సిరిని పోగొట్టుకొనును. అల్లకల్లోలమగు తటాకము శాంతమగునట్లు తన కష్టములనోర్చి యుండువాడే ధీరుడు. ఇప్పుడు చెప్పినది కష్టముల నోర్చుకొను విధము. ఇందున్న నీతి మార్గము వినుము. తక్కువ తనమున కోర్చి శత్రునితో స్నేహముగనే యుండి, ఒకరి సహా యము వలననో మాయోపాయము వలననో పగ సాధింపవలయుననగా, క్షేమ దర్శి ఓ మునీంద్రా అధర్మోపాయములను నేనవలంబింపజాలనని నుడివి యూర కుండెను. ఆ మునీంద్రుడంతట విదేహరాజును రహస్యముగ రావించి క్షేమదర్శి గుణగణంబులు నుడివి వారిర్వురికి సంధి యొనర్చెను. విదేహపతి క్షేమ దర్శితో స్నేహము నెరపి తన కుమార్తె నాతనికిచ్చి వివాహ మొనర్చి వాని రాజ్యము వాని కిచ్చి పంపెను.

## పరివారమును జూచు విధము

పనులు జేయుట యందు నేర్పరులు, పన్నులు వసూలు జేయగలవారు కావలయును. వారికి విశ్వాసము కలుగునట్లు వారితో కలిసి మెలిసి యుండుట మేలు. ఈ పరివారజనులు కులమెుక్కటైనను మంచి చెడ్డలు చూడక కొంద రసూయ కలిగి యుందురు. అది రాజ్యమునకు చేటు సమయానుకూలముగ తగిన విధమున వారితో సంభాషించ వలెనే గాని, ఐకమత్యముగ నుండవలెనని చూచుట రాజునకు చేటు. ఆ జనులు వారిలో వారికి విరోధము పెంచుకొనుచు విడిపోవుట వలన రాజ్యము పెంపు నశించును.

## ధర్మ సూక్ష్మత

ధర్మములు బహు విధములుగ నున్నవి. అన్నిటిని ఆచరించుట కష్టముగదా. ఇహపర సౌఖ్యముల కేవి ముఖ్యములు అని ధర్మజుడడుగగా భీష్ముని హిత వాక్యములు.

తల్లికి తండ్రికి గురులకు సేవచేసి వారి మాటకు విధేయులై యుండుట అధిక ధర్మము. ఆ ముప్పురియందు, వేద త్రయము ఋగ్యజుస్సామ వేదములు,

అగ్ని త్రయము ఆహవనీయము దక్షిణాగ్ని, గార్హపత్యము, మూడు లోకములు స్వర్గ మర్త్య పాతాళములు, దేవతా త్రయము బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఉందురు. వారి సేవ అవ్యయానంద ప్రదము. వారి యందు తల్లి ముఖ్యము. భూదివముల యందు జనని పూజలందుకొనును.

## సత్యాసత్యములు

సత్యసంధత అన్ని ధర్మములకన్న మిన్న. అనృతము మహా పాతకము. పరుల ధన ప్రాణములు అపహరించు వానితో సత్యము పలుకుటయు పాపమే. బొంకులు పలికి యైనవారిని శిక్షించుట ధర్మము. ఇతరులకు హితము సేయు పలుకులు ధర్మములు. జీవులకు బాధ గలిగించునవి నిజములైనను పాపములే. మానవులందీ మంచి చెడ్డలు వివేకముతో నిర్ణయించుకొనవలయును.

## పాపమునుండి తొలగుట

వర్ణ సదాచార పరులు, వ్యసనములు లేనివారు, తమకు ప్రతికార శక్తి యుం డియు నిందలు సైచుధీరులు, అతిథి పూజనులు, వేద పాఠకులు, అగ్ని హోత్రము నడుపువారు, పిరికి తనము లేక యుద్ధమున ముందునకు పోవువారు, సత్యసంధులు, సాధు జన పోషకులు అయిన వారందరును సర్వ దేవతాసములు. వారిని పాపము లంటవు. గోవిందుని భక్తులకు మహేశ్వరుని భక్తులకు పాప భయములేదు. వారినా దైవమే కాపాడును. ధర్మ రాజా! నీకు గోవిందుడు సఖుడు బంధువు కూడ; పాప మను పేరు నీకెప్పుడును ఉండదు.

## సుజన దుర్జన విచక్షణ - పులి నక్కల కథ

మంచి వారు చెడ్డవారగుచు, చెడ్డవారు మంచివారుగ నటించుచు ప్రభువుల అనుగ్రహము సంపాదింతురు. వీరిని తెలిసికొని నిర్ణయించుటెట్లని ధర్మరాజడుగగా భీష్ముడొక కథనిట్లు చెప్పెను.

పూర్వము పౌరికుడను రాజొకడు తన దుష్టచేష్ట ఫలముగ మఱు జన్మమున నక్కయై పుట్టెను. తన దుర్మార్గము వలననే తానిట్లు నీచ జన్మము నందిన విష యము నెఱిగి, సద్వర్తనమున కాలము గడపు చుండెను. మాంసము ముట్టదు. శాకాహారములే తిని బ్రతుకును. అల్ప జంతువుల హింసింపదు. ఈ విచిత్రమును గని తోడి నక్కలు ''ఏమయ్యా మా సాటి వాడవు నీ నియమ నిష్ఠలు మాకు తల

వంపులు గానున్నవి. పోనీ, మేము తెచ్చి పెట్టెదము మంచి రుచి అయిన మాంసము'' అని ఎంత చెప్పినను ఆ నక్క వినక తన నియమములు వీడక పాటించుచుండెను. ఈ నక్క యొక్క సద్వర్తనము విని ఆ అడవికి రాజయిన పులి వానిని పిల్చి నీవు నాయొద్దనుండుము అని కోరెను. నక్క ''పులి రాజా! మీరు స్వాభావికముగ క్రూరులు, నేను అల్పుడను నన్ను హింసింపక నామాట విందునని మాట యిచ్చినచో నీకు భృత్యునిగా ఉండగలను'' అని చెప్పగా పులి అంగీకరించినది. తానును అట్లే నడచు కొనుచు అంతకంతకు పులి అనుగ్రహము ఆదరణ సంపాదించెను. తోటి నక్కలును పులి వద్ద పూర్వమునుండి ఉండిన భృత్యులు ఆ క్రొత్తనక్కపై అసూయ పెంచుకొని ఒకనాడు పులిని చూచి, రాజా, ఈ క్రొత్త నక్కను నమ్మకుము, నిన్ను వంచన జేయుచు నీకు మేము తెచ్చిన మాంసము కొంచెము కొంచెము తినుచున్నది. తుదకిది నీకు చేటు తెచ్చును'' అని యెంతో చెప్పినను వారి మాటలు పులి వినలేదు.

ఆ నక్కలన్నియు ఒకనాడు కుట్రపన్ని గుహలో పులి తిను మాంసమును దొంగిలించి పోగా, మధ్యాహ్న భోజనమునకు వచ్చిన పులి తనకు మాంసము లేక పోవుటకాగ్రహించి దొంగను శిక్షించుటకు జంతువులన్నిటిని పిలిచి అడిగెను. సమయము కనిపెట్టి మిగిలిన నక్కలు మరల ''పులిరాజా! మేము చెప్పితిమి గదా, నీ వద్ద క్రొత్తగా చేరిన నక్కయే మిమ్ముnనమ్మించి యిట్లు చేయుచున్నదని ఏవేవియో కొండెములు చెప్పినవి. పులి ఆ మాటలు విని ఆ నక్కను దూరముగ పార ద్రోలి దానిని చంపి ఆ మాంసము తెండని తన పూర్వ సేవకులకాజ్ఞాపించెను. ఆ నక్కను కాళ్ళు కట్టి తక్కిన జంతువులు ఈడ్చుకొని పోవు చుండ పులితల్లి వేగమె వచ్చి'' తనయా, ఇదేమి నీవీ దుష్టులమాటవిని ఈ క్రొత్త నక్కను చంపించు చున్నావు. ఇది నిర్దోషి. వచ్చినప్పటినుండియు మనకు హితములు చేయుచున్న నక్కను చంపకుము. అని గట్టిగా నుడువగా పులి మెత్తబడి ఆ నక్కను పిలిచి నీవు భయపడకుము. నా దగ్గరనే యెప్పటి వలెనుండుము. అని ప్రేమతో కౌగిలించుకొని మృదువుగ జెప్పినను ఆ నక్కకు పులి మాటలు నచ్చలేదు. రాజా మీవంటి వారు మాబోటి భృత్యులను మంచి చెడ్డలు చూడక రమ్మని పొమ్మనుట తగదు. ఎవరెట్టి వారో గ్రహించు నిదానము మీకు ఉండవలయును. నేను పెద్దవాడనయితిని. మీ వద్ద నుండలేను. అని చెప్పి అరణ్యమునకు పోయి తపో వృత్తి నుండి మరణించి దివికేగెను. ధర్మజా చూచితివా ఎవరెట్లు ప్రవర్తింతురో! కనుక రాజనువాడు ఎవరు

ఏమి చెప్పినను వినక మంచి చెడ్డలు గ్రహించి, ఎవరు ఎట్టివారో ఏర్పఱించి ఎరుగవలయును. రాజునకిది అత్యావశ్యకమని భీష్ముడు హితముపదేశించెను.

## భూపాలునకు సౌఖ్యమెట్లబ్బును - ఒంటెకథ - ఆలస్యము కీడు

ఈ ప్రశ్నమునకు భీష్ముని హితవచనములు

ఏ పనికైనను తగిన సహాయము కావలయును, ఆలస్యము కారాదు. ఆలస్యము, వలన కీడు కలుగ వచ్చును. ఆ కథ వినుము. తొల్లి ఒక యొంటె మహా తపస్సు చేసి కొన్ని యోజనముల పొడవు గల మెడను వరముగా పొందినది. దానితో ఎంత దూరమందున్న వృక్షమునుండి యైనను వలసిన లేత ఆకులను తృప్తిగా తినెడిది. ఒక దినమున పెద్ద వర్షము రాగా ఆ లొట్టె తన తలను ఒక గుహలోనికి దూర్చి నిదురపోయినది. అచ్చటకు ఒక నక్క జంట జేరి కొంత వడికి ఆకలి కాగా ఒంటె కంఠ నాళముల కొరికి మాంసపు ఖండముల నూడబెరికి నక్కలు తినుసరికి ఒంటె మేల్కొని ప్రాణములు విడిచినది. వానవచ్చుచున్నను ఇంటికి పోక చేసిన ఆలస్య ఫలితమిది.

శత్రురాజు అధికుడైన ఆపద నెట్లు తప్పించుకొనుట

దీనిని గూర్చియు ఒక కథనుడివెను. తనలో కలియుచున్న నదులతో సముద్రుడు గోష్ఠి సలుపుచు, నదులారా మీరు పొంగి ప్రవహించునపుడు నిడుపయి నిలుచు చెట్లు నేలకూలగా తీరమందున ప్రబ్బలి తీవ లట్లే యుండును. ఆ తీవ లందు మీ కంత ప్రేమ యేలననగా, ఆ తీవల నమ్రతయే వాని సుస్థితికి కారణ మని నదులు నుడివెను. ఎదిరి బలమధికమైనపుడు వానితో మూర్ఖత్వమున పోరికి బోవుచో ఎవరికైనను పతనము తప్పదు. శత్రు విజృంభణ తగ్గిన వరకు తాళి, తన వైరిని లోబరచుకొనుట యుక్తము.

## రాజకార్య నిర్వహణకు తగిన వారులేకపోయినపుడు కుర్కుర నీచత్వ కథ

మహాత్ముడయిన ఒకముని యాశ్రమంబున సర్వ జంతువులు నెయ్యముతో నచట వసియించు చుండెను. వానిలో ఒక శునకము మరింత చనువు తీసికొని ముని వెంటనే తిరుగుట కారంభించుట చూచి తక్కిన జంతువులాకుక్కపై అసూయ జెందినవి. ఒకనాడొక పులి ఆకుక్కపై బడబోయినది. ముని కరుణతో ఆ కుక్కకు పులి బలము కలిగించెను. ఇట్లే సింహము, ఏనుగు శరభము, ఒక

టొక్కటే వచ్చి కుక్కపై బడగా దాని కాయాబలములొసంగి ముని రక్షించెను. కుక్కకు గర్వమెక్కువైనది. పూర్వనీచత్వము పోలేదు. తన బలము చూచుకొని మునినే వధింప జూడగా దానినాముని యెప్పటివలె కుక్కను జేసి వైచెను.

కావున గుణ హీనులు మానవీయులు గారు. భృత్యులలో వారి వారి గుణ సామర్థ్యము లెఱిగి తగిన కార్యములందుంచ వలయును. కులమని పట్టింపులేల? కార్య జ్ఞానము సత్యము శౌర్యము భక్తి తాత్పర్యము గాంభీర్యము చూచి తగిన పదమున నిలుపవలయు. ఉత్తమ మధ్యమ హీన-గుణముల వారికి దగిన పనుల నీయవలెను. తగిన పదమున నిలుపవలయు. సింహమైనంత మాత్రమున చాలదు. తగిన బలము స్థైర్యము కావలెను. భక్తి విశ్వాసములు సత్కుల గుణములున్న వారి వలననే, కార్యములగును. రాజునకు గూఢ సమయము గనిపెట్టి ఔదార్యము, కోపము జాప్యము కుటిలత్వము నణచుట, నీతి వలయును. కాంతి కిరణములు మూలమూలలకు వ్యాపించినట్లు చారులను పలు ప్రక్కలకు బంపి పరుల పనులు ఆలోచనలు కనిపెట్టి రాజు తాను సూర్యుని భంగివెలుగ వలయును. తన కోశ సంపదను ఇట్లే భూపాలుడభివృద్ధి చేసికొన నగును.

## దండనీతి

రాజులకు దండము సర్వ సాధారణము. అయినను దాని స్వరూప స్వభావము లెట్టివి? అని అడిగిన ధర్మజునకు భీష్మాచార్యుని ఉపదేశము.

దండమొక పవిత్రమైన ఆయుధము. ఖడ్గ గదా శక్తి శరాసన ముసల చక్ర పాశ తోమర త్రిశూల పరశు మున్నగు సాధనములు దండ స్వరూపములే, పాపులను వివిధ రీతుల శిక్షించి జనులకు ప్రియము గూర్చునవి. యజ్ఞమయాత్ముడగు విష్ణువు దండమై పెను పొందును. ధర్మాధర్మములు, సుఖ దుఃఖములు, నయానయములు, అర్థానర్థంబులు బలాబలంబులు ప్రమాదా ప్రమాదములు దండములను ఉపయోగించు విధమున కలుగును. దండమును సద్విధముగ నుపయోగించినపుడు సుఖ పడిన ప్రజలు రాజు యొక్క అభివృద్ధి అభ్యుదయము కోరుదురు. గాన రాజులకు దండము ఆశ్రయము ఆధారమునై వర్తిల్లును. సత్య ప్రకారమైన ధర్మము ఎల్ల వేళల అనుష్ఠింపదగినది. సూర్యునకది ప్రీతికరమ్మై యాతడు ప్రజలకు అన్నము కలుగ జేయును. దండము దండదేవుడై ప్రసన్నుడగును. పురుషుడు ఈశ్వరుడు భూతాత్మకుడు, జీవుడు ప్రాణుడు, అక్షయుడు సత్త్వము ప్రజాపతి ఈ యెనిమిదియు దండదేవుని నామధేయములే.

## దండోత్పత్తి - వసుహోముడు మాంధాత్రునకు చెప్పిన విధము

అంగదేశపు రాజైన వసుహోముడు భార్యా సహితుడై హిమాద్రి కేగి ముని వాటికలలో తాను గూడ ఋజువర్తనమున కాలము గడపు చుండెను. మాంధాత్రుడొకనాడచ్చటకు వచ్చి, అచటి వారిడిన అర్ఘ్య పాద్యాదులు స్వీకరించి, వసుహోముని జూచి నరేంద్ర వర్యా తమ వలన దండోత్పత్తి క్రమంబెఱుగ వచ్చితి ననగా ఆతడీ కథ మాంధాత్రునకు చెప్పెను.

బ్రహ్మ ఒక సమయమున ఒక మహా యజ్ఞము సేయ దలంచి సమర్థుడయిన ఋత్విజుడు లేక తనలో నుండి తుమ్ము వలన క్షుతుడను వానిని బుట్టించి ఋత్విజునిచేసెను. అతడు ఋత్విజుడుగ క్రతు వొనర్చు చుండెను. ఇంతలో తనంతట తానెచ్చటికైన బోగలిగిన యజ్ఞ దండ మదృశ్యమైనది. కార్యాకార్యము తెలియక పుడమి యందంతటను అమర్యాద నిండి పోయినది. ఈ ప్రమాదమునకు వగచి విరించి, విష్ణువు కడకేగి వారిరువురు రుద్రుని కడకేగి తమ వృత్తాంతము నుడివిరి. మహాదేవుడంతట తన ప్రభావము దండముగా కల్పిం ) దండనీతి కాశ్రయుడై యుండెను.

## పదునెన్మిది విద్యలు

వేదములు నాల్గు, కల్పాది అంగములు ఆరు, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు నిరుక్తము, జ్యోతిషము, కల్పము, పురాణములు, ధర్మ శాస్త్రములు, న్యాయము, మీమాంస కలిసి పదునాల్గు విద్యలైనవి. వీనికి వైద్యము, ధనుశ్శాస్త్రము, అర్థము, నీతి శాస్త్రము కలిసి మొత్తము పదునెన్మిది విద్యలైనవి. వీనిని శివుడేర్పఱచి విష్ణువునకు వశము గావించెను. విష్ణుదేవుడు విరించి కిమరల తుమ్ము వచ్చునటుల జేసి ప్రజాపతి యావిర్భవించునట్లొనర్చె. దండనీతి యిట్లు సమగ్రమై చెల్లగా లోకమంతయు సుఖముగా నుండెను. విరించి యజ్ఞము కొనసాగెను. విష్ణువు నుండి ఈ దండనీతి ఆంగిరసునకు, ఇంద్ర మరీచులకు, భృగువునకు వానినుండి అనేకమునులకు వరుసగా వచ్చినది. మహా శివుని నామములతోనే దండమును వర్తిల్లును. న్యాయమైన ప్రజాపాలనకీ దండనీతియే ఆధారము.

## ధర్మార్థ కామములు - శీలము

ఈ గుణముల నడవడి యెట్లున్న ప్రజలకు మేలగునని ధర్మజుడడుగగా భీష్ముడిట్లు నుడివెను. కామందకుడను ముని అంగరిష్ఠుడు అను రాజునకు దీని విధ మిట్లు నుడివెను.

కామము వలన ధర్మార్థములకు చేటు వాటిల్లును. కామ నిరతుడైన రాజును ప్రజలెల్లరు నిరసింతురు. ధర్మసాధన కనువైన అర్థనీతి రాజనుసరించుట ఉచితము.

శీలము సత్ప్రవర్తనల వలన, ఉన్న సంపద శోభిల్లును. ధర్మరాజు మహా వైభవముగ, భూరి దాన ధర్మములతో నొనర్చిన రాజ సూయము శోభిల్లినది. ఆ శోభను జూచి అసూయ పడి దుర్యోధనుడు తండ్రికడ మొఱ వెట్టగా ధృత రాష్ట్రుడు నాయనా దుర్యోధనా! నీకున్న సిరియు సంపద తక్కువైనది గాదు. ధర్మజుని శీలము సత్ప్రవర్తనయు పరిశుద్ధములైన కారణమున ఆ శోభ అతనికే దక్కినది. నా భాగుడు మాంధాతృడు మున్నగు వారు వారి సచ్ఛీలము వల్లనే గదా కీర్తి పడసిరి అని బోధించెను.

మరియు నొక కథ వినుము. ప్రహ్లాదుడను రాక్షసరాజు తన శీలమ హిమ చేతనే ఇంద్రుని సంపద హరించి త్రిలోకములు మహా విభవమున నేలు చుండె ను. దీనుడైన ఇంద్రుడు బృహస్పతి పంపున భార్గవుని వద్దకేగి ఏ విధము వలన తన సంపద తాను పొందగలనని అడుగగా ప్రహ్లాదునే అడుగుమని వెనుకకు పంపె ను. ఇంద్రుడొక విప్రకుమారుని రూపమున పోయి ప్రహ్లాదుని వినమ్రుడై సేవిం చుచు ఆ దనుజ రాజు మన్ననలందుకొనెను. ఒకనాడా విప్రుడు దైత్యేంద్రా! నీకీ త్రిలోక రాజ్య సంపద యెట్లబ్బినదని అడుగగా, ప్రహ్లాదుడు నాకు మహా సంపద అబ్బినదిగదా అను గర్వము, అన్యులపై అసూయ గాని లేదు. ఎల్లరు మెచ్చునట్టి శీలమున ధర్మమున ప్రవర్తింతును. అదియే నా సంపదకు కారణమని నుడివెను. అంత ఆ విప్రుడు దైత్య రాజా ''ఆ శీలము నాకిమ్ము మహాత్ముల సేవించిన మేమును బ్రతకవలె గదా'' అని వేడగా, ''ఓహో! ఈ విప్రుడు సామాన్యుడు కాడు అని తలంచి అట్లేయని యిచ్చెను. ఇంద్రుడు శీల సంపన్నుడై తన అమర లోకమునకే గి తన సంపదల నొందెను. ప్రహ్లాదుడా విప్రునకు తన శీలమిచ్చిన వెంటనే ఒక తేజస్వి తన శరీరమునుండి వెడలి పోవుటయు ఆ వెనుక ఒక సుందర కాంతామ ణి దేహము నుండి వెడలుట గన్పడెను. ప్రహ్లాదుడు నివ్వెరపోయి మీరెవ్వరని ప్రశ్నింపగా నీవు శీలము నిచ్చిన విప్రుకడకు బోవు చున్నాను. నేను సిరిని బల మెక్కడ ఉండునో అచటికి పోదును అని ఆమె నుడివెను. ప్రహ్లాదుడంతట సిరిని జూచి మహాదేవీ! నా వద్దనున్నట్లే యుండి నా శీలమును గొంపోయిన అతడెవ్వడ ని అడుగగా, ఆమె అతడుదేవేంద్రుడు నీ శీలమును హరించి తిరిగి తన పూర్వ ప్రభావమును పొందెను. ఇంకను వినుము శీలము వలన ధర్మము, ధర్మము వల న సత్యము సత్యవర్తనమ్మున బలము వాటిల్లు. బలమున్న యెడల నేనుందును, సర్వమునకు మూలము శీల సంపద యని చెప్పి యామె వెడలెను. ధృతరాష్ట్రు డు గూడ దుర్యోధనునకొకసారి శీలమును గూర్చి ఇట్లు చెప్పెను. కావునమనో

వాక్కాయ కర్మముల ఎవ్వరి యెడలను ద్రోహము లేకుండుట శీలము. పరహిత ము సేయు వారిని ప్రజానీకము మెచ్చుకొందురు. తన యానీ విప్పుడైనను నీ శీలమును పునః పరిశీలించుకొని వర్తింపుము అనెను.

ఈ కథను భీష్ముడు నుడివి ధర్మరాజా నీకు సచ్ఛీలము స్వాభావికమే కదా, అదియే నీ శ్రేయస్సు కాపాడును. అనగా తాతా! ఆశగదా దుర్యోధనుని అంత దుర్మతిని జేసినది. మొదటి నుండియు మా రాజ్య భాగమున కాశపడి దుర్మార్గ మునకు పాల్పడి తానేనశించెను. ఈ ఆశను పోగొట్టు కొనుట యెట్లు అని ప్రశ్ని ంచెను. భీష్ముడంతట

## సుమిత్రుడను రాజు చరిత్ర - ఆశను నివారించు విధము

సుమిత్రుడను హైహయ రాజొకనాడు అడవికి వేటకు పోయి ఒక మృగ మును కొట్టగా అది తనకు గ్రుచ్చుకొనిన బాణముతో బాటు పరుగెత్తి పోయి రాజు వెంట బడి తరిమినను, తప్పించుకొని పోయెను. వెదకి వెదకి రాజు ఒకముని పల్లెజేరి, అలసట తీర్చుకొని యుండగా ఋష భాఖ్యుడను ముని రాజును జూచి అతని వృత్తాంతము ఆశకొలది తాను కొట్టిన మృగము వెంట వచ్చుట విని యిట్లు నుడివెను. రాజా! ఆశ చాల దుర్నివారమైనది. నీ వలెనే వెనుక ఒక భూపతి అడవిలో దారి తప్పిన తనకుమారుని వెదకుచు దనువు అను మునివద్దకు వచ్చి తన గోడు వినిపించి ఆశా పాశము నుండి తప్పించుకొనుట యెట్లని అడుగగా, మనసు నందు ధైర్యము గల వానికి దుర్లభమనునది లేదు, తానాస పడినది సర్వ ము లభించిన కృతార్థుడును లేడు. ఒక పేదవాడు, తన కూడు మూట గట్టుకొ ను వస్త్రము కొరకు ఒక ధనవంతుని జేరి కొంత ధనమడుగగా ఆ ధన వంతుడు నిరాకరించెను. ఆ పేద వాడు నిరాశతో సిగ్గుపడి సర్వము వదలి తపస్సున కేగి శాంతముగ కాలము గడిపెను. తన ఆసలు ఫలింపక పోయినను ధైర్యముగ నుం డుట సుఖ ప్రదమని నుడివెను. ఋషభమునీంద్రుడిట్లు సుమిత్రునికి మృగయా శను వదలి సుఖముండుమని బోధించి వెడలెను.

ఇంకను ధర్మ విషయములు వినగోరు ధర్మజునకు భీష్ముడిట్లు బోధించెను.

## ధనార్జనము

ధర్మజా, రాజ్యపాలనమునకు మూలమగు ధర్మసంరక్షణమునకు ధనము మూలము. ధరణీ పతి తన భూమి నుండియు, పర ప్రదేశముల నుండియు ధ నార్జన చేయవలెను. రాజు కఠినుడయినను సాగదు. బొత్తుగా మెత్తవాడయినను

ఈ ధనార్జన సాగదు. ప్రజల చిత్తమెరిగి సావధానముగ రాజు మెలగ వలయును. భాండారము లేని రాజునకు మిత్రులూ ఉండరు. బలమూ ఉండదు. ఈ రెండును లేనిచో రాజ్య విభవమే లేదు. నిర్ధనుని ప్రజలు గౌరవించరు. శత్రువులు లెక్కసే యరు. ధన సంపద కావలయునని అన్యాయమునకు దిగిన యెడల ఏమియు సమకూడదు. న్యాయ పరులకే తమ యత్నము ఫలించును. దీనికి ఉదాహరణ ముగ ఒక కథ వినుము.

## రాజులు - ప్రజలు - కాపవ్యుడు

పారి యాత్ర పర్వతమున వసించు కాపవ్యుడను ఒక బోయ గలడు. అతడు కడు న్యాయ తత్పరుడు. మంచి విలుకాడు. అచటి అరణ్యములు అందున్న మృగ ముల విషయములన్నియు తెలిసినవాడు. ధర్మబుద్ధి, తల్లి దండ్రులకు సేవ, ముని వరుల యందు భక్తి గౌరవములు కల సత్ప్రవర్తనుడు. ఎదురు తిరిగిన విరోధుల నిరోధింపగల సమర్థుడు. ఆతని న్యాయబుద్ధికి మెచ్చి ఆ ప్రాంతపు జనులాతనిని తమకు ప్రభువుగానుండి పాలించుమనిరి. ఆతడును వారిని ప్రియముగ జూచి, ప్రభువు పాలించుట సరే ప్రజలును వారి ధర్మములను పాలించునపుడే ప్రభువు లు పాలన రాణించును. ఎవరును శిశు, ముని, స్త్రీ జనముల బాధించ రాదు. పెరవానిపై కలహింపరాదు స్త్రీలను చెఱపట్టరాదు. మృగ రక్షణ ముఖ్యము ఆడ జంతువులను చంప గూడదు. గో బ్రాహ్మణులు దేశమున పాడి పంటల అభివృ ద్ధికి ప్రజల జ్ఞానోదయమునకు తోడ్పడుదురు. వారిని కాపాడుట పుణ్య ప్రద ము. సస్యములను పాడుచేయుట దోషము. మీరీ మంచి చెడ్డలెరిగి వర్తించుచో నేను మీకు సఖ్యుడనై పాలింతును. ప్రజలు కాపవ్యుని మాటలకంగీకరించిరి. ప్రజ లు రాజు పరస్పర సహకారముతో ప్రవర్తించుచు ఇహపరసిద్ధి ప్రశస్తిని పొందిరి.

## ఆపదల నుండి తప్పించుకొనుట, మూడు చేపల కథ

భీష్ముడు మరల ఈ కథనిట్లు నుడివెను ధర్మరాజా! ఎంతటి వానికైనను తనకు రాబోవు ఆపదను గుర్తించి మంచి సమయములో దానిని తప్పించు కొన వలెను. అందులకీ కథను వినుము.

ఒక మడువునందు మూడు చేపలు వసించుచుండెను. వాని పేర్లు దీర్ఘదర్శి ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘ సూత్రుడు. వానలు తగ్గి కాలక్రమమున మడువులోని నీరు ఎండిపో జొచ్చెను. దీర్ఘ దర్శి యీ చిక్కును కనిపెట్టి తక్కిన యిద్దరు స్నేహి

తులతో నిట్లనెను. ''స్నేహితులారా చూచుచున్నాము గదా రోజు రోజునకు ఇందున్న నీరెండిపోవుచున్నది. నీరు నిండుగా ఉన్నపుడు మనము సుఖముగా కాలము గడపితిమి. ఇందే యున్నచో వేసవిలో చాల కష్టమగును. నీరు ఎప్పుడును తరుగని చెరువునకు ముందే పోదము లెండు'' అనెను. ఈ మాటలు ప్రాప్త కాలజ్ఞుడు ఇప్పుడేమి తొందర. ఆ సమయము వచ్చినపుడు చూచుకొనవచ్చును. ఏదో ఉపాయమున తప్పుకొనగలననియెను. తరువాత దీర్ఘ సూత్రుడు ఈ కొలను ఇప్పుడు బాగుగనే ఉన్నది. ఈ నీరు చాలదా నిక్షేపముగ నున్నది.'' అని ఊరకొనెను. ఈ యిరువరి మాటలు వినక దీర్ఘ దర్శి వేసవి వచ్చుచున్నదనగా త్వరగా జాగ్రత పడి తప్పించుకొని నీరున్న మరొకచెరువు జేరెను. వేసవికి నీరెండిపోయిన చెరువులో చేపలు పట్టుటకు వచ్చిన జాలరుల వలలో మిగిలిన రెండును చిక్కుకొని చచ్చినవి. రానున్న ఆపదలను వారించి దీర్ఘ దర్శివలె ముందే జాగ్రత పడుట ఎన్నటికిని శ్రేయము.

## పెక్కు శత్రువుల నిగ్రహించుట – పిల్లి ఎలుక కథ

ఈ విషయమై భీష్ముడొక కథను నుడివెను. ఒక అరణ్యమున ఒక మహా వృక్షము క్రింద కలుగులో బలితుడు అను ఎలుకయు, చెట్టుపై రోమశుడను పిల్లియు నివసించుచుండెను. రాత్రి యగుసరికి బోయవాడొకడు ఆ చెట్టు క్రింద వలపన్ని అందు పడిన చిన్న చిన్న జంతువులను పట్టి ఆహారముగ తీసికొని పోవును. ఒకనాడు ఆ వలలో పిల్లి చిక్కుకొని ఎట్లు తప్పించుకొనుటా అని యోచించు చుండెను. తన ఆహారము కొరకు ఆ పిల్లియే ఆ వలలో చిక్కుకొనెను. ఇంతలో ఎలుకయు తన ఆహారము కొరకు పైకి వచ్చుసరికి ఒక ముంగిసయు గ్రుడ్ల గూబయు చూచి ఆ ఎలుకపై బడబోయెను. ఆ రెంటిని చూచి వణికిపోవుచూ ఎలుక పిల్లి సమీపమునకు చేరి ''మార్జాలమా నేనీ వలను కొరికి నీకు విడుదల నిప్పింతును. నీ యొద్ద నాకు రక్షణ నిమ్ము ఈ గూబయు ముంగిసయు నన్ను తినజూచుచున్నవి. అనగా మార్జాలమందులకంగీకరించి తన యొద్ద ఎలుకనుంచుకొని కాపాడదలచెను. ముంగిసయు గూబయు కొంతసేపచట తారాడి వాని దారి నవి పోయెను. ఎలుక ఎంత సేపటికిని వలను కొఱుక కుండ ఆలస్యము చేయుగా అందున్న పిల్లి ''ఏమి మూషికమా యీ వలను కొఱుక కుండ కూర్చుంటివేమి. నీకు చేసిన మేలునకు ఇది తగునా'' అని తర్జింపగా ఎలుకయు, మార్జాలమా, నీవు బలమైన దానవు. మన ఒప్పుదల మాట యెటులున్నను నీకు స్వేచ్ఛ రాగానే

నన్నేమి చేసెదవో ఉదయమున బోయవాడు వచ్చుట చూచి వలను కొఱికెదను. తొందర పడకు నీకు విడుదల అగును అని చెప్పునంతలో ప్రొద్దుపొడిచినది. బోయ వాడును వచ్చెను. ఆ బోయవాని జూచి ఎలుక త్వరత్వరగా తన వాడి పళ్ళతో వలను కొఱుకగా పిల్లి పైకురికి చెట్టుమీదకు పోయెను. ఎలుకయు కలుగున దూరి కూర్చొనెను. తనపని నిష్ఫలమై బోయవాడు నిరాశతో తిరిగి పోయెను.

తన కలుగులోనికి దూరి పైకి మిలమిల చూచుచున్న ఎలుకను చూచి పిల్లి, ''ఓ మూషికమా అట్లు దూరమున నుందువేల నన్ను జూచి భయపడినట్లు. నాకు నీవు మేలొనరించితివి. బలవంతులతోడి స్నేహము ఎప్పటికైన మంచిది కదా. నా కడకు రమ్ము. నిన్ను జాగ్రత్తగ చూచెదను'' అను మాటలు విని ఎలుకయు ''ఓ మార్జాలమా నీ మాటలు బాగున్నవి. కాని నా మాటయు వినుము. మీ జాతి మమ్ము ఎపుడును విరోధముగ జూచును. మిత్రులును ఒకప్పుడు వారి స్వప్రయోజనము కొరకు విరోధము పూని పైబడుదురు. అట్లే శత్రులు మిత్రులటుల నటింతురు. రాత్రంతయు వలలో ఉండి ఆకలితో నన్ను తినుటకు పిలుచు చున్నావేమో. నన్నిచటనే ఉండనిమ్ము'' అనినది. మార్జాలమెంత కోరినను ఎలుక తన కలుగు వదలి రాలేదు. మనము ఒకరికొకరుపకారము చేసికొనినాము మన స్నేహమిట్లే ఉండనిమ్ము అన్నది.

భీష్ముడీ కథనుడివి ధర్మరాజా గ్రహించితివి గదా. ఎలుక ఎట్లు ప్రవర్తించినదో. మున్ను శుక్రాచార్యులును ఇట్లు బోధించెను. బలవంతుని వలన ఒకప్పుడు సహాయము కలిగి లాభించినను అతనినే ఎల్లపుడు నమ్మి యుండరాదు. దూరముగ నుండుటయే మేలు. తగిన వారినైన పూర్తిగ నమ్మి యుండుట మేలుగాదు. తన యందు ఒరులకు నమ్మకము ఉండునట్లు వర్తించుచు ఒరులను నమ్మక యుండవలెను.

## నమ్మవచ్చును, నమ్మరాదు - బ్రహ్మదత్తుడు పూజని కథ

శాంతనవా, గురుదేవా, నీవు చెప్పుచున్నవి గ్రహించితిని. మఱి ఎవరినీ నమ్మకపోయినచో పనులెట్లు జరుగును, మనస్సునకు విశ్రాంతి యుండదు కదా, నమ్ముటయు నమ్మకపోవుట వీనిలో కర్తవ్య మెయ్యది అని ధర్మరాజు అడుగగా, భీష్ముడు-

ధర్మజా నీకీ విషయము తేటపఱచు ఒకకథ చెప్పెదను. వినుము-

పూర్వము బ్రహ్మదత్తుడు అనే రాజు కలడు. అతడు పూజని యను గోరింకను పెంచుచు ప్రతిదినము దానికి పండ్లు తెచ్చియిచ్చును. ఆ పక్షి ఒక పిల్లను పెట్టినది. ఆ పిల్ల ఆ పండ్లలో కొన్ని తిని కొన్నిటిని రాజ కుమారునకిచ్చును. ఏమి తోచినదో ఒకనాడా బాలకుడు ఎవరును లేకుండ చూచి ఆ పిల్ల పక్షిగొంతును నులిపి చంపెను. తల్లి పిట్టవచ్చి తన కూనయిట్లు అన్యాయముగ చంపబడుట జూచి, స్నేహముగ ఆటపాటలుతో కలిసి యుండెడు వారి యెడల గూడ రాచవారికి మంచితనము లేదు, దీనికి నా పగ తగినట్లు తీర్చికొందునని, రాచ కుమారుని కను గ్రుడ్లు తన కాలి గోళ్ళతో పెకల్చి పీకి గ్రుడ్డి వానిని జేసి పైకెగిరి పోయి రాజు వినునట్లుగా ఓ రాజా! నీ కొమరుని గ్రుడ్డివానిగ జేయుటలో నా తప్పు లేదు. అతడు చేసిన చెడ్డపనికి ఫలితమనుభవించినాడని చెప్పినది. అంత బ్రహ్మదత్తుడు, పూజనీ! నీ మాటలు మంచివే. ఇందు నీ తప్పులేదు. ఒక దానికి మరొక పని సరిపోయినది గదా. దీనివలన మన స్నేహమేల పోవలయును. ఎప్పటియట్ల రమ్మ అని ఎంతయో చెప్పినాడు. ఆ గోరింక రాజు మాటలు నమ్మక రాజా! మనసున నున్నపగ నీవు తీయని మాటలు చెప్పినంత పోవునా? మ్రాను నందగ్ని యున్నటులను మనసుననున్న పగ ఎన్నటికిని పోదు. దాయాదులనే గాదు తల్లి దండ్రులను పుత్రులను సహోదరులను గూడ నమ్మరాదనినచో మదిలో పగయున్న వారినెట్లు నమ్మవచ్చును. అని స్ఫుటముగ జెప్పి రాజునెడల విశ్వాసము లేక పూజని తన దారిన ఆకసమునకెగసి పోయెను.

ధర్మరాజా, ఈ విధముగనే రాజులకు తన సంపద పదవి రక్షించుకొనుటకు జనులయందవిశ్వాసము ఉండవలయునని బృహస్పతి ముఖ్యులు చెప్పినదే. ఆ మాటల నాదరింప వలయును. మఱియొక వృత్తాంతము ఇట్టిదే అని భీష్ముడిట్లు చెప్పెను.

## కణికుడు శత్రుంజయునకు చేసిన ఉపదేశము

శత్రుంజయుడు సౌవీర దేశమునకు రాజు. రాజైన వాడు తనకు కార్యము లందు మెలగవలసిన విధము భారద్వాజవంశీయుడగు కణికుడనుముని యిట్లు చెప్పెను.

రాజు తన హృదయమునందున్న కాఠిన్యము కప్పిపుచ్చి పరులతో తీయని మాటలు ప్రసన్నముఖుడై పలుకవలెను. జ్ఞాతుల సహాయము వలన తనకు రాజ్యమబ్బి సుఖముగా నున్నను తన మందిరమున నున్న జ్ఞాతులు ప్రక్కలో త్రాచు

పాముల వంటి వారే. అవసరము కొలది శత్రువులను తలపై నెత్తుకొని మోయవలయును. సమయము జూచి గోతిలోనికి త్రోయవలెను. మద్యము, జూదము, వేట, స్త్రీయు రాజులకు ప్రియములైనను ఒక మితి ఉండవలె, లేనిచో అవియే కీడొనర్చి నాశనము జేయును. తనపని జరుగు నంతవరకు ఎవరికి లోబడకుండ చూచీ చూడని యట్లు, వినీ విననియట్లుండట మంచిది. తనకిష్టముగాని పని విషయమున ఎట్లో కాలము గడపివేయుట మంచిది. పనికి ఆటంకము గలుగజేయుచు ఏ నేర్పులేని గురుని విడనాడినను తప్పులేదు. **తీర్చని అప్పు, ఆర్పని నిప్పు సమసిపోని పగ ఏనాటికైనను చేటే.** కార్య నిర్వహణ విషయమున, మాటయందు చేతయందు మార్దవము ఉన్నచో ఎట్టి పనియైనను సఫలము సాధ్యము అగును అని కణికుడు బోధించగా ధర్మరాజు అంతయు సావధానముగ విని మఱల నొక సందేహమును వెలిబుచ్చెను.

## అనివార్య సమయమున ఆహారము

## విశ్వామిత్రుడు - చండాలుడు కథ

తాతా, ధర్మదీక్షగల వర్ణముల వారు తమ సదాచారమును నిర్వర్తింపలేని కష్టముల పాలయిన యపుడు వారి కడుపు నింపుకొనుట యెట్లని అడుగగా భీష్ముడిట్లు నుడివెను.

ధర్మరాజా! నీ సందేహమునకు సమాధానముగా నొక్క కథ వినుము. నీవూహించిన కష్టము లెవరికైనను రావచ్చును. త్రేతాయుగమంతమయి ద్వాపరము రాబోవు సమయమున భూమిపై పెద్ద కరువు వచ్చి పండ్రెండు వత్సరముల పాటు ప్రజలను నానా బాధలకు లోను జేసినది. ఏఱులు చెరువులు ఎండిపోయినవి. సస్యములు మాడిపోయినవి. త్రాగుటకు నీరు, తినుటకు తిండిలేక ప్రజలల్లాడి పోవుచున్నారు. దేవతా పూజలు యజ్ఞములు ఆగిపోయినవి. వర్ణాశ్రమ ధర్మంబులు నడవక పుడమిపై అధర్మము, హింస ప్రజ్వరిల్లినవి.

ఆ పరిస్థితులలో విశ్వామిత్రమహర్షికే పొట్ట నింపుకొను ఉపాయము దొరకలేదు. ఊరూరా తిరిగినను గుప్పెడు మెతుకు లెచ్చటను లభింపలేదు. తుట్టతుదకు, కనబడిన ప్రాణిని జంపి ఆ మాంసమును తిని జీవించుచున్న జనులుగల ఒక పల్లెలో ఒకమూల పడి ఉన్న కుక్క మాంసమును జూచెను. ఆ రాత్రికి ఆ దుర్వాసనగల మాంసమునే దిని తన ప్రాణమును నిల్పుకొన నిశ్చయించెను.

రాత్రి యైనది. చీకటులలమినవి. పల్లె వారందరు నిద్రలో నున్నారు. మెల్లగా విశ్వామిత్రుడు లేచి ధూళిలో పడియున్న మాంసమును తీసికొనబోవునంతలో ప్రక్కమంచమున నున్నవాడు లేచి'' ఎవరు నీవు ఇచటి మాంసమును దొంగిలించుచున్నావు, నీ పని పట్టెదనని గద్దించి లేవగా ''అయ్యా నేను విశ్వామిత్ర మునిని. కొన్ని దినముల నుండి నాకు తిన తిండిలేక యీ మాంసమును దొంగిలింప దలచితినని వినయమున నుడివిన పలుకులు విన్నంతనే తన మంచము నుండి లేచి ఆ నిషాదుడు ప్రణామము లర్పించి, అయ్యా! మీరు మహాత్ములీపనికేల తలకొనిరి. జంతువులలో కెల్ల కుక్క కడు నీచమైనది. దీని మాంసమాసించి ధర్మహాని కేల గడగెదరు. మీ ధర్మాచరణ మేల మానుకొందురు. మరేదైన దొరకు చోటునకు పోరాదా? మీరు తేజోమహితులు ఎవ్వరైనను మిమ్మాదరింతురు. ఆ మాత్రము కరుణ మీవంటి పుణ్య పురుషులయెడ మాబోటి వారు చూపలేరా అనిన విని, విశ్వామిత్ర మహర్షి ఓయీ నిషాదా ఒక్క మాట వినుము. నా కాకలి దప్పులతో ప్రాణమే పోవునట్లున్నది. ప్రాణహాని వలన పాపమేల భరింపవలయును. బ్రతికి యున్నచో విద్యలనేర్చి ఏ పాపమునైనను పరిహరింప వచ్చును. సూర్యుడెంత నిష్కలుష తేజస్వి, మరి సర్వ భక్షకుడే ఆతనికేలోపము రాలేదు కదా. అగస్త్య ముని రాక్షసుని మాంసము దినలేదా. ఆ పత్సమయము వచ్చినది నన్నీపనిలో అడ్డగింపకుము అని ముని యనెను. ఆ నిషాదుడు, అయ్యా మిమ్ములను దినుడని ఈ మాంసమిచ్చుటకు భయమగుచున్నది. తమ యిష్టము వచ్చినట్లు చేయుడని కుక్క మాంసమును విడిచిపోయెను. దానిందిని విశ్వామిత్రుడు ప్రాణ రక్షణగావించు కొనియెను. ఇంద్రుడును తదనంతరము వర్షములు గురిపించి ప్రజలకు సుఖము చేకూర్చెను. విశ్వామిత్రుడు తనతపో మహిమచే తన సదాచార భంగపాపమును పోగొట్టుకొని జనస్తుత్యుడయ్యెను. ఆపత్సమయమునందిట్టి యిక్కట్లును కలుగును. ధర్మమను నది బహువిధములు, రాజైనవాడు వీని నెఱుగ వలయునని సుజీయొక కథను భీష్ముడు నుడివెను.

## శరణాగత రక్షణ ఫలము - బోయవాడు, గువ్వ పిట్ట కథ

శరణాగతులను రక్షించుటవలన కలుగు ఫలమెట్టిదని ధర్మజుడు తెలియగోరగ భీష్ముడీ కథను నుడివెను.

పూర్వము ముచికుందుడను రాజునకు శుక్రాచార్యులు చెప్పినదే ఈ వృత్తాంతము. పక్షులను పట్టి అమ్ముకొను ఒక బోయ అడవికి వేటకు పోయి పెను

వానలో చిక్కుకొనియెను. అరణ్యమంతయు నీటితో నిండగా ఇంటికి పోలేక ఒక చెట్టు క్రింద వలపన్ని అచటనే నిద్రించెను. చెట్టుపై నున్న ఒక మగ గువ్వ తన జత గువ్వ పెంటి మేతకు పోయి తిరిగి రాక పోవుటచే అయ్యో ఏమైపోయినదో అని విలపించుచు ఇంటికి ఇల్లాలు లేనిచో ఏ సౌఖ్యము లేదు గదా యని ఆ మగ పిట్టపలుమఱు దుఃఖించుచు అనినమాటలను బోయ వలలో చిక్కుకున్న ఆడ పిట్ట విని ఆహా! నాయందు నాభర్తకెంత ప్రేమయో పతిని తృప్తి పరచిన నా జన్మ ధన్యమైనదని ముదము నందుచు తన మగపిట్ట వినునట్లు ''నాధా! నేనీ వలలో చిక్కుపడి యున్నాను. మనము చేయగలిగనదేమియు లేదు. మనము నివసించు ఈ చెట్ల క్రిందనున్న బోయ చలికి తాళలేక బాధపడుచున్నాడు మనకు అతిథి గదా, అనిన మాట విని మగ పిట్ట మనుష్య భాషణంబుల ఆ బోయతో నీవీ చలికి చాల బాధ పడుచు అలసి యున్నవాడవు. మా అతిథివి నీవు, నీకేమి యుప కృతి చేయగలనని అడుగగా ఆ బోయ చలికి నా దేహము కొంకుపోవుచున్నది. ఎట్లయిన ఈ బాధను తీర్చుమనెను. మగపిట్ట సంతసించి కొన్ని యెండు చిదుకు పుల్లలు ముక్కున తెచ్చి ప్రోగుపెట్టి ప్రక్కనున్న పల్లియ నుండి నిప్పుగల పుల్లను దెచ్చి ఆ చితుకుల ప్రోగును మండించెను. ఆ బోయవాడా నిప్పుల సెగను చలికా చుకొని తృప్తిపడి ఓ పిట్టా నీ ఉపకారమునకు తృప్తి నొందితిని. చలి తీరినది. ఆక లియగు చున్నది. నీవేమి చేయగలవో మఱి. అనగా మిత్రుడా! దానికంత సంది యమేమి. నావద్ద వేరేమియు లేదు. నీవు ప్రియాతిథివి. నా శరీరమునే ఆహార ముగా గొనుము అని ధైర్యమున తాను చేసిన మంటలో పడినది. ఇది యంతయు బోయవానికి ఆశ్చర్యకరమయి ఆహా ఒక పక్షి యింత సేయునే, ఈ పిట్టకున్నంత వివేకము నాకులేదు. నేనెంత పాపిని. ఎన్ని పక్షులను చంపితింటినో, ఈ పులుగు తన భార్యాబంధువులను విడచి నా కొరకు బలియైనది. అని విచారించి విచారించి తక్షణమే వైరాగ్య భావమంది తన వలనున్న పిట్టలను కరుణించి వదలి వేసెను. మంటలో బడి ప్రాణములు వీడిన తన పతిని దలచి ఆ ఆడుపిట్ట అయ్యో నన్ను ప్రియముగ జూచుకొను నా భర్త గతించెనే. పూదీవల వనములందు, చల్లగాలు లందు, నన్నెంతయో మన్ననతో విహారమునకు తీసి కొనిపోవు నా పతి లేని బ్ర తుకు నాకేల పతితో చితిలో బడి మరణించిన వారికి సద్గతి కలుగునని చెప్పుదురు. నేనట్లే చేసెదనని పతి మరణించిన మంటలో బడి మరణించెను. దివినుండి దేవత లరుదెంచి ఆ రెండు పిట్టలను రథముపై బెట్టి స్వర్గమునకు గొంపోయిరి. బోయ వానికీ దృశ్యము అద్భుతముగ దోచినది. తాను చేసిన పాపము తొలగించుకొను

టకు మనసార పశ్చాత్తాప పడి తన దారిలో వనమును కాల్చుచున్న దవానలమున బడి దేవత్వమందెను.

## తెలియక చేసిన పాపమునకు పరిహారము

ఎవరైనను బుద్ధి పూర్వకముగ గాక తెలియక పాపమొనర్చి రేని అది యెట్లు పోవును అని ధర్మజుడడుగగా భీష్ముడు నుడివిన ఉదాహరణము. తొల్లి పరీక్షితుండను రాజు యొక్క కుమారుడు జనమేజయునకు తెలియకుండగనే బ్రహ్మహత్యా దోషము కలిగెను. ఆ దురితమునకు మునులు ప్రజలు కూడ అసహ్యించుకొని తమకారాజు పనికి రాడని విడిచి పెట్టిరి. తన దుస్థితికా జనమేజయుడు చాల సంతాపము జెంది ఇది యెట్లునశించునా యను పశ్చాత్తాపమున పురము విడిచి అడవులపోయి శౌనకుడను మునిని జూచి నమస్కరించి యెదుట నిలబడియుండగా అతనిని జూచి ఆ ముని వర్యుడు ''ఎవరవు నీవు పీనుగు వలె నున్నావు, నీవద్ద దుర్వాసన కొట్టుచున్నది, ఆవలకు పొమ్మని గర్జించగా ఆ రాజు దీనుడై యా ముని కాళ్ళపై బడి తన మనో వ్యధ చెప్పుకొని రక్షింపుడని మఱి మఱి ప్రార్థించెను. శౌనకున కారాజు నందు దయకలిగి ''రాజా నీవు నీ దురితము తెలిసికొని దానినుండి బయట పడుట కాసించి వచ్చితివిగాన నే చెప్పినట్లు చేయుము. భూ పతులు మత్సరములు లేక ధర్మము తపము అధ్యయనము, తీర్థ యాత్ర సేయుచో వానినందరును గౌరవింతురు. అట్లు చేసినచో నీకు మేలగును. భూసురులు పవిత్ర చరిత్రులు ధర్మపరులు. వారిని గౌరవించి పూజింపుము.'' అని బోధించెను. జనమే జయు డాముని వాక్యములు శిరసా వహించి మనోవాక్కాయ కర్మల తానా హితబోధము ననుసరింపగలనని ప్రతిజ్ఞ చేసి ముని వరు ననుగ్రహము పొంది వెడలి సచ్చరిత్రుడై విలసిల్లెను. శౌనకుడును ఆ రాజుచే అశ్వమేధము చేయించి పవిత్రుని చేసెను. **తెలియక చేసిన పాపములు తెలిసికొని వానిని మరల చేయక సుకృతులొనర్చెనేని** ఆ పాపము క్రమముగా నశింపగలదని భీష్ముడు వచించెను.

## ఆర్తజన రక్షణ : గ్రద్ద నక్క కథ

మరల గాంగేయుడీ కథ ధర్మజునకు చెప్పెను. పూర్వము విదిశానగరమున మృతి జెందిన బాలుని శవమును మరుభూమికి గొంపోయి బంధువులెల్లరు ఆ శవము చుట్టును జేరి విలపించసాగిరి. పైనుండి ఒక గ్రద్ద అచ్చటికి వచ్చి మీరేల

యీ చనిపోయిన బాలునికై యింతగ నేడ్చుచున్నారు. చచ్చిన వారు బ్రతికి వత్తురా. ప్రొద్దు క్రుంకుచున్నది. ఇంక భూతములు పిశాచములిచట తిరుగును. చచ్చిన వారితో మీరును చావవలసి వచ్చును. ఈ శవమును విడచి మీరింటికి పొండు లెండు అని హెచ్చరించెను. గ్రద్ద మాటలకు భయపడి శవమును విడచి వెనుదిరిగి పోవుచుండగా ఒక నక్క వారి దారికి అడ్డువచ్చి ఏమిది గ్రద్ద మాటలకు మీరు భయపడి పారిపోవుచున్నారు. ఇంకను చాల ప్రొద్దున్నది. మీరిచటనే నిలువుడు. ఆ బాలుడు బ్రతికినను బ్రతుకవచ్చును దైవ బలమెట్లున్నదో ఎవ్వరెరుగుదురు. ఈ బాలుని చూచినచో నాకే ఏడుపు వచ్చుచున్నది అను నంతలో గ్రద్ద మరల "మీకు వెఱ్ఱియాయేమి. మరల వచ్చిరి నేను పుట్టి మూడు వందల ఏండ్లయినది. యింతవరకు చచ్చి బ్రతికి వచ్చిన వానిని చూడలేదు. నక్కమాటలందు మీకు లెక్క ఎందులకు. మీరిటనుండి పోయి మీ ప్రాణములైనను దక్కించుకొనుడని గర్జింపగా వారును లేచి పోబోవ మరల నక్క అడ్డము వచ్చి ఈ గ్రద్దమాటలకేమి ఈ శవమును తాను తినవలెనని అట్లు చెప్పినది. నేను చెప్పినది పొల్లుకాదు. శ్రీరాముడు విప్రకుమారుని బ్రతికించెను. నారదుడు సృంజయ పుత్రుని బ్రతికించెను. ఈ కథలు మీరు వినలేదా. మీ రోదనము విని ఏ సిద్ధపురుషుడో వచ్చి ఈ శిశువును బ్రతికింపగలడు అనునంతలో ప్రొద్దు క్రుంకి చీకటి పడినది.

గ్రద్ద నక్క రెండును ఆ పీనుగు మాంసమును తినగోరి అచటనే ఉన్నవి. ప్రొద్దుండగనే తాను తినవచ్చునని గ్రద్ద తలపు. చీకటి పడినచో తనకు వీలుగదా అని నక్క జిత్తులు. పొమ్మని గ్రద్ద, కొంతసేపు ఉండుడని నక్క వారి వారి మాటలాడినవి. ప్రేత భూత భూములందు శంకరుడు విహరించును. ఆ దైవము కరుణాళుడు. శవము చుట్టు జేరి వలవల యేడ్చువారిని జూచి కరుణించి వారి విన్నపము నాలించి ఆ శిశువు బ్రతుకునట్లు వరమిచ్చి వారికి ముదము గూర్చెను. ఆకలితో బాధపడు గ్రద్దకు నక్కకు ఎన్నడును ఆకలి కాకుండునట్లు వరమిచ్చెను.

ఆర్తజనుల రక్షణ ప్రభువుల కర్తవ్యము. తమ స్వార్థమునకయి సేవకులు కొందరు మోసపు పలుకులాడుదురు. వీనినెఱిగి వర్తింపవయునను[illegible] కథ ఉదాహరణము.

## బలవంతునిపై బలహీనునకు మత్సరము వలదు

## బూరుగు చెట్టు - వాయువు కథ

భీష్ముడు ధర్మజునకు నుడివిన మఱొక కథ. హిమవత్ పర్వతమందు పెద్ద ప్రా పొడవు గల బూరుగు చెట్టున్నది. బలమైన మొదలు దృఢములైన శాఖోప శాఖలతో నలు దిక్కుల వ్యాపించినది. ఒకనాడా దారిని బోవుచు నారదముని ఆ చెట్టును జూచి, ఏమి బూరువా! ఇన్నియేళ్ళ నుండి నిన్ను చూచుచున్నాను. అట్లే ఉన్నావు. వాయువు తీవ్రముగ వీచుచో ఎన్నో చెట్లు పడిపోవును. నీకు వాయువు బంధునా నిన్నేమియు చేయలేడా అని అడుగగా ఆ వృక్షము నారదమునీ! నే నెంత లావు బలము కలవాడనో చూచుచున్నావు గదా. వాయువు నన్నేమి చేయగలడు. నాలో 18వ వంతు బలశాలి కూడకాడు. అనగా నారదుడు వాయువు ముందు కొండలైనను ఆగవు కదా నీవింత దర్పము చూపుచున్నావేల అని యెంతచెప్పినను బూరుగామాటలు వినలేదు. నారదుడేగి బూరుగు దర్పమును వాయువునకు విన్న వించెను. పవనుడంతట బూరువు కడకేగి ''బూరువా నన్ను చుల్కన చేసి పల్కి తివట. నిన్ను తాకగలుగుచో ప్రభంజనుడన్న నా పేరూ ఊరూ లేకుండ పోవున న్నావట. నీ నీడయందొకనాడు బ్రహ్మ విశ్రాంతి తీసికొనుట చూచి నిన్ను నేను మన్నన చేయుదును గాని నీ లావునకు భయపడిగాదు ఱేపకడ చూచు కొందువులే నీ లావని వాయువు వెడలెను.

బూరుగునకు తనచేసిన తప్పుతెలిసినది. దేవముని నారదుడనిన మాటలు తాను వినలేదు. వాయువు ముందు తానెంత! ఆతడెప్పుడో వచ్చి తనను కూల్చ గలడు అనుకొని తనకు తానే తన ఆకులు కొమ్మలు శాఖలు విరుచుకొని మొండి కాండముతో మిగిలెను. మఱునాడు పవనుడు మహా వేగ విజృంభణతో వచ్చుట గమనించి బూరువు గడగడలాడిపోయెను. పవనుడంత బూరువును చూచి, బూరువా నాపని నీవే చేసి కొంటివి. సరే, నాసంగతి నీ కులమునకు జెప్పి సుఖ ముండుమని చెప్పి వెడలెను. ప్రబలుని బలహీనుడు నిగ్రహింప జూచినచో తనకే చేటగు ననుటకీ కథయే ఉదాహరణము.

## లోభమే పాపకారణము

పాపమునకు స్థాన మెయ్యది అని ధర్మరాజడిగిన ప్రశ్నకు శాంతనవుడిట్లు వచించెను.

అన్ని పాపములకును, లోభమే హేతువు. లోభమనగా పిసినిగొట్టుతనము,

అత్యాశయును, దీనివలన కోరికలు కోపము మత్సరము ద్రోహము పరధనాప హరణ అసత్యము సిగ్గు మాలిన పనులు క్రమముగా ఒక్కటొకటే అలవాటగును. లుబ్ధులను దూరమున నుంచి ధర్మపరులయిన వారినే దగ్గర నుంచుకొని పనులు నిర్వహించు కొనవలెను. లోభము అజ్ఞానము ఇవి రెండును మనుజునకు కీడొన రించును. రాగ ద్వేషములు, దురభిమాన దర్పములు, క్రోధము దుఃఖము, అజ్ఞాన మూలక కార్యములు అందుచే లోభమును వీడి అజ్ఞానమును పోగొట్టుకొనవలెను.

## దమము తపము సత్యముల వివరణము

ధర్మరాజు మరల భీష్ముని జూచి, తాతా! ధర్మము పెక్కు వితములని విందుము. వాని వివరణము వినగోరెదననగా భీష్ముడిట్లనెను. ధర్మజా విజ్ఞానులై న పూర్వులు తమతమ సాధనానుభవములననుసరించి ధర్మమును గూర్చి తెలిపిరి. దమము అనగా ఇంద్రియ నిగ్రహము అన్నిటికన్న మిన్నయయిన ప్రాపు. దమము నిజముగ ధర్మసారమే. దాని వలననే బుద్ధి వివేకములు వికసించును. అజ్ఞానము నశించును. ఇంద్రియములు ఇహలోక సుఖములచే నాకర్షింపబడి పలు తెన్నుల బోవును. వానిని నిగ్రహించి మనసు నిశ్చలము నిర్మలము అయినప్పుడే దుర్గుణ ములును క్రోధలోభాదులు దరిజేరవు. బుద్ధి ధర్మమార్గము వైపు మ్రొగ్గును. అట్టి వానికే బ్రహ్మ పరమయిన స్థితి సన్నిహితమగును.

## తపము

ధర్మ విధానములలో తపము నిదానమైనది. తపమునకు ఆహార నిగ్రహము పోషకము. తపస్వులకు చిత్తము వశమగును. సత్య శౌచములు సిద్ధులు అలవడును.

## సత్యము

సత్యము దేవ పితృ భూదేవ గణముల ప్రశంసలందిన సద్గుణము. **అస త్యమువ కంటె పాపములేదు.** ధైర్యము దమము సమత అహింస దానము ఓర్పు అద్వేషము సత్యము యొక్క రూపములు ఇవి యోగ మోక్ష సంపాదక ములు. వేయి క్రతువులైనను సత్యమహిమకు చాలవు.

## అరిషడ్వర్గముల నిరోధము

ధర్మజా ఇవి యారు విధములు కామ క్రోధ లోభ మోహమద మాత్స ర్యములు. మనుజునకు శత్రువులు. కామము చెడు తలంపుల వలవ కలుగును, దేహ పరిస్థితి నెఱిగి మనము వీనిని నిరోధింపవచ్చును. పరులు మనయెడల జేయు తప్పుల వలన క్రోధముదయించును. ఇది ఓర్పు వలన సమయును. సర్వము

అశాశ్వతము అని తెలియక లోభము కలుగును. తెలిసినచో ఇదియు నశించును. ధనధాన్య సంపదలయందాసక్తి మోహము అజ్ఞానముచే కలుగును. ధర్మగుణము వలన ఇవి తగ్గును. మదమునకు కారణము కులము ధనము విద్య అవి అస్థిర ములని ఊహించగలిగిన అణగిపోవును. మత్సరము అనగా ద్వేషము ఈర్ష్య ఆశ వలన కలుగును. సాత్విక గుణము వలన తగ్గి పోవును.

ఈ యారు దుర్గుణములు ఎన్ని అపాయములనైన జేయును. ధైర్యముతో వీని నణగద్రొక్కగలుగు ధీశాలికి శుభములు సద్గతులు లభింప గలవు. దుర్యోధ నాదులయందీ దుర్గుణములు హెచ్చు. ధర్మజా నీవు ధీరుడవు ఉదారుడవు కాన నీవు సులభముగ వీనిని నిర్జించి సత్ఫలితము లందగలవు.

## జీవన భృతి

ధర్మజా! మఱియొక్క మాట వినుము. బ్రతుకు దెరువు మనుగడ ఎవ్వరికైన ముఖ్యము. ఎప్పుడు ఏ యాటంకము వచ్చునో యెవరికెఱుక. కుటుం బమునకు, పరిచారకులకు మూడు సంవత్సరములవరకు సరిపోవు ధనధాన్యవ స్తుసామగ్రిని సమకూర్చుకొని యుంచుకొను వాడు ధన్యుడు.

యజ్ఞ యాగాదులొనర్చలేని భూసురులకు కలిగి ఉన్న భూపతి తగురీతి సాయమొనర్పవలెను. ధనధాన్యములు పుష్కలముగ గలిగిన వైశ్యుడు అధ్వర ములను చేయనిచో అతని ధనము రాజు తీసికొని భూసురులకీయవచ్చును. శూద్రుడు తన కార్యముల వలన ధనము మిక్కిలిగ కూడ బెట్టిన యెడల దాని లో సగమ్మైకొని ధర్మకార్యములకు వెచ్చింపవలయును.

విప్రులు సామాన్యముగ పేదలు. రాజెంత అవివేకి య్యైనను వారిని తల్లి దండ్రుల వలె భావించి సేవించువాడు మేలును పొందును. ఆకుల పాత్తరలో పెట్టి న బియ్యము కూరగాయలు, రత్నము, స్త్రీయు శుచిగల వారని గ్రహించుము.

అమృతము, విద్య, ఎవరు ఇచ్చినను చెప్పినను స్వీకరింపదగును. అవి పరమ హితకరములు.

పంచమహా పాతకములు. బంగారమును దొంగిలించుట, గురు పత్నిని కామించుట, మద్యపానము, బ్రహ్మహత్య, ఇవి చేయువారితో స్నేహము, , ఈ పాపములు నిత్యము పుణ్యకార్యములొనర్చుట వలన పోవును.

నీచులతోడి సాంగత్యము, అన్నపాన ఆసనాదులలో వారితో కలిసి తిరుగుట

వలన కలుగు పాపము తపస్సుమున్నగు ధర్మకార్యములొనర్చుట వలన నశించును.

అన్నృత మాడుట పాపమే అయినను స్త్రీల యెడల పెండ్లి విషయముల యందు, ధన మాన నష్టములందు పాపము కాదు.

ఏ పాపము నెఱుగని వానిపై పాపమును మోపిన దుష్టునకే ఆ పాపము అంటుకొనును.

తల్లిదండ్రులకు సేవచేయుట అకారణముగ మానరాదు. మానినచో అతడు భ్రష్టుడగును.

బ్రహ్మచారికి ఆసనము, శయ్య, భోజనము ప్రియముగా నిచ్చిన యెడల ఏ కీడును ఉండదు.

## భీష్ముడు నకులునకు ఖడ్గ ప్రభావము వచించుట

భీష్ముడు ధర్మజునకీ రీతి ధర్మ ప్రబోధము సేయుచుండ నకులుడు లేచి నమస్కరించి, తాతా, శాంతనవా! నీవు సకలాయుధ విద్యా విశారదుడవు. యుద్ధ సమయమున ధనుర్బాణములు ఉత్తమాయుధములని యందురు. అవి విరిగి పోయినపుడు శత్రు నిర్దళనకు ఆత్మరక్షణకు కృపాణము మేలని తలతురు. ఈ విషయమై నీ యుపదేశమును విన్పింపవే అని అడుగగా భీష్ముడు-

కుమారా, నకులా! మంచి ప్రశ్న నడిగితివి. ఖడ్గము యొక్క కథ చాల ఉన్నది వినుము. తొల్లి బ్రహ్మ జగముల సృష్టించి భూతముల సృజింపగా దేవతలు మర్త్యులు వారి వారి విధులు నిర్వర్తించుచుండ, దైత్యులు చెలరేగి వారి క్రతువులు ధ్వంసము చేసి నానా హింసల పాల్సేయు చుండుట సహించలేక బ్రహ్మ హిమాద్రి తటమున తీవ్రతపమొనర్చి ఒక క్రతువాచరించెను. ఆ యగ్నినుండి మహా భీకర రూప భూతమొకటి వెలువడినది. సురలు జనులు భయపడి పరువెత్తు చుండ బ్రహ్మ వారినాపి భీతిజెందకుడు ఈ భూతమే ఖడ్గరూపమున దైత్యుల శిక్షించి మిమ్ము రక్షింపగలదని నుడువు నంతలో ఆ భీకర నిశిత దంష్ట్రోగ్రమైన భూతము దిక్కులను మహా ప్రకాశవంతముగ జేయు ఒక మహాఖడ్గ రూపము ధరించెను. మున్ముందు ఆ ఖడ్గమును విరించి మహా శివునకిచ్చెను. ఆ ఖడ్గమును ధరించి మహా శివుడు విజృంభించి క్రూర దైత్యులను సంహరించి, పిదప దానిని త్రిలోక రక్షకుడైన విష్ణువునకిచ్చెను. విష్ణువా ఖడ్గముచే క్రూర రాక్షసులను సంహరించి ఆ తరువాత దానిని మరీచికొసగెను, మరీచి భార్గవునకు, భార్గవుడు మునులకు,

మును లింద్రునకు నొసగగా, తరువాత మనువు మున్నగు రాజులకు క్రమముగా ఆ ఖడ్గము లభించెను. తరువాత దానిని దుష్యంతుడు భరతుడు ద్రోణుడు కృపుడు వరుసగా పొందిరి. కృపాచార్యులు దానిని మీ పాండవు లేవురికి నిచ్చెను. నకులా నీవు ఖడ్గ యుద్ధ విద్యా విశారదుడవు. నీకు యశస్సు దెచ్చినదీఖడ్గమే. ఖడ్గమునకు నిస్త్రింశము నక్షత్రము, కృత్తిక, అగ్ని అధిదేవత, గురుడు రుద్రుడు అనియు నుజీయు దీనికి అసి, విశసనము, ఖడ్గము, తీక్ష ధారము, దురాసదము, శ్రీ గర్భము విజయము ధర్మపాలము అను ఎనిమిది దివ్య నామములు గలవు. కృపాణము తక్కుగల ఆయుధములలో ప్రధానమైనది. పరమ పూజ్యమైనది.

## ధర్మార్థకామముల తారతమ్యము

సాయంతనమైనది. ఆనాటికి భీష్ముని వద్ద సెలవుగైకొని ధర్మజుడు సోదరులతో కలిసి నగరమునకేగి కాల్య కర్మముల దీర్చి, విశ్రాంతిగ ఉపవిష్టుడై విదురుని జూచి తాతా ధర్మార్థ కామములు స్వాభావికముగనెట్టివి. ని యెక్కువ తక్కువలు తెలియజేయుడనగా విదురుడిట్లనెను.

ధర్మజా, ధర్మము వలన ధనము, ధనము వలన కామ తంత్రము సిద్ధించును గాన ధర్మమే ఉత్తమమైనది. ధనము మధ్యమము, కామము అధమము. అంతట పార్థుడు, ధర్మ కామముల నడుపవలెనన్న చోధనము కావలెను. విరాగులకును దినవెచ్చమునకైన ధనము కావలె గదా. శుక్రుడు కణ్వుడు గూడ ఈ విధముగనే ధనము ప్రధానమని నుడివిరి. ఆ మాటవిని నకులసహదేవులు ధర్మము ధనము ఇతరులనాశ్రయించి యుండును. అవి లేని వాని కామము ప్రాప్తించదుగాన కామము ఎక్కువైనది అనిరి. భీముడంతట లేచి, ఈ మూడుగుణములొకదాని కొకటి సంబంధించినవే గాన ఉత్తముడైన నాయకుడన్నిటిని సమముగానే జూచునని నుడివెను. తమ్ములిట్లు వేర్వేరు అభిప్రాయముల వెలిబుచ్చుటచే, ధర్మజుడు చిరునవ్వుతో వారిని జూచి యిట్లనెను.

నేనడిగిన ప్రశ్నకు విదురుని మాటయే సిద్ధాంతము. అర్థకామములు పరిస్థితులను బట్టి ఎప్పుడైనను ఎవరికైనను ఆదరణీయములు కావచ్చును. ప్రాణులకు జర మృత్యువు తప్పవు కాన, ధర్మార్థ కామముల వలన కలుగు దుఃఖమును పోగొట్టు కొనుటకు మోక్షమును వాంఛించుటమేలు. అదియెట్లు లభించునందురా ధర్మార్థ కామములు క్రమమైన పద్ధతిని మనసున పట్టనిచో ఆ కారణముగ సుఖదుఃఖములు మదము దైన్యము సంభవించును వానిని వదలగలుగుటయే మోక్షము. అనిన ధర్మజు మాటలకందరు సంతసించిరి.

## నృపాలునకు కావలయువారు అక్కరలేనివారు

మఱునాడు భీష్ముడిట్లు చెప్పెను.

కావలసిన వారు - ఓర్పు గలవారు, ధర్మజ్ఞులు, సత్యము పలుకువారు, గర్వ లోభ కోపములు లేనివారు, మంచి ప్రవర్తన కలిగి, మాట నేర్పు కార్య నిర్వహణ దక్షులయిన భృత్యులుండుట మంచిది.

అక్కరలేనివారు - క్రూరుడు, లోభి, మూర్ఖుడు, కొండెములు చెప్పువాడు, బద్ధకస్తుడు, కృతఘ్నుడు, నేర్పులేనివాడు, బొంకులాడు వాడు, నిందలోర్చు వాడు, పిరికి వాడు, ధైర్యము లేనివాడు పనికి రారు. వీరుండుట రాజునకు చేటు. వీరందరిలోను కృతఘ్నుడు అనగా తనకు జరిగిన మేలును విస్మరించినవాడు అధముడని ఒక కథ చెప్పెను.

## నాడీ జంఘుని చరిత్రము - కృతఘ్నత మహాపాపము

ఒక బ్రాహ్మణుడు కుల వృత్తులు మాని, దుర్వ్యసనలోలుడై ఒక బోయ స్త్రీని పెండ్లి చేసికొని కిరాతుల గూడి మద్య మాంసాదుల కలవాటు పడి, దరిద్రుడై ధనము సంపాదించుటకై విదేశములలో వర్తకమునకై పోవు ఒక వ్యాపారుల గుంపులో చేరెను. ఆ గుంపు ఒక అడవిని సమీపింపగనే ఒక అడవి యేనుగు వారి మీద పడి చెల్లాచెదురు గావించెను. ఆ బ్రాహ్మణుడు దారి తప్పి ఆ వర్తకులను కలిసి కొనలేక ఒక పెద్ద మఱ్ఱి చెట్టు క్రింద చల్లగాలికి విశ్రాంతి తీసికొనుచుండెను. నాడీ జంఘుడను ఒక కొంగకు ఆ చెట్టు నివాసము. అది బ్రహ్మదేవునకు ప్రీతిపాత్రమైన పక్షి. చెట్టు క్రిందనున్న బ్రాహ్మణుని జూచి జాలిపడి ఆతడచ్చటికి చేరిన విషయమెఱిగి నదిలోని రుచిగల చేపలు తెచ్చి కాల్చి విందు చేసినది. ఆ రాత్రి అతనికి ఆకులు కొమ్మలు కూర్చిన మెత్తని పక్క నేర్పరచి సుఖ నిద్రను కల్పించెను.

మఱునాడుదయము ఆ కొక్కెర బ్రాహ్మణుని జూచి అయ్యా లోకమున స్నేహితుడు బంగారము వెండి బుద్ధి ఈ నాలుగింటివలన దారిద్ర్యము పోవును. బృహస్పతి చెప్పిన సూక్తియిది. నీవు నాకు స్నేహితుడవు. నీకు ధనములభించు ఉపాయమొకటి ఉన్నది వినుము. నా మిత్రుడు విరూపాక్షుడను రాక్షసుడు కలడు. అతడు పేరెన్నికగన్న దాత. నేను పంపితినని చెప్పి అడుగుము. నీకు సహాయము లభించునని పంపెను. బ్రాహ్మణుడట్లే యేగి విరూపాక్షుని చూచి ధన సహాయము నడిగెను. చూచీ చూడగనే ఈ బ్రాహ్మణుడు మంచివాడు కాదు అని విరూపాక్షునికి మనసులో తోచినది. అయినను తన మంచి స్వభావముచే మఱునాడు తక్కిన బ్రాహ్మణులతో పాటు ఇతనికిని సంతృప్తిగా భోజనము ఇచ్చి అతడు తినిన పళ్ళెము

నిండా రత్నాలు మణులు నింపి దానము చేసెను. బ్రాహ్మణుడు తిరిగి తానున్న మఱ్ఱిచెట్టును జేరి నాడీ జంఘునకు ధనములభించిన వార్త చెప్పెను. ఇరువురును సంతసించి సుఖ నిద్రపోయిరి. రాత్రి ఆ దుష్ట బ్రాహ్మణునకొక చెడ్డ తలపు కల్గినది. నాడీ జంఘుని వలన ధనములభించినది. మంచి ఆహారము దొరకినది. మరి రేపటి మాటో అని ఆలోచించి ఉదయముననే లేచి ఆ నాడీ జంఘుని రెక్కలు విరిచి చంపి కాల్చిన మాంసము మూటగట్టుకొని తన దారిని పోయెను.

ప్రతి దినము తనవద్దకు వచ్చు నాడీ జంఘుడు రాలేదు. విరూపాక్షుని మనసు కలత చెంది ఏమైనదో ఏమో అని భటులను పంపెను. నాడీ జంఘుడు చంపబడినగుర్తుల వలన దారిలో కనబడిన ఆ బ్రాహ్మణుని చేతులు కాళ్ళు విరిచి కట్టి విరూపాక్షునికి చూపిరి అతడా దుష్ట బ్రాహ్మణుని చూచుటకే అసహ్యించు కొని గోతులో పారవేయుడీ తుచ్ఛుని అని ఆజ్ఞాపించెను. గోతులో పడి ఉన్న ఆ దుష్టుని కుక్క గూడ ముట్టుకొనలేదు.

భీష్ముడీ కథను నుడివి, వింటివా ధర్మరాజా! కృతఘ్నత యెంత పాపమో! దానికంటె మేలు చేసిన మిత్రునకు ద్రోహమొనర్చుట మహా పాపము. దీనికీ కథయే నిదర్శనమని నుడివెను.

తన మిత్రుడు నాడీ జంఘుడు మరణించెను గదా యని మిగుల దుఃఖించి విరూపాక్షుడా బకము రెక్కతెప్పించి దానికి అగ్ని ముట్టించి అంత్యక్రియలు చేయు నంతలో ఇంద్రుడు వచ్చి విరూపాక్షా యేలనీకీ చింత. నాడీ జంఘుడు బ్రహ్మదే వుడిచ్చిన మిత్రుడు. బ్రహ్మను ప్రార్థింపుమనగా విరుపాక్షుడును అట్లొనర్చెను. ఎచ్చటి నుండియో తటాలున ఒక గోవు వచ్చి ఆ చితాగ్ని వద్దనే తన దూడకు పాలీయగా ఆ పాల నురుగు కొంత పొదుగు నుండి జారి ఆ యగ్నిలో పడెను. దాని ప్రభావమున నాడీ జంఘుడు బ్రతికి ఎప్పటివలె రాగనే అందరు సంతసించిరి. నాడీ జంఘుడచట గోతులో పడిఉన్న బ్రాహ్మణుని జూచి అయ్యో నావలన గదా యీతని కింతదీనావస్థ కలిగినదని చింతించి వానిని రక్షింప ఇంద్రుని వేడుకొనెను. ఇంద్రుని దయవలన విప్రుడును ఏ బాధ లేక బ్రతికెను. ఆతనికి తానిచ్చిన ధన ము కూడ మరల యిచ్చి విరూపాక్షుడని పెను.

విరూపాక్షుని దాతృత్వము స్నేహ శీలమును నాడీ జంఘుని సత్ప్రవర్తనము మెచ్చి దీవించి ఇంద్రుడంతర్ధానుడయ్యెను.

# మహాభారత ధర్మశాస్త్రము

## శాంతి పర్వము - చతుర్థాశ్వాసము

### దురాశ కూడదు

మఱునాడు సోదరులతో కలిసి యేతెంచిన ధర్మరాజును గని భీష్ముడు, ధర్మజా నాయెఱింగిన తెఱంగున నీవడిగిన విషయములన్నియు సవిస్తరమ్ముగ తెలియ జేసితిని. ఇంకేమైన తెలియవలసిన వున్నచో అడుగుమనగా ధర్మజుడు, తాతా, దేవ వ్రతా! నీ చెప్పిన రాజోచిత ధర్మ విషయములన్నియు మాకత్యంత హిత కరములైనవి. ఇంక భూ జనులకు పరమ హితములైన ధర్మములు వినగోరెద మనగా భీష్ముడిట్లు నుడివెను.

ధర్మజా అనేక విధములగు ధర్మములున్నవి. అన్నియును ఫలప్రదములే కాని మోక్షము నిచ్చు ధర్మము పరమోత్తమము. ఇది ప్రియము ఇది అప్రియము అని మనసున జేరనీయని ధర్మము పరమోత్తమము. దీనికి నిదర్శనముగ ఒక కథ వినుము.

సేనజితుడను రాజు తన పుత్రుడు మరణించిన కారణమున శోకార్తుడయి ఉండగా, స్నేహితుడైన విప్రుడొకడు వచ్చి యిట్లోదార్చెను. ఏమయ్యా, ధరణీంద్రా! సుతునికై యిట్లు దుఃఖింతువేమి. మరణము నీసుతుని కొక్కనికేనా? అందరికిని ఉన్నది. బంధు మిత్రులు ఇతరులు వీరందరు శాశ్వతముగ ఒకని నంటిపెట్టుకొని యుందురా. తుదకు ఎవరి దారి వారిదే. కష్టసుఖములను సమముగా జూడవల యును లేని యెడల శోకము తప్పదు. పూర్వజన్మముల చేసిన కర్మముల ఫలము అనుభవింపక తప్పదు. పేరాస ఎప్పుడును తగదు. అది దుఃఖమునకు కారణము ఒక కథ వినుము.

పింగళయను ఒక వేశ్యయుండినది. ఒకనాడు తన ప్రియుడు రాకపోవు టచే చాల ప్రొద్దువరకు వేచివేచి తుదకు ఇట్లాలోచింపదొడగెను. దగ్గరకు వచ్చిన వాని నెల్ల ప్రియునిగా జూచు ఆశ నాకేల, నేనెవరి కొరకును ఆశపడను. నిరాశయే పరమ సుఖ ప్రదమని తలుపులన్నియు మూసి సుఖముగ నిద్రించెను. విప్రుని యీ మాటలకు సేనజితు సంతృప్తి పడి శాంతినందెను. భీష్ముడంతట-

ధర్మజా! ఈ కథ యందులి సారమును గ్రహించి నీవు కూడ దురాశను త్యజించినచో మనశ్శాంతియు సుఖము కల్గునని నుడివెను.

## సత్యధర్మము : మేధావి తన తండ్రికి చెప్పిన హితము

ధర్మరాజు భీష్మని మఱియొక విషయము తెలియగోరి యిట్లడిగెను. శాంతనవా! సర్వభూతములు నశించు ప్రళయమేతెంచుచున్నది. కాన ప్రజలకి పుడు కర్తవ్య ధర్మము దెలుపుడనగా భీష్మడిట్లు మరియొక ఉదంతమునుడివె ను.

వేద పండితుడయిన ఒక బ్రాహ్మణునకు, మేధావియను నామముగల బుద్ధి మంతుడగు పుత్రుడు గలడు. ఒకనాడామేధావి తండ్రిని జూచి, తండ్రీ! జనుల కందరకు ఆయువు త్వరత్వరగా చెల్లిపోవుచుండును. ఈ పరిస్థితులను మనసులో పెట్టుకొని వారి వారి శ్రేయస్సుకొరకు మనుజులెట్లు వర్తింపవలయునని అడుగగా, తండ్రి యిట్లు చెప్పెను. తనయా! మనుజుడు భార్యవలన మంచి సంతతిని పొంది, యజ్ఞముల ద్వారా దేవతలను తృప్తి జేయుచు శాంతచిత్తుడై సాధు వర్త నమున ముక్తి సాధించి మృత్యువునుగెలువ వచ్చుననెను. అంతనా బాలుడు తండ్రీ, కాలము మనవశమున నున్నట్లు మాటాడుచున్నారు. అది సరిగాదు. నరుడు తల్లి గర్భము చొచ్చిన క్షణమునుండియు మృత్యువు వెంటాడు చుండును. సం సార మందు భార్యాపుత్రులపై ఆశతో నుండు మనుజుడు ఎండు చెరువులోనున్న చేపవంటివాడు. మృత్యువు వచ్చి ఏ క్షణమునందో ఎత్తుకొని పోవును. ఇప్పుడీ పనిని జేసి తరువాత మఱొకపనిని చేయుదమనునంతలో మృత్యువే వచ్చి పైబ డును. వీడు పండితుడు వాడు మూఢుడు, వీడు బలశాలి, వాడు బక్కమనిషి అని లేదు. మృత్యువు అందరిని తన వశము చేసికొనును. దుఃఖమయమగు సం సారమును వదలి విరాగి యగుట మేలు. మోహము మృత్యుసమానము. సత్యము అమృతము. సత్యము వలన శాంత చిత్తుడనై కష్టసుఖములు సమముగా జూచుచు మృత్యువును జయింతును. పశువులను బలియిచ్చు యజ్ఞము అహంకారయుతము, హింసాత్మకమైనది. వాక్కు మనసు కర్మలను నియమ నిష్ఠలందుంచు యాగము నాశనములేని ఆనందము నిచ్చును. కావున తండ్రీ, కామ క్రోధాదులను విడచి ఏకాంత ధ్యానముతో నిన్ను నీవు తెలిసికొనుము అనెను. పుత్రుని వివేకమునకు తండ్రి సంతసించి అట్లే యొనర్చి సుఖమును పొందెను. కాన ధర్మరాజా నీవును సత్యధర్మమున వాఙ్మనస నియమ యోగంబున చిత్త శాంతి పొందుమనియెను.

## ధనవంతులు పేదవారు వీరిలో సుఖులెవ్వరు?

ధర్మజుడడిగిన యీ ప్రశ్నకు భీష్ముడిట్లనుడివెను.

ధర్మరాజా! ఒక సమయమున శమ్యాకుడను విప్రుడు నావద్దకు వచ్చి ప్రసంగ వశమున యిట్లు నుడివెను. ధనమును పేదరికమును త్రాసులో పెట్టి చూడగా పేదరికమే యెక్కువయినదిగా ముల్లు చూపెను. కారణము వినుము. ధనము గల వానికి యిది అగ్ని పాలు, దొంగల పాలు అగునేమో అనిన భయమే. ధనము తో పాటు కోపము లోభము ఎక్కువై ఆపదకు కారణములగును. ఇక పేదవాడా స్వేచ్ఛగా ఎచటికైన తిరుగ గలడు. భయమనునది లేదు. మనసు విప్పి మంచిగా మాటలాడగలడు. మనకు కనపడు ధనాదులన్నియు కాలము వలన చిక్కులు కలిగించునవియే యని తెలిసికొనవలయును. ధన సంపాదన దుఃఖకరము. పేద వానికి తనమనసు అధీనములోనుండి సౌఖ్యకరమగును. ఇది తెలిసికొనుమని పలి కెను.

**ధనాశఉన్న వానికి సుఖములేదు – మంకి యను విప్రుని చరిత్రము**

భీష్ముడు ధర్మజునకీ సందర్భమున ఒక కథనుడివెను.

ధన సంపాదన యందు విసువు జనించి నిరాసక్తుడైనపుడు సుఖము కలుగును. ఇందులకొక పూర్వకథ యున్నది వినుము. మంకియను ఒక బ్రాహ్మ ణుడు ధనార్జన యందు మిగుల ఆసక్తి కలవాడు. అందులకు వ్యాపారము గూడ చేయువాడు. ఒకనాడు ఒక గిత్తల జతను గొని వానిమెడలు కలిపి లంకెవేసి పెరటి లో నుంచగా అవి బెదరి పారిపోయి వీధిలోనున్న ఒక ఒంటె వీపుపై అటు నిటు పడి గింజుకొని గొంతులు బిగిసి చచ్చినవి. ఆ విప్రుడు రత్నములవంటి లేదూడలు చచ్చిపోయినవే అని చూచువారికి కూడ జాలిపుట్టునట్లేడ్చెను. అట్లు విచారించిన వాని మనసున ఒక విరక్తి కలిగినది. దైవ బలము కావలెగాని పురుష యత్నము వలన కార్య సిద్ధి కానేరదు, మనసునకు సుఖ శాంతులు వలయునన్నచో ధనార్జన కాంక్షలు విడుచుట మేలు అని నిశ్చయించుకొనెను. సొమ్ము సమకూడినయంత సుఖము కలుగదు. అది చావుతో సమానమయి పెక్కు చిక్కులు తెచ్చును. ఆశ శ్రమ శోకములకు ఈ కోరికయే మూలము అనుకొని ఇంక ఈ కోరికలనన్నిటిని కట్టిపెట్టి సుఖముగ నుండదలచెను. ఇట్లు కృతనిశ్చయుడయిన ఆ విప్రుడు అరి షడ్వర్గములనువదలి బ్రహ్మ భావుడయ్యెను.

**నరునకు దుఃఖము నాశనమయి సద్గతి యెట్లు లభించును.**

## అజగర చరిత్రము

భూతములన్నియు అశాశ్వతములు- అవి అశాశ్వతములని యెఱిగి యున్నచో సంతోష దుఃఖభావములుండవు. అన్నియు సమానమే. ఒకప్పుడు ప్రహ్లాదుడు అజగరుడను సద్బ్రాహ్మణుని పిలిచి శమము అనునది ఎట్టిది దాని ప్రభావమేమి అని అడిగెను. అజగరుడంతట దానవేంద్రా! శమమును గూర్చి నేనెఱుంగుదునని కదా నీవు నన్నడిగితివి. వినుము- మేలును కోరను, కీడును విచారముతో తొలగ ద్రోయను. సరసాన్నము, తెలికి పిండి, నారబట్ట పట్టువలువ, ఇవి నామనస్సునకు సమములే. ఈ విధముగ కలిమిలేములను సమముగ పాటించుటే వివేకము. ఇట్లు అజగరుని వ్రతము తెల్పి భీష్ముడు ధర్మజా నియమము లేని ఆహార శయనములు కీడు. తృప్తి శుచి నిరాసక్తి ఓర్పు, సమత్వము ఇవి పాటించుట అజగర వ్రత మందురు. ఇది యజ్ఞ దుర్లభమైన జ్ఞాన దీప్తి నిచ్చును. మోక్షమునకు దారి జూపును. అజగర వ్రతులకు పాప భయము ఉండదు.

బంధువులు ధనము ప్రజ్ఞ ఏది ప్రయోజనకరము అను ప్రశ్నకు భీష్ముడిట్లు నుడివెను. అన్నిటికన్న ప్రజ్ఞ ముఖ్యము. ప్రజ్ఞ అనగా బుద్ధి వికాసము. దానికి అసాధ్య ములు లేవు. అదియే సుఖ ప్రదము, కైవల్య ప్రదము కూడ. కాశ్యపుడను బ్రాహ్మణుడు, ఒక ముఖ్యుని రథము తాకి క్రింద పడి ఆ యవమానము భరింప లేక ప్రాణ త్యాగము చేయనున్న తరి, ఇంద్రుడే వచ్చి చిత్త శాంతికల్గించెను. ఈ మాటలు విని ధర్మతనయుడు. దానము తపము గురు శుశ్రూష యజ్ఞములు నరులకెట్లు ఫలప్రదములగునని యడుగగా భీష్ముడిట్లు నుడివెను. సత్ప్రవర్తనము వలన మంచియును, మేలును కలుగునట్లే దుష్కార్మములు కష్టములనొకదానివె నుక నొకటి వచ్చునట్లు చేయును. ధాన్యమునందు పొల్లుగింజలవంటివారు దుష్టులు. వాని సమయము వచ్చునప్పటికి చెట్లు పూచి కాయలు పండ్లు ఇచ్చునటులనే దుఃఖ సుఖములు తెలియకుండనే వచ్చును. ఆకాశమున పక్షులు పోవుట నీటిలో చేపలు మసలుట తెలియదు. అట్లే ఉత్తమ పురుషులు బోవు దారులు తెలిసికొనుట కష్టము. పెద్దలు జ్ఞానులు చెప్పిన ఉపదేశముల ప్రకారము ధర్మములయిన కార్య ములు చేయుట వలననే ఫలితముండును.

## భూమి మొదలగు భూతోత్పత్తి

ధర్మజునకు భీష్ముడిట్లు నుడివెను. పూర్వముకైలాసశైలమున భరద్వాజుడీ విషయమునే అడుగగా భృగుడిట్లు వచించెను.

అనంతుడు అవ్యయుడయిన నారాయణుడు భూతసృష్టి నొనర్పదలచి తనలోని సహస్రాంశకల అవ్యక్తుని, అజరామరుడైన వాని మనసునుండి సృజించెను. అతని వలన మహత్తత్వ ముద్భవించినది. అతనిచే దివ్యతేజో మయంబైన పద్మ మొకటి కల్పింప బడినది. అందుండి బ్రహ్మ ఉద్భవించెను. బ్రహ్మ తలపున ఆకసము, దానియందు జలము, ఉద్భవించినవి. జలమునుండి అగ్ని వాయువు వచ్చినవి. వాయువు అగ్ని కలియుట వలన భూమి పుట్టినది.

బ్రహ్మ అఖిల భూతాత్మకుడు అతనికి ఎముకలు పర్వతములు. మేదిని మేధ, సముద్రములు రక్తములు, ఆకాశము పొట్ట, వాయువు విశ్వాసము, అగ్ని తేజము, నదులు నాడులు, సూర్య చంద్రులు కండ్లు ఊర్ధ్వలోకములు శిరము, పాతాళము పాదములు, దిశలు బాహువులు, ఈ విధముగ విశ్వమంతయు విష్ణుని వలన కలిగెను. ఈ పంచభూతముల ప్రమాణములు ఊహింప అలవి కానివి. బ్రహ్మ విష్ణు మానస భవుడు. పద్మము ఆసనముగ కల్పితమైనది. అతనికి ఆది అనునది లేదు గనుక పద్మసంభవుడందురు. ఆ పద్మమునకు కార్ణిక మేరు పర్వతము. అందున్న కారణమున బ్రహ్మకు సకల జంతు సృష్టి మహిమ కలిగినది.

అయిదు భూతములకును వేర్వేరు గుణములు వాయువు నందు కదలిక, ఆకసమునందు శబ్దము, జలము నందు ద్రవము, అనలమునందు వేడి భూమి యందు గట్టితనము, వీని మూలముననే స్థావరములు (కదలికలేనివి) జంగమ ములు (తిరుగునవి, నడచునవి) అగుచున్నవి. వీనియందు పంచ భూతముల గుణములెట్లున్నవనగా వినుము. ఉరుముల ధ్వని వలననే వృక్షము అనేక రూపము లందును; ఆకాశ శక్తివలననే ఆ ధ్వని ప్రభావము- ఎండవేడి తగిలిన వాడిపోవును. వాయు శక్తి వలన స్పర్శ, ప్రక్కలకు పొడుగెదుగుట తేజశ్శక్తి, పాదము వలన జలము పీల్చును. జలమువలన పూవులు పూయుట పరిమళ ధూపములు కలుగును. ఈ విధముగ వృక్షము పంచ భూతాత్మికము. పర్వతాదులు నిట్లే; పంచ భూతా త్మకము కానిదేదియును లేదు. ఇది వేదములలోని మాట. అంతరాత్మ బోధము వలననే నరులు ఇంద్రియ మనసుల వలన విషయములననుభవించి వాని ఫలము లైన మోద ఖేదముల పొందుదురు.

సృష్టి కారణమైన పురుషుడు క్షేత్రజ్ఞు డను పేర సర్వము నందును వ్యాపించు వాడగును. ఈ తత్వము పూర్వగురుత్వంబునకును విగతత్వమునకును నెలవయి సత్వ రజస్తమోగుణముల వికారములకు అతీతమైనది. సజ్జనుడైన నరుడు

నిర్మలము సూక్ష్మమైన బుద్ధితో ఆ పురుషుని యందు మనసులగ్నమొనర్చి, సుఖ దుఃఖములను గణింపక శుద్ధ శాంతి నుండుటయే పరమ సుఖము.

### వర్ణాశ్రమాచార క్రమము – భృగు మహాముని భరద్వాజునకు చెప్పుట

వేదము, సత్యము, ధర్మము, సదాచారము, తపము ఉనికి పట్టులు గాగ తొల్దొల్త బ్రాహ్మణులను, తరువాత నృపవైశ్య శూద్రులను బ్రహ్మ కలిగించెను. వరుసగ వారి దేహచ్ఛాయలు తెలుపు కెంపు పసుపు నలుపు. ఆర్యవరులు తమ స్వకర్మను విడచి అన్య జాతిపనికి పూనుకొన్నచో ఆజాతి వారగుదురు. ఇట్టి పెక్కు పనులచే జారుడు కూడ అగును. ఈ కారణములచే ఈ ఛాయలు క్రమక్రమముగా తగ్గును. అందుచే సహజస్వభావము నిలుపు కొనుటకు కర్మ శీలత చాల ముఖ్యము.

సత్యమే ధర్మము, తపస్సు ప్రజలను సృజించునది. లోక స్థితి కాధారము. అసత్యము వలన సత్యము మఱుగుపడి పోవును. మఱియు సత్యము సద్గుణ ప్రకాశము బోధము సుఖము కాగా, అసత్యము, అధర్మము తమోగుణము అజ్ఞానము నరకము దుఃఖము అగును. సత్యాసత్యము లీ రీతి వర్తిల్లు చుండును.

దుఃఖాత్మకమగు అనృతమును తొలగించుటకు సుజనులు మోహమును అణచివేయుదురు. శరీరమునందు ముసలితనము రోగము, మనస్సునందు బాధ దుఃఖము కలుగుచుండును. ఈ రెండింటిని నశింప జేయుటకు నియమ నిష్ఠల నాచరించి సుఖ మందుదురు. దుఃఖములను వెడలించి విషయా సక్తుడుగాని మనుజునకు పరమ పదము లభ్యమగును.

### ఆశ్రమధర్మములు

బ్రహ్మ చర్యము :- గురు సేవ, వేదాభ్యాసము, శుచి, సత్ప్రవర్తన, వినయము, ఉదయమధ్యాహ్న సాయంకాల స్నాన పూజలు, సూర్య, అగ్నులకు పూజలు.

గృహస్థ ధర్మము :- సన్మార్గమున ధన ధాన్య సంపాదన, అతిథి పూజ, అన్న పానములు.

వానప్రస్థము :- వనవాసము జపతపములు, ఆత్మ చింతన, ఇంద్రియ నిగ్రహము, శమదమములు, అగ్నిహోత్రము

సన్యాసము :- వననివాసము, నేల మీద పరుండుట, కందమూల శాకాహారము, నిస్సంగము, భిక్షవలన మనుగడ.

ఫల కాంక్షలేని ఈ కర్మాచరణములే మోక్ష ప్రదములు

## ఇహ పరలోకములు

ఈ రెండు లోకములకు హస్తిమశకాంతరమగు భేదమున్నది. నివాసము శయనాసనము, వస్త్ర ధారణ, స్త్రీ సుఖము యీ యన్నిటియందును వేర్వేరు విధములే. ఇహము కర్మభూమి దుఃఖ బహుళమైనది. పరలోకము భోగాస్పదము సత్యము శౌచము మంచితనము దయ గల వారికది లభించును. పరలోకవాసు లన్యోన్యము స్నేహముగ నుందురు. అధర్మ వర్తనులకు నిరంతర దుఃఖ నిలయమైన అధమలోకమే గతి. మమకారము లేని విరాగులు ఈ పుణ్యపాపముల లోకనివాసములేని శాశ్వతానందము పొందుదురు.

## ఆచార విధులు

ధర్మజుడు తెలియగోరిన ఈ విషయమును గూర్చి మున్ను నారదుడు వివరించిన విధమును భీష్ముడిట్లు నుడివెను.

సదాచారవంతులు సజ్జనులు, దురాచారము కష్టములకు మూలము. రాజ వీధి యందును, గుంపు మధ్యమున మూత్ర పురీషములు విడువరాదు. శుచియై సంధ్యావందన మొర్చవలెను. సూర్యుని పూజింపవలెను. ఉదయమున అస్తమయ సమయమందు నిద్ర పనికిరాదు. పంచార్ద్ర భావమున భుజించుట, తడి కాళ్లతో నిదుర కేగరాదు. ఉదయసూర్యుని చూడరాదు. నగ్నయగు అన్య స్త్రీవైపు దృష్టి పోరాదు. తన పురీషమును చూడరాదు. తాను చేసిన తప్పును దాచియుంచుట తగదు. భార్యాసంభోగము గుప్తముగ నుండవలెను. గురు శుశ్రూష ఉత్తమ గుణుల సేవ ఆయుర్వృద్ధి కరము లక్ష్మీ ప్రదము.

## అధ్యాత్మ విద్య

ధర్మజా వినుము. సముద్రములోని కెరటములవలె పృథివి మున్నగు పంచ భూతముల గుణములు మానవునందు విజృంభించుచు అణగు చుండును. ఇంద్రియములకు పెద్ద ప్రావు మనస్సు, బుద్ధి నిర్ణయము వలన ఆయా గుణములను పురుషుడు పొందును. ఇంద్రియ వ్యాపారములను మనసునకు పట్టకుండ బుద్ధి లోపలనే అణగజేయుట వలన నిర్విషయ స్థితి కలుగును. విషయానుభవములు మాయా జనితములు. మనుజుని మోసగించి తనలోని ఆత్మను తెలియకుండ చేయును. సత్త్వగుణము సుఖ ప్రదము, రజోగుణము దుఃఖ ప్రదము, తమోగుణము అజ్ఞానము. సమత్వ దృష్టితో యీ త్రిగుణములకు అతీతమయి యుండుటయే విమలమగు అధ్యాత్మస్థితి.

## యోగ ప్రకారము

యమ నియమములెనిమిదియు యమము (హింసాదుల నణచుట) నియమము ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము ధారణ, మననము, సమాధి అభ్యసించుచు నిష్ఠతో ఏకాగ్రమైన నిశ్చల మనసునకు గాలియే ఆధారముగా గల ఆలోచనయే వివేకమును గల్గించును. పవన ధారణములోనున్న ఇడపింగళ నాడుల ద్వారా బ్రహ్మపదమును జేరగా శాంతిగల చిత్తము ఆనంద మొంది దానియందే కలయును. ఇది యోగ ప్రకారము.

## జపవిధి శీలురు, కౌశిక మునికథ.

ధర్మరాజు మరల జప విధి, జప శీలురు పోవు మార్గమును తెలిసికొన కోరగా భీష్ముడా విషయమును గూర్చి ఒక కథ నిట్లు వినిపించెను.

వేదాంతుల అంగీకారము నందినట్టి జప కర్మమును పొంది సాధకుడు చిత్తమును అన్య విషయములందు బోనీక, అహంకారము మత్సరము డాంబికము లేకుండ బ్రహ్మ చర్యము గలిగి జపము నందే ధ్యానముగల వాడు సర్వలోకాతీతమైన శాశ్వత పదము నందును, ఈ విధమగు సుగుణములు లేని వానికి జపము నరకమునే తెచ్చును.

పూర్వము కౌశికుడను బ్రాహ్మణుడు, వేదవేదాంగముల నెఱిగినవాడు విధి విధానముగ కడు నిష్ఠతో సంహితా జపము వేయేండ్లు సేయగా సావిత్రి ప్రత్యక్షమై అతని కోరిక నెఱిగి, ఉత్తమమగు ధర్మబుద్ధి ఆతనికి కలుగునట్లు వరమిచ్చెను. అట్లు వరమిచ్చి యముడు, కాలుడు, మృత్యువు, నీపయికి వాదమునకు వత్తురు సుమా అని కూడ హెచ్చరించి చనెను.

కౌశికుడు జపము అనేక దివ్య సంవత్సరములు చేసినాడు. ధర్మము ఆతని కడకు వచ్చినది. వచ్చి ''ఓ మునీంద్రా నీ జపము సిద్ధించినది. నీవిక నీ శరీరమును వదలి పుణ్యలోకములకు వేడుకగ ఏగవచ్చును'' అనగనే సాకారముగ ఎదుట నున్న ధర్మమును జూచి కౌశికుడు నీవు చెప్పినది మేలైనను, నాతోపాటు దుఃఖము ననుభవించిన ఈ తనువును విడచి నేను వెళ్ళలేను. అని నిశ్చయముగ పలికెను.

అంత ధర్మము ఆ విప్రవర్యుని జూచి

''ఇదియేమి విప్రవర్యా, శరీరమును విడువకుండ ఎట్లు పొసగును. అదిగో చూడుము నిన్ను తీసికొను పోవుటకు వచ్చిన యముడు కాలుడు మృత్యువు ఏమను చున్నారో.

యముడు : విప్రవర్యా నీ జపము ఫలసిద్ధిని పొందినది

కాలుడు : నీవు స్వర్గమేగు సమయము వచ్చినది. అందులకే వచ్చి చెప్పితిని.

మృత్యువు : నీకు కాలము సరిపోయినది. నిన్ను కొనిపోవుటకు వచ్చితిని.

అనిన మాటలను పెడచెవిన పెట్టి కౌశికుడు, సవినయముగ స్వాగత మిచ్చి మీరు పుణ్యులు పూజ్యులు మీకు నేనుసేయవలసిన కార్యమును వచింపుడు చేసెదను అనునంతలో తీర్థయాత్రలు సేయుచు ఇక్ష్వాకు ప్రభువచ్చటికేతెంచి వారి కెల్లరకు ప్రణతు లర్పించెను. కౌశికుడును ఆ నరపాలునతిథిగా భావించి ఆదరగా రవ మర్యా దలతో జూచి వినతుడై.

కౌశికుడు : రాజేంద్రా నీవు నేడు నాకు ప్రియాతిథివి. నీకేది యిష్టమో కోరు కొనుము ఇచ్చెదను.

ఇక్ష్వాకు : నరపతులు దానములిచ్చెదరే కాని కోరుకొనరు. మునీంద్రా నీకేది కావలయునో కోరుము ఇచ్చెదను.

కౌశికుడు : లోక వృత్తిలో నున్న వారికి కోరికలుండును. నేను విరాగిని నీవేకోరు కొనుము. మీరతిథులు, పూజారూపమున నిచ్చుచున్నాను. మీరు నృపతులైనను కై కొనుటలో ఎగ్గులేదు.

ఇక్ష్వాకు : నీవీయ దలచినచో నీ సకల జపఫలము నాకిమ్ము. జపము వలన ఫల మెట్టిదియో యెఱుంగగోరెదను.

కౌశికుడు : నాకు దేనియందును అపేక్ష లేదు ఫలమెట్టిదని చెప్పగలను. నాజప ఫలములో సగ భాగము నిచ్చెదను. కాదేని సర్వమును గైకొమ్ము. సందేహింపక నీవనినట్లు తీసికొని నీ సత్య వాక్యమును నిలుపుము. సత్యమనగా వేదము తపము యజ్ఞము శాంతి దాంతులు కూడ సత్యమును నిలుపకపోయినచో నిత్యానుష్ఠానములు నిష్ఫలమే.

వారిరువురి వాదము వినిన ధర్మము, అటనున్న యముడు మున్నగు వారు వినునట్లు వీరిరువురు సమాన ఫలము నొందువారే, ఇక్ష్వాకునకు సత్యఫలము కౌశికునకు దాన ఫలమును దక్కుననగా ఆ ధరణీశుడు అట్లయిన నేనిచ్చునది అనగా నా పుణ్యకర్మల ఫలమును ఈ ముని స్వీకరింపవలయునని నుడివెను. విరాగి యైన కౌశికుడింకను సందేహించుచుండెను.

అంతలో వికృత వేషులయిన ఇరువురు పురుషులు తమలో తాము వాదు లాడుకొనుచు వచ్చిరి. వారిలో నొకడు మరియొకనికి గోదానమిచ్చెను. తత్ఫలమును గూడనతడడుగగా దానిని గూడ మొదటి వాడిచ్చెను. అది తక్కువగా భావించి రెండవ వాడు రెండు మంచిగోవులను కొని ఒక ఉత్తమునకు దానమిచ్చి తత్ఫలమును గూడ తనకు గోదానమిచ్చిన వానికీయబోవ నతడు తిరస్కరించి వాదులాడుకొను వృత్తాంతము నా నృపతికి నుడివిరి. కౌశికుండును రాజును జూచి మదీయ జపఫలము నీవు స్వీకరింపనిచో శపింతుననియెను. ముని వచనములకు భయపడి తుదకు చేయి సాచగా తన జపఫలము సర్వమును ఇక్ష్వాకునకు ముని ధారవోసి, జప విధియందు శ్రద్ధ బలము సావిత్రి తనకిచ్చినట్లు నుడివెను. నృపతి కోరిన విధమున నతని సత్కార్మ ఫలము మునియు స్వీకరించెను. ఆ వచ్చిన వారిర్వురును వారిని పరీక్షించవచ్చిన కామము క్రోధము ధర్మము యముడును గూడ అట్లే మునీంద్రుని నరేంద్రుని పరీక్షించి వారి నిష్ఠకు సంతృప్తులై, మీరిరువురును సిద్ధులయిరి. వేగమె ఉదాత్తమైన ఉత్తమ గతికి పొండని నుడివి యేగిరి. కౌశికుడు ఇక్ష్వాకుడును యోగ సమాధి నంది, దేవతలభినందించు చుండ బ్రహ్మ పదము నొందిరి.

## జ్ఞాన యోగ ప్రకారము

భీష్ముడు ధర్మజునకు చెప్పిన విధము. పూర్వము బృహస్పతి మనువునకు ఉపదేశించినది.

జ్ఞాన యోగమునకు సత్కార్మయోగ సిద్ధి కారణము. నరుడు సామాన్యముగ అనిష్టమును వదలి ఇష్టమైన దానిని చేయును. ఏవి ఒకప్పుడు సుఖములో, అవే కొంత కాలమునకు దుఃఖములగును. ఈ సత్యమునెఱిగి తాను చేసిన సత్కార్మకు ఫల మాసింపక, సుఖ దుఃఖములను వీడి కామ క్రోధాదులకు వశముగాని జ్ఞాన విశేషముచే పరమ సిద్ధి నొందును. ఇట్టి సిద్ధి నిర్గుణ నిరాకార మైనది. ఈ పరమ తత్త్వమున స్త్రీ పురుష నపుంసక భావములేని బోధము ప్రకాశించును. ఒక వెలుగు ఇతర వస్తువుల ప్రకాశింప జేయునట్లే ఈ బోధన జ్యోతి ఇంద్రియముల యందు మనస్సు నందు అజ్ఞానమును నశింప జేయును. నరుడు చేయు పనులను ఇంద్రియములు మనస్సే చేయించును. వేదోక్తములైన సాధనల చేతనే ఈ పరతత్త్వము లలవడును. వలలు పన్ని మృగమును బంధించి పట్టుకొనునట్లే విజ్ఞాన సంపద చేతనే పరతత్త్వము నొందగలరు. అజ్ఞానము లేని నిర్మలమైన మన

సునందు యెట్టి కలుషము ఉండదు. ఇంద్రియములు తమయిష్టము వచ్చినట్లు సంచరించుచో దుఃఖమే కలుగును. అవి కట్టుబడియున్నపుడే మనకు సుఖము. కావున ఆత్మను ఈ యింద్రియ దుర్వ్యాపారములనుండి రక్షింపవలయును. ఇంద్రియ గుణముల విడచినపుడె ధ్యానయోగ నిశ్చలతతో మనసు పరమ పదము నందును.

## మాయా ప్రకారము

మాయ జ్ఞానమును మఱుగు పఱచును. మాయ ఇట్టిది అని తెలిసికొనుట కష్టము. సత్వము రజస్సు తమస్సు అను మూడు గుణములు ఆత్మను చుట్టుకొని ఉండును. వానిని దరికి రాకుండ చేయవలెనన్నచో వైరాగ్య మొకటే సాధనము. వైరాగ్యమనగా ఇంద్రియ విషయములందు ఆసక్తి లేకుండుట. పూసలందు దారము ఉన్నట్లే అన్ని భూతములయందును పరమాత్మ ఉండును.

పంచ భూతములకంటె పెద్ద మనసు, మనసుకంటె బుద్ధి పెద్ద. బుద్ధి కంటె కాలము పెద్ద. కాలమునకతీతుడైన ప్రభువు జగత్ప్రభువే. ఆ తత్త్వమునకాది మధ్యాంతములు లేవు. యమ నియమముల కలవడిన చిత్తమున జ్ఞాన బుద్ధిచే దర్శనము పొందినపుడే అమేయము అనంతమైన ఆ వెలుగును జేర సాధ్యమగును.

ధర్మరాజా! బృహస్పతి మనువునకు చెప్పిన ఈ వాక్యముల అర్థము అలవరచుకొనుము అనిన భీష్ముని పలుకు లాలించి సంతుష్టుడై ధర్మజుడు కృష్ణుని మాహాత్మ్యమును వినగోరెను.

## కృష్ణుని మాహాత్మ్యము

నారదుడు వ్యాస వాల్మీకులు మున్నగు ఋషీంద్రులు చెప్పగా తాను వినినదే భీష్ముడిట్లు చెప్పెను:

కృష్ణుడు విష్ణుదేవుడు, పంచ భూతములను తన లీలా క్రియా వినోదముగ కల్పించి జలములయందు తాను శయ్యాగతుడయి యుండ నాభినుండి పద్మముదయించినది. పద్మమునుండి బ్రహ్మపుట్టెను. బ్రహ్మతన మనసు నుండి మరీచి అత్రి అంగీరసుడు పులహుడు పులస్త్యుడు క్రతువు దక్షుడు అను ఏడ్గురు నందనుల సృజించెను. అందు మరీచికి కశ్యప ప్రజాపతి కలిగెను. అతని వలన సురాసుర గరుడనాగాది జాతులు కలిగిరి. కశ్యపుని వలన సూర్యుడు అత్రివలన చంద్రుడు ఉద్భవించిరి. సూర్య చంద్రులు రాజ వంశములకు మూలములైరి. ఆ వం

శములు శాఖోపశాఖలుగ వర్ధిల్లి ధరణినేలిరి. దేశకాల విశేష వర్తనలచే వారి యందు గలుగు పరస్పర విరోధ సంగ్రామములు నిమిత్తమాత్రముగ విష్ణువు వారిని ఉపసం హరించుచుండును. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న అనిరుద్ధ నాలుగు నామములలో విష్ణువు నాలుగు రూపములు కలిగి జగదాధారుడై యుండును. ఆ మహాత్ముడు మనయెదుట నున్న కృష్ణుడే అని చూపి, మరల ధర్మజా! లీలా విగ్రహుండైన యీత నిని సామాన్య మానవునిగ చూచుట తగదు. భక్తులను కరుణించి భోగమోక్షసం పద లీయగలిగిన మహా దేవుడని నుడివెను.

## విష్ణు మంత్ర ప్రభావము - అనుస్మృతి

కృష్ణుని మాహాత్మ్యమును శ్రద్ధతో ఆలకించిన ధర్మరాజు మహాత్మా! మను జుడెవ్వని దలచి ధ్యానించిన నిరంజన స్థితి గలుగునో చెప్పుమనగా భీష్ముడు తాను నారదుని వలన వినిన విషయమిట్లు చెప్పెను.

నారదుడే ఒకప్పుడు విష్ణుదేవుని జేరి ప్రస్తుతించి యిట్లడిగెను. దేవా, మోక్ష మును గోరువారు నిన్నేరీతి తలచి ధ్యానించిన ఫలసిద్ధి పొందగలరు అని. అంతట విష్ణుదేవుడు మునీంద్రా! నన్ను ధ్యానించుటకు పరమ భక్తి నిర్మల శ్రద్ధ ఇంద్రియ నిగ్రహము, ముఖ్యసాధనలు. కల్మషము లేని వాని కవి యలవడును. నా మెచ్చిన అను స్మృతి జపించినచో కల్మషము పోవును.

ఓమ్ నమో అను శబ్దములకు దేవతా నామముచేర్చి తుదిని చతుర్థి ప్రత్య యము చేర్చుట మంత్రమగును. ఓమ్ నారాయణాయ! ఓమ్ నమశ్శివాయ వలె మంత్రములను నియమ నిష్ఠలతో జపించిన వానికి పురుషార్థ సిద్ధియగును. అనుస్మృతి మహాస్తవము కృష్ణుడు నారదునకిట్లుపదేశించెను.

అవ్యక్తుడు, శాశ్వతుడు, భక్తవత్సలుడు, పరమ పురుషుడు, అక్షయుడు, నిత్యుడు, అయిన భవ్యుని, లోకైక నాధుని, సర్వతోముఖుని భూత భవ్యుని భూత సంప్రవర్తి, అమృతు, నచ్యుతుని, అనంతుని హృషీకేశుని, సహస్ర సూర్య నిభు, హిరణ్యగర్భు, అబ్జనాభు, సత్యు నాద్యంత రహితు, భూగర్భు, ప్రభువు, భక్తగమ్యుని, అచలు, సూక్ష్మ శరణ్యు, సహస్రశీర్షు, అభయకారి సశీర్షు సనాతనుని ధ్రువుని యోగ మూర్తి లోకాతిరక్తు ఈశ్వరుని హరిని నారాయణుని, భక్తితో సేవింతును.

ఎవ్వడు జగద్గురుడో, ఎవ్వని నాభి పద్మమందు బ్రహ్మ జనించెనో, ఎవని ఆధారమున జగములు నిలుచుచున్నవో ఆ ముకుందుని నిత్యము కొలుతును. సకల

చరాచర భూతములు ధాత సహితము ప్రళయమున నశించినపుడు ఎవ్వడు నిత్య సత్యముగా నిలుచునో ఆ ప్రసన్న ముఖుని కీర్తింతును.

ఏ విశ్వాత్ముని వలన సూర్యాగ్ని చంద్రులకు తేజము గలుగునో ఆ నిరుపమాన తేజస్విని పూజింతును.

యజ్ఞ కర్తలు అగ్నులందు వేల్చి ఆరాధించు కామిత దాయి విష్ణువు నాకు ప్రసన్నుడయ్యేడు గాక

సర్వమునకు హితముగూర్చు నెలవు, యోగమునకు స్థానము, లక్ష్మీ నివాసము అయిన పంచయజ్ఞుని వరదుని పరుని కొలుతును. నిశ్చలుడు అఖిల జగద్భారము వహించు వాడు రూపరహితుడు గుణాత్మకుడు నిర్గుణుడైన వానిని పూజింతును.

వ్యక్తమున కనువగు అవ్యక్త తత్త్వమును భక్త పరాధీనుని కొలుతును.

జితేంద్రియులు జ్ఞానధ్యాన పరాయణులైన వారి జన్మ రాహిత్యమున కెవ్వరు శరణుఅగుదురో, సర్వలోకము ఎవ్వని ఒక అంశయో, పంచభూతములు ఎవ్వనికి పంచాననములై ఎవ్వడు వానియందుండునో, జ్ఞాన కర్మయోగులు ఎవ్వని దెలిసికొని మరల పుట్టువు లేని వారగుదురో ఎవ్వడు జ్ఞాన కర్మయోగులు తెలిసికొను వెల్గైన పరమాత్మయో, ఆత్మారాముడైన వాడెవ్వడో, ఎల్లయెడలను తానైన సర్వ సాక్షి యెవ్వడో, ఎవనినెఱిగిన సంసార నిమగ్నత బోవునో, కామ క్రోధ రాగద్వేష రహితులైన సిద్ధులెవ్వని గొలుచు చుందురో, నిష్కామ కర్మ నిరతులు జ్ఞానాగ్ని యందు తత్కర్మల దహించుచు నిర్ద్వంద్వులైన వారెవ్వనిని జూతురో, దురితములను పుణ్యములతో సమబుద్ధితో మోహరహితులై జూచుచు ఎవడు దేహము నందుండియు దేహము లేని వాడో అఖిల దేహములందు సముడో, అట్టి పరమాత్మను హరిని పద్మనాభుని నారాయణుని సేవింతును. దేవా! ప్రకృతి బుద్ధి అహంకారము భూతములు ఇంద్రియములు నీ ఆశ్రయమున గదా వర్తించును, సర్వమున వెలుగు ప్రసన్న మూర్తివి నీవు. ఏకత్వము అనేకత్వము అయిన నీ మహిమ నెఱుగు వారికి పరమ పదము సులభము. ఇదియని చెప్పశక్యముగాని వాడవు. అకర్తవు స్రష్టవు జగన్నాథుడవు నీనే. నా జ్ఞాన కర్మేంద్రియములు క్రమముగ పంచభూతములందు బొందజేసి ఆనందము నిమ్ము. మనసునందు అహంకారమును, అహంకారమున బుద్ధి ఒదుగునట్లు జేసి అవ్యక్తమును జేర్చి తిరిగి వ్యక్తమగు త్రిగుణముల యందు సామ్యస్థితికి పంచభూత ప్రచారంబు క్రమ్మకుండ వానిని దూరము నందుంచి "నేనే నీవు" అను జ్ఞానమును మరల జనన మృత్యువులు లేకుండ కేవలము పరమపదము నందవలయును. హరి యందు నేనును నేను హరి యందుండెదము. నారాయణాబుద్ధి ప్రాణమునిన్ను

పొందునట్లు జేయుభక్తి నాకొసగుము. పూర్వకర్మఫలములు తీరిన వెనుక సుఖింతును. వాసుదేవా ముని వంద్యా! వీడు నావాడు అను వాత్సల్యమున నన్ను జూడుము. నిన్ను నిరతము తలంతును. నన్ను మఱవకుము. పునరావృత్తి లేకుండ తనయందే తన్ను నిలిపి అనువగు బుద్ధితో భక్తుల నియమ నిష్ఠల స్వీకరించు నారాయణుని స్మరింతును.

ఈ విధమున సర్వావస్థల యందు నిర్మల భక్తితో నను స్మరించిన యతడు సకల పాపములు నశించి శాంతినొంది అవ్యయానంద పదమున భాసిల్లును. విష్ణు సంబంధము, పాపనాశనము అయిన యీ అనుస్మృతిని యజ్ఞ దాన సమయముల పఠించునతడు నూరు రెట్లు ఫలమనుభవించును. సురపితృ పూజల యందును అగ్ని హోమాదులందును, అమావాస్య పూర్ణిమ ద్వాదశి దినములం దీ అనుస్మృతి వినిన పఠించినను సద్గతి వైభవము అతి పాపికైనను కలుగును. అజ్ఞానికి జ్ఞానము కలుగజేయును. అధికఫలము నిచ్చును. కావున నేను చెప్పిన ఈ సర్వవిధము నిర్మలాత్ములకు కరుణతో ఉపదేశింపుము. నారదా నాయందు భక్తి పరాయణము కలుగు వారికి వేయి అశ్వమేధములు చేసిన ఫలమొదవును.

భీష్ముడంతట, ధర్మరాజా! కేవలము ఆ విష్ణుమూర్తియే ఈ పరమపద ప్రాప్తి నొసగు ఆత్మచింతన విషయములు అనుస్మృతి రూపమున దేవముని నారదునకు చెప్పిన దంతయు నీకు బోధించితిని. ఏకాగ్ర చిత్తుడవై నీవును దీనిని జపించి ధన్యుడవు కమ్ము అనెను.

## మోక్ష మార్గము - వార్ష్ణేయ అధ్యాత్మ విధానము

భీష్ముడు చెప్పిన విష్ణు మంత్ర ప్రభావమును అనుస్మృతి మహిమను విన్న ధర్మరాజు, సంతుష్టాంతరంగుడై తాతా! మోక్షమార్గమును తెలియజెప్పవే అని అడిగిన నతండును వార్ష్ణేయముని తన శిష్యునకు జెప్పిన అధ్యాత్మ తంత్రము నిట్లు నుడివెను.

శిష్య ప్రవరా నీవడిగినది వినుము. కాలము అనంతమైనది. సృష్టి ప్రళయములు జరుగుచునే ఉండును. పరమాత్ముడు ప్రళయమున ప్రకృతి రూపము నందుండి కల్పాదియందు సృష్టి యొనర్చును. సర్వ భూతములతో వచ్చిన మునులు ప్రళయమున అణగిపోయిన సర్వవేదములను శాస్త్రములను ఆ మహాదేవునను గ్రహమున తిరిగి పడసి అఖిల జనులకు అభ్యాసయోగ్యముగ విశదపఱచిరి. జనార్దనుని దయవలననే ఆ వేద శాస్త్రవముల రహస్యవములు మునుల కవగతములయ్యెను.

చైతన్య శక్తిని గూడిన పురుష తత్వము ప్రకృతిని ధరించును. ప్రకృతి వలన బుద్ధి దానివలన అహంకారము అందుండి జ్ఞానము కలుగును. అహంకారము వలన ఆకాశము అందుండి వాయువును తరువాత క్రమముగ తేజము (అగ్ని) జల ములుద్భూతములయినవి.

బుద్ధిని తత్త్వ సంబంధమున మహత్తు అందురు. మహత్తు మున్నగు జ్ఞాన కర్మేంద్రియములు పదియు, విషయపంచకములు అయిదు మనసు కలిసి షోడశ వికారములగును.

జ్ఞానేంద్రియములు 5 త్వక్కు-చక్షు-శ్రోత్ర-జిహ్వ-ఘ్రాణము.

కర్మేంద్రియములు 5 - వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము.

మనస్సు 1

విషయ పంచకము5 పంచభూతములు - భూమి, జలము, వాయువు, తేజము, నింగి ఇవి 16 మొత్తము. షోడశక వికారములు

ఈ అన్నియు దేహమునందు ప్రతి ఫలించి దేహియైన పరమాత్ముని లీలలై కరుణ రూపముగ ఆకర్తనుపాసించును.

నవద్వారములు, నేత్రములు 2, చెవులు2, ముక్కు 1, నోరు 1, శరీరము1, గుదము1, లింగము 1 = 9 కల పురమను దేహమునందు ఊహాతీతుడై వ్యాపించి ఈ సర్వ భావములతో పురుషోత్తముడనగా పరమాత్మ ఉండును. అతడు జరామ రణములేని అనంతుడు మితి, మేరలేని వాడు అయిన ఆ పురుషుడు, వృక్షమును మథించిన వచ్చు అగ్నివలె, దేహమునందుండును. యోగమువలననే ఆ తేజమును దర్శించి అనుభవింపనగు. అది అఖిల భూతముల యందుండునది. అవ్యక్తమైన దానినుండి సర్వ చరాచర భూతములు పుట్టి పెరిగి లయమగుచుండును.

## కాల చక్ర ప్రభావము

వ్యక్త సప్తధార, అవ్యక్త నాభము, షోడశక వికార సుపరిమండలము ధృవము, ఆత్మ అధీనమైన కాలచక్రము తిరుగు చుండును. తత్త్వ శోధనచే చరాచర లోకములు అవశానిష్టాగోచరముగా తిరుగు చుండుట చూచుకోవలయును. అంతరాత్మను సత్వ రజస్తమో గుణములు క్రమ్ముకొనును. వివేక వంతుడై జనుడు ఆ అంతరాత్మను తెలిసికొని ఆ త్రి గుణములకు వశము కారాదు. ఎంత శాంతుడైనను దేహాభిమానము లోకవ్యవహార ప్రవృత్తి యందున్నచో చెడ్డ గుణములైన కామ క్రోధ మద భయా

దులు పోవు. వేదాంతియే వానిని దూరము చేసి కొనగలడు. సంసార సుఖము ఒక అరణ్యము వంటిది. అందు తిరిగిన కొలది తిరుగవలెననియే యుండును. సత్య శౌచ శమ దమములచే ఆ మోహము నందు పడకుండ ఉండవలయును. పంచ భూతములకు ఇంద్రియములకు అన్ని లోకములకు అన్ని గుణములను ఈశ్వరు నకు అహంకారము ఉనికి పట్టు

సత్త్వ గుణములు - జ్ఞప్తి, సంప్రీతి, ప్రసన్నత

రాజసములు - క్రోధ లోభ మోహములు

తామసగుణములు - గర్వము, దుఃఖము

జ్ఞాన సంపాదనకు ఈ గుణములు ఆటంకములు. సత్త్వ గుణము వలన రాజస తామసముల నరికట్టినపుడే బోధ సంపద అవగాహనమగును. శుక్ల శోణిత ముల మిళితమే జన్మము. అహంకారము వలన చేయు వ్యావహారికములు దేహ సం బంధములై జన్మలు కలుగును. మూత్ర పురీషాదుల మధ్య గర్భమున ఇట్లే మను జుడు సంసార దుఃఖమగ్నుడగు చుండును. దీనికంతకు ఆశ కారణము. అది అణగి నపుడే ముక్తి. జ్ఞానాజ్ఞానములు బుద్ధి యెట్లున్న అట్లు కలుగును. అహంకారము తత్త్వబోధ ఎఱిగినవాడే జీవుడు. లోభమోహముల వశమై యింద్రియములు కాల వశత జేయు పనులే సంసారమున త్రోయును. అఖిల భూతములలో పురుషుడు అందు బ్రాహ్మణుడు వారిలో జ్ఞాన బోధ కలిగిన వాడే ఉత్తముడు. జ్ఞాన వంతుడై నపుడే సత్ప్రవర్తన మలవడును. ధైర్యము ఓర్పు సత్యము శౌచము, బ్రహ్మ చర్యము ఉత్తమ ధర్మములు. స్త్రీలతో పరిహాసము, వారిని కామ దృష్టితో చూచుటయు తగదు. స్త్రీ అవయవములును సామాన్య మాంస అస్థికలమయమని వివేకముతో తెలిసికొనినచో వనితా విషయమున ఆసక్తి యుండదు.

స్థూలమగు నాడులు పది, సూక్ష్మములైదు. అతి సూక్ష్మమగు హృదయము వీని నడుమనున్నది. ఇదియె ఇంద్రియ సంచారమునకు కారణమై శారీర స్థితికి హేతు వగును. హృదయ మందు లోచూపు నం దలవడి పరమాత్మను చూడగల్గిన యెడల మరియే వంకకును దృష్టిపోదు. శుక్లము యొక్క నిజస్థితినెఱిగినపుడే ఆ లోచూపు పట్టువడును. శుక్లమునకు నెలవు అన్ని అంగములును. అది సంకల్పము వలన నగును చిన్నలకు వృద్ధులకు విషయ లోలత్వమెక్కువ. మనో బలము వలన ఇంద్రియమను శుక్లము నరికట్టవలయును. విషయ సుఖముల వలన చేటే కలుగును. యమ నియ మాదుల ఆచరణవలన విషయ చాపల్యము తొలగించుట ముఖ్యము. మనోబలము

వలన ఇంద్రియములను వశము నందుంచుకొని విషయ సౌఖ్యములను దూరము చేయువానికి దేవతలు ప్రసన్నులగుదురు. చావుపుట్టుకల నుండి, ముసలి తనము నుండియు తప్పించుకొనుటకును అదే మార్గము. ఆహారము గూడ కూరలు కందమూల ఫలములు భిక్షచేసి తిని నిర్విచారముగ నుండి నిశ్చల నియమములు పాటించు జ్ఞానమువలన ఈ సిద్ధి లభ్యమగును. రజస్తమో వికారముల వలన నిద్రా దోషమున మనసు చెదరి కలలు వచ్చును. ఈ చిత్త విభ్రమమును, రజోవికారములను లెక్క చేయక మనుజుడు దుష్ప్రవర్తనకల వాడగును. యోగి అయినవాడు జ్ఞానాభ్యాసమున నిదురనుతగ్గించి తుదకు దానిని గూడ లేకుండ చేయును.

## స్వప్నాద్యవస్థల విధము

ఇంద్రియ చంచలత్వమున విషయానుభవము కలుగును. ఇంద్రియములు లీనమగునది నిద్ర. నిద్ర ఫలితము కల. దీనికి సాక్షి దేహమందున్న జీవుడే. పంచ భూతముల ప్రభావమున త్రిగుణముల వికారమున మెలకువగ నున్నపుడు గలుగు తలపులు కలయయి ఒకప్పుడవి శుభాశుభ సూచకములగును. నిద్ర సమయమున దేహము వివశత నున్నపుడును సూక్ష్మ రూపమున పురుషుడు తెలివిగ నుండును. మెలకువ నిద్ర కల అను మూడవస్థలను దూరము చేయజాలు వాడే ఆనంద స్వరూపుడు.

మోక్ష మార్గము నెఱుగుటకు వ్యక్తము అవ్యక్తము అనువానిని తెలిసికొనవలెను. వ్యక్తము మృత్యువు, అవ్యక్తము అమృతమని నారాయణుడే చెప్పినాడు. త్రిలోకములకు ఆధారము అవ్యక్తము. దాని లక్షణము ధర్మము అని వేదవాక్యము. చేసినది చేయబోవు పనుల యందుండునది ప్రవృత్తి ధర్మమయిన బ్రాహ్మము. ఇట్టి లోక వ్యవహార కార్యములయందాసక్తి లేని నివృత్తి ధర్మము మోక్ష ప్రదము. కట్టిన ధోవతి, పైన వేసికొనిన కండువా, తలకు జుట్టిన పాగ వంటివి దేహము నావరించి యున్న రాజ సతామస సత్వగుణ త్రయము. ఈ గుణములకు ఆవలనున్న వెలుగే పరబ్రహ్మము. మనో వాక్కాయములు ఏకాగ్రమైన శుచితో తపము, అహింసా బ్రాహ్మచర్యము పాటించువాడు జ్ఞాన యోగమున సర్వమును తెలిసికొన జాలును. సంసారముపై ఆశా బంధములను త్రుంచగల తపశ్శాలి ప్రకృతి వికారములను, పురుషుని అకలంకము తెలిసికొను జ్ఞాని అగును.

ఇట్లు వార్ష్ణేయ మహాముని తన శిష్యునకు జెప్పిన ఆధ్యాత్మంబను మోక్ష మార్గమును తన శిష్యునకు చెప్పిన దంతయు భీష్ముడు ధర్మజునకు బోధించెను.

## పంచశిఖుడు జనకునకు చేసిన తత్త్వోపదేశము

ఆధ్యాత్మ విధానమంతయు శ్రద్ధగా విని సంతృప్తమానసుడయి ధర్మరాజు భీష్ముని జూచి, గురుదేవా! మిథిలాధి పతియగు జనకుడు మోక్షప్రాప్తి నందెనని విందుము. ఆ భాగ్యమెట్లబ్బినదని అడుగగా భీష్ముడిట్లు నుడివెను.

ధర్మజా, నీవు వినగోరిన విషయమును వినుము. ఇందులకొక కథయు గలదు. జనకుడు మిథిలనేలు మహారాజు సత్కార్మనిరతుడు. అతనికి నూర్వురు గురు వర్యులు గలరు. వారు చేసిన బోధనలను విని అట్లే నడచుకొనుచుండెను. పంచశిఖుడను ముని వర్యుడు మహా జ్ఞాని, కపిల యను గురు భార్య వద్ద పెరిగి పెద్దవాడై సకల తత్త్వ జ్ఞాన పారగుడయి దేశాటనము సేయుచు జనకుని యాస్థానమునకు వచ్చెను. జనకుని గురువులు నూర్వురును పంచశిఖునితో వాదింపమొదలిడి పంచశిఖుని వాదనకు సమాధానము చెప్పలేని వారైరి. జనకుడు పంచశిఖముని వర్యుని విజ్ఞత గ్రహించి అతనిని తనగురువర్యునిగా స్వీకరించెను. జనకుడు ప్రార్థింపగా ఆ ముని బోధించిన మోక్ష సాధన విధానమును వినుము.

లోభ మోహములవలన నరునకు తెలివి నశించును. అది కారణముగా కోరికలుద్భవించి చెడు పనులు చేయించును. ఈ హేతువున సంభవించు ముసలితనము రోగములు శరీరమును పాడుచేయుట నరుడెఱుగడు. ధనము బంధువులు భోగములు అస్థిరములని యెఱిగినపుడే మనస్సునకు శాంతి, జన్మకు మోక్షము.

జనకునకొక సందేహము కలిగినది. వైరాగ్యము మోక్షము నిచ్చుచో విరక్తి భావము గలవాడు పరమపదమును పొందునా అని - ముని వర్యుడంతట

సంతోషము. ప్రియము, సుఖము, ఆనందము, శాంతము, సాత్త్విక భావములు. సంతాపము, విచారము, ఆలోచన, వ్యవహారము, విసువు, రాజసములు. ప్రమాదకరమైన తలపులు, కలలు, మఱపు, భ్రమ, అతిశయము, నిర్లక్ష్యము తామసములు.

ఈ గుణము లస్థిరములు వీనికి తిరుగబడు లక్షణమును కలదు. అందుచే సుఖ దుఃఖములకు జడత్వములకు లొంగక ఆత్మను అచంచలముగ నిలుపుకొనుట మోక్ష ప్రదము. ఈ మార్గము అలవడుటకు దేనియందును ఆసక్తి లేని వైరాగ్యము మూలము. పాప చింతలేని ఆత్మ తత్త్వమున ఈ గుణములను లీనమొనరించి లయ మొనర్పవలెను. ఈ గుణముల సంపర్కము వదలుకొను మనస్సు గూడ ఆత్మ తత్త్వ

మున లీనమగును. పాము కూసము నుండి విడివడు నట్లు కర్మతనకు అంటుకొనని విధమున నుండవలెను. మునివర్యుని ఈ బోధనల ప్రభావముచేతనే జనకుడు తన మిథిలా నగరము అగ్ని ప్రమాదమున కాలిపోవు నపుడు ఎట్టి చింతయు పొంద లేదు. ఈ కథను చదివి అందలి సత్యమును గ్రహించిన వానికి దుఃఖములు సమసి అమృతత్త్వము సిద్ధించును.

**ఎట్టివాడు సుఖి, మంగళవంతుడు, నిర్భయుడు కాగలడని ధర్మరాజు మరల ప్రశ్నింపగా శాంతనవుడిట్లు పచించెను.**

ధర్మజా సర్వ వర్ణముల వారికి, సర్వ ఆశ్రమములందు, శమదమ సుగుణ మ్ములు వలయును. బ్రాహ్మణునికివి అత్యావశ్యకములు. శమము అనగా కామలో భాదుల వశముగాక, వానిని అణగించుకొని శాంతిని వహించుట. దమము అనగా, ఇంద్రియములను నిగ్రహించి శుచి, సంతోషము, మంచితనము, కలిగి కోపము లేకుండ దీనత్వము పడకుండుట. ప్రమాదముల విడనాడుట, దురభిమానము, అతివాదము లేకుండుట, అఖిల భూత దయ, నిందాస్తుతులకు లోను గాకుండుట కొండెముల చెప్పకుండుట, సత్యముపలుకుట విరక్తి, సాధుజన సంగము, సత్ప్ర వర్తన గుణములు కలవాడు నిర్భయుడై ఇహపరలోక సౌఖ్య, శాంతి శుభములు పొందును.

## భోజనము వ్రత హాని అగునా

వ్రతస్థులొక సమయమున భోజనములు సేయవలసి వచ్చును. వీనివలన వ్రతహాని అగునా యని ధర్మజుడు ప్రశ్నింపగా, వేదోక్త ప్రకారము చేసిన వ్రత ప్రసా దముగా భోజనములు స్వీకరించుట వ్రత హానికాదు. వాని వివరములు వినుము.

సదోపవాసి : దినమునకు రెండు మార్లు తినినను అప్పుడప్పుడు ఉపవాసముండుట

సదా బ్రహ్మచారి : ఋతు స్నాతయగు సమయమున దక్క, భార్యా సంభోగము చేయని వాడు.

అమాంస భోజి : దేవ పితృ తిథుల పూజలకిడునవి తినువాడు.

విఘసాశనుడు : పంక్తి వారు భుజించునట్లు తానును భుజించువాడు

అమృతాశి : పరిచారకులు సేవకులు తినిన వెనుక తినువాడు

అస్వప్నుడు : పగలు నిద్రలేనివాడు.

వీరికి భోజనము వలన వ్రతహానిలేదు. వీనికంటె అధికములైనవి నరులకు దేహబాధకములే.

## ఇంద్ర ప్రహ్లాద సంవాదము – కలిమి లేములు

ధర్మజుడిట్లడిగెను. తాతా, కర్మంబుల ఫలముగ శుభాశుభములు కలుగును. దాని కర్త యెవడు. ఆ ప్రశ్న విని భీష్ముడీ యితి హాసము చెప్పెను.

దానవ నాధుడు హిరణ్యకశిపుని కుమారుడు ప్రహ్లాదుడు శమదమాది సర్వ సద్గుణ పరాయణుడు నారాయణ ధ్యాన నిరతుడు. ఇంద్రుడొకపరి యతనిని జూచి ప్రహ్లాదా, నీవు దైత్యేంద్రుని తనయుడవు. నీ సంపదగూర్చి యాలోచింపవు. శత్రువులు నీరాజ్యమును లోబరచుకొనుట కూడ తలంపవేమి? ప్రహ్లాదుడామాటలు విని మహేంద్రా! మన కలిమి లేములకు మనము కర్తలము కాము. అవి విధి నిర్ణయములు. ఒకప్పుడు వాటంతటఅవే వచ్చును. మనము ప్రయత్నము చేసి తెచ్చుకొనినను అవి నిలువవు. అట్లే శత్రువుల వలన నష్టముగాని మిత్రుల వలన లాభముగాని వాని స్వభావము వలన అవి వచ్చును పోవును. గాన అవి అస్థిరములే. విధి కృతములైన యీ పనులకు తాను కర్త యనుకొనుట అహంకారము, సిద్ధించునని సుఖ దుఃఖముల నుండి మనసును తొలగించుటేగొప్పతనము అందుచే నేనే బంధములను పెట్టుకొనలేదు. శాంతుడనై దాంతుడనై నిశ్చింతతో నుందుననగా ఇంద్రుడు ప్రహ్లాదా నీవు పూజ్యుడవు నీకీ శాంతత ఎట్లు వచ్చినదనగా, శాంతికి మూలము సత్ప్రవర్తన, దయ, లోని ఆత్మతత్త్వమెఱుగుటయని నుడివిన ప్రహ్లాదుని మాటలు విని ఇంద్రుడు సంతుష్ట మానసుడై నమస్కరించి వెడలెను.

## లక్ష్మీ భ్రంశము – ఇంద్ర బలి సంవాదము

ధర్మజుడీ ప్రశ్ననడుగగా మరల భీష్ముడిట్లు చెప్పెను.

బలి చక్రవర్తి మహా సంపదకలవాడు కదా. ఆతడు కనబడడేమి అని ఇంద్రుడు బ్రహ్మకడకేగి అడుగగా, బ్రహ్మ ఇంద్రా! నీవు అసత్యమాడకు. నీ తలపులనేనెఱుగుదును. అయినను చెప్పెదను. బలి యిప్పుడు ఒంటె, గాడిద, పశువు, గుర్రము ఏదో అయి ఉండును. అని చెప్పెను. ఇంద్రుడును అట్టివాని నణగించు టెందులకని నుడివి, వెదకి వెదకి ఎట్టకేలకు ఒకగాడిద రూపమునున్న బలిని చూచి యిట్లనెను.

బలి రాజేంద్రా! ఏమిది ఆశ్చర్యము! చక్రవర్తివి, రాజ భోగములనుభవించినవాడవు, ఇట్లుంటివి, ఊకపొట్టు తినుచున్నావు. నీ పూర్వపు సంపద ఏమయినది.

జ్ఞాపకమున్నదా. అనుట విని బలి, అవును ఇట్లుంటివిని నీకు నా సంపద, వైభవము కానరాదు. అది రహస్యముగనున్నది. కావలసినప్పుడు వచ్చును. అయినను నీవి టకు ఎందులకు వచ్చితివి నీ ఆధిపత్యము చూపుటకా, నీ దారిని నీవేగుము. మరొక మాటను వినుము. కలిమి లేమి, చావు బ్రతుకు, దుఃఖము సుఖము కలుగుచునే ఉండును. నా కన్నియు సమమే. వీరు వారనక విధి వీనిని సమదృష్టితో నిర్ణయించును. ఈ హెచ్చుతగ్గులకొరకు నేను బాధపడను. నా ప్రస్తుత రూపము చూచి ఇంద్రా నీవు అహంకృతిచే త్రుళ్ళిపడుచున్నావు. నీకును బాధలు తప్పవు. అయిన నీవెన్ని అనినను నీ యెడల నాకు కోపములేదు. నీ గర్వము మానుము. నీ వజ్రాయుధ ము నాకు లెక్కలేదు. విధి లిఖించినదానికి తిరుగు లేదనునంతలో -

ఒక సుందర రూప యగు స్త్రీ యొకతె బలి దేహము నుండి మహా తేజస్సుతో బయటకు వచ్చినది. ఆమె శ్రీ, భూతి, లక్ష్మి అను పేరులు గలది. ఆమె ఎవ్వరో ఏమో యెవ్వరును ఎఱుగరు. నీవు బలిని ఎందులకు విడచి వచ్చితివి అని యింద్రు డడుగగా ఆమె తన సమాధానము నిట్లు చెప్పెను.

ఇంద్రా నా మాటలు శ్రద్ధగా వినుము. సత్యము ధర్మము, దమము దానము పరాక్రమము ఇవి నా నెలవులు. ఇవి యున్నచోటనే నేనుందును. బలి మున్ను సద్గు ణములు సచ్చారిత్రముకల వాడే. బ్రాహ్మణులపై అసూయయే కాక, అవినీతిని బడినాడు. ఈ కారణమున నేనతనిని విడచుచున్నాను. నేను నీ యందు నిలచెదను. నేను నుడివిన సద్గుణములను నీవు మఱవక సత్ప్రవర్తనతో నుండుము. అని లక్ష్మి వచించినది. తన నుండి లక్ష్మి తొలగి పోయి నంతనే బలి తేజస్సుడిగి, ఇంద్రా నీవు గర్వింపకు. దేవదానవ యుద్ధమున నీపని పట్టెదను అని దక్షిణమునకు పోయెను. అసలే శూన్యుడవయి యున్న నీపైని నా వజ్రాయుధము ప్రయోగింపనులే అని చెప్పి ఇంద్రుడును తన దేవలోకమునకు ఉత్తరమునకేగెను.

## ఇంద్రనముచి సంవాదము

ధర్మజునకు భీష్ముడు నముచిని గూర్చి గూడ ఈ సందర్భముననొక యితి హాసమును తెల్పెను.

నముచి యను దానవముఖ్యుడు తన సంపదనంతయు పోగొట్టుకొని ఏకా ంతమున నుండగా ఇంద్రుడచటికేగి, ఏమి దానవముఖ్యా, సిరిసంపదలు నశించి పరిజనములు కూడలేక ఇట్లు దీనుడవై యుంటివి. ఎంత బాధ పడుచున్నావో అనగా నముచి, ఇంద్రా మంచిగాని చెడుగాని ఏదైనను మనము కావలయుననిన వచ్చునా

వలదనిన పోవునా - ఈ మంచి, చెడ్డ అఖిల భూత నాధుని కల్పనలు. ఎంత వీరుడు ప్రజ్ఞావంతుడైనను రానిదానిని తెచ్చుకొనలేడు. కావున ఉన్నను లేకపోయినను వచ్చి నను రాకపోయినను, సుఖమునకు ఉబ్బిపోవుట, దుఃఖమునకు క్రుంగిపోవుట ఆర్యు డెఱుగడు అని తనమనసున ఉన్నది నుడివిన నముచి మాటలు విని ఇంద్రుడు తృప్తి పడి తన నెలవునకేగెను.

## దుర్దశ యందెట్లుండవలెను

ధర్మరాజునకు ఈ విషయమై భీష్ముడిట్లు చెప్పెను. ధర్మజా, దుర్దశ ప్రాప్తిం చినపుడు నరుడు ధైర్యము వహించు టొక్కటియే మార్గము. ధైర్యము బలము నొస గును. దుఃఖమునందు తొట్రుపడనీయదు. ధైర్యము వలన ఆరోగ్యము లక్ష్మి కీర్తియు కూడ కలుగును.

## ఇంద్ర బలి సంవాదము - కాల ప్రభావము

కాలము కల్పించు సద్గతి దుర్గతులను గూర్చి భీష్ముడు మరల నొకయితి హాసము నుడివెను.

దేవదానవ యుద్ధము జరిగినది. నారాయణుని అనుగ్రహమున దేవతలు గెలిచిరి, దానవులోడిరి. ఇంద్రుడు విజయోత్సాహమున సురగంధర్వాది ముఖ్యులు చుట్టును కొలువ ఐరావతము నెక్కి త్రిలోకముల దిరుగుచు దక్షిణ సముద్ర తీరమున ఒక పర్వత గుహాయందున్న బలిని జూచి యిట్లనెను. ''ఏమయ్యా బలీ! నీకిపుడు రాజ్యము లేని హీనస్థితి యందుండి గూడ విజయ వైభవముతో వచ్చిన నన్నేల లెక్క చేయక నిర్లక్ష్యముగా నున్నావు. నీవు వీరుడవనియో తపశ్శాలివనియో గర్వించు చున్నట్లున్నదే ఏమందువు.''

అంత బలి, ఇంద్రా! నీ మాత్సర్యపు మాటలు చాలు. నీ శక్తి నాకు తెలియదా. దైవ విధి యెట్లున్న అట్లగుదురు. పూర్వము నీవును హీనుడవు, దీనుడవే. నా దైన్యము నే చేసినది గాదు. నన్ను నీవు బాధ పెట్టను లేవు. ఇవి దైవాధీనములు. ధైర్యముచే ఈ సుఖ దుఃఖములణచి కొనుటయే వివేకము. ఎల్లపుడు ఒకే రీతి నుం డలేము. బంధు మిత్రులు చేసిన సహాయము ఎల్లకాలము నిలువదు. నీవు గెలుచుట నేనోడుట కాల ప్రభావము. నీ గర్వపు మాటలు కట్టిపెట్టు. మనమధ్య శత్రుత్వ మేల. ఇది నాకు విక్రమ సమయము కాదు. నాకు నీపయి కోపమును లేదు. సమ యము వచ్చినపుడు నీవు నీ పరిజనము నాముందు నిలువనేలేరు. ఇప్పుడు నీ సం

పద చూచుకొని మిట్టిపడు చుంటివి. చేటు కాలము నీకును దగ్గఱ పడుచున్నదిలే. ఎంతమంది ఇంద్రులేకాదు, బ్రహ్మలు గూడ గతించిరో! ఎన్ని వ్రతములు క్రతువులైనను కాల వశమున సంభవించు గతులను అడ్డలేవు.

ఈ మాటలకు దేవేంద్రుని సంరంభము కొంత తగ్గినది. వినయమున బలిని జూచి ఏమయ్యా! నీ మనస్సు ఇంతగా ధైర్య వివేక శాంతములు గలిగి నిర్వికారముగా నుండుటకు ఎట్టి నిష్ఠ పాటించితివి. నేను తెలియగోరు చుంటిని అనగా బలి ఓ ఇంద్రా! ధైర్య వివేకాదులు నేనెచ్చటి నుండియైన సంపాదించి తెచ్చితినా ఏమి. కాల ప్రభావ మెఱిగి యిట్లుంటిని. లోభ క్రోధ భయములున్నవాడు కాల వృత్తి నెఱుగ లేడు. పురుషుడు తనకడనున్న కళలు కర్రలు మొదలుగునవి అమ్ముకొని జీవించుచో కాలమునకు వశుడు కావలసినదే. కలిమి లేముల స్వభావము నెఱిగి ఉత్తమ తపశ్శాలి యైనవాడు కాలగతి నెఱుగ గలడు. అట్టి వానికే చిత్త శాంతి లభించును. ఆత్మ మయమైన బలము కలుగును. ఇంద్రుడు బలినుడివిన తత్త్వ వాక్యములకు ఆశ్చర్యము నంది ఓ బలిరాజా నీవు కాల ప్రభావము పూర్తిగ నెఱిగిన ధన్యుడవు. త్రిగుణములకు అతీతుడవు ఆదర్శ పురుషుడవు. నీ దీనదశ ఇక తొలగిపోవును గాక. నీవు కోరిన మేలును బొంది పరమసుఖంబులనుభవింపుము. అని నుడివి దివికేగెను.



# మహాభారత ధర్మశాస్త్రము

## శాంతిపర్వము - పంచమాశ్వాసము

### పురుషుడు తన సహజ రూపుడై యెట్లుండగలడు

ఎందువలన అతని రూపము పొడగును అని ధర్మజుడడుగగా భీష్ముడొక కథ నిట్లు నుడివెను.

నారదుడు లోక సంచార మొనర్చుచు ఒకనాడు మందాకిని నదిని జేరి స్నాన మాడి ఉండగా, ఇంద్రుండును ఆ సమయములో అచ్చట స్నాన మొనర్చెను. ఇరువురును కుశల ప్రశ్నాదికముల నడపుచుండ ఆకసము నుండి ఆకస్మికముగ ఒక నిరుపమాన సౌందర్యవతియగు ఒక వనిత విమానములో దిగగా ఇంద్రుడాశ్చర్య పడి నీవెవ్వరవు దేవీ అని అడిగెను. అంత నా స్త్రీ నేను కమలము నుండి పుట్టిన దానను. లక్ష్మి, భూతి, శ్రీ అని నా పేర్లు, మున్ను స్వాహ స్వధా మతి శ్రద్ధ ధృతి స్మృతి మేధల నామములతో దనుజులకడ నుంటిని. దనుజులను మెచ్చక ఇపుడు ఇంద్రా నీకడ వసింప వచ్చితిని. అనగా ఇంద్రుడు మరల వారిని నీవెందులకిపుడు మెచ్చక పోతివని ప్రశ్నింపగా ఆమె-

''ఇంద్రా! వినుము దానము, వేదపఠనము, అతిథి మర్యాద మున్నగు సుగుణములుండుటచే మొదట నేను దానవుల కడనుండి, ఇప్పుడు వారు వానిని మరచి గర్వము కలవారగుటచే వారిని విడచి, సత్యధర్మ పరుడవగు నీకడ వసియింప వచ్చితిని. ఇంకను వినుము. గురు భక్తి, దేవతాపూజ, పెద్దలసేవ, సత్యవచనము. దానము పరధనము పరస్త్రీని కోరని వారు, బ్రాహ్మణ ప్రియులు పగలు నిద్ర పోనివారు, అతిథులు తినిన తర్వాత తినువారు. ఈ గుణములు కలవారు నేను మెచ్చు జనులు. అచట నేనుందును. ధర్మమును విడచి, కామ క్రోధముల కలవాటుపడి, బలిగాని బిచ్చముగాని ఈయని వానిని, పరుష వాక్కులు క్రూర చరితులు అయిన వారిని నేను మెచ్చను. అచ్చట నేనుండను. బుద్ధి ధైర్యము నీతి శ్రద్ధ, యోగ్యత, ఓర్పు, శాంతి ఈ ఏడుగురు నాకు వృద్ధి కలిగించువారు. ఎనిమిదవ దేవత కష్టాత్ములైన దానవులందు విడచితిని. నాకు తృప్తి కలిగించు వారుగాన దేవలోక వాసులకడ నేనుందును.'' అని నుడివెను. ఆ మాటలనువిని లక్ష్మీ దేవి కృపకు సంతసించి దేవతలు దుందుభులు మ్రోయించి పుష్ప వర్షము గురిసి ఇంద్రునభినందించిరి.

ఈ కథ విని చదివిన వారికి లక్ష్మి సకల సంపదలనొసగును.

## ముక్తి దొరకు ఆచారము ప్రవర్తన

ఇవి యెట్లుండవలెనని ధర్మజుడడుగగా భీష్ముడు మఱియొక ఇతిహాసము నిట్లు నుడివెను. జైగీషవ్యుడను ముని ఒక దేవలునకు (నంబి) చెప్పిన విషయము.

దేవలా! వినుము. శాంతి మంతులైన సజ్జనుల జీవన విధానమే నేను మనసార ఆదరింతును. ఒకరు పొగడిన సంతోషము పొందకుండుట, కొట్టినను అప్రియము కోపమును పొందకుండుట, వివేకవంతుల గుణములు. కోరిన పని అయినను కాక పోయినను విచారించక, వచ్చిన దానితో తృప్తి పడుట సద్గుణములు. దురభిమానము, కోపము గర్వము అతిశయము. ఇవి ఉండరాని గుణములు. సద్గుణుడు అవమాన మయినను, అమృతమిచ్చినను రెండును సమానముగ జూచును. ఇతడు బంధువు, అతడు పరాయి వాడు అను భావము ఉండదు. కోరికలు ఉండవు. ఇంద్రియ మోహమును గెల్చి హృదయమునందు సుఖ శాంతులతో నుండును. దేవతలందు కూడ ఈ సద్గుణములు అరుదు.

## అఖిల జన ప్రియుడు

శాంతనవుడు నుడివిన యితిహాసములన్నియు విని ముదమందిన ధర్మరాజు మరల ఆ ఆచార్య వర్యుని జూచి తాతా! నీవెన్నియో యితిహాసములు మానవ వైదిక ధర్మ ప్రతిపాదకములైన విషయములు బోధించితివి. ఇవి యెన్నెన్నియో విధముల నున్నవి. అఖిలజన ప్రియుడు సకల జీవసమ్మతుడైన వాడెట్టివాడో వినగోరెదననగా భీష్ముడు -

ధర్మజా! ఉగ్రసేనుడను రాజు ఒకనాడు శ్రీకృష్ణుని జూచి మహాత్మా! నారద మహర్షిని ఎల్లరును ఉత్తమోత్తమునిగా వర్ణింతురు. ఏ కారణము చేతనని అడిగెను. అంత శ్రీకృష్ణుడు ఔను రాజా, నారదుడు, అంతటివాడు అగుటకు కారణమాతని సత్ప్రవర్తన సదాచారము. దేవఋషినని అతిశయముగాని అహంకారముగాని లేవు. గర్వము లేదు. మంచి చెడ్డలు సమదృష్టితో భావించును. ఆతని జననము, తపము బుద్ధి వినయము తేజము జగమెల్లరెఱుదురు. మధుర భాషణుడు- మూర్ఖత దైన్యము క్రోధము అసూయలేవు. ధైర్యవంతుడు, అవమానమనునది యెఱుగడు. ఇన్ని సద్గుణముల ప్రోవైన నారదుడు సర్వ ప్రియుడు సర్వ సంస్తుత్యుడగుట ఆశ్చర్యముగాదు.

## కాలమానము

కాలమానము - యుగములు - భూతసంఘములు వీని విభాగములను గూర్చి ధర్మజుడడుగగా, పూర్వమొకసారి శుకునకు వేదవ్యాస మహర్షి జెప్పిన విషయములను శ్రీకృష్ణుడు వివరముగ నిట్లు చెప్పెను.

కాలమునకు భూతములకు ఆలంబనమైన మహామహిమ కర్మాత్మకముగ కన్పడినను. అది కర్మములతో సంబంధములేనిదే. అదెట్టిదో ఊహించుకోవలసినదే. కాలమానములు వినుము.

నిమేషము = కనురెప్పపాటు కాలము, 18 నిమిషములు = కాష్ఠ, 30 కాష్ఠలు = కళ, 360 కళలు = ముహూర్తము, = దినము. (పగలు రాత్రి), 30 ముహూర్తములు = మాసము (నెల), 2 మాసములు = ఋతువు, 6 ఋతువులు = ఒక సంవత్సరము, 3 ఋతువులు = అయనము, 6 మాసములు = ఉత్తరాయనము (అహస్సు), 6 మాసములు = దక్షిణాయనము (రాత్రి), ఉత్తరాయనమున పగలు అని అగ్ని యనియు శుక్లము అని సుగతి ప్రదమని దక్షిణాయన మన రాత్రి అని పొగ అనియు కృష్ణము అని అగతి ప్రదమని ప్రతీతి. నరులకు నెలలు ఏళ్ళు అనునవి పితరులకు దేవతలకు దినముల క్రిందనే లెక్క.

యుగములు నాలుగు - దేవతలకు 12వేల ఏండ్లలో కృతత్రేతా ద్వాపర కలి యుగములు నడచును. ఈ నాలుగు యుగములు ఒక మహా యుగము.

| | | | |
|---|---|---|---|
| కృతయుగము | : | 17,28,000 | మనుష్య వత్సరములు |
| త్రేతాయుగము | : | 12,96,000 | ,, |
| ద్వాపర యుగము | : | 8,64,000 | ,, |
| కలియుగము | : | 4,32,000 | ,, |
| మొత్తము | | 43,20,000 | |

వీనిలో సంధ్యలు సంధ్యాంశములు నని కొంతకాలము చెల్లును.

కృత యుగమున తపము, త్రేతాయుగమున భవ్య జ్ఞాన స్ఫురణము, ద్వాపరయుగమున యజనము, కలియుగమున దోషాదరము మనుజులకు ప్రాధాన్యత నిచ్చును. త్రేతా యుగము నుండి న్యాయము ధర్మము ఆయువు దేహబలము క్రమముగా తగ్గును.

పై జెప్పిన నాలుగు యుగములు ఒక మహా యుగమగును. వేయి మహాయు

గములు బ్రహ్మకు, ఒక పగలు, వేయి మహా యుగముల బ్రహ్మకు ఒకరాత్రి. అతడు రాత్రివేళ నిద్రించును. అది ప్రళయము. ఉదయమగు సరికి మేల్కొని భూత జాలమును సృష్టించును.

## సృష్టి

బ్రహ్మము తేజోమయమైనది. దాని సారము విశ్వము. శుక్ల వర్ణమగు పగలున బహువిధమైన భూతసృష్టి జరుగును. ఆ మహిమ వలన అహస్సు (పగలు) మనస్సు గగనము వాయువు నీరు అగ్ని భూమి అను ఏడు రూపములు ఒకదానికొకటి మూలములై యుండును. వాని గుణము ఆకాశమునకు శబ్దము, వాయువునకు స్పర్శ, అగ్నికి రూపము, నీటికి రసము, భూమికి గంధము (వాసనయు) ఈ యేడు రూపములను పురుషులని అందురు. తేజో రూపమైన బ్రహ్మమే పురుషుడు. స్రష్ట ప్రజాపతి. అతడు దివ్యమైన తన యంతరంగమున దలచి, నరులను దేవతలను కిన్నరాది ఖచరులను గిరులు నదులు వనములు సముద్రముల నన్నిటిని అవి చేయుపనులను కల్పించును.

ఈవిధముగ నున్న లోకములందు, కర్మిష్ఠులు చేయు కార్యములకు ఫలితము పౌరుషమువలన వచ్చునని, దైవ నిర్ణయమువలన కాదు. భూతము స్వభావము వలన నని వేర్వేరుగ చెప్పుదురు.

సత్త్వగుణము కలవారు శమదమ సంపన్నులయి చేయు తపము శుభకరమై యుండు నందురు. తపమునకు బలము వేదాధ్యయనము.

బ్రహ్మము రెండు విధములు. శబ్దము పరము త్రిగుణాతీతుడై వానిని ధ్యానించు వానికి పరబ్రహ్మ పదములు లభించును. ఆ పరబ్రహ్మము తానేమి చేయని వానియట్లే ప్రకృతి స్వభావము వలన సకల భూతములను సృష్టించి లయమొనర్చును.

## ప్రళయము

స్థావర జంగమములు భూమిలో గలియును. భూమి జలము లందు మునిగి పోవును. జలములను అగ్ని మ్రింగును. అగ్నిని వాయువు ఆ వాయువును ఆకసము మ్రింగివేయును. ఆకసమును మనసు హరించును. ఆ మనసును బ్రహ్మ విలీనము చేసికొనును. ఆ బ్రహ్మము రేబగల యందు యీ విధముగ విలయము సృష్టి తన క్రీడా ప్రాయముగ కల్పించు చుండును.

## బ్రాహ్మణులాచరింపవలసినవి

ఉపనయనము కాగానే గురువునొద్ద వేద శాస్త్రములు చదివి వారి అనుజ్ఞచే

గృహస్థ ధర్మమును పూని దైవ పితృ ఋషిగణంబుల ఋణము తీర్చి తరువాత వాన ప్రస్థ తురీయాశ్రమముల చేకొన వలయును. యజ్ఞము చేయించుట, వేదములు చదువుట చదివించుట, ధనము దానము చేయుట, తీసికొనుట ఈ ఆరును బ్రాహ్మణునకు అర్హములయిన విధులు.

## దాన గుణ ప్రాధాన్యము

దానము చేయుట సర్వవర్ణములకు సర్వ జనులకు ఆచరణీయమైన ఉత్తమ ధర్మము. ప్రతి వస్తువు దానమున కర్హమే కాశ్యుడను రాజు తన ప్రాణములిచ్చి ఒక బ్రాహ్మణుని ప్రాణములు కాపాడెను. శిబిచక్రవర్తి తన శరీరాంగములనే కోసి దానమిచ్చెను.

కాశీపతి ప్రతర్దనుడు తన నేత్రములను ఒక బ్రాహ్మణునకిచ్చి దృష్టి కల్గించెను. విదేహుడు పరశురాముడు గయుడు ఒక్కొక్కతరి సకల భూమిని బ్రాహ్మణులకిచ్చిరి. పాంచాల దేశీయుడు బ్రహ్మదత్తుడు శంఖనిధి విప్రులకిచ్చెను.

పెక్కు మంది ధనధాన్య ప్రాణాదులు అర్హులగు బ్రాహ్మణులకొసగిరి.

యోగ ప్రకారము దానము వేద పఠనము యజ్ఞము పాపములను నశింప జేయుచుపాపరహితుడైన వానికి ఇంద్రియ నిగ్రహము, కామ క్రోధాదులపై జయము లభించును. అట్టి వాడు ధర్మవిధి నెఱిగి అన్నిటిని సమముగా జూచును. వానికి నాశనము లేదు. వేదపండితుడైనను నాస్తికుడైనను వానికి సమానమే. కర్మములయందు ధర్మాధర్మములు నిజస్థితి తెలియుటకు శాస్త్రజ్ఞానము నెఱుగవలయును. ధర్మజ్ఞానము నెఱుగుటకు నియతమైన ఆత్మ వాఙ్మనములు ఆవశ్యకములు. జీవన రథమును, యోగ మార్గమున త్యాగమను పగ్గములను బట్టి జ్ఞానమను సారథి నడిపించినపుడే నరుడు యోగసిద్ధి నంది సంసారాంభోధి దాటి అక్షర మగు పదమునందును.

## సాంఖ్యము

కన్ను ముక్కు మున్నగు జ్ఞానేంద్రియములను కాలు సేతుల వంటి కర్మేంద్రియములను విషయ సౌఖ్యములగు కామ భోగముల మీదకు పోనీక స్థిర మనస్సుతో వానిని ఆత్మ చింతన వైపునకు ద్రిప్పుట సాంఖ్యమతము. సాంఖ్యము యోగము రెండును ఒకే స్వభావము కలపద్ధతులు. సంసారము నిస్సారమైనది. దానిపై మమతను పెంచుకొనరాదు. యోగ సాంఖ్యపరులకిరువురకును సమానమగు ధర్మమిది.

## భూతములందు తారతమ్యములు

స్థిరముగానుండు స్థావరముల కన్న తిరుగుచుండు జంగమములు మేలు. ఈ జంగమములు జీవాండముల వలన జనించును. రెండుగాని ఎక్కువగాని పాదములు

గల వీనియందు మానవ జన్మ ముత్తమము. ఇందు జాతి ధర్మము నాచరించువారు, వారికన్న విప్రులు, వారిని మించి వేద జ్ఞులు వారికన్న ప్రవచనము సేయ జాలు వారు, వారియందు ఆత్మ జ్ఞానము కలవారలుత్తములు. వారు సర్వ ధర్మములెరిగిన వారు. సత్యమగు సంకల్పముగలవారయి అధి భూతమగు దైవమును తెలిసికొనిన వారు. వారే బ్రాహ్మణులు ఎల్లరికిని నమస్కారార్హులు పూజ్యులు. దేవతలును వారిని గౌరవింతురు. వారివలననే జగద్వర్తన నడచుచున్నది. బ్రాహ్మణుల నడవడిక నిర్మల జ్ఞానము కలదియై నియమనిష్ఠలు కల కర్మాచరణ యుతమై యుండవలయు. జీవ న ఫలము అందేయున్నది. అఖిల బ్రహ్మాండమును సృష్టించు మహాశక్తి సన్నిధి లభింపగల శుభము తపస్సు వలననే లభించును. ధర్మము లన్నిటి యందును మైత్రి అతి ఉత్తమమైనది. దాని వలన వివేకము కలుగగలదు.

## పరబ్రహ్మ ప్రాప్తి సాధనము, శుకునకు వ్యాసుని ఉపదేశము

మహర్షీ! యజ్ఞము, జ్ఞానము యోగము సాంఖ్యము వలననే గదా బ్రహ్మ పదము జేరవచ్చునని శుకుడు అడుగగా వ్యాసుడిట్లు నుడివెను. శుకుని తండ్రియే వ్యాసుడు.

అవును. నీవు చెప్పినది మేలే. తపము వలనను ఇంద్రియ నిగ్రహము వలనను నను రాగ లోభముల నణచిన యపుడును బ్రహ్మమును పొందగలుగును. దీనియందు మరియొక విశేషమున్నది. చూచుట వినుట తినుట చేయు ఇంద్రియములు పర బ్రహ్మ ప్రాప్తికి అడ్డు దగులును. మనసుచే వానిని కట్టడి బెట్టినపుడే సిద్ధి లభించును. విప్రుడని నీచకులజుడనియు, గోవు ఏనుగు కుక్క వీనియందున భేద భావము లేక సమానముగా చూచువానికే ఈశ్వర దర్శనములభించును. అన్ని భూతముల యందు ఆ ప్రభువు వసించుచుండునను సత్యమెఱుగవలయును. ఆత్మకు క్షరము అక్షర మను రెండు మూర్తులున్నవి. అన్ని భూతములకు పూర్వము గలది మృతము, దినమున నుండునది అమృతమని తెలియువాడే బుధుడు. నవద్వార పురమను మనదేహమున వెలుగు చుండు హంసుడు అక్షరుడు అనబడును. వానిని పరమ యోగులే సత్క్రియా భ్యాసమువలన వైరాగ్యము వలనను కాంచుదురు.

యోగులకు కామము క్రోధము భయము నిద్ర లోభము పనికిరావు. వానిని విడువ వలయును. వీనిని నిర్జించుటకు దృఢమైన సంకల్ప వివేకములు కావలెను. మనస్సును ముందు కట్టడి చేసినచో ఆ అయిదు దుర్గుణములు అణగును. మనస్సు సుస్థిరమయి ఏకాగ్రత కల్గుటకు జనసమ్మర్దములేని ఏకాంత వన గుహావాసము మంచిది. ఇట్టి ప్రవర్తనమందు మంచిచెడ్డలు సుఖదుఃఖములు ఱాయి బంగారమును సమముగా చూడగల్గుటయే పరబ్రహ్మ ప్రాప్తి సాధనము.

## కర్మాచరణము, కర్మపరిత్యాగము

వ్యాసుడు నుడివిన పైయోగ సాధనములన్నియు విని శుకుడిట్లు ప్రశ్నించెను. మునీంద్రా వేదములు కర్మాచరణము, కర్మ పరిత్యాగము రెండిటిని బోధించెను. ఇవి పరస్పర విరుద్ధములు గదా. దేనివలన ఎట్టి ఫలితము వచ్చునో విన దలతు ననియె. వ్యాసుడంతట పుత్రుని జూచి

కర్మము ప్రవృత్తి బంధనము. దీనియందాదరణ కలవారు జననమరణములు పొందుచునే ఉందురు. నిష్కర్మ మోక్ష ప్రదము పరమానంద ప్రదము. చిత్తశుద్ధి కలిగి చేసినను కర్మ అవిద్యయే. కర్మత్యాగము విద్య, ధర్మము మోక్షకారణము. కర్మ ఫలము స్వల్పము, కర్మత్యాగ విద్య అఖండ సుఖంబు. అజ్ఞానమును నశింపజేయు బోధానందము.

## నైష్కర్మ విద్య - ఆశ్రమ ధర్మములు

కర్మబంధనము లేని విద్య బ్రహ్మ పద సాధకమని తండ్రి నుడువగా శుకుడు అట్టి విద్యనెట్లు పొందవచ్చును? అను ప్రశ్నకు వ్యాసుడిట్లు చెప్పెను.

బ్రహ్మ చర్యముతో తపము, కాననమున వాన ప్రస్థముననున్న వారితో మైత్రి పర్ణశాలల నివాసము. భిక్షాభోజనము, శుభాశుభములు సమముగా చూచుట ఇది అధ్యాత్మ విద్య. కర్మమును మానరాదని వేద విదులందురు. మఱి ఆ విషయమో! అను ప్రశ్నకు వ్యాసుడు, కుమారా కర్మమును విడువకుండుట విడచుట కూడ కలదు. అది యెట్లన బ్రహ్మచారి గృహస్థ వాన ప్రస్థులు వారి వారి కర్మ నిష్ఠనను సరింప వలసినదే. బ్రహ్మచారి, గురుపరిచర్య సేయుచు శయనించు వేళ పాదముల నొత్తవలయు. గురువునకు వీలైన సమయమెఱిగి వేదాభ్యాసముసేయవలయు. తన శక్తితో గురు దక్షిణ నొసగి వివాహమై గృహస్థాశ్రమమున ( యజ్ఞ యాగాదులు) అతిథి బంధు ప్రీతిగ ప్రవర్తింప వలయును. వాన ప్రస్థమందు అగ్ని వ్రతముల విడు వక ఫలమూలము లాహారముగ భిక్షుపూజ సలుపుట ధర్మములు. ఆయువునందీ యాశ్రమము లొకొక్కపాలు. నాల్గవ పాలు శాంత చిత్తముతో సన్యాసము స్వీకరిం పవలయు.

శిరోముండనము, నివాసము లేకుండుట, ఆత్మను ధ్యానాగ్ని యందు పరి శుద్ధమొనర్చుట, మైత్రీ విరోధములు లేక, కామ క్రోధ శోకములు విడచి కపాలమున భిక్షనందుచు, ఎందయినను శయనించుచు వర్తించు వాడు నిజమైన బ్రహ్మవిద్యగల బ్రాహ్మణుడని దేవతలు వినుతింతురు. తక్కు వారికి అతని వలన భయము గాని

వారి వలన నతనికి భయము ఉండరాదు. సత్యాహింసలు భూత దయ సన్యాసి ధర్మములు ఆతడే జగములకు శరణ్యము. అతని మనసు అమృతముతో నిండినట్లుండును సర్వాతీతు డతడే.

## అంతర్యాగ విధానము - శుకునకు వ్యాసుని బోధ

హృదయమునందున్న మహా తేజమునందే తన ప్రాణములను హోమము సేయవలయు. అట్టి యాజియే పాప రహితుడై వర్ధిల్లును. అవియే ఆత్మ తీర్థ సేతువులు. మరియొక చోటునకేగనక్కరలేదు. అతడు శాశ్వత యోగ సమేతుడు. ఆరు ఋతువులు పండ్రెండు మాసములు కలిగి నడచు కాలమునకాతడు అతీతుడు. ఇంద్రియ నిగ్రహమను శిక్షతో నతడు వర్తించుచు అనంత పద సిద్ధినందును.

కుమారా నీకు వేదాంత శాస్త్ర సారమును తెల్పితిని. నీవీ విద్య నాదరించి అనుసరింపగల తపస్వికి తెలుపుము. మరియును వినుము. తాబేలు తన అవయవములను తెఱచి ముడుచుకొనునటుల, ఈశ్వరుడు సర్వభూతముల సృష్టించి తనలో లయమొనర్చు చుండును. మరల మరల సృష్టిస్థితిలయములు జరుగుచునే యుండును.

పంచ భూతముల వలన గలుగు శబ్దాది విషయములందు మోహము నణగించు కొనుటకు శమము సాధనము. త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ఆఘ్రాణమ్ములైదు ఇంద్రియములు. ఆరవది మనసు సప్తమము, బుద్ధి, అష్టమత క్షేత్రజ్ఞుడైన ఆత్మయందు దృఢమైన నిశ్చయత నియమము కావలెను. సత్వరజస్తమో గుణములు కల్గించు ఇంద్రియముల వెంటపోక తనను తాను తెలిసికొనుగలుగు వానిని సుఖ దుఃఖములు, హర్షమద దైన్యము లేమియు చేయజాలవు.

## ఇంద్రియ నిగ్రహ ముత్తమధర్మము

కుమారా! ఇంద్రియ నిగ్రహముత్తమ ధర్మము. తండ్రి కుమారులను కట్టడి చేయునట్లు అటునిటు విషయ సౌఖ్యములకై పరువెత్తు ఇంద్రియములను మనసును నిలువరించుగలిగినచో పరమ పద సిద్ధి లభించును. తన శాఖలనున్న పూవులను, పూదేనెను, ఫలించు పండ్లను వృక్షము అనుభవించదు అట్లే సహజమగు పరతత్వము తను సుఖముల క్లిష్టపడదు. అట్టి నిష్ఠ వలననే, పాము నుండి కుబుసమువిడిపోవునటుల ప్రాణులనుండి పాపములు పటాపంచలగును. ఈ విధమగు ఇంద్రియ నిగ్రహ ఫలమున కుమారా! నీవు విగత కల్మషుడవై మోహ సంకల్పితమైన సంసార వాహిని తరించి సంతృప్తుడవగుము. నీ ప్రతిపత్తికి సంతసించి విశిష్ట ధర్మమగు శాంతము నీకు ప్రసాదించితినని నుడివి వ్యాసుడు మఱియును కొన్ని అధ్యాత్మ విషయము లిట్లు పదేశించెను.

బ్రాహ్మణత్వము చిత్త శాంతి వలననే లభించును. కేవలము వేద పఠనము వలన కాదు. సమత్వ భావమున స్థిరమైన నడవడి కలవాడు బ్రాహ్మణుడు. శాంత గుణ సుఖము వలన దుఃఖము లన్నియు సమయును. వేదముల తత్త్వము నాది నేను అను తలపును పొందకుండుటే. అట్టివానికి జరామృత్యు భయము లుండవు. అట్టి శాంత జీవనుడే దేహమునందున్న సూక్ష్మ రూపమగు భగవదంశను కనగలు గును. నీటియందు సూర్య బింబము ప్రతిబింబించినటుల బుద్ధి యందు ఆత్మ యను పరమార్థము నతడు చూడగలుగును. అదియే వివేక అవివేకములు లేని పర మ యోగము. అట్టి జ్ఞానము వలననే పురాకృత కర్మఫలములను బుధుడు దాటగ లుగును.

దేహమొక నగరము. బుద్ధి దానికి ప్రభువు. ధర్మ చింతన మంత్రిగా మన స్సు నడచును. శబ్దాది అయిదు గుణములు పురోహితులు, ఇంద్రియములు పుర జనులు రజస్తమములు దుష్టులు - ఆ దుష్ట వర్తనము లందు పడకుండ వర్తింప జేయు బుద్ధి మనసులవలననే అవ్యయమగు ఆనందము కలుగును.

అని వ్యాసుడు తనకుమారుడగు శుకునకు చేసిన ఉపదేశమును భీష్ముడు నుడువగా విని ధర్మరాజు మఱియొక సందేహము నడిగెను.

## మృత్యు దేవత విధము

తాతా! యిప్పుడు నీవు నుడివిన దంతయు శ్రద్ధగా విన్నాను. కాని, నాకొక సందియము కలదు. మేమొనర్చిన ఈ యుద్ధమందు, కార్యబలము, వీర్య బలము మనోబలము కలవారెందరో నరపాలులు మరణించిరి. ఈ మృత్యువు స్వభావమెట్టిది అనగా భీష్ముడు-

కుమారా, ఇదియు వినదగిన విషయమే. వినుము పూర్వ మొకప్పుడు అకంపనుడను రాజు తన తనయుని మృతికై దుఃఖపడుచుండగా నారద మహర్షి చె ప్పిన కథ యొకటి కలదు. దానిని నుడివెద నీ సందేహము పోవును.

చతుర్ముఖుడగు బ్రహ్మ ఈ ప్రాణికోటిని సృష్టిగావించెను. అది అంతకంతకు సమృద్ధమై లోకమెల్ల నిండుట గని ఈ ప్రాణి సంఖ్యను తగ్గించుటెట్లా యని విచా రించుచుండ ఆ విచారాగ్ని నుండి మహాదహనుడను వాడు పుట్టి లోకమును దహించుట మొదలిడెను. అదియును బ్రహ్మకు బాధా కరమయ్యెను. సదాశివుడం తట ఆ దహనాగ్నిని నశింపజేయగా రక్తాక్షియను స్త్రీ ఆ అగ్నినుండి జనించెను.

బ్రహ్మ ఆమెను జూచి రక్తాక్షీ! నీవే మృత్యుదేవతవు. బలవంతులు బలహీనులు అను విచక్షణ లేకుండ ప్రజల సంహరింపుము. ఇది నీకర్తవ్యము అని ఆదేశించెను.

బ్రహ్మ వాక్యములకామె నిర్ఘాంతపడి స్వామీ! ఇదేమి-నేనా ప్రజలను చంపవలయునా. నావలెనే వారందరు తమచే సృజింప బడిన వారే. నాతోడి వారిని నేనెట్లు చంపుదును అని ఆమెవలవల ఏడ్చెను. బ్రహ్మ ఆమెకన్నీటిని దోసిటపట్టి భద్రపరచి కుమారీ! ఇది నీకర్తవ్యము. ప్రాణి సంతానమెల్ల నేను సృజించిన మాటసరే. ఈ సంతతి అసంఖ్యాకముగ పెరిగి పోయినది. అదికారణముగ ప్రపంచమున ఎన్నో సమస్యలు ఉద్భవిల్లుచున్నవి. కాలుష్యము వ్యాధులు ఎక్కువగుచున్నవి. నీవు నిమిత్తమాత్రమే. ఇదిగో నీకనులనుండి రాలిన జలమే చిహ్నముగా ప్రజలు నానావ్యాధి గ్రస్తులు అగుచున్నారు. అవియే వారిని చంపును. పురుషుని మృతి కలుగజేయునపుడు పురుషునిగను, స్త్రీ విషయమున స్త్రీగను, నపుంసకుని విషయమున నపుంసకునిగను కామరూపిణివైనాయాజ్ఞ పాలింపుమని బ్రహ్మ ఉపదేశించెను. రక్షాక్షి నిష్ఠతో మహాతపస్వినియై మృత్యు దేవత రూపమందినది.

ఈ కథను విని ధర్మరాజు భీష్ముని జూచి పితామహా! ఇప్పుడు మృత్యువెట్లు సంభవించునో గ్రహించితిని, కాని, సజ్జనులు ధర్మమునకును భయపడుదురు. ధర్మ స్వభావమెట్టిది అని మరల అడుగగా భీష్ముడిట్లు నుడివెను.

ధర్మము నాలుగు విధములు, వేదములయందు భక్తి, దృఢమగు విశ్వాసము, సదాచారము, పరిశుభ్రమగు ఆకారములు. అవి నీతి వలన, అన్నృతముల వలన ధనము గూర్చుట ఎల్ల పాపములకు మూలము. సత్యభాషణము పరుల సొమ్మున కానపడకుండుట ఉత్తమ ధర్మములు. విధి విహితమైన ధర్మాచరణమెల్లరకును ఇహపర సుఖసాధనము.

ఇతరులు చేసిన వేవి యయినను తనకు అప్రియములైనచో తాను వానిని ఇతరులకు చేయకుండుటయే అత్యుత్తమ ధర్మము.

## సదాచారములు

ధర్మజా నీవడిగినది మఱియొక విషయమున్నది. అది సదాచారములను గూర్చి వినుము.

వివిధములయిన ఆచారములను గురించి వేదములు నుడువును. మనకెల్లరకు మార్గదర్శకులైన మహాత్ములొనరించిన ఆచారములనే మనము అనుసరింపవలయును. జాజలి యను మునితో మున్నొక వ్యాపారి ప్రసంగించిన విధము వినుము.

మున్ను జాజలియను ఒక ముని మహా తపోనిష్ఠ కలవాడుండెను. ఆతడు కదలక మెదలక తపస్సు నందుండుటచే అతని శిరోజములయందు పిచ్చుకలు గూడు కట్టి పిల్లలను బెట్టెను. అవియును పెరిగి పెద్దవై తమ తిండి కొరకు బయటికేగి

నచ్చుచు ఆ గూటియందే వసించుచుండెను. దేవతలు గూడ ఆ ముని తపోనిష్ఠకు మెచ్చుకొనిరి. వారణాసి పురమున ధర్మపరుడైన వ్యాపారి తులాధారుడను వాడుండెను. తన తపో నిష్ఠను గూర్చి అతడేమియు ఇంతవరకు మాటాడలేదను మత్సరముతో ముని యాతనివద్దకేగెను. మునిని చూచినంతనే గౌరవించి తులాధారుడు ''మునీంద్రా! పిచ్చుకలు నీ తలజడలపై గూడు కట్టుకొని వసించు చున్నను నిశ్చలమైన తపోదీక్షయెట్లలవడినది. నీవు గౌరవార్హుడవని నుడువగనే మునియు ఓ వ్యాపారీ నీకీ ధర్మ చింత ఎట్లు వచ్చినది. వ్యాపారము లోభ స్వార్థమయము గదా అని ప్రశ్నించెను. ఆప్రశ్నకు తులాధారుడు తన ప్రవర్తన నిట్లు చెప్పెను.

మునీంద్రా కొనుట అమ్ముట వ్యాపార లక్షణములు. బంగారము ఇనుము నాకు సమమే. ఆత్మ స్తుతి, హింస నాకులేవు. ఒకరికి మేలు చేసినను ఇంత చేసితిని గదా అని కీర్తికి గాని భోగమునకు గాని ఆసపడను. ఇట్లు చెప్పిన వ్యాపారి మాటలకు జాజలి ఆశ్చర్య పడి

ఓ వ్యాపారీ నీవు చెప్పిన మాటలు సరియైనవే, కాని తపముల మాట యజ్ఞముల మాట యెత్తనేలేదు. వానిని కూడ వేదములు చెప్పినవి గదా.

తులాధారుడు : ఔను మునీంద్రా, అహంకారము ఫలవాంఛ యున్న తపోయజ్ఞములు దేవతలిష్టపడరు. అవి కీడే కాని మేలు కావు. దేవతా తృప్తి వలననే అవ్యయానందము సమకూడును.

జాజలి : అట్లే అయినచో నీవు కర్మను వీడక, వ్యాపారవృత్తిలోనే ఉన్నావు. ఇది ఎందుచేత?

తులాధారుడు : ధర్మతత్పరుడై అనన్య చింతతో నున్నపుడు కర్మచేయనియట్లే కర్మము మంచి ఫలితములకు కారణమే. మరియొకటి చెప్పెద వినుము. నీ శిరోజములందు గూడుకట్టుకొని పెరిగిన యీ పిచ్చుకలను కొంచెము లాలింపుము.

ఆ మునివరుడట్లే ఆ పిచ్చుకలను పిలువగానే అవి పైకెగిరి యిట్లు మాట్లాడినవి. మునివరా ధర్మదేవత పంపగా వచ్చి నీవద్దనున్నాము. మత్సరముగల మనసున ద్వేషము విచారము, వీనివలన హింసయు పుట్టును. ఒకరితో స్పర్థ పనికిరాదు. అది ధర్మనాశన హేతువు. శ్రద్ధ గలిగి మత్సరము విడనాడి చేసిన క్రతువును దేవతలు మెచ్చెదరు. శ్రద్ధయే జీవాత్మకు సుప్రసన్నత ఘటించి మనో వాక్కాయ కర్మలను యథావిధిగ ఉండునట్లు జేయును, అనిన ఆ పిచ్చుకల మాటలకు ముని పరమాశ్చర్యమునందెను.

## తులాధారుడు నుడివిన బ్రహ్మగీతలు

యాగమునందును శ్రద్ధాయోగము వలయును శ్రద్ధగల వానికే గౌరవము మేలు కలుగునని మున్ను బ్రహ్మ దేవతలకుపదేశించెను. ధనము వడ్డీకిచ్చి తిను వాడు లోభి, శ్రద్ధ లేనివానికి దానగుణము అలవడదు. శ్రద్ధతో వర్తించుటమేలు. దాని వలన పాపములు తొలగును. మత్సరము మొదలయిన దుర్గుణములు నశించును. అట్లుపదేశించిన తులాధారుని మాటలు విని జాజలి ఇతనివలనగదా శ్రద్ధా తత్త్వమును తెలిసికొనగలిగితినను ముదమున తులాధారుని అభినందించెను. ఆ వ్యాపారియు నిష్కామము, వైరాగ్యము గల శ్రద్ధయే యెల్లరకు సద్గతిని సమకూర్చునని మఱియొకసారి నుడివి ఆ మునిని వీడ్కొలిపెను. అట్టి శ్రద్ధ వలననే ఆ వ్యాపారి ఇహపర సౌఖ్యములంది ధన్యుడయ్యెను.

**కార్యనిర్వహణము - సమీక్ష, మాతృభక్తి,**

ఏవైన కార్యముల నొనరించుట యందు చింతనము చిరమై యుండవలెనా అచిరము తాత్కాలికముగా నుండవలెనా అను ధర్మజుని ప్రశ్నకు భీష్ముడిట్లు నుడివెను.

తొందరపడక సవిమర్శనగ చేసిన కార్యములందే స్థిరమగు ఫలితము కలదు. ఓర్పు లేనివారు మంచిని చూడక ఆలస్యమగుచున్నదను నెపమున దోషాలోచన సేయుదురు. ఈ విషయమును సమర్థించుచు చిరకారి యను ముని కుమారుని కథనిట్లు చెప్పెను.

మేధాతిథియను ముని తన పుత్రుడు చిరకారిని బిలిచి నీ తల్లి నా మాట మీరినది ఆమెను చంపుము అని ఆజ్ఞ యిచ్చి వెడలెను. చిరకారికేమియు పాలు పోలేదు. తల్లిని చంపినచో సకలారిష్టములు మెడకు చుట్టుకొని దుర్గతి పాలొనరించును. తండ్రి దైవము గురుడు, ధర్మము విద్యయు జనకుని వలనగలుగును. జనకునాజ్ఞ సేయనిచో నరకమే గతి. అతడు నిర్దేశించిన పనినొనరించుటే శుభ ప్రదము. ఇక మాతృ మూర్తియా, నానాకష్టములు పడి జన్మనిచ్చిన ప్రేమ మూర్తి ఆమె. అప్పుడప్పుడు వచ్చి చూచువాడు తప్ప తల్లికి వలె బిడ్డను కాచుకొని తండ్రి ఉండడు. తల్లియే గౌరవమున అధికమని శాస్త్రములు నుడువును. పుత్రుడు బాలుడైనను వృద్ధుడైనను తల్లికి వానియందు ప్రేమ సమానమే. ఎవరికైనను తల్లి యెదుటనున్నపుడే శాంతియు సంపదయు, మాతృ వియోగమున సర్వము శూన్యమే. అట్టి ప్రాపు నిచ్చు తల్లిని వధించుటకు ఎంత క్రూరుడైనను చేతులాడవు. ఇట్లాలోచించుచు తొందరపడక చిరకారి ఉండెను.

ఇట్లుండ కొన్ని దినములకు తండ్రి మేధాతిథి తాను క్రూరుడై తొందరపాటు వలన ఇచ్చిన ఆజ్ఞననుసరించి చిరకారి తల్లిని చంపివేసె నేమోయను దుఃఖమున యింటికి వచ్చి తనయుడు తల్లిని చంపకుండుట చూచి సంతసించి యిట్లనెను.

కుమారా! చిరకారీ నీవు తొందరపడక మీ అమ్మను రక్షించితివి. నేనేదియో కోపమున అనిన మాటలను విమర్శన పూర్వకముగ యోచించి ఊరకుంటివి. నీ నామము సార్థకమైనది. నిన్ను జనులెల్లరును సంస్తుతింతురు. నీ తాలిమివలన నాకును నింద రాకుండ చేసితివి. అని ఆనందాశ్రువులతో తనయుని దీవించి కౌగిలించు కొని భార్యను ప్రేమతో జూచుచు సుఖముగ కాలముగడపెను. ఈ కథాసారమేమనగా

కార్య విచారము ధైర్యముగ మంచిచెడ్డలు చూచి చేయవలెను. సర్వ శుభముల కదియే సూత్రము. తొందరపడి అనాలోచితముగ సేయుకార్యము వలన పశ్చాత్తాపమే కలుగును. కావున ధర్మజా నీవు బాగుగా ఆలోచించి మేలు కీడులు విమర్శించియే ఏ కార్యమైనను చేయుట సముచితము అని భీష్ముడుపదేశించెను.

## నేరస్థులను శిక్షించు విధానము

మరల ధర్మజుడీ ప్రశ్ననడుగగా భీష్ముడిట్లు నుడివెను. పూర్వము ద్యుమత్సేనుడను రాజునకు నతని పుత్రుడగు సత్యవంతునకు ఈ విషయమై జరిగిన సంభాషణమును వినుము.

మరణ శిక్షయు వలసినచోట సముచితము. దొంగలు, దుష్టులు స్వల్పలాభమున కాసపడి ఎంతటి తీవ్ర నేరమైనను చేయుదురు. అట్టివారికి తగిన శిక్ష లేకపోయి నచో ప్రజలకు బాధలు తప్పవు. తప్పు గలిగినచోట శిక్షించుట విధి. ఆత్మీయుడని మిత్రుడని మన్నన సేయ గూడదు. అయినను చేసిన నేరమును బట్టి దండన విధానము, నిందించుట, తాడించుట, వికలాంగుని చేయు విధములు ఆలోచనీయములు.

రాజైన వాడు ముందు తాను నీతిపరుడయి, అమాత్యులను పరిచరవర్గమును సన్మార్గమున నడిపించి విద్యా బోధకులయిన విప్రుల కెట్టి హింసయు జరుగకుండ చూడవలయును.

## గృహస్థ ధర్మము - సన్యాసము

వీనిలోనేది అవశ్యకర్తవ్యము అని అడిగిన ధర్మజుని ప్రశ్నకు భీష్ముడొక కథనిట్లు చెప్పెను.

రెండును ఆదరించి అనుసరింపదగిన ధర్మములే. కపిలుడను మహాముని

ఒకప్పుడు నహుష చక్రవర్తిచే పూజింపబడు గోవును జూచి నీవు వేద స్వరూప వగుదువా అని ప్రశ్నింప ఆ మాటలో వేదములయందు ఆదరములేనట్లు గ్రహించిస్యూమరశ్మియను ముని సూక్ష్మ రూపమున గోవునందు ప్రవేశించి యిట్లనియెను.

వేదములాచరించుట యందు డాంబికము కలదని యతులందురు. అదికాదు, అవి సర్వాదరణీయములు. నరులకు బ్రహ్మచర్య గృహస్థ వాన ప్రస్థ సన్యాసములని నాలుగు ఆశ్రమములున్నవి. వేదవిహితాచారముల వలన వానిని నడుపవలయును. యజ్ఞాదులు హింసాత్మకములనుకొనుట తగదు. పశువులను ధాన్య సంపదను బ్రహ్మ ఒకే విధముగా సృష్టించెను. అతడును యజ్ఞములొనర్చును. ఎవరికైనను విద్య సుఖము నిచ్చునది యాగాచరణమే. దానిని హింసగా తలపరాదు.

కపిలుడు : వేదాచారములచే విప్రులు దేవతలను తృప్తినొందింతురు. అది సరియే కడుపు, చేయి, వాక్కు, కామము ఈ నాలుగును మనుజునెప్పుడును పెడ త్రోవను పట్టించును. బుద్ధుడైనవాడు ఈ ఇంద్రియ విజృంభణము నణచికొని తనలోనున్న పురాణ పురుషుడైన ఆత్మను రక్షించుకొనును. అట్టి సద్గుణ సంపన్నుడు పరుల నుండి గ్రహింపడు, స్త్రీ మోహమున పడడు. సత్యమును పలుకును మృదువుగా భాషించును. మితముగా శరీర రక్షణకు మాత్రము భుజించును. అట్టివానికి జపములు తపములు పూజలును ఏల?

స్యూమరశ్మి : (గోగర్భమునుండి వెడలి వచ్చి తనపేరు చెప్పి) మునీంద్రా ధర్మ నిర్ణయము నెఱుగ కొనదలచి అట్లు మాట్లాడితిని. వేదములే ప్రమాణముగా చతుర్వర్ణాశ్రమాచరణములు పరిత్యాగము కూడ కలవు. ఏది అత్యంత విధేయము. నన్ను శుశ్రూషకునిగా స్వీకరించి విశదీకరింపుడు.

కపిలుడు : జ్ఞానము నాశ్రయించిన వానికి ఏకీడును రాదు. అజ్ఞాని కోరికలు పెంచుకొని కర్మ బంధములలో చిక్కుకొనును. జ్ఞానికి అహంకారము కోపము ఆశ దూరములు. ఎక్కువ తక్కువలని మంచి చెడ్డలని భేద భావము లేక సమతా దృష్టితో ఆత్మవస్తువు అన్నిటను ఒకటే అను సిద్ధి నంది అఖిల కర్మలకు అతీతుడగును.

స్యూమరశ్మి : వేద శాస్త్ర విధులనుల్లంఘించుట అవివేకము, మోక్షప్రదము కాదు. ఆత్మ సిద్ధి గలవాడు వేదముల విడచి వర్తించుట కీడు అని పల్కుదురు. ఈ సంశయమును తీర్చుము మునీంద్రా!

## వేదములు ముఖ్య ప్రమాణములు

కపిలుడు : బ్రహ్మపదార్థము శబ్దము పరము అని రెండు విధములు. శబ్ద బ్రహ్మము నెఱిగిన పరమ బ్రహ్మపదము లభించును. అసూయ కామము లేక శమదమములు గల జ్ఞాని వేద విహితా చారములను ధర్మముగా నభ్యసించును. కోరిక, అహంకారములను వదలి భూత దయతో వర్తించు గృహస్థులు శాశ్వత పదము నందగలరు. ధర్మ మునకు బ్రహ్మచర్య, గృహస్థ వాన ప్రస్థ, సన్యాసములు నాలుగు పాదములు. ఎవరెట్లు విధివిహితముగ వర్తించినను అది ధర్మమే. అనన్యచింతనుడై సంతృప్తి చిత్తుడైన వానికి గృహము, అరణ్యము ఒక్కటే. నాల్గవ ఆశ్రమ వాసులకు ఆశ అనునదియే ఉండదు. ధర్మమునకు జ్ఞానము మూలము. జ్ఞానము వలననే పరమ సంతో షానందములు కలుగునని వేదములు చెప్పును. అన్ని ఆశ్రమములు ఆచరింపదగినవే. వేద తత్పరులు శాంతులు అయిన వారికి లభిం చునదే సద్గతి. మోక్ష అభిలాషగలవారికి త్యాగము శమము సంతోషము ఒకదానికన్న మరియొకటి ఉత్తమ మార్గములు. వేద విదితము, సత్యము, సర్వాత్మకము, శుభము, అవ్యక్తము, బ్రహ్మము శివము శాంతి నంది భూనభంబుల అనామయమగు లీనమగు బుద్ధి మంతులు పూజ్యులు అని కపిలుడు స్యూమరశ్మి కుపదేశించెను.

## ధర్మార్థ కామములు – కుండధారుని కథ

భీష్ముడు చెప్పిన కథలన్నియు విని సంప్రీతుడైన ధర్మజుడు మరల తాతా భీష్మాచార్యా! ధర్మార్థకామములు మూడును వేదములచే చెప్పబడినమోక్ష మార్గములు. ఇందెయ్యది లాభదాయకమని అడుగగా భీష్ముడు కుండధారుని కథ నిట్లు చెప్పెను. కుండ ధారుడను బ్రాహ్మణుడొకడు ధనము కొరకు ఒక యజ్ఞము సేయగా, దేవాను చరుడొకడు వచ్చి నీకేమి కావలయును అని అడిగెను. ధన సంపద కావలయును అని బ్రాహ్మణుడు నుడువగా ఆ దేవానుచరుడు కుబేరుని సేవకుడగు

మాణి భద్రుని రప్పించి, ఈ విప్రుడు ధనమునకై యజ్ఞము చేసెను గాని మనుజుని జన్మమే అశాశ్వతము ఇకనీతనికి అస్థిరమైన ధనమెందులకు ధర్మమార్గమేదియో అది చెప్పుము, సర్వ సంపదలనదియే యిచ్చును, అని నుడివెను. మాణి భద్రుడు దేవతలను ప్రార్థించి కుండధారునకు భగవచ్చింతనము కలుగజేసి వెడలెను. కుండ ధారుడు నియమ నిష్ఠలతో తపమాచరించి సిద్ధుడై తానేయిక ఎవరికేది కావలసిన ఆ సంపద నిచ్చెదనని తలచి మరల దేవానుచరుని పిలిచెను. అతడు విప్రవర్యా నీవ నుకొనిన వన్నియు ధర్మముతో సరిగావు. పురుషార్థమయిన ధర్మమువలెనే మహో న్నత మగు సత్త్వ శాంతి యోగము లభించును. అట్లు నిష్ఠాపరుడవగుమని తెలిపిన పిదప కుండ ధారుడును ధర్మమార్గ తత్పరుడై సురముని పూజితుడయ్యెను.

## అర్థమగు హింస అహింసయే

భీష్ముడు మరియొక ధర్మ సూక్ష్మతను గూడ ధర్మజునకిట్లు నుడివెను. భిక్షా వృత్తిచే బ్రతుకు గడుపునొక విప్రుడు యజ్ఞము చేయుచు పశువధ హింసగా భావించి ఫలమూలములే హవిస్సుగా నుపయోగించెను. అది విధి విహితము కాదని యెఱిగియు అతని భార్య శాప భయమున ఊరకుండెను. ఇంద్రాగ్ని దేవతలు ఆ హవిస్సును గ్రహింపరైరి. ఇంతలో ఒకలేడి ఆ విప్రునకెదురు నిలిచి ఆర్యా నీ యజ్ఞా చరణము సక్రమముగా లేదు. నన్ను జంపి యాగహోమ మొనర్చి తత్ఫలితంబను భవింపుము. అని చెప్పిన మాటలా విప్రుడు హింసాభయంబున వినడయ్యె. ఆ లేడి ఓ విప్రవర్యా నీకు దివ్య దృష్టి నిచ్చుచున్నాను. నా చెప్పిన విధంబాచరింపుము. అరుగో అచ్చట గంధర్వకాంతలు నిన్నభినందించుటకు గగనమున నిల్చినారనగా విప్రుడు దివ్య దృష్టిని వారిని విలోకించి ఆ లేడిని హింసింపబోవ అతని తపమునకు ప్రమా దములు సంభవించె. అంతట ఆ హరిణము తాను ధర్మదేవతనని చెప్పి అతని యాగ దీక్షను ప్రశంసించి, క్రతువిధిని అర్థమగు హింసాది విధానము అహింసా వృత్తికానేర దని చెప్పి వెడలెను. విప్రుని భార్యయునట్లే యనియెను. ధర్మదేవత వచనానుసారము అతడా యాగమును పూర్తి గావించి సంప్రీతుడయ్యెను.

## అరిషడ్వర్గ నిరాసము - ముక్తి మార్గము

మనుజుడెందుచేత పాపములొనర్చును. ధర్మాచరణమునకు ఏది మూలము. దేనివలన ముక్తి పొందగలడు అను ధర్మజుని ప్రశ్నకు భీష్ముడిట్లు నుడివెను.

ఇహ సౌఖ్యములవలన లోభము మోహము కలుగును. మనసు ఈ సౌఖ్య ములకు లోబడినపుడు ధర్మలోపము కలుగును. అది పాపాచరణకు దారితీయును.

ఆ కీడు ఆలోచించి విషయ పరత విడచిసద్గోష్ఠిని నడచుట, ముక్తి సాధనమగు ధర్మ బుద్ధికి ఆలవాలము. ముక్తిని అనపాయమగు ఉపాయమున పొందవలయు. అదెట్లన, ఓర్పువలన కోపమును, కోరికలు మాని కామమును, సత్త్వ గుణమువలన నిద్ర పోతు తనమును, ధైర్యము వలన రాగద్వేషములును, పొరపాటు చేయకపోవుట వలన మోహము భ్రమను, దురలవాటు మానుట వలన రోగములను, సంతోషమున లోభమును, కృపచే అధర్మమును తొలగించు కొనుట ముక్తికి ఉపాయము. సకాలము మితము అయిన భోజనము ముఖ్యము ఏ సాధనమైనను ముక్తికి మార్గమే. ఆ సాధ నమును ఉపాయమున ఆలోచనతో అభ్యసించవలెను.

## తృష్ణ( దురాశ) ను తొలగించు విధము

తాతా! నీవు చెప్పిన మాటలు సర్వ శ్రేయోదాయకములు. నాకొక సందేహ మున్నది. రాజ్యముపై తృష్ణచే కదా అన్నదమ్ములమైన మేము యుద్ధమునకు తలపడి బంధుకోటుల మరణమునకు కారణమైతిమి. ఈ తృష్ణను మనసునుండి తొలగించుట యెట్లు అని ధర్మజుడడుగగా భీష్ముడు, ఇట్లొక వృత్తాంతము చెప్పెను.

మాండవ్యుడను ముని జనకమహారాజు కడకు వచ్చి తృష్ణ పోవుట యెట్లు అని అడిగెను. జనకుడంతట మునీంద్రా! సంపదలన్నియు దుఃఖమును కలుగ జేసెడివే. దేనిమీదను నాకు ఆశ లేకపోవుటచే నాకు దుఃఖమేమియును లేదు. నీకు తెలియును గదా ఒకసారి నా రాజధాని అగ్ని ప్రమాదమున కాలి పోయినది. అపు డును నేను విచారపడలేదు. ఆశలేకపోవుట వలన కలుగు సుఖము మరి అన్యథా ల భింపదు. గోవునకు కొమ్ములు పెరుగునట్లు ఆశ తనంతట అది పెరుగును. నేను మా బంధువులు నా యిల్లు అని ఆశ పెట్టుకున్న కొలది దేహమున రోగము పెరు గునట్లు ఆశ పెరుగును మనసును కట్టడి పెట్టి ఆశను వీడుము. శాంతి సౌఖ్యములు లభించును. మాండవ్యుడామాటలకు సంప్రీతుడై మనశ్శాంతి నలవరచు కొనియెను.

## కాలము

ధర్మజుడిట్లడిగెను. తాతా, వెనుక నీవు చెప్పినదే మరల విశదముగ వినగోరెదను అంతకంతకు కాలము భీకరమగుచున్నది. ఈ సందర్భమున మనుజుడెట్లు నడచు కొనవలెనని అనగా భీష్ముడు అవును ధర్మజా! పితాపుత్ర సంవాద కథను మున్ను చెప్పితిని. దానిని విశదీకరింతును వినుము.

మేధావి యనువాడు తండ్రినిట్లడిగెను. తండ్రీ ఆయువు తరిగి పోవుచున్నది. ఏమి చేయవలెననగా తండ్రి కుమారా! మనుజుడు బ్రహ్మచర్యమున వేద అధ్యయనము

సలిపి గృహస్థు అయి మంచి సంతానమును కని యజ్ఞములొనర్చి పిదప వాన ప్రస్థము నడపి, ఆ తరువాత సన్యాసి కావలెను. ఇది కర్తవ్యము, జనన మరణములు మనలను వెంటాడుచునే ఉండును. ఆలస్యము చేయక మన పనులు నెరవేర్చవలయును. ఇది మంచి ఇది చెడు అను ఆలస్యముతోనే మన ఆయువు చెల్లి మృత్యువు సంభవించును. మృత్యువు అమృతము మన దేహమునందే కలవు. వాంఛా మోహములు మృత్యువు. దాని యొక్క నిజరూపు గ్రహించి తప్పించుకొనుట అమృతము. పశుయజ్ఞమున హింసలేదు. అది బ్రహ్మోధ్వరమైన శాంతిపూజ. రాగద్వేషములు సుఖము నీయవు. యోగము తపము త్యాగమే సుఖ ప్రదములు. కాల ప్రభావమున ప్రజలు లోకము నశించువారే కావున శాంతి సమత నిష్ఠను బూని లోనున్న ఆత్మను దర్శించి ధన్యుడవు కమ్ము. మున్ను జనక భూపతియు అట్లే చరితార్థుడయ్యెను.

## శీలము మోక్షము - హారీతుని తత్త్వోపదేశము

ధర్మజుడా మాటలు విని సంతృప్తుడై మరల, మంచి వర్తనము కలవానికి బ్రహ్మపదమెట్లు లభించునని అడుగగా భీష్ముడు -

ధర్మజా! మితాహారము, ఇంద్రియ నిగ్రహము, మోక్ష సాధనలగు ధర్మాచరణము పరమపద ప్రాప్తికి మార్గములు. ఈ విషయమున హారీతుడను మునివర్యుడు విద్వజ్జనుల కుపదేశించిన తత్త్వార్థమును వినుము.

కోర్కెలను వదలి నిష్ఠతో చరించుచు, మనో వాక్కాయ కర్మముల ఎవరికిని కీడు తలపెట్టక మంచి చెడ్డలను సమముగా పాటించుచు మైత్రి కరుణ కలిగి ఏకతమ వసించుచు భిక్షాటనమున బ్రతుకువాడు ఆత్మ దర్శనమును పొందును. ఈ యుపదేశ ధర్మమును విని విద్వజ్జనులు ప్రీతి జెంది వెడలిరి.

## రాజభావము - పరమ పదము - వృత్రగీతి

భీష్ముని ఉపదేశములు వినుచున్నకొలదియు ధర్మజునకేవో సందియములు తోచుచున్నవి. అతడు భీష్ముని జూచి గంగానందనా, భావ శుద్ధి వలనగదా మేలొనగూడును. నా విషయమాలోచింపుము. రాజభావము నా మనసున నిండి యున్నది. అట్లుండగా ఇంద్రియములను వశపరచుకొని త్రిగుణాతీతుడనై శాంత సుఖంబుల నందుట నాకు సాధ్యమా అనగా భీష్ముడు - ధర్మజా అన్నివిధములైన యోగములు కాలము తోడివే, వర్ణ ధర్మపాలన వలన మనోవికాసము కాలక్రమమున గలుగును. అది కలిగినపుడే రాజన్యుడు సన్యాసమున కర్హుడగును. ఈ సందర్భమున వృత్రగీత యను కథ గలదు వినుము.

శుక్రుడు రాక్షసులకు గురువు. వృత్రుడను రాక్షస వీరుడు ఒకప్పుడు యుద్ధమున ఓడి క్రిందబడిన అవస్థలో గూడ దుఃఖపడక ధీరుడై యుండెను. శుక్రుడతనిని జూచి ఏమి దనుజేంద్రా! నీవిట్టి దురవస్థలో గూడ శాంతముగ నుంటివి. కారణ మేమి వినగోరెదననగా - వృత్రుడు

కలిమిలేములు కాలవశమున కలుగును. అవియే సుఖ దుఃఖములకు కారణము. ఈ కలిమి లేములు అశాశ్వతములు. ఆ సత్యమునెఱిగిన వానికి ఎట్టి విచారమును ఉండదు. దేవత లైనను మానవులైనను కర్మవివశులై చిక్కులనుభవింతురు. వాని అస్థిరత్వమునెఱిగిన వాడను గాన నేనోడి పోయితినను విచారము నాకు లేదనెను.

శుక్రాచార్యులు అన్నియు తెలిసినవాడే అయినను వృత్రుని చిత్తశుద్ధి ఎఱిగిన వాడయి మరల ఇట్లు ప్రశ్నించెను. దానవ నాథా, నీవు మానవంతుడవు. నీ రాజనీతిని గోల్పోయి ఇట్లేల శాంతుడవై యుంటివని మాటిమాటికి శుక్రుడనుట విని వృత్రుడు గురువర్యా! నీవెఱుగుదువు గదా సమరమున విజయమునకై తపమొనర్చితిని. మూడు లోకములను జయించితిని. ఏదో దుష్కృత్యము వలన ఆ ఐశ్వర్యము పోయినది. అందులకేల విచారము ఇకనాకు సుకృతము దుష్కృత్యము అను చింత లేదు. ఆద్యుడు అవ్యయుడైన విష్ణుదేవుని దర్శనము పొందవలెను. ఇంద్రునితో యుద్ధమైనప్పుడా అచ్యుతుని జూచితిని. ఆ మహా దేవుని మహిమ నాకెఱిగింపు మనగా. అట్లే అని శుక్రాచార్యులు విష్ణుమహిమ వర్ణింపబోవు నంతలో సర్వమునిపూజ్యుడు సనత్కుమారుడు అచ్చటికి వచ్చెను. సనత్కుమారుని శుక్రవృత్రులు పూజించి సముచితాసనమున కూర్చుండ జేసిరి. శుక్రాచార్యులు అర్థింపగా సనత్కుమారుడు వృత్రునకు విష్ణుమహిమ నిట్లు జెప్పెను.

## విష్ణు మహిమ

విష్ణుని యందు సర్వజగత్తు సృష్టి యగును. వృద్ధి బొందును, లయమగును. ఇంద్రియ జయము వలననే విష్ణుభక్తి మిక్కిలి ఫలవంతము. శ్రేయోదాయకము. భూమి విష్ణుని పాదము. ఆకాశము శిరము, దిశలు చేతులు, సర్వదేవతా మూర్తి యతడు. భూతసృష్టి సంహారము లతనిలీలలు. జీవావస్థలు అతని ఛాయలు. కృష్ణము,(నలుపు), ధూమ్రము పొగరంగు, హరితము ( ఆకుపచ్చ), హారిద్రము (పసుపు), రక్తము (ఎఱుపు) శుక్లము (తెలుపు) ఇవి ఆఱును వేర్వేరు దశావిశేషములు. విష్ణుని లీలలందు తిరుగు చుండు జీవుడు అతని కర్మముల వశమున నుండును. ఆ ఆఱు ఛాయా విశేషములు ఉత్తమ మధ్యమ అధమములుగా మూడు

విధములు జీవుని వర్తన మాధారముగ ఆ దశలు కలుగును. జీవుడు దేవత్వము మున్నగు గతులలో ఎక్కుచు దిగుచు ఉండును. మేలొనరించిన మంచి ఛాయ, కీడొనరించిన తక్కువ ఛాయ వచ్చును. పసిడి వలువ నేతకు దారమును శుద్ధి చేయునటుల, పూవులు వికసించి తీయని తావిపొందునటుల, సత్కర్మముల జేయు జీవుడు క్రమముగ చిత్త శుద్ధి నంది సంతోషామృతమును పొందును. శుక్లత్వము ఎక్కువైన ఛాయ. అది కలవానికి విష్ణు చింతనము సులభము.

సనత్కుమారుడు నుడివిన ఈ వాక్యములను విని వృత్రాసురుడు మునీంద్రా నీ వాక్యంబుల వినికి జేసి పరిశుద్ధ మానసుడనైతి నని యోగ బలమున ప్రాణంబులు విడిచి విష్ణు నింజేరెను. వృత్రుని వివేకము విష్ణుని మహిమను విని ధర్మజుడద్భుతాశ్చర్యములు నంది- వృత్రునకు ఇంద్రునకు మధ్య జరిగిన యుద్ధ క్రమమెఱుగగోరగా భీష్ముడిట్లు నుడివెను.

## వృత్రామరేంద్రుల యుద్ధ ప్రకారము

అరువదివేల దివ్యాబ్దముల తపస్సొనర్చి వృత్రుడు అజేయమహోగ్ర బలమును బ్రహ్మచే బడసెను. ఆ దానవుని బలమునకు జనులే కాదు దేవతలు భీతినందగా ఇంద్రుడు తన సైన్యముతో వృత్రుని పైకి దాడి వెడలెను. వృత్రుడును రాక్షస సైన్యమును సమకూర్చుకొని ఇంద్రునిపైకేగెను. ఆఘోర యుద్ధమున వృత్రుని ధాటి కాగలేక ఇంద్రుడు మూర్ఛిల్లి క్రిందబడెను. సురలు అడలి పోయిరి. వసిష్ఠుడు తన మంత్ర బలముచే ఇంద్రునికి తెలివి వచ్చునటుల జేయగా, బృహస్పతి సహితుడై సురలెల్లరు ఇంద్రుని విజయము కొరకు శ్రీహరిని ప్రార్థించిరి. శ్రీహరి తేజము వలన పీడాకరమగు జ్వరముద్భవించి వృత్రు నావహించెను. ఆ తేజము మహో బలోగ్రమై ఇంద్రుని వజ్రాయుధమున జేరెను. అదియే సమయమని రుద్రుడు ప్రేరేప ఇంద్రుడీ వజ్రమును వృత్రునిపై వేసెను. వజ్రాయుధ కారణముగ విష్ణు తేజ స్పర్శ వృత్రునకు కలుగుటచే వానికి చిత్తశుద్ధియు శాంతియు శమదమగుణములబ్బినవి.

## ఇంద్రునకు బ్రహ్మ హత్యా దోషము

వృత్రుడు బ్రహ్మకుల సంజాతుడు. అకారణమాతనిని హత్య కావించుట వలన బ్రహ్మ హత్య ఆతనిని వెంటనంటి బాధింప ఆతడొక మడుగు జొచ్చి ఒక కీటము వలె తామర తూడున ప్రవేశించి ఈ దోషమెట్లు తీరునా అని బ్రహ్మను ప్రార్థించెను. బ్రహ్మయు కరుణించి అగ్నిని ఓషధి వృక్షంబులను, వనితలను, జలములను రప్పించి ఇంద్రునకు గల బ్రహ్మ హత్యా పాపమును నాలుగు పాళ్ళు చేసి

వారికి ఒక్కొక్క పాలు నిచ్చి భరింపుడని ఆదేశించెను. అవియును, మాకీ పాపము నుండి విరమణ మెప్పుడని ప్రార్థింప బ్రహ్మ వారి వినతులు మన్నించి, అగ్నికి జ్వాల కాకముందే హవిస్సును వేయువాని యందును, పండుగ దినములందు ఓషధి వృక్ష తృణములను కోసి ఖండించు వారి యందును, రజస్వల కాలమున వనితలను భోగించు వారియందును, జలములలో మలమూత్ర మలినాదులను విడచు వారి యందును క్రమముగా ఆ నాలుగింటి యందున్న బ్రహ్మ హత్యా దోషము చేరగల దని ఊరడించి పంపెను. ఈ విధముగ బ్రహ్మ దయవలన ఇంద్రుడు తన బ్రహ్మ హత్యా దోషమును పోగొట్టుకొని తిరిగి తన దేవలోక సామ్రాజ్యాధిపతియై వెలింగె నని భీష్ముడు నుడివి మరియును వృత్రుని రక్త బిందువుల వలన పుట్టకొక్కులు జనించి ప్రజలకు భోజ్య ప్రాయములగుననియు, కాని విప్రులు మున్నగు ద్విజులకు (ఉపనయన కర్మకలవారికి) అవి అంగీకారములు కావని పలికెను.

## జ్వరము - జ్వరప్రకారము

ధర్మరాజా గాథలన్నియు విని శంతను నందనా, విష్ణు జ్వరము వలన వృత్రుడు మడిసెనని చెప్పితిరి అట్టి జ్వరమెట్లుద్భవించినది. దాని స్వభావమెట్టిది వినగోరెద ననగా భీష్ముడు ఇట్లు నుడివెను.

వెండికొండపై ఒకప్పుడు శివుడు అంబికా సహితుడై అమర మునీంద్ర యక్షా దులు సేవలొనర్చుచుండ దేవర్షి కోటులామార్గంబున బోవుచుండిరి. వారెచటికేగు చుండిరి అని భవాని అడుగగా శివుడు, వారందరు దక్షుని యజ్ఞమున హవిర్భాగము గొననేగు చుండిరనియె. అట్లయినచో మీకేల ఆ భాగ్యము లేదని భవాని ప్రశ్నింప, నాకాహవిర్భాగము మొదటినుండియు లేదు. ఆ కారణమున దక్షుడు నన్ను బిలువ లేదని చెప్పెను. అందులకు భవానికి తీవ్రమగు కోపము వచ్చి మాటలాడ కుండుట శివుడు గ్రహించి ప్రమథుల గూడి చని ఆ యజ్ఞమును సర్వము ధ్వంసమొనర్చెను. ఈశుని ఫాలమునందు అలుకవలన పుట్టిన చెమ్మట బిందువు నేలమీద బడగా అందుండి ఒక భీకరాకారుడుదయించె. ఆ రూపమునుండి మహా భీకర జ్వాలలు లేచి వ్యాపింపగా సురలు మునులు నలు ప్రక్కలకు పరువులిడిపోయిరి. బ్రహ్మ స్వయ ముగ శివుని కడకేగి, పరమేశా నీకోపాగ్ని జగత్తునకు దుర్భరముగా నున్నది. నీకును దేవతలు హవిర్భాగము కల్పింతురు అని శాంతింప జేసెను. శివుడు ప్రసన్నుడయ్యెను. సురలానందించిరి.

బ్రహ్మ మరల శివుని జూచి, దేవా నీ నుదుటి బలమున బుట్టిన మహా పురు షునకు జ్వరమను ప్రశస్తి కలుగును జ్వరబాధను లోకము భరించలేదు. ప్రాణుల

యెడల దయతో ఆ బాధను విభాగించి నియోగింపుమన శివుడా జ్వరమును వివిధములుగ జేసెను. ఆ బాధ ఏనుగులకు తలయందును పాములకు కుబుసమునందు, గోవులకు గిట్టలందును. మృగములకు నిజరూపదర్శనమునందును, గుఱ్ఱములకు డొక్కలయందు, నెమళ్ళకు ఈకలూడుట యందు, కోకిలలకు కళ్ళ జబ్బునందు, చిలుకలకు ఎక్కిళ్ళయందు, పెద్ద పులులకు ఆయాసమునందు మనుష్యులకు జనన మరణ బాధలందును ఉండునట్లు నియోగించెను. జ్వరమనగా మాహేశ్వరమైన తేజము గాన దానిని సర్వజనులును నమస్కారార్హముగ తలపవలెను.

## శాస్త్ర తత్త్వ మెఱుగని వాడు సేయవలసిన విధి.

శాస్త్ర జ్ఞానములేని సామాన్య మనుజుని దృష్టి యందుంచుకొని ధర్మరాజీ ప్రశ్ననడిగెను. భీష్ముడంతట ధర్మజా వినుము, పరమార్థము తెలియని వాడైనను సంశయింప పనిలేదు. గురువులను పూజించుట, వృద్ధులకు సేవచేయుట పుణ్యకథలను వినుట అట్టి వానికి అవశ్యకర్తవ్యములు.

దేవఋషి యగు నారదుని గాలవుడను విప్రుడీ విషయమునే అడుగగా నారదుడిట్లు చెప్పెను. ఆశ్రమ ధర్మములు నాచరించుచు పాపముల చెంతబోక పుణ్యకర్మముల శుద్ధమనస్కుడై యుండవలయు, సజ్జనులతో మైత్రి ముఖ్యము. సరళమగు సంభాషణమును సర్వప్రాణులందు దయ వలయును. పరనింద ఆత్మశ్లాఘ అహంకారము విషయవాంఛ విడువవలెను. బద్ధకస్థుడు గర్వి అసూయ గలవాడును కోపియు కాగూడదు. అతిథి మర్యాదలు నేర్వవలయును. వేదాధ్యయనము సదాచారము యజ్ఞములొనరించుచోట్ల దైవ బ్రాహ్మణ పూజగల ప్రదేశములందు నివాసముండుట మంచిది. ఇట్టిగుణములు కలిగి యుండుట వలన చిత్తశుద్ధి గల బోధము లభించును.

## భవబంధమోక్షము

ఈ విషయమున అరిష్టనేమి యనుముని సగరుడను రాజునకు చెప్పిన విధమును భీష్ముడు మరల నిట్లు చెప్పెను.

సంసార బంధమునుండి విడివడి ఏకాంతముగ నుండుట ముక్తికి మొదటి మెట్టు. భార్య, పిల్లలు బంధువులు అను సంసార లంపటము ముక్తికి అవరోధము. వారెవరికి వారే. మరణము వచ్చినపుడు తప్పించగలవారు కాదు. ప్రాణులు పుట్టి పెరిగి చచ్చుట యందుగల సత్యమెఱిగిన వానికే మోక్షప్రాప్తి. మంచి చెడ్డ, మృదు శయ్య కటికినేల, చిరుగుబట్ట క్రొత్త పట్టుబట్ట అన్నియు సమముగా జూచువాడే విరాగి. వానికే మోక్షము. ధనము నందు నిరాసక్తి, కష్టమున ఓర్పు ఆవశ్యకము.

రాచరికము అశాశ్వతము. మనుజ జన్మము కీడుగా చూచువాడే చిత్తానందము గనును. కావున రాజా సంసారలోలుడవు కాక ప్రజలను రక్షించు ధర్మవిధి నీవు పాటించినచో కైవల్యము సులభము. సగరుడీ ప్రకారము జీవన విధానము నలవరచుకొని పుణ్యాత్ముడయ్యెను.

## శుక్రుని జన్మవృత్తాంతము

భృగుమహాముని కుమారుడు భార్గవుడు. అతడే రాక్షసులకు గురువయిన శుక్రాచార్యుడు. ఇతనికీ పేరెట్లు వచ్చినదని అడుగగా భీష్ముడా కథ నిట్లు నుడివెను. భార్గవుడు కనుమాటు జేసి కుబేరుని వద్ద నున్న ధనమును కొనిపోయెను. కుబేరుడా వార్తను ఈశ్వరునకు జెప్పగా ఈశ్వరుడు కోపించి శూలమెత్తగా భార్గవుడు భయపడి అటనట దాగి తుదకు శివుని హస్తమున నొదిగెను. శివుడా భార్గవుని మ్రింగి అతడు సూక్ష్మరూపమున బయటకు రాకుండ శరీర ద్వారములన్నియు మూసి పురుషాంగమును అట్లే ఉంచెను. సూక్ష్మబుద్ధియగు భార్గవుడా ద్వారమునుండియే బయట పడెను. శివుడదిచూచి కోపించి భార్గవుని చంపబోగా శ వాని అడ్డువచ్చి దేవా! నీ గర్భము నుండి వచ్చిన యీతడు నాకును కొడుకయినట్లే కదా వీనిని రక్షింపుమనెను. శివుడతనిని రక్షించి సర్వ విద్యా పారగుని జేసెను. పురుషాంగము నుండి వచ్చిన కారణమున భార్గవునకు శుక్రనామము కలిగెను.

## పరాశరగీత – సద్ధర్మము – 1

ధర్మరాజు మరల మొదటికి వచ్చి సద్ధర్మమేదియో తెలుపుమనగా, ఈ విషయమును గూర్చి జనక భూపతికి పరాశరముని చేసిన ప్రబోధము పరాశర గీత నిట్లు నుడివెను.

పండునందు బీజమున్నటుల ధర్మమునందు సౌఖ్యసిద్ధి గలదు. సుకృత దుష్కృతములు వానివాని ఫలము లిచ్చుచునే యుండును. మనో వాక్కాయ కర్మములందు అన్యాయ మార్గము లేనప్పుడవి సన్మార్గమును చూపును. శమ దమ సత్య అహింసలు సత్పథములు. భగవానుడు మనకొసగిన మహా సంపద ఆయువు. ఆ ఆయువును సార్థకము చేసికొనవలె. దురితముల వలన మేలు రాదు. అఖిల ప్రాణి కోటియందు సమతాదృష్టి గలవాడు నమస్కారార్హుడు. ధర్మముగా వచ్చిన ధనమునకు సద్వినియోగమే గమ్యము. సన్మార్గమును జూపినందులకు మనుజుడెందరికో ఋణపడి ఉన్నాడు. వేద పఠనము వలన మునుల ఋణము, యజ్ఞముల వలన దేవతల ఋణము, ఆదర పూజవలన అతిథుల ఋణము, శ్రాద్ధ విధివలన పితృదేవతల ఋణము, ప్రియమువలన ప్రజల ఋణము తీర్చుకొనవలెను. విష్ణుకీర్తనమునను, ధర్మ వర్తనము వలనను పాపి కూడ పుణ్యుడగును. జననీ జనకులు గురువులు సద్గతి

నొసగుదురు, అగ్నిపూజ తేజము బలము నిచ్చును. మంచి వారి సాంగత్యము వలన దుష్టుడును నిర్మల చరితుడగును. బ్రాహ్మణ సేవ వలననే ఇతర వర్ణముల వారికి ఇహపర సౌఖ్యములు గలుగును. మర్త్య జీవన మశాశ్వతము. ధర్మాచరణము స్వల్ప మైనను ఫలప్రదమే. ధర్మలబ్ధమైన ధనము బహుళ ఫలము నిచ్చును. అవినీతి మహా దోషము అన్యాయార్జిత ధనమెంత యైనను నిష్ఫలమే.

## వృత్తులు - 2

పశుపాలనము వ్యవసాయము, ఇతర వృత్తులు, శూద్రుల ధర్మములు. రాజ ధర్మము ప్రజాపాలన రక్షణ - వైశ్యధర్మము వ్యాపారము - కాని, మధువు మాంసము అమ్మిన దుర్గతి పాలగును. బ్రాహ్మణునకు బ్రతుకు గడవని యపుడు రాజ వైశ్య ధర్మముల వలన ఇబ్బంది లేదు, కాని శూద్ర వృత్తులు తగవు. దానవులొకప్పుడు ధర్మ వర్తనములసహ్యములుగ గణించి దర్పదౌష్ట్యములతో అధర్మవృత్తికి గడగిన కార ణమున వేదపఠనము క్రతువులు పూజలు అణగిపోగా శివుడు వారి దౌష్ట్యమునడచి సురలకు ప్రజలకు ఆనందము కల్పించెను.

## తపము - 3

మునులు విద్యాధరులు దేవతాగణములు తపమువలననే మహావిభవము నందిరి. బ్రహ్మసృష్టి కర్త కాగలిగెను. పూర్వపురాజుల ఔన్నత్యము తపమువలననే వచ్చినది. చేసిన తపస్సు వలననే మంచి ఆహారము, సంపద నివాసము లభించును. భార్యా పుత్రులు మొదలగు సంసార బాధల వలన కలత కలిగినచో తపము వలన చిత్తశాంతి కలుగును. తపము లేని మనుజునకే బహు కష్టములు లోభము సుఖసం తోషములు సంభవించును.

తపమనగా ఎట్టిదో వినుము. సుఖమునకు గర్వము, దుఃఖములకు విషా దములు పొందక మంచి చెడ్డలు సమముగా భావించుట, ప్రాప్తించిన సంపదకే తృప్తి పడుట, లేని దానికై రానిదానికై ఆశలేకపోవుట తపస్సు రూపమని ఆర్యులనిరి. ధర్మము అర్థము సుఖము సద్గతి, తపము వలననే కలుగును.

## చతుర్వర్ణ తారతమ్యములు - 4

బ్రహ్మముఖమునుండి బ్రాహ్మణులు, బాహువులనుండి క్షత్రియులు తొడల నుండి వైశ్యులు పాదములనుండి శూద్రులుద్భవించుటచే తరతమ భేదములు కలిగినవి. పుట్టిన స్థలమును బట్టియు, గుణ కర్మములను బట్టియు ఈ వర్గవిభేదములు తెలియ నగును.

వర్ణధర్మములు వినుము. పుచ్చుకొనుట, యజ్ఞపూజాదులు, విద్యా బోధన బ్రాహ్మణులకు; ప్రజారక్షరాజునకు; వైశ్యులకు వ్యాపారము; పశుపాలన కృషి శూద్రులకు - ఇవి విశేష ధర్మములు.

శుచి, అహింస, అసూయ లేకుండుట, శ్రాద్ధము, అతిథిపూజ, ఏకభార్యాత్వము, సాధారణ ధర్మము.

సర్వ ప్రజలకు సహజధర్మాచరణమే ఇహపరసౌఖ్య సంపదలిచ్చును. మోక్షమయ సుఖము విష్ణు పూజవలన లభించును.

## హింస - అహింస - 5

శమదమ సాధుసద్గుణములు లేని వర్తనము హింసకు దారితీయును. కాన ఆ సద్గుణములను హృదయమందలవరచుకొనుట కర్తవ్యము. భూపతులకు శత్రువులను నిర్జించునపుడు హింస ఆవశ్యకమేకాని అట్టి చర్యకును కొన్ని విధులున్నవి. రణరంగమున క్రిందపడిన వానిని, వెనుకకు పారిపోవు వానిని, ఆయుధము పడిపోయిన వానిని, వాహనము పడిన వానిని పొడువరాదు. అది సుకృతము. న్యాయమైన యుద్ధమున శత్రువులను ఆయుధ హతిచే పోయినవీరునకు మోక్ష ప్రాప్తి తథ్యము. తనతో సముడైన వానిని అధిక బలసంపద గల్గిన శత్రువును సంపగల్గిన వానికి పుణ్యలోక ప్రాప్తి. ఇంద్రియ సమూహము గల్గిన శరీరము, శరీర సుఖములు ఇవి అశాశ్వతములని యెఱిగిన నరుడు ధర్మపథము వీడడు. ఉత్తరాయణము, సంగరోత్సవ కాలములు మంచివైనను, విషముత్రాడు జలమువలన మరణము దుష్టచరితునకగును. నరునకు పెద్ద శత్రువు అజ్ఞానము. అన్ని జన్మములకన్న మానవ జన్మము మేలు. సుగతి సాధనకు అనుకూలము మానవజన్మమే. ఎన్ని సుకృతములున్నను మానవజన్మమును గౌరవించి సార్థకము కావించుకొనుట కర్తవ్యము.

## మేలు - పరమగతి - నాశములేనిదేది

జ్ఞానము, నిస్సంగము మేలు. మహాతపస్సు పరమగతి. ఇవి చేటులేని కృత్యములు. విజ్ఞాని యైన వానిని విషయములేమియు చేయజాలవు. తామరాకున నీటిబొట్లు వలె అవి అంటవు. కర్రకు లక్క రంగు పట్టుకొని విడువనట్లు మూఢాత్ముని పట్టుకొని విషయ సంగము విడువదు. సూర్యుని కాంతికి ఊయి ప్రకాశించునటుల సద్భావముచేత చిత్తము సదాత్మకమగును. ఇంద్రియ నిగ్రహమువలన ఆత్మ సముద్ధరణమావశ్యకము. ఏ చేటును కలుగదు. ఒక్కసారి గెలవేయుటతో తుదముట్టు అరటిచెట్టుగర్భము వంటిది సంసారము. గ్రుడ్డి వాడు అభ్యాసబలమున తన యింట్లో తిరుగునట్లు మూఢుడు సంసారమున తిరుగాడు చుండును. మోక్షపదమెఱుగడు. తామర తూడున పట్టిన బురద కడిగిన వెంటనే పోవునట్లు నిర్మల జ్ఞానమున సంసార బాధ నాశమగును. విషయముల చిక్కుపడిన వాడు పిల్లికి చిక్కిన ఎలుకవలె

నుండును. కామ మోహముల పాలబడిన వాడు సంసార వార్ధిని దాటలేడు. కష్టములు బహుళముగ వచ్చును. సుఖములల్పములే. ఎట్లయినను వీనిని విడుచుటే కర్తవ్యము. తనతో పాటు ఎట్టి భేదము లేక కుటుంబము, స్నేహితులు అందరిని సమముగా చూచువానికి ఆత్మబోధలభింపగలదు.

ఈ ధర్మవిషయములు పరాశరుడు జనక మహారాజునకు చెప్పినవి భీష్ముడు మరల ధర్మరాజునకుపదేశించెను. ఈ ధర్మ రహస్యములను విని ధర్మరాజెంతయో ప్రీతినంది మరల కొన్ని సందేహములడిగెను.

## హంసగీత

గంగా నందనా! సత్యము శమదమములు క్షమ ఉత్తమ గుణములని ఆర్యులు నుడివిరి. ఎందువలన వానికాగొప్పతనము వచ్చినది. తెల్పుమన భీష్ముడీ హంస గీతను ధర్మజునకు చెప్పెను.

చతుర్ముఖుడొకనాడు తన హంస వాహనమెక్కి ఆకాశమున బోవు చుండుట చూచి సాధ్యులను వారు, ఓ పక్షివరా! నీవు చాల విద్యా వంతుడవు మా మనస్సులందు గల సందేహము దయయుంచి తీర్పుమని యిట్లడిగిరి.

గుణములందుత్తమ గుణమేది. పురుషునకెట్టి గుణము అలవడిన కర్మ బంధమోక్షము కలుగును? ఈ ప్రశ్నలకు హంస యిట్లు చెప్పెను.

సత్యము ఓర్పు దమము శ్రేష్ఠములైన ధర్మములు, హృదయమున నున్న చిక్కులను విడదీయగల ధర్మములు. న్యాయముకానివి, అధర్మములు పరుల రహస్యము పరుషములు ఉత్తమ పురుషుడు పలుకడు. ఇతరులు తనను నిందించినను అవమానించినను మారు పలుకక సైరించును. నాకు కీడొనరించి నన్నుకొట్టజూచిన వారినైనను ఎదురాడక వారిమేలు కోరెదను. వేదముల సారము సత్యము-సత్య సారము దమము, దమము అలవడినవారికి ముక్తి పదము లభించును. మనసు వాక్కు స్వాధీనమున నున్నవానికి స్మృతి తపము త్యాగమును సులభముగా లభించును. దమ గుణమున ఇంద్రియముల నణగజేయునతనికి ధర్మమేదో తెలియును. అతని పాపములు నశించును. పాపరాహిత్యమున మబ్బుతెర విడిన చంద్రునివలె చిత్తము పరిశుభ్రమయి ప్రకాశించును. మంచిచెడ్డలు మనము పలికిన మాటలయందే ఉండును. కోపముగలవాని సద్గుణములు సద్వ్రతములు జపతపములు నిష్ఫలములే.

మాటలాడకుండ ఉండుట కంటె మాట్లాడుటే మేలు. ఏమి మాట్లాడవలెను? ఎట్లు మాట్లాడవలెను. వీనినెఱుగుట ముఖ్యము. సత్యము పలుకవలెను.

ధర్మమార్గము పలుకవలెను. సర్వజనులకు ప్రియముగ పలుకవలెను. దేవతలు మెచ్చు కొను విధమిది. సత్సాంగత్యమున సత్వ క్షమాదమములు అలవడును. హంసనుడి విన ఈ వాక్యములు విని సాధ్యులు సంతోషించి మరల కొన్ని ప్రశ్నలడిగిరి. ఆ సంభాషణ ఇట్లు సాగినది.

సాధ్యులు : ప్రపంచము దేనితో నిండి ఉన్నది?
హంస : అజ్ఞానము తో
సాధ్యులు : ఎందుచేత నరుడు ప్రకాశించడు?
హంస : ఈర్ష్య, క్రోధములుండుటచేత
సాధ్యులు : మిత్రులు ఎందులకు విడిపోదురు?
హంస : లోభమున్న కారణమున
సాధ్యులు : మోక్షము ఎందుచేత దూరమగును?
హంస : దుస్సాంగత్యము చేత
సాధ్యులు : ఎవ్వడు తనంత తాను సుఖమనుభవించును?
హంస : ప్రాజ్ఞుడు
సాధ్యులు : ఎవ్వడు పెక్కుమందికి ప్రీతి కలుగుజేయును?
హంస : ప్రాజ్ఞుడు
సాధ్యులు : బలవంతుడెవడు?
హంస : ప్రాజ్ఞుడు బలవంతుడగును.
సాధ్యులు : ఎవడు కలహమునకు దూరముగ నుండును.
హంస : ప్రాజ్ఞుడు కలహమునకు దూరముగ నుండును.
సాధ్యులు : విప్రునకు దేవత్వమేల కలుగును.
హంస : వేద శాస్త్రాధ్యయనము వలన
సాధ్యులు : సాధుత్వము ఏల వెలయును
హంస : వ్రతముల వలన
సాధ్యులు : అసాధుత్వమేల వచ్చును
హంస : వివాదము, శౌచహీనత వలన
సాధ్యులు : దేవత్వమందినవాడు మనుష్యుడు ఎందుచేత అగును
హంస : మరణ భయము గలిగిన చింతతో దీనుడగుటవలన

సాధ్యులకీ విధముగ సమ్మోదము కలిగించి బ్రహ్మతాను మందహాసవదనుడై వెడలెను. బ్రహ్మయే తానీ విధముగ సంవాదము కల్పించి సాధ్యులను హర్షచిత్తుల నొనరించెను.

## సాంఖ్య యోగముల స్వరూపము - తారతమ్యము

ధర్మరాజునకు భీష్ముడిట్లు నుడివెను.

సాంఖ్యులు యోగులు ఇరువర్గములు ఎవరికి వారే వారి వారి కారణములు జెప్పుచు వారి పద్ధతియే మేలందురుకాని పరిశీలించగా రెండును ఒక రూపమైనవే. సాంఖ్యులు శాస్త్రార్థములమీద, యోగులు ప్రత్యక్షహేతువాదముపై ఆధారపడి వాదింతురు. సద్గతిని పొందుటే ఇరువురి లక్ష్యము. సకల భూతముల యందు ప్రియత్వము సదాచారము శౌచము రెండు తెరగులకు ముఖ్యములే. వాటిని పాటించుట యందే దృష్టివేరు.

అట్లయినచో వారిమధ్య యీ భేదమేల వచ్చినది అని ధర్మరాజడిగెను. అంతట భీష్ముడు - యోగులు వారి యోగ బలమున కామ క్రోధాది దుర్గుణములనిర్జించి ఉత్తమ గతినందుదురు. యోగబలములేని వానికీ సుఖ స్థితి లభింపదు. విషయేంద్రియములు అతని యోగసిద్ధికి అవరోధములగును. నియమపాలనగలుగు యోగిని మృత్యువేమియు చేయజాలదు. భోగమునందతనికెపుడును మనసు పోదు. ఆత్మ సుపథమందు వర్తిపజేయు వాడుగా యోగి తాను కావలయును. తల నాభి హృదయము వక్షము చెవులు ప్రక్కలు ఆత్మకు, ఆదరణీయస్థానములు. ఆహారము నందు యోగి ఆడంబరమునకు (పిండివంటలు) ఆసపడడు. నీరు గూడ మితముగ నే త్రాగవలెను. కామక్రోధ నిద్ర ఆశలను వదలి ప్రాణాయామము నభ్యసించు నియమ నిశ్చలుడైన యోగి సుఖస్థానమందును. అట్టి నియమ ధారణ కలవాని కన్నియు సాధ్యములే. జనన మరణ భయములను మంచి చెడ్డలను, సుఖదుఃఖములను, పట్టించు కొనడు. ఏకాంతమైన గుడి గుహ అరణ్యము ద్వీపము ఏదైనను ప్రశాంతమగు నివాసమువలనను, కీడు కలిగినను కలతలేక యుండుటవలన, యోగికి సిద్ధి లభించును. యోగ విధానము జగత్పతి నారాయణుడు చెప్పినదే. మునులకు విధిగా ఆచరణీయము.

### సాంఖ్య స్వరూపము

విషయేంద్రియముల వర్తన, విజృంభణ, మనసు నెట్లు వశపరచుకొని తప్పు

దారి పట్టించునో ఈ విధము సర్వము నిశ్చయజ్ఞానమున తెలిసికొనవలెను. ఆయు వల్పమైనను దీర్ఘమైనను కాల ప్రభావమున మంచి చెడ్డలు కలుగుచునే ఉండును. సత్త్వరజస్తమోగుణముల ప్రభావము బుద్ధిపైనుండుటయే దీనికి కారణము. సత్త్వ గుణాధిక్యముగల ఆత్మ, నారాయణుడు మహేశుడన బరగు. తుదకది పరము దాని వలన మోక్షము కలుగును. మోక్ష భావమునకు త్రిగుణ సంగము ఉండదు. మనుజ ప్రకృతి పదార్థు వికారములకు ( విగుణములకు) ఆశ్రయము. అదే ఆత్మకు నెలవు. నిష్కల్మషుడైన ఆత్ముడు ప్రకృతి వికృతులకు లోబడడు. విషయ సంగము, నిస్సంగము అని ఆత్ముడు రెండు విధములు. వాయువు ఒకటే, కాని ప్రాణాపాన వ్యానోదాన సమానములని అయిదు విధములు వీనిని తెలియుటయే అంతరాత్మ జ్ఞానము. అదియే జననమరణ రాగద్వేష భావములను తొలగజేయును. పుణ్యము లొనరించిన ఆత్ముడు దేవత అగును. మధ్యకర్మములుగలుగు వాడు మనుజుడగును. పాపము లొనర్చిన వాడు పశువో పురుగో అయి పుట్టును. ఈ భేదము నెఱిగిన వానికే మోక్షమార్గమవగతమగును. తనయందుగల దోషములను అజ్ఞాని తెలిసి కొనలేడు. అహంకార దూరుడై వానిని తెలిసికొనగలుగువాడు ఏ వేయిమందిలోనో ఒక్కడుండును.

కామము క్రోధము భయము నిద్ర నిశ్వాసము ఇవి దేహము నందున్న అయిదు దోషములు. క్రోధము ఓర్పువలన, కామము వాంఛలు వీడినందున, భయము ప్రమాద ములకు పోకుండుటవలన, నిద్ర సత్యమువలన, నిశ్వాసము మితభోజనము వలన తగ్గును. ఇంకను గల అనేక దోషములును వివేకమువలన తప్పించుకొన వచ్చును. జ్ఞాని అయినవాడు ప్రాపంచిక మాయా మోహములను లెక్కసేయక మోక్ష మార్గ మున పోవును.

## ఆత్మకు పరమపద ప్రాప్తి

భీష్ముడిట్లు చెప్పెను.

ధర్మజా, సంసారమొక సముద్రము వంటిది. సముద్రమున పాములు మొసళ్ళు తిమింగలములు సుడిగుండము లెట్లు నావకు అవరోధములగునో, సంసారమున వ్యాధులు బాధలు దుఃఖములును పురుషుని నియమ నిష్ఠలకు అడ్డువచ్చును. నావి కుడెట్లెట్లో సముద్రమును దాటి తీరమును జేరినట్లు సాధకుడు జీవన సత్యము అను రహస్య సూక్ష్మమార్గమున చనుచుండ సప్త మారుత రూపుడైన పవనుడు

ఆకాశమునకు జేర్చును. రజస్సు అతనిని ఆకసమునుండి సత్త్వపరమగతికి, సత్త్వము నారాయణుని, నారాయణుడు పరమపదమున జేర్చును. అందు సాధకుని ఆత్మ నిత్యమైన అమృతత్వమును పొందును.

## పూర్వ చరిత్ర జ్ఞానము

అయితే అట్లు అమృతత్వ స్థితి నందిన మహనీయుడు తన పూర్వ చరిత్రను తలచునా అని ధర్మజుడడుగగా భీష్ముడిట్లనుడివెను.

ధర్మజా! ఈ విషయమై కపిలుని ఉపదేశము పొందినవారి అభిప్రాయ మిట్లున్నది. పురుషుని ఇంద్రియములెఱుగవు. అవి మనస్సు సంబంధమైనవే. మోక్ష మార్గమున జ్ఞానమగ్నుడయిన పురుషునకు ఇంద్రియములతో పనిలేదు. అవి ఉండినట్లు తోచినను నిర్వికారుడై వానిని లెక్క చేయడు. మనసును బుద్ధిని అణచుకొనియే జీవుడు పరమ పదమునందును గాన అతనికి పుణ్యపాపములతో పనిలేదు. పునర్జన్మ నందడు. అదియే మోక్షము. అంతకన్న కావలసినదిలేదు. ఇది సాంఖ్య మతము. బ్రహ్మము ఈ భావమును గౌరవించును. ఈ బ్రహ్మ భావమునకు సరి మరిలేదు. వేదశాస్త్ర పురాణములు నుడువు జ్ఞానమునకు ఈ పరమపదమే ఏడుగడ.

సాంఖ్యులు యోగులు చూచు గమ్యస్థానమొకటియే. పేరులే వేరు. ఒక భావమునందు మరియొకటి పరస్పరము ఉండును. ఒకవేళ సాధకునకు యీ అభ్యున్నత స్థితితప్పినను దేవలోకమునకు వచ్చి తిరిగి భూమిపై సదాచారులు ధర్మపరులయిన వారి వంశమున జనించి తన సాధన ఫలితముగ మోక్షస్థితి నందును. నారాయణుడే మోక్షమార్గమును చూపగలదైవము.



# మహాభారత ధర్మశాస్త్రము

## శాంతి పర్వము - షష్ఠాశ్వాసము

### క్షర అక్షర స్వభావము

యోగ సాంఖ్య విదులు అక్షర త్వము నంది పరమానంద స్వరూపులగుదురని భీష్ముడనుడువగా ధర్మరాజు దేవా! దయానిధీ! ఆ అక్షరక్షర అను దశలెట్టివి అనగా జనకునకు వశిష్ఠుడు చెప్పిన విశేషములను విశదీకరించెను.

కళ్ళు ముఖము చేతులు పాదములు ఏదశయందు వృద్ధిగాని క్షీణముగాని లేక ద్వివిధముగాని తత్వమునందు ఉండునో అది అక్షరము. క్షరము వలన క్షీణించు తత్వములు ఇరువది నాలుగున్నవి. క్రియా రహితమై అక్షరము మార్పు జెందును. ఆ మార్పులకు వివిధ నామములున్నవి. అవ్యక్త ప్రకృతి, మహత్తు, దానివలన అహంకారము అందుండి పంచభూతములు అయిదు, వానిగుణములైదు ఇంద్రియములు పది, మనస్సు. ఇవి ఇరువది నాలుగును క్షరము. విజ్ఞానము చేతనే తెలియనగునవి. మొత్తము ఇరువదియైదుగనివి అక్షర మనబడును. త్రిగుణముల వలన అక్షరము మాయా లీలల ప్రదర్శించును. దేవతలనుండి క్రిమికీటకాదుల వరకు గల జన్మలు ఆ ప్రభావమే. నిజ తత్త్వమెరుంగలేక అవి తామే యనిన భావమున నుండును. అనేక వర్ణములలో అనేక రూపములనున్న ఈ అక్షరము నిరాకారమయ్యు ఆకారత నుండును. నిర్గుణమయ్యు సగుణమగును. ఆ రూపములందే అక్షరము తన్ను దాను తెలియక వ్రతములని పూజలని ఉపవాసములని శరీరమును కష్టపెట్టును. ప్రకృతి గుణములవలననే ఈ యజ్ఞానము. నిర్మల వర్తనము శాంతి బోధము వలన అక్షరము ప్రకాశించును.

స్త్రీ పురుష భేదములు అన్ని జీవులలోను వాని వాని జన్యవిధమును బట్టి ఆ రూపము గుణము పొందును. నరనారీ సంబంధము మొదటినుండియు ఉన్నదే. ఇట్లీ రూప జనిత చేష్టలలో బడి ప్రాణులు తమ అక్షర తత్వము మోక్ష మార్గమెఱుగ కున్నవి. వసిష్ఠుడు జనకునకు చెప్పిన అజరము అనంతమైన జ్యోతీ రూపము నిట్లు నుడివెను.

సత్వరజస్తమముల ప్రభావమునుసరించి నరజంతు పక్షి యోనుల జనించి అక్షరము తన్నుదానెఱుగలేక క్రీడించుచుండును. తెలుపు ఎఱుపు నలుపు వర్ణము లొంది మరల త్రిగుణ ప్రభావమున వికృత వర్ణమగును. అక్షరము నిర్గుణమైనదయ్యు

గుణ సహితమై అహంకారము విడిచినపుడే నిర్గుణత శోభిల్లును. వ్రతములు తీర్థములు ఉపవాసములు మున్నగు వాని వలన అక్షరము శరీరమును బాధపెట్టుటయే గాక తనకు దాన బంధము లేర్పరచుకొనును. శాంతిబోధ ఘనత వలన నిర్మలమై అక్షరము ప్రకాశించును.

### జన్యముల స్వభావము - మోక్ష తత్త్వము

జనకుడు వసిష్ఠునిట్లడిగెను. మునీంద్రా! పురుషుడైనను స్త్రీయైనను తనకు దానుగా మరియొక రూపము నొనరించలేరు. చర్మమాంస శోణితములైన వనిత గుణములు, మజ్జాస్థి స్నాయువులగు పురుషగుణములతో కలిసి జన్యములు పుట్టునని శ్రుతిసూక్తి. నరనారీ సంబంధమే ప్రజాసృష్టికి కారణము.

జనకుడు మరల మునివర్యా ప్రకృతి పురుషులను గూర్చి స్పష్టముగ వచించినట్లే, అతీంద్రియము, అనంతము, అజరము అని చెప్పబడిన మోక్షమును గూర్చి తెలిసికొను మార్గము నుడువుమన వసిష్ఠుడిట్లు నుడివెను.

కేవలము గ్రంథపఠనము ఫలప్రదము కాదు. దాని యందున్న అర్థమును గ్రహించినపుడే తత్ప్రయోజన మవగతమగును. యోగ విధానమునసుసరించియే సాంఖ్యము కలదు. ప్రయోజనమున అవి రెండును ఒకటే. ప్రకృతి యందు గల స్త్రీ పుంస నపుంసక లింగములు ఆత్మకులేవు. ఆత్మ నిర్గుణుడు. బీజము ఇంద్రియము మనసు ఆత్మకు లేవు. జ్ఞాన బోధ లేనివారు అక్షరక్షర వివేకమును గ్రహింపలేరు. సాంఖ్యులు యోగులు బుద్ధికి అతీతంబయి ఇరువది యైదు విధములుగ నున్న యాతత్త్వమును చూడగలరు.

జనకుడు మరల వసిష్ఠునిట్లడిగెను. ఆత్మునకు ఏకత్వము అనేకత్వము కలదందురు. సాంఖ్యము యోగము అను విషయములు నాకు విశదముగా నుడువుము. అనగా వసిష్ఠుడిట్లు చెప్పెను.

ఇతర ఆసక్తి లేని ధ్యానము యోగము. ప్రాణాయామము మనసు ఏకాగ్రత నుండుట ఇవి సగుణ నిర్గుణ భావములు. మల మూత్రముల కాలమున భోజనానంతరము యోగమలవడదు. అనన్య చింతనుడై మిత భుక్తి కలవాడయి మనసును ఆత్మయందు నిలుపగల యోగి ఆనంద మనుభవించును.

ఇక సాంఖ్య ప్రకారము వినుము.

ప్రకృతి అవ్యక్తమైనదని కొందఱందురు. కాని ప్రకృతి, బుద్ధి అహంకారము పంచభూతములు ఇంద్రియములు విషయములుగా తన్ను దాను విస్తరించుకొనును.

పురుషుని వలన నివి కలుగును. అతడధిష్ఠాత. సృష్టి ప్రళయములతనికేకతయే. అవ్యక్తము క్షేత్రము అన ప్రకృతియే. దానినెఱిగిన వాడు క్షేత్రజ్ఞుడు అందు వసించు వాడు గాన పురుషుడు అని జీవునకు పేర్లు. క్షేత్ర క్షేత్రజ్ఞులు వేర్వేరు. ప్రకృతి సగుణాత్మిక, పురుషుడు నిర్గుణుడు. ఇది సాంఖ్యము. ఇరువదినాల్గు తత్త్వములు కలది. పురుషుడు తన్నుదాను తెలిసికొనుటయే కైవల్యసిద్ధి దానికి పునరావృత్తి లేదు. అది అక్షరము.

## ఇక విద్య అవిద్యల ప్రకారమెఱుగుము

విద్య అనగా ఇరువది యైదు తత్వములయిన అక్షరము. ఆ విద్యను తెలిసికొనుము.

కర్మేంద్రియములకు జ్ఞానేంద్రియము విద్య, జ్ఞానమునకు మనస్సు, మనస్సునకు పంచభూతములు, పంచభూతములకు అహంకారము, అహంకారమునకు బుద్ధి, బుద్ధికి అవ్యక్తము, అవ్యక్తమునకు ఇరువది యైదు తత్వములును విద్య అనబడును.

జీవుడు అక్షరము, ప్రకృతిక్షరము. రెండును ఆద్యంతరహితములు. ఈశ్వరత్వము కలసి, ప్రకృతి గుణములు అహంకారాది కములు కలసినపుడు పురుషుడు క్షరము అనబడినను గుణవికారములు లేమిచే అక్షరము.

సంగాభి భూతమైనది. బహురూపములు గలది. బహుజన్మములిచ్చు మమతను విడిచినప్పుడు జీవుడు నిర్మలుడగును. అది నిశ్చయమైన పదము. ఇట్టి బోధ వలన క్షరము వదలి అక్షరమగును. ఈ అక్షరమునకు పరమైనది సాంఖ్య రహస్యమెఱిగినవారికే విదితము. ఈ పరమైన స్థితియే ఇరువది యారు తత్వములు గలిగి తక్కిన తత్వముల జ్ఞానము ప్రకాశించును. ఇది సనాతనము. జీవతత్వము దృశ్యము, పరతత్వము అదృశ్యము వీనికి బ్రహ్మము అనిపేరు. ప్రకృతికి ఇవిలేవు.

సగుణమైన ప్రకృతిని వదలిన జీవుడు పరమ పదమును గనుటయే కైవల్యసిద్ధి. ఏకత్వము అనేకత్వము లిట్లు గల పురుషుని తెలియు విధమిదియే. ఇదియే మోక్షము. పూర్వములేని నిర్మలత శుచిత్వము స్వాతంత్రత సత్త్వపరతతో భాసించును. అవి హరము, బ్రహ్మము, శివమయ శాశ్వతమగు పదమిదియే.

జనకమహారాజా! ఈ విధమున నీవీ ఆత్మవిద్యను తెలిసికొని ధన్యుడవగుము. శమదమవంతుడై దీనియందాసక్తిగలవానికేదీని విచెప్పుము. ఆసక్తిలేని వానికి కైవల్యసిద్ధి రహస్యము చెప్పవలదు.

ఈ తత్త్వము మొదట బ్రహ్మవసిస్ఠునకు, అతడు నారదునకు నారదుడు భీష్మునకు జెప్పినది. భీష్ముడు దానిని ధర్మరాజునకు తేటపరచి మఱియొక వృత్తాంతము నుడివెను.

## వసుమంతుని వృత్తాంతము

జనకుని కుమారుడు వసుమంతుడను వాడు ఒకనాడు వేటకు చని, అచ టనొక మునీంద్రుజూచి ఇహపరసౌఖ్యములెట్లు పొందనగును అని అడుగగా ముని యిట్లు నుడివెను.

సకల ప్రాణులకు హితము చేయుట సుఖప్రదము. కీడు చేయుట దుఃఖ ప్రదము. నరుడు తన సుఖము కొరకే ఆశ పడును. అందుగల చేటు నెరుగుడు. ధర్మము, జ్ఞానము, చిత్తశుద్ధి వలన ఇహపరములు రెండు లోకముల యందు మేలును పొందును. క్రోధమును కామమును అణచుకొనుము. ఉత్తములయిన విప్రులకు ఇతరులకు దానము చేయుచు, ఇచ్చితినని బాధపడకు. కామక్రోధము లణచుకొన లేక మహాభిషుడను రాజు స్వర్గ పదము నుండి భ్రష్టుడయ్యెను. యయాతి ఆ దుర్గుణముల వదలి కీర్తి మంతుడయ్యెను.

## యాజ్ఞవల్క్య జనకరాజ సంవాదము

భీష్ముడు నుడివినదంతయు విని ధర్మరాజు మరల జనన మరణములులేని సంశయములు లేని అవ్యయమైన పరము ఎట్టిది, ధర్మాధర్మము లెట్టివి అనగా భీష్ముడీ యితి హాసము నుడివెను.

యాజ్ఞ వల్క్యుడు మునీంద్రులలో మహా మునీంద్రుడు. వేదోపనిషత్ సర్వశాస్త్ర రహస్యము లెఱిగిన విజ్ఞాన ఘనుడు. జనక మహారాజాతని వద్దకేగి వినతుడై ఇంద్రియములు - అవ్యక్తము బ్రహ్మము పరము - భూతసర్గ ప్రళయములు కాల సంఖ్యను గూర్చి తెలియ జెప్పుడని ప్రార్థింపగా ఆ ముని వరుడిట్లు చెప్పెను.

అవ్యక్తము సృష్టి ప్రళయముల నొనరించును. పది కల్పములు బ్రహ్మకు ఒక పగలు. రాత్రికిని అంతకాలమే. పగటి వేళ సృష్టియగును. రాత్రి ప్రళయము సర్వము నశించును. మరల సృష్టి ప్రారంభము. సర్వ భూతములకు సర్వ ప్రాణులకు సర్వ లోకముల వారికి జీవనాధారమగు ఓషధులను ధాత సృజించును. ఇంద్రియములు శరీర భాగములు ముక్కు చెవి మున్నగునవి, వానికవి తమంతట పనిచేయవు. మనస్సు యొక్క ప్రభావమున అవి పనిచేయును. మనస్సు ఆ స్వామియే. ఈ మనస్సు వలననే ఇంద్రియముల చంచలత్వమును అణగింపవలయును.

రాత్రి యగుటతో ప్రళయ అవ్యక్తము అహంకృతి యొక్క బోధము వలన పురుషుడు 12 రూపముల తనరశ్మిచే సర్వ భూతములను రూపు మాపును. ఈ సమయమున పృథ్వి జలమయమగును. జలముపై అగ్నులు లేచును అగ్నులపై వాయువు వీచును. ఇవి ఒకదాని నొకటి అణగింపజూడగా ఆ వాయువును ఆకాశము మింగును. ఈ సర్వమ్మును అహంకార పూర్ణుడైన పురుషుడు కబళించును. ఆ అహంకృతిని అవ్యక్తము తనలో లీనమొనర్చుకొనును. మరల ఎప్పటియట్ల సృష్టి.

## అధ్యాత్మ అధిభూత అధిదైవతములు

మనస్సు అధ్యాత్మము. చేయించునది అధిభూతము, బ్రహ్మము అధిదైవము అని వేదవాక్కులు - జ్ఞానమువలన తెలిసికొనగలిగినదే అధిదైవము.

సత్త్వాది గుణములవలన ప్రకృతి నానావిధముల బోవును. సత్త్వము ఆనంద ప్రదము. రజోగుణములు గర్వ క్రోధాభిమానాదులు, మూఢత్వము తిండి పోతు తనము మోహము తమోగుణములు. ఈ గుణ వికా ములు పురుషుని వశపరచు గొన జూచును. సత్త్వము వలన దేవతాస్థితి, రజస్సు వలన మానవ స్థితి, తమస్సు వలన రౌరవము ప్రాప్తించును. తనను ఎఱిగిన ఆత్మ శాశ్వత పదమును బొందిన అక్షరుడు జరాజననమరణ రహితుడు.

ప్రకృతి గుణాయుతము పురుషుని తత్త్వము నెఱుగదు. కావున అచేతన పురుషుడు తనకు పరము లేదని యెఱుగును గాన చేతనము. పురుషునిలో ప్రకృతి నిల్చును. తానే ప్రకృతి అయినను పురుషునికి నిర్వికారత లేదు.

ఈపై జెప్పినదంతయు సాంఖ్యము. ఇక యోగ ప్రకారము వినుము. రెండును వేరువేరు కాదు. యోగమున రెండు తంత్రములు కలవు. ఒకటి నిర్గుణమగు మనో ధారణ, రెండవది సగుణమగు ప్రాణాయామవిధి.

ప్రాణాయామము శరీరమునకు పీడలేకుండ క్రమముగ సలుపవలయును. ఈ తంత్రమువలన శరీరము మనస్సు శుద్ధి యగును.

నిర్గుణతంత్రము. మనస్సు ఇంద్రియముల నణగ ద్రొక్కవలయును. బుద్ధి ధ్యానైకతత్పరతను పొందవలయును. ధ్యానము వలన జ్ఞానమయుడైన శాశ్వతుని తెలిసికొన గలుగును. అతని చిత్తము మేఘములు లేని ఆకాశము, తరంగ చలనము లేని సముద్రము వలె శాంత స్థితి నుండును. ఆత్మానంద రసము నాతడు అనుభ వించును. వివిధములయిన శరీరాంగకములందు వివిధ దైవస్వరూపముల తేజము వెలుగు చుండును. ధ్యాన సమయ ఉచ్ఛ్వాస నిశ్వాస పవనక్రమములందు యోగి వ రుడా దైవత తేజముల చూడగలుగును.

## మరణ సూచకములు

ధ్రువమండలమున నున్న అరుంధతి నక్షత్రమును చూడలేనిచో, ముక్కు ప్రక్క భాగము వాచినను, పూర్ణ చంద్రుడు మసిమసిగా కనపడినను ఒకవత్సరమే ఆయువు. దేహమున కాంతి ఆకస్మికముగ ఎక్కువైనను తగ్గినను, ప్రజ్ఞకూడ అట్లే ఎక్కువైనను తగ్గినను ఆఱు నెలలలో మరణదశ. చంద్రునిలో గాని సూర్యునిలో గాని మధ్యగా తెఱపి కన్పడిన ఏడు దినములలో మృత్యువు, గుడియందున్నపుడు సుగంధ ద్రవ్యములు దుర్వాసన నిచ్చిన ఆఱు దినములందు మృత్యువు. ముక్కు క్రిందకు వ్రాలుట చెవులు వ్రేలాడుట, పళ్ళు రంగు చెడుట కనులు మూసి కొనిపోవుట, దేహము నల్లబడిపోవుట వెంటనే మృత్యువగును. కనులందకారణముగ నీరు గారిన, తలనుండి పొగ ఎగయుట మరణదశయే.

యోగి అయినవాడు మరణ దశకన్గొని ధ్యానపరుడై ఆత్మను పరమందు జేర్చి కాలము గడపుచు మృత్యువును జయించును. ఇది అనామయమైన అవ్యయమైనస్థితి.

పరమును గూర్చి యాజ్ఞ వల్క్యుడిట్లు నుడివెను.

## పరము అనగా ఎట్టిది. సరస్వతీ దర్శనము

యాజ్ఞ వల్క్యుడు జనక మహారాజునకు చెప్పిన విధము. జనక రాజేంద్రా వినుము. నా అనుభవమును చెప్పెదను. నా తపః ఫలముగా సూర్యుడు ప్రత్యక్షమై నా కోరికను మన్నించి, నన్ను నోరు తెఱవుమని అందుండి సరస్వతి నన్ను జేరున ట్లనుగ్రహించెను. నాకు తెలియని యొక భీతి జనింప, నన్ను కుదుట పఱచి, మార్తాండుడు వేదములు నీయందు భాసిల్లును. భక్తియలవడి శరణాగతి లభించును, సాంఖ్య యోగ ధర్మములవగతములగును, బుద్ధి యందుల్లాసము కలుగునని, నుడువగా చిత్తమానందమయమైనది. వచశ్చాతుర్య మలవడినది. సూర్యుడస్తంగతుడయ్యెను. సరస్వతిని తలచుచు నేను నా నివాసమునకేగి ఓంకారమధ్యమున మధురస్వర వ్యంజన శబ్ద సహితముగ వాగ్దేవి నాకనుల ముందు గోచరమైనది. ఆ పూజా మూర్తిని ధ్యానించుచు శిష్యులచే వేదాధ్యయనమ్ము చేయించుచున్న తరుణమున వాఙ్మయ బ్రహ్మము ఫలముగ యోగసాంఖ్యరూపముల ఉపాయములు బుద్ధికి అవగతములైనవి.

## విశ్వావసునకు యాజ్ఞవల్కుని ఉపదేశము

ఇంతలో విశ్వావసుడను గంధర్వరాజు నన్నెన్నియో విషయములడిగెను. వానికి నాయుత్తరములును వినుము.

విశ్వము : భూతమయమగునది. వ్యక్తము. అవ్యక్తనామ ప్రకృతి. నిర్గుణుండగు పురుషుడు.

మిత్రావరుణులు - ప్రకృతి పురుషులు

జ్ఞాన జ్ఞేయములు, తపోజపంబులు, సూర్యాతి సూర్యులు - ప్రకృతి పురుషులు
విద్య, వేద్యము, అచలము - పురుషుడు

ప్రకృతి వాచకములు

అవిద్య అవేద్య, చలము

తెలిసికొనదగినదాని తెలిసికొనలేని వేదపాఠము వ్యర్థము

వేదము వలన క్షరాక్షరములు విశదమగును. క్షరమును వదలి అక్షరమును గ్రహించవలెను.

అక్షరమైన 25 తత్త్వముల తత్పరతవలన కైవల్యము కైవల్యము వలన 26 తత్త్వముల దర్శనము పురుషునకగు, పురుషుని అవ్యక్తము రెండు విధములుగ జూచు వాడే పురుషోత్తముడు. ఇరువురును రెండుగాదు ఒకే రూపము.

పరము అనగా పురుషోత్తమ షడ్వింశములు పరమేశ్వరుడు అని నామములు. విశ్వావసునకు మరల సందేహముకల్గినది. పంచవింశకతత్త్వమునకు పరముగలుగుట అది రూపమున ఒక్కటే అని అందురు. ఇదియెట్లు అని సంశయము. పురుషునకు అవ్యక్తము అవగతమైనపుడే పురుషోత్తముడందురు. పంచవింశకుండయిన పురుషుడు ప్రకృతినుండి విడివడి తన్నుతానెఱిగిన స్థితియే షడ్వింశకత్వము. పురుషుడు పురుషోత్తముడు ఇరువరయ్యు పురుషోత్తమునందు పురుషుడుండు గ్రహణ శక్తియే ఏకత్వమును జూచువిజ్ఞానము. ఈ జ్ఞానమే మోక్షము. జనన మరణ రాహిత్యము. ఈ వచనములు విని విశ్వావసుడు సంతృప్త హృదయుడై వెడలెను. జనకుండును ఈ గాథను విని పరితుష్ట మానసుండయ్యెను.

## గృహస్థునకు మోక్షప్రాప్తి - జనక సులభ సంవాదము

భీష్ముడునుడువగా పై విషయములన్నియు వినిన ధర్మరాజు గృహస్థుడుగా నున్న వానికి మోక్షప్రాప్తి కలుగునా, అను ప్రశ్ననడిగెను. భీష్ముడంతట, రాజ్యపాలకుడయ్యు నిష్కామ కర్మయోగియను పేరుగన్న జనకునకును సులభయను యోగినికి జరిగిన సంవాదము నిట్లు చెప్పెను.

జనకమహారాజు యోగ దీక్ష యెట్టిదో ఆతని బోధము ఏవిధమైనదో పరీ

క్షింప దలచి సులభయను వనిత తన యోగశక్తిచే సుందర కాంతాకృతి ధరించి జనకు నింటికేగి, అతిథి మర్యాద లందిన పిదప సమీపమున జేరి కూర్చొని ఆతని మన స్సున ప్రవేశించి కామవికారము కల్గింప యత్నించెను.

ఆమె చేయుచున్న విలాస చేష్టలు గ్రహించి, జనకుడు చిరునవ్వుచు నామెను జూచి వనితా నీవెవ్వరవు. ఇచటికెందులకు వచ్చితివి. ఐనను నా పలుకులు వినుము.

నేను పంచశిఖుడను ముని శిష్యుడను. అతని వద్ద మూడు ధర్మములను నిష్ఠతో నేర్చితిని. సాంఖ్యము, యోగము రాజ్య పాలన. ఇవియే మోక్షధర్మములు. స్థిరమగు జ్ఞానము వలన విరక్తి కలిగినది. దానివలన నిస్సంగుడనై చరింతును. సుఖ దుఃఖములు నాకు సమానము, నా దృష్టిలో ఇనుము బంగారము సమానము, నన్ను నుతించి చందనము పూసినను, నిందించి కత్తితో కొట్టినను సమచిత్తమే. జ్ఞానము కర్మము మోక్షపథములే. గురువచనముగ మూడవ మార్గమనుసరింతును. గృహస్థునిగా నుండియే. నియమ నిష్ఠలతో నడచుకొందును.

ఇంకను వినుము. ఏదో కారణమున గృహము వదలి సన్యాస ఆశ్రమమును గైకొన్నంత మాత్రమున ముక్తిరాదు. దండకమండలువులు కాషాయ వస్త్రములు లింగధారణము వలన ప్రయోజనమేమి. శమదమములు గలిగి మనుజుడు నిస్సంగి కావలెను. నేను రాగరహితుడునయి యట్లు వర్తింతును. వనితా నీవు బ్రాహ్మణ స్త్రీవి. నాయందనురాగముచే నీ నిజరూపము దాచి కామినివై వచ్చితివి. ఇక నైన ను నీ చెడ్డ చూపులు మానుము. నీవు యోగినివి. నీకీ చౌరవ ఎట్లు వచ్చినది అని జనకుడు స్పష్టముగ పలికిన మాటలు విని ఆ కాంత-

రాజా! నీమాటలు సరియే. నా విషయమును గూడ వినుము. నీ వెవరవు. ఎవ్వరి దానవని అడిగితివి. ఏమి చెప్పుదును. భూమిపై మనుజులు ఎవ్వరి కెవ్వ రగుదురు. ఇంద్రియములు పదియు ఒక్కొక్కటి తమపని తాము చేయునట్లు ఎవ రికి వారే. అయినను నా చెప్పెడు మాటలు వినుము. నీవు నిన్ను తలచునటుల ఒరులను గూడ అట్లే భావింపవలయునుగదా. వీరు మిత్రులు వారు శత్రువులని భావించువలన ముక్తి లభింపదు. అందుచేత నీవు ముక్తుడవుగావు. ముక్తుడనని భావించుచున్నావు. నీవు నరపాలుడవు. నీమనసెప్పుడును పాలనా విషయము లందే యుండును. అమాత్యాది పరివారమును ప్రజలును పరిపరివిధములనుందురు. వారిని చూడవలయును. నేను నీ చిత్తమున ప్రవేశించినంత మాత్రమున నన్ను నిరసించితివి. ఇది ముక్తుని చందము కాదు. ముక్తుడయిన వాని మనసు శూన్యము

నిరాసక్తముగదా. అందులకు నిన్ను జొచ్చితి. నా శరీరాంగములు నిను దాకలేదు ఎందులకీ చింత. ఈ మంత్రుల ముందు పరివారముల ముందు ఒక స్త్రీని నిందసే యుట నీకు తగదు. నీకు గృహధర్మము లేదు మోక్షధర్మమును లేదు. నీ జ్ఞానము మిథ్య అయినది. ముక్తులు ముక్తులను కలియుట యుక్తము. మనము ముక్తులము కాకున్నను మన సాంగత్యమున తప్పులేదు.

నా చరిత్రమును వినుము. నా పేరు సులభ. ప్రధనుడను రాజవంశమున పుట్టినాను. మా పూర్వులు శతశృంగ ద్రోణాది పవిత్ర ప్రదేశముల అనేక యాగ ములొనర్చిరి. ఇంద్రుడే వచ్చి వారితో ధర్మచింతన సేయును. నాకు ఎనయ్యైన పురుషుడు లేడు. నీకు ముక్తి ఉన్నదో లేదో చూచుటకు వచ్చితిని. అంతియేగాని మరొండు లేదు. నీవు నిజముగ ముక్తుడవు. అగ్ని వేడిగా ఉన్నదో చల్లగానున్నదో యని పరీక్షసేయుట అవివేకము. నా పలుకు లసత్యములు నీవు ముని సేవసీయు డవు నా అపరాధము సైచి, నిస్సంగినైన నన్నీనాడిచ్చట నుండనిమ్మనగా, జనకుడు మంత్రులును సంతసించి ఆమెతో ధర్మచింతన మున నుండిరి. మఱునాడామె అట నుండి వెడలెను.

## వేదవ్యాసుడు శుకునకు వైరాగ్యముపదేశించుట

ధర్మజుడడుగగా భీష్ముడిట్లు చెప్పెను

శుకుడు వ్యాసుని కుమారుడు. మహర్షి కుమారుడయ్యు ధర్మచింతనము లేక సామాన్యునివలె తిరుగు చుండెను. వ్యాసుడది గమనించి, తనయా! ఈ ప్రాకృత వర్తనము నీకు తగదు. ఇంద్రియములను మనస్సును అణచి యుంచుము. కోపము లేకపోవుట సత్యశమదమ తప అహింసలు ఓర్పు ధర్మములు. తిండిపోతు తనము తగ్గించుము. నీలోనున్న జీవుడెవరో గమనింపుము. దినదినము ఆయువు తరిగి పోవుచుండుట గమనింపుము. జ్ఞానులు చెప్పిన మాట వినకుండ విషయ తత్పరు లగుట అప్పటికప్పుడు సుఖము అనిపించినను తుదకు ఆపదలను తెచ్చిపెట్టును. ధర్మవృత్తి తెలియని అవివేకి తనకు తానే శత్రువు. ధైర్యమున ఇంద్రియ నిగ్రహము పాటింపవలెను. మానవ జన్మము అందు బ్రాహ్మణత్వము లభించుట కడుదుర్లభము. దానిని సద్వినియోగము చేయవలయు. జన్మించినది మొదలు ముసలితనము మృత్యువు వెంటాడుచునే ఉండును. బంధు మిత్రులు కాపాడలేరు. నిస్సంగమున నుండు టొకటే మార్గము. భోగ లాలస విడచి నిర్మల భావమున తపము ముక్తికి మార్గము. బంధుత్వము అశాశ్వతము. నేను ఎవరివాడనుగాను. నా మంచి నేనే చూచుకొనవలయు. దారాపుత్రుల యందపేక్ష తన దారికి బంధనమే. ధనభోగముల చెంతబోక జితేంద్రియుడగుటయే జీవన ధర్మము.

## శుకుని జన్మవృత్తాంతము

మేరు పర్వత తటమున పరమ శివుడు పార్వతిని గూడి, తన ప్రమథ గణములతో కొలువు దీరి యుండ, వ్యాసుడు పుత్ర సంతతిని కోరి అచ్చట యోగ బలమున తప మారంబించెను. ఆ మహా తపస్సునకు తృప్తి పడి పరమ శివుడు ప్రత్యక్షమై వ్యాసుడు కోరిన విధమున పంచభూత సమ వీర్యుడగు పుత్ర సంతతి కలుగునని వరమిచ్చెను. తన యాశ్రమమున వ్యాసుడు అరణిమధించి అగ్ని హోత్ర పూజయందున్న యపుడు మహా సౌందర్యవతియగు ఘృతాచి యను నప్సర అచటికి రాగా ఆమెను జూచి కామపరవశుడయ్యెను. ఆమెయు మన్మథుని వాహనమగు ఒక సుందరమైన చిలుక రూపమున అచ్చటనే చెట్టుపై నుండెను. కామ వాంఛలోనున్న వ్యాసుని వీర్యము స్ఖలితమై అగ్నియందు బడి, అందుండి మహాతేజస్వియగు సుతుడు జనించెను. ఆ బిడ్డకు శుకుడు అని నామము వచ్చినది.

అగ్ని తేజస్కుడై జన్మించిన ఆ శుకునకు అభ్రగంగ సాకారయై వచ్చి మంగళ స్నానము చేయించినది. ఆకసమునుండి కృష్ణాజినదండంబు లాతని ముందు పడినవి. పార్వతీసహితుడయి పరమ శివుడేతెంచి ఆ బాలునికి ఉపనయనము చేసి నాడు. ఇంద్రుడు కమండలువు దేవతలు ఎప్పుడును మాయని వస్త్రములిచ్చి గౌరవించిరి. దివ్యదుందుభులు మ్రోగినవి. దేవాంగనా గానములు వాయులీనములై వచ్చినవి. పంచ భూత ప్రభావమునందిన ఆ బాలునియందు వేదములు చేరినవి. ఆచారాను సారమా బాలకుడు తండ్రియగు వ్యాసుని గురువుగా వరించి వేద వేదాంగ ధర్మ శాస్త్ర రాజనీత్యాది సకల విద్యలు నేర్చెను.

తండ్రి ఆశ్రమము వద్దనే శుకుడుండి ముని వాటిక యందలి బాలురతో నాడుచు వేద శాస్త్రధర్మాచరణము నందు శ్రద్ధ చూపకపోవుట వ్యాసుడు గ్రహించి దేహంబు నందు మమత మంచిదికాదని సాంఖ్యయోగ శాస్త్రములుపదేశించెను. శుకుండును అందలి జ్ఞానము నెఱిగి, బ్రహ్మచర్య గృహస్థ వాన ప్రస్థ ధర్మంబు లందాస పడక, ధర్మమునుపదేశింపుడని తండ్రినడిగెను.

## శుకునకు జనకుని ఉపదేశము

తనయా! నీకు మోక్ష ధర్మమెఱిగింపగలధన్యుడు జనక మహారాజు. వారి వద్దకేగుము. వారివద్ద అహంకారము మమత పనికిరావు. అతడు పూజ్యుడు అనిన తండ్రి మాటలు విని శుకుడు వెంటనే బయలుదేరి కాలినడకనే నదీనద శైల ప్రదేశ

ములు గడచి మిథిల కేగి రాజ ప్రాసాదమున చేరెను. ద్వారపాలకులడ్డగింపగా తానేగు దెంచిన విషయమునుడివెను. వారు లోనికి పోనిచ్చిరి. భవనములో నున్న రక్షక భటులు అడ్డగించిరి. నమ్రస్వభావమున వారికిని తన తలపు నుడివెను. ఈయన యెవరో విశిష్టవ్యక్తియని భటులు లోనికి పోయి నుడువగా జనకుడు పురోహితునంపెను. అతడును శుకుని జూచి ఆశ్చర్యపడి భక్తి శ్రద్ధలతో ఆముని బాలకుని రాజు,నొద్దకు కొంపోయెను. జనక భూపతియు శుకునకు గౌరవ పూర్వకముగ అతిథి మర్యాదలు జరిపి సుఖాసీనుగావించి కుశల ప్రశ్నములడిగి, సముచితమగు విడిదల నేర్పరచి అన్నపానాదులకేర్పాటు గావించి వినోదమునకై గాయనీ మణులను నియోగించెను. ఇన్ని మర్యాదలొనర్చినను శుకుడు వాని యందాసక్తి చూపకుండెను. మఱునాడు మంత్రి పరివార సమేతుడై రాజు తన వద్దకు వచ్చి ఆసీనుడై ఏమి కారణమున విచ్చే సితిరని అడుగగనే, శుకుడతి వినయమున రాజా! నా తండ్రి వ్యాసమహర్షి పంపగా తమవద్ద మోక్షబోధము వినుటకు వచ్చితినని శుకుడు విన్నవించెను. జనకుడంతట మునీంద్రా! నాయభిప్రాయము వినుము. విప్రు డుపనీతుడయి బ్రాహ్మచర్యమున వేద శాస్త్రము అధ్యయనము చేసి, గృహస్థుడయి సంతానమును బడసి క్రతువు లొనర్చి అతిథి అభ్యాగతుల నర్చించి, అగ్ని హోత్రయుతముగ వాన ప్రస్థముకు జని రాగద్వేషాది గుణముల వర్జించి అగ్నులను తన యందారోపించుకొని చిత్తశాంతి నొందిన వాడు బ్రహ్మానందపదము నొందును. అని చెప్పిన జనకునుపదేశమును విని శుకుడు, రాజా జ్ఞానోదయమైన వారును మొదటి మూడాశ్రమములు ఆచరింప వలెనా, వేద విధులెట్లున్నవి యని ప్రశ్నింప, జనకుడు మునీంద్రా! జ్ఞాన విజ్ఞాన ములు గల వాడును ఆ మూడాశ్రమములను కర్మవ్యాకులుడు కాకుండుటకు గడ పవలసినదే పూర్వమునులట్లు గడపిరి. పూర్వజన్మ సిద్ధివలన ఏ యాశ్రమము నం దైనను జ్ఞానియై తనయందు సర్వమును, సర్వము తనయందు జూచిన వాడు ముక్తి జెందిన వాడే, అయినను నీ సందేహ వృత్తికి యయాతి యను మహారాజు చెప్పిన మాటలు చెప్పెదను వినుము.

జ్యోతి ఆత్మ యందె యున్నది. సర్వమును సమతా దృష్టితో జూచిసుఖ దుఃఖములు సమముగా నెంచి, పరులను తనవలె జూచి ఇంద్రియచేష్టలనణచువానికి బ్రహ్మపదము లభ్యమగును. అని యయాతినుడివెను నీ యందివి యన్నియునున్నవి. మోక్ష బోధమునీకవగతమైనది. నీ మదికి దోచిన విధమొనర్చుమని జనకుడు శుకుని వీడ్కొలిపెను.

## శుకుడు తిరిగి తండ్రివద్దకు వచ్చుట

వ్యాసుడు హిమగిరి యాశ్రమమున తన నలువురు శిష్యులు, సుమంత పైల వైశంపాయన జైమినులను అధ్యయనము చేయించుచుండెను. హిమపత్పర్వతము బహు పవిత్రమైనది. సకల ప్రకృతి సంపదన్వితము. పుణ్య విభవ సంయుతము. ని ఖిలామరులు గరుడ గంధర్వాదులచట సుఖంబుగ నుందురు. పరమేశ్వరుడచ్చట బహు సంవత్సరములు పుత్రవాంఛ తపమాచరించెను. శివాంశ సంభవుడు కుమార స్వామియు ఆత్మశక్తి వలన దేవాధిక తేజస్వి యయ్యెను. శుకుడు ఆ సమయమున తండ్రి ఆశ్రమమున కేతెంచెను. జనకునిచే ప్రబోధితుడైన తనయుని జూచి వ్యాసుడు సమ్మదితుడై శుకునభినందించి శిష్యులతో గలిపి యతనికి గూడ అధ్యాపనంబొన రించు చుండెను.

ఒకనాడా నలువురు శిష్యులును పారాశర్యుని జూచి గురుదేవా! నీ ప్రబోధ మున మాకు వేద విద్య సర్వమును తెలియవచ్చినది మాకు వలె తక్కిన వారి కంత అధికముగా నీవు వచింప వేలయని యడుగగా, వ్యాసుడు నవ్వి భక్తుడగు వానికి వాగ్బ్రహ్మము సకలవిద్యలనిచ్చును. మీరును ఇతర ప్రాంతములకేగి అచటి వారిని విద్యావంతులజేయుడని దీవించి పంపెను.

## సప్త పవనములు

వ్యాసముని యాశ్రమంబున కొకనాడు నారదుడరుదెంచి, శిష్యులుగాని మరె వ్వరుగాని అధ్యయనము చేయుచుండుట లేమి చూచి ఇదేమి వ్యాస ఋషీ! నీవును కుమారుడును వేద నినాదమును వినిపింపవచ్చును గదా అనినంత వ్యాసుడట్లే గావించెను. ఒకనాడొక మహా భీకరమయిన వాయువు వచ్చుట చూచి వ్యాసుడు తన వేదోచ్చారణమానెను. ఇదియేమియని శుకుడడుగగా విష్ణువును, భానుడును పైన తిరుగుచున్నారు. ఆ కారణమున ఈ మహావాయువు వచ్చినది. ఈ సమయ మున అధ్యయనము కూడదు. సమానుడు ఉదానుడు వ్యానుడు అపానుడు ప్రాణుడు వీరైదుగురు జగమంతయు వ్యాపించి యుందురు. వీరుగాక అదితి పుత్రులు ప్రవ హుడు ఆవహుడు ఉద్వహుడు సంవహుడు వివహుడు పవహుడు పరావహుడు అను సప్తపవనములు నిఖిల భువనముల నిండి యుండును. సమానాది పంచకము హిమ గిరియందుండును. దేవయానములకు వర్తన మీ వాయువులే. వర్షమ్ముల గురియించునవియు ఈ వాయువులే అని చెప్పుచున్నంతలో ఆ ప్రచండ వాయువు తగ్గిపోయెను. వ్యాసుడు కుమారుని అధ్యయనమునకు నియోగించి తాను అభ్ర

గంగ దిగిన చోటికి స్నానమునకేగెను. శుకుని అధ్యయనము నారదునకు ప్రీతి గల్గిం చినది. శుకుని కోరికపై నారదుడిట్లుపదేశించెను.

## నారదుడు శుకునకు లోకహితము బోధించుట శుకుని యోగసిద్ధి

ఈ లోకంబున పుట్టిన వానికి హితము గూర్చుతత్త్వమును తొల్లి సనత్కు మారుడు మునులకు చెప్పిన వాక్యంబులను మరల నారదుడిట్లు చెప్పెను.

తపము, సత్యము, విద్య, అపరిగ్రహము, అహింస, జితేంద్రియత, ఇవి మోక్ష ప్రాప్తికి సాధనములు. సంసారా సక్తుడు రొంపిలో దిగిరాలేని ఏనుగు వంటివాడు. కామ క్రోధలోభమోహ మద మాత్సర్యములు రాగము దుఃఖ ప్రదములు అవియున్న వానికి మరొక పుట్టువు నందును, సుఖము ఉండదు. తపస్సత్యాది సద్గుణములను శ్రద్ధా సక్తితో నిర్మల చిత్తమున అభ్యసించు వారికి ఇహపర సుఖములు, అంతరాత్మ జ్ఞానము, ధర్మాధర్మ, సత్యాసత్య వివేకము కలుగును. నారదమునీంద్రుని వాక్యములు శుకునకు హృదయమున బట్టినవి. ఆ దేవ మునికి కృతజ్ఞతల తెల్పి శుకుడు వ్యాసుని కడకేగి తనకు నారదమునీంద్రుని బోధమువలన కలిగిన చిత్త శాంతియు ఆత్మ జ్ఞానమును తాను సమస్తమును వీడి వైరాగ్యమున తానరుగుచున్నట్లు నుడివి వెడలెను. కుమారుని యోగ సిద్ధికి ముదితుడై వ్యాసుడు తనయా నిలువుమొకింత అనినను నిలువక యోగ సేవన కనుకూలమైన కైలాసగిరిచేరెను. అచట పరమ యోగ సాధ నమున ఆత్మయందు సర్వము విలీనము చేసి సర్వాత్మతత్త్వ దర్శనము పొందెను. ఇంతలో నారదుడటకు రాగా శుకుడా దేవమునికి ప్రణమిల్లి, మునీంద్రా నీ ప్రబో ధము వలన ప్రబుద్ధుడ నయితిని యోగ నిరతి అలవడినది నిస్సంగత్వమున ఈలో కమును విడచిపోవుచున్నాను. అని ఆకసమున కెగసి అదృశ్యమయ్యెను. కిన్నర గం ధర్వాదులతనిని జూచి ఆహా యింత బాల్యమున ఇతని కింత యోగ సిద్ధి అలవడినదా అని ఆశ్చర్యములందిరి.

## వ్యాసుడు శుకుని వెనుకాడుట

అట్లాశ్చర్యమొదవ పైకెగసిన శుకుడు నదీతరుకాన నంబులు గడచి పోవు చుండ రెండు పెద్ద పర్వతములు ఒకటి తెల్లనిది ఒకటి పసుపు వర్ణము కలది అడ్డువచ్చి శుకుని పాదములు తగిలి చూర్ణములైనవి. తుద కతడు మందాకినిని జేరి అతిక్ర మించి వాయుపథంబున సర్వ భూతాత్మకుడయ్యెను. అతడరుగు మార్గమున దేవ కన్యలు నగ్నముగ జలకమాడుచు గూడ దిగంబరుడై యేగు శుకుని జూచి ఏమియు చలనము నందలేదు. శుకుడు యోగ సిద్ధి వడసి చనిన వార్తకు వ్యాసుడు వగచి అతడు

పోయిన మార్గమున యోగ బలమున తానును బోయి అచటి పర్వతమున నిలిచి శుకా ఆగుము! శుకా ఆగుము! అని కేకలు వెట్టగా పరిసరములనున్న చెట్లు కొండలు ఎచ్చట నుండియో శుకుడు ' ఓ ' యనిన శబ్దమును నలుదిక్కుల ప్రతిధ్వనించెనే గాని శుకుడు రాలేదు.

మార్గమధ్యమున విగత వస్త్రలై స్నానమాడు దేవకన్యలు వ్యాసుని జూచి సిగ్గుపడి త్వరత్వరగ లేచి తమ వస్త్రములు కట్టుకొనిరి. శుకుని ముక్తతయు తన సక్తతయు గ్రహించి తనయుని వైరాగ్యమునకు సంతసించి తనమనోభావములకు వ్యాసుడు సిగ్గిల్లెను.

కైలాసమునుండి శివుడేగుదెంచి వ్యాసమహర్షీ! నీవు పంచభూతబలుడగు తనయుని కోరితివి. ఇచ్చితిని ఆతడు పరమయోగపదమంది బ్రహ్మతేజో మయుం డయ్యెను. ఇందులకు నీవు సంతసించవలసినది పోయి విచారింతువేల. నీకు వలసి నప్పుడు ఎల్లవేళల నీ తనయుని నీడ నీవెంటనుండును. నీవు మహాతపశ్శాలివి మీ యిరువురి కీర్తియు విశ్వమున నదీపర్వతము లుండుదనుక శాశ్వతముగ నుండునని వ్యాసుని సంప్రీతుంజేసి పంపెను.

## బ్రహ్మచర్యాది నాలుగాశ్రమములవారికి ఉత్తమ పదసిద్ధినిచ్చు దైవము

## నారద నారాయణ సంవాదము

బదరికాశ్రమమున నున్న విశ్వాత్ముడు అవ్యయుడు అయిన నారాయణు డను మునీంద్రుని కడకేగి నారదమహర్షి ప్రణమిల్లి దేవా! సిద్ధికి ఆరాధనీయమెద్ది యన సర్వమునకు అంతరాత్మయై వెలుగు తత్త్వమే ఆరాధనీయము. అది సూక్ష్మము అగోచరము అని నుడివెను. నారదుడు మరల దేవా! నీవే లోకేశుడవు అఖిల ధర్మ ములకు ఆవలవెలుగు మూర్తి యయిన మూలాకృతి దర్శనము దయతో నాకను గ్రహింపవే అని వేడెను. అంత నారాయణుడు నారదా నీవు ఉత్తమమైన ఏకాంతి కుడవగుము. నీకాదర్శనములభించును అనెను. నారదుడా మాటలు విని యేగి, మేరుశైలమున పాలకడలి నున్న శ్వేత ద్వీపమున ఆహారములేకుండ, ఇంద్రియ వృత్తి లేకుండ నున్నవారిని జూచెను.

ధర్మజుడది విని, దేవకీ నందనా! నీవునుడివిన శ్వేత ద్వీపము వారెట్టి వారు. ముక్తులయిన వారుగా దోచుచున్నదనగా భీష్ముడొక కథ నిట్లు చెప్పెను. తొల్లి భూావ లయమ్ముమను సదాచారుడై ఏలు ఉపరిచరవసువనునృపతి కలడు. అతడు తపోధ్యాన

నిమగ్నుడై అడవులనుండగా ఇంద్రుడు ప్రత్యక్షమై రాజా నీ తపమునకు మెచ్చితిని రాజ్యమును వీడకుము, నీకొక రత్నదీప్తమైన విమానమును వరమునిచ్చుచున్నాను.నా మిత్రుడవై దానిపై వచ్చిపోవు చుండుమన వసురాజట్లు చేసెను. అతనిని గూర్చి మఱొక విశేషముగలదు.

కల్పాది యందు సప్తఋషులు; మరీచి, అత్రి అంగీరసుడు, పులస్త్యుడు క్రతువు వసిష్ఠుడు స్వాయంభువమనువు విష్ణుని గూర్చి తపమొనర్చిరి. విష్ణువు సం ప్రీతుడై అదృశ్య రూపమున ఋషులారా! మీరు సదాచారణులు ధర్మశాస్త్ర విదులు. సరస్వతి మీయందు నిలుచును. అంగిరసుని పుత్రుడైన మహామేధావి బృహస్పతి వలన ఈ ధర్మములు ప్రచారము కావలెను. నా భక్తుడయిన ఉపరిచర వసువు అను రాజు ద్వారా ఈ కార్యమునడుపుడు అనెను.

ఉపరిచరవసు మహారాజు అశ్వమేధయాగము నారంభింప సప్త ఋషులును తోడ్పడిరి. బృహస్పతి ముఖ్య ఋత్విక్కు. పెక్కు మునులును సదస్యులై వచ్చిరి. వసురాజు అహింసా వ్రతుడు ఆరణ్యక ఉపనిషత్తున చెప్పబడిన వాక్యములతో విష్ణుని కీర్తింప ఆ దేవుడు వసురాజునకొక్కనికిని కనపడునట్లు వచ్చి హవిర్భాగమును తీసి కొనెను. తనకేల కనుపింపకుండ విష్ణువు వచ్చెను అని బృహస్పతి మహా కుపితుడు కాగా, వసురాజు, సదస్యులు మునులును ఆతనిని శాంతపరచిరి.

## బృహస్పతికి మునులు విష్ణుమహిమను నుడువుట

అచ్చట నున్న ఏకద్విత్రితులను మునులు బృహస్పతిని జూచి గురువర్యా! నీకేలనయ్యా యీ కోపము. శ్రీహరి కొఱకయిన హవిస్సు శ్రీహరివచ్చి తీసి కొనినాడు. మనమెంతవారము శ్రీహరి కన్పడు భాగ్యము మహాతపశ్శాలులైన వారికే పట్టదు. మేము బ్రహ్మ మానస పుత్రులము. మేము హరిదర్శనము గోరి తపస్సు చేయుచుండ ఒక అశరీర వాణి ఇట్లు చెప్పినది. పాలకడలిలోనున్న తెల్లని ఒక దీవి యందు, తెల్లని వారు హరిదర్శన పరులు, నిరాహారులు సుగంధ శరీరులు కలరు. వారికి హరినిజ తేజో రూపము కనుపడును. అచటికేగుడని నుడువగా అచటికే గితిమి. ఒకనాడు ఇట్టి దట్టిదనరాని భాను సహస్ర సమంబగు తేజము తోచినది. అచటనున్నవారు జయ పుండరీ కాక్ష! జయ హృషీకేశ! జయ విశ్వాత్మ! యనుచు ఎల్గెత్తి స్తుతించిరి. మేమాతేజమును చూడజాలక మిన్న కుండితిమి. ఇంతలో నొక అశరీర వాణి, ఇచటనున్న పురుషుల జూచుట హరిని జూచినట్లే మీకు తొందర

యేల అనేక వత్సరములింకను తప మొనర్చుడు. అనగా మేమును వెనుదిరిగితిమి. ఈ మాటలు విని బృహస్పతి శాంతుడై వసురాజు యాగమును పూర్తి నొందించెను.

దేవలోకమున నొకప్పుడు సురలకు మునులకు ఒక వివాదంబైనది. అజము లగు మేకపోతులు యెల్లవేళల యాగంబుల వధార్హములని దేవతలు, కృతయుగమ్మున అట్లు కాదని మునులు వాదించు కొనుచు అచటికేతెంచిన వసుమహారాజునడిగిరి. అతడు సురల వాదమే యుక్తమని నుడువ మునులు కోపించి వసువును భూమిపై బడుమని శపించిరి. సురలాతని కెట్టి బాధయులేకుండ చేసిరి. వసువు తన దీక్షను వీడక హరి నామత త్పరుడై యుండుట చూచి శ్రీహరి కరుణించి గరుత్మంతుని పంపి వసువును ఊర్ధ్వలోకములకు రప్పించి బ్రహ్మ పదప్రాప్తి నొసగెను.

అచట నారదుడు క్షీర సాగరమున శ్వేత ద్వీపమునకేగి అచట నున్న ఏకాం తికుల గలసి, నారాయణస్తుతి జప పరాయణత్వముననుండగా నారాయణుడు తన నిజతేజో రూపమున ప్రత్యక్షమై తత్త్వోపదేశమొనరించెను.

## నారాయణుడు నారదునకు చేసిన తత్త్వోపదేశము

నారదమునీంద్రా వినుము. ఇటనున్న ఏకాంతికులకు తప్ప మఱెవ్వరికిని నను జూడ అర్హతలేదు. నీవును ఏకాంతికుడవు పరమ భక్తుడవగుట నీకు నా దర్శ నములభించినది. నా తత్త్వంబొకింత వినుము.

నేను శాశ్వతుడను. ఇంద్రియములకు అందువాడను కాను. అఖిలమ్మునకు ఆత్మయగు సర్వసాక్షిని. వాసుదేవుడు సంకర్షణుడు అనిరుద్ధుడు అను నామములు నాతత్త్వములే. ఇట్లిరువది నాల్గు తత్త్వములకు అధిపతిని పంచవింశతితత్త్వా భిఖ్యుడను. నాకంటె పరములేదు. పరమపురుషుడను. ఏకాంతికులకు గోచరమైన పరమునేనే. ఈ యఖిలమును జీవవ్యాప్తి గలదే. జీవుడు నా సంబంధమైన వాడే. భక్తి గలిగి నన్ను ఆశ్రయించిన వానికి ముక్తి నిచ్చెదను. ఆదిత్య వసురుద్రాదులు బ్రహ్మ అట్టివారే.

బ్రహ్మను జగత్ సృష్టి కావించుటకు నియోగించి నేను నివృత్తిగా ఏకాకినై మధ్యస్థుడనై యుందును. ఒకానొక సమయమున పరిస్థితులను బట్టి జన్మకర్మముల చరింతును. ధర్మరక్షణకు వలయు కార్యము లొనర్తును. మున్ను మత్స్యమై వేద ములను కూర్మమై దేవతలను రక్షించితిని. లోకరక్షణకు నరనారాయణులను ఋషి త్వరూపములనుంటిని. మఱియు వరాహరూపమై హిరణ్యాక్షుని, నారసింహాకృ తిని హిరణ్య కశిపుని, పరశురాముడనై దుష్ట రాజన్యులను రాముడనై రావణా ది రాక్షసులను, కృష్ణుడనై కంస కాలయవనమురనరకాది దుష్టులను పాలియించి నరు

ని సాయమున భూభారమును బాపుదును. శివుడడ్డు పడినను బాణుని నిర్జింతు. తిరిగి నా సహజ ప్రకృతిని పొందుదును. నారదా! నీవేకాంతికుడవగుట నాచరిత్ర మును చెప్పితి. ఈశ్వేత ద్వీపముననున్న వారు మద్భక్తులు. నన్ను గూర్చిన ధ్యాన మందున్నవారు. సందడి చేయవలదు. నీవిక బొమ్మనిన, నారాయణ దర్శనము త త్త్వోపదేశము కాంచిన మహా నందముతో నారదుడరిగి ముని బృందమునకు బ్రహ్మ లోకమున తానువినిన దానిని ప్రచారము చేసెను. క్రమముగ నది భూలోకమున వాఙ్మయమై వ్యాపించెను.

ఈ యుపాఖ్యానము చదివినను వినినను దీర్ఘాయు (శ్రీ) విభవంబు కలుగును. వ్యాసుడు నిత్యము దీనిని పఠించుచు శ్వేత ద్వీపమున కరిగి విష్ణుని దర్శించును. వారి శిష్యుల మైన మేమును పాలకడలి తీరమున తపస్సు చేసితిమి. ఆదిత్య మరు ద్వసురుద్రాదులు బ్రహ్మయు అట్లేకడు భక్తి తత్పరులై తపమ్ము చేసిరి.

## బ్రహ్మాదులకు విష్ణువు అదృశ్యరూపమున చేసిన ఉపదేశము

మీరందరు పుణ్యాత్ములు మీవచ్చిన పని నెఱుగుదును. బ్రహ్మ జగద్గురుడు. అతడు చెప్పినది వేదవాక్యము. వేదహితంబగు యాగమొనర్చి వైష్ణవమను యాగ మును బ్రహ్మహితముగా జేసిరి. ఈ యాగఫలమును వినుడని విష్ణువిట్లు నుడివెను.

వేదాచార పరాయణులు మరీచ్యాది సప్తఋషులు విధింపగా, మానసీయులు మానవులు నడప మీకా భాగంబుల ఫలము కలుగును. సనక సనందన కపిల సనా తన సనత్కుమారులు సహజ జ్ఞానులు. బ్రహ్మ నిష్ఠితులు సాంఖ్య ధర్మమును ప్రచారమొనర్తురు. మోక్షధర్మములు బోధింతురు. సర్వులకు తల్లి తండ్రియగు విరించి నా శాసనమున వర్తిల్లును. నా ఫాలమ్మున బుట్టిన రుద్రుడు సకల వరదుడు ఇది కృతయుగము. వీరు విధించినట్లే వేదోక్త కర్మలు నడచును. ఈ యుగమున యాగ ములందు పశువులను హింసింపరాదు. యజ్ఞభాగార్హుడు, యజ్ఞధారి విష్ణువు ఆ రీతినుడివి, సకలమునకు గురువు ప్రభువునై వర్తిల్లుమని బ్రహ్మను నియోగించెనని వ్యాసమహర్షి శిష్యులకు చెప్పినట్లు వైశంపాయనుడు జనమే జయునకు బోధించెను. ఇది సకల కార్య విజయ ప్రదము.

## భగవన్నామ నిర్వచన ప్రకారము

అర్జునుడడుగగా కృష్ణుడు చెప్పినది వైశంపాయనుడు జనమే జయునకు నుడివిన విధము.

నరనారాయణులు: అర్జునా నీవును నేనును నరనారాయణులనిన నామములతో భువన హితమాచరించుటకు పుట్టిన వారము.

నారాయణుడు : నారములనగా నీరు. అయనము అనగా శయనము. నాకు జలము శయనము నెలవు అగుటచే నారాయణుడను.

వాసుదేవుడు : నేను జగములందు వసింతును. జగము లెల్ల నాలో వసించును గాన వాసుదేవుడను.

విష్ణువు : ఆకాశభాగమంతయును వ్యాపించిన వాడనగుట విష్ణుడను.

దామోదరుడు : దమము అనగా ఇంద్రియనిగ్రహము అను సద్గుణము గలిగి నన్ను పూజించు వారు నామధ్య యందు తేజరిల్లుదురు గాన దామోదరుడను.

పృశ్నిగర్భుడు : అన్నవము జలవము అమృతవము వేదవము అనునవి పృశ్ని యనబడును. అవి నాగర్భమందుండుటచే పృశ్నిగర్భుడను.

కేశవుడు : సూర్యుని కాంతి కిరణములు చంద్రుని వెన్నెల కిరణములు, అగ్ని జ్వాలలు నాకు శిరోజములగుట నన్ను కేశవుడందరు.

అగ్నిష్టోమ మాహాత్మ్యములు; క్షత్రములు బ్రహ్మము, అవి అగ్ని సోముడు. వానిచే అఖిల జగమునకు సంతోషము కలిగింతును. వీనిచే రాజుల విప్రుల మహాను భావ ములు విలసిల్లును.

పరమ వరదుడు, లోక భావనేశ్వర, హృషీకేశ నామములు నాకు కలిగినవి.

హరి : యాగ భాగముల హరించువాడను.

గోవిందుడు : గోవర్ధన మహిని గుహలోనికి బడకుండ ఎత్తితిని గానగోవిందు డందురు.

శిపివిష్టుడు : రోమములుండవు గాన నాకీ నామము వచ్చినది.

కృష్ణుడు : భూమిని దున్నునట్లు చేయుదును. నామేని చాయ నలుపు అగుట వలన కృష్ణుడందురు.

అజుడు : పుట్టుకలేని వాడను.

సత్యుడు : సదసద్ద్వయంబు నాయందుండుటవలన ఈ పేరు వచ్చినది.

అధోక్షజుడు : జాతత్వ వికృతి (పుట్టుక) లేని. యపుడు తదనంతరము క్షయము లేనివాడనుగాన అధోక్షజు డందురు.

| | | |
|---|---|---|
| సాత్త్వతుడు | : | సత్త్వమునుండి వేరుగాను. నావలన సత్త్వము శక్తి వంతమగు చున్నది. సత్త్వముగల జన్మము కలవాడనగుట సాత్త్వతుడను. |
| అచ్యుతుడు | : | చ్యుతము (నాశనము) లేని వాడను. |
| త్రిధాతువు | : | వాతపిత్త శ్లేష్మములను ధాతు త్రయము శరీరమున కలవాడను గాన ఈ నామము వచ్చినది. |
| ఘృతార్చి | : | ఘృతము అనగా నీరు. నీటికి కాంతిగలదు. జలశయనుడను ఆకారణమున ఘృతార్చి నామము వచ్చినది. |
| వృషుడు | : | వృషము అనగా ధర్మము. ధర్మస్థితి నాయందుండుటచే వృషుడను |
| అనాది | : | ఆదిలేనివాడు |
| అమధ్యుడు | : | మధ్యలేని వాడను |
| అనంతుడు | : | అంతములేనివాడను. |
| శుచిశ్రవుడు | : | పేరులు నాచెవులకు ఇంపుగ నుండును గాన శుచి శ్రవుడందురు. |
| ఏకశృంగుడు | : | వరాహవతారమున ఒక కొమ్ముతోనే ఉర్విని పైకెత్తుటచే ఈ పేరు వచ్చినది. |
| విరించుడు | : | లోకమునకు రేచనము (ఊపిరి) కలుగజేయువాడను. |
| కపిలుడు | : | సూర్యుని యందు విద్యుక్షితిగనున్నవాడను. |
| హిరణ్యగర్భుడు | : | యోగమనగా హిరణ్యము. యోగ గర్భుడనుగాన హిరణ్య గర్భుడను గూడ. |
| ధర్మజుడు | : | లోకరక్షణమునకు నరుడు నారాయణుడనగ ధర్మమునకేను పుట్టిన వాడనుగాన ధర్మజుడందురు. |
| ముంజకేశుడు | : | గంధమాదనమున నేను తపస్సు చేయునపుడు, శివునకు భయపడి దక్షయజ్ఞము నావక్షస్థలమున దాగినది. అచటి కేశములు ముంజి గడ్డివలె అయినవి. ఆకారణమున ఈ పేరు వచ్చినది. |
| ఖండపరశువు | : | శివునిపై నేనొక గడ్డిదుబ్బును పరశువు అనగా గండ్రగొడ్డలిగా మంత్రించి వైచితిని. దానికి పదును లేకుండ శివుడొనర్చుటచే ఖండపరశువు అను పేరు కలిగినది. |

## శివకేశవుల పరస్పర కలహము

విష్ణుని మాటలు విని అర్జునుడు, నారాయణా! మహాత్ములైన మీకిరువురకు కలిగిన కలహమెట్లు అంతమొందినది వినదలతునన విష్ణువిట్లు చెప్పెను.

అవును మా ఇరువురి మధ్య మహా ఘోర రణమైనది. రుద్రుడు మహా రౌద్రాకారమున వచ్చినాడు. నారాయణుడను నేనును విజృంభించినాను. మామా ఆయుధముల ఘర్షణకు లోకములు తల్లడిల్లినవి. పర్వతములదరినవి. నదీ నద ములింకినవి. సాగరములు ఘోషిల్లినవి. అగ్నులు వెలుగలేదు. ఈ భీభత్సమునకు బ్రహ్మయే భయకంపితుడై రణ భూమికేగి శివునకు ప్రణమిల్లి పరమశివా! లోక ములకు శివమును కూర్చువాడవు నీవే యిట్లు పరాక్రమించిన లోకములాగునా. ప్రాణి కోటి నశించును. శివ విష్ణువులు, అద్వంద్వంబు, నిర్గుణము అమూర్తమగు తత్త్వము మూర్తి భేదము మాత్రమే. ప్రసన్నుడవై దివ్య బుద్ధిని జూడుమని ప్రార్థింప శివుడును శాంతినొంది విష్ణువును తేర్చెను. నారాయణుడును శివునుద్దేశించి మన మిర్వురము ఒక్కరూప, నిను బూజించిన నను బూజించినట్లే. మనమధ్య భేద ములేదు. ఇటనుండి శ్రీవత్సము శూలాంకితమగును. నా హస్తముద్ర గలిగి శ్రీ కంధుడను నామము నీకు వరలును. ఇట్లు ఆ ఇరువురకును సఖ్యము గలిగి లోక ములు సంతసించినవి. అర్జునా రుద్రుడు శూలపాణియై సమరమున నీ శత్రుకోటిని వరుసగ వధిం ను.

## నరనారాయణులతో నారదుని సల్లాపము

శ్వేత ద్వీపము నుండి తిరిగి యథా పూర్వస్థానమున నరనారాయణులను గాంచిన నారదునకు ఆశ్చర్యము కలిగెను. వారిరువురిచే అతిథి సత్కారములంది ఆ దేవముని నారాయణా! శ్వేత ద్వీపమున అచ్యుతుని చూచితిని మరల నిచ్చట ఆ రూపమే యిది. ఇది అద్భుతముగ నున్నది. అచ్చటి శ్వేతులు శమదమ సంపన్నులు ఆ అచ్యుతుని కృపకనినవారు. ఆ మహా దేవుడు నాయందును కరుణించి క్షేత్రజ్ఞుని తత్త్వమును, రాబోవు తన ప్రాదుర్భావములను తెల్పి నన్నును గ్రహించెను. శ్వేతద్వీ పము పరమ శాంతి నిలయము. సూర్యసోముల కాంతిగాని, వాయుసంచారము గాని ఉండదు. నేను ఏ కాంతికుడనై యచట నుంటిని. నన్నును గ్రహించి ఆ మహా త్ముడు వీడ్కొలిపి పంపెను. ఇచ్చటికి వచ్చితిని. నన్ను కరుణింపుము ఇచ్చట నుం డెదననెను.

వారిరువురును నారదుని మాటలకు ముదమంది, నీవా దేవుని కృప బొంది వారి ఉపదేశమును వింటివి. ధన్యుడవు మేమది యెల్లనెఱుగుదుము. నీవిచట నుండుట మాకు ప్రీతికరము అనిరి. నారదు డామహాత్ముల ఆదరణకు సంతసించి వినమ్రుడై నమస్కరించి ఆ యాశ్రమమునందే వేయి దివ్య వత్సరములు ఏకాంతి యై తపమాచరించెను. నారదుని భక్తి భావమునకు నరనారాయణులు సంతృప్తిపడి హితవచనంబులు పలుక, వారిని వీడ్కొని హిమ వత్పర్వతమునకు తన ఆశ్రమం బున కరిగెను. దేవతలెల్లరు నారదమునిని జూచి ఆతని భక్తి తత్పరతల నెంతయో స్తుతించిరి.

## జనమేజయునకు వైశంపాయనుని ఉపదేశము

జనమేజయా! నీవు ప్రసిద్ధికెక్కిన పాండవ వంశమున పుట్టిన ధన్యుడవు. విష్ణుదేవుని మహిమ ఉపదేశములు వింటివికదా. భక్తి శ్రద్ధలతో విష్ణుదేవుని పూజింపుము. విష్ణువుపై విద్వేషము సకల విధముల చేటు. ఎల్లరకును శ్రీహ రియే ఆత్మ. తన ఆత్మను తెలిసికొనలేని చెడ్డ వారికెప్పుడును ఆపదలే. ఇవన్నియు మాగురువర్యుడు వ్యాసమహర్షి చెప్పినవే. ఆయన కేవలము నారాయణుడే కాకపో యిన మహా భారతము పురాణములు వ్రాయగలడా. భారతాధ్యయనమును విస్మ రింపకుము. వ్యాసుడనగా లోకహితముకొరకై బహువిధ ధర్మముల నిట్లు చెప్పిన మహనీయుడు జగద్వంద్యుడు.

## విష్ణువు హయగ్రీవుడయిన వృత్తాంతము

శ్రీ విష్ణువు హయశిరుడయి బ్రహ్మకు సన్నిహితుడయ్యెనను కథను జనమే జయుడు వినగోరగా వైశంపాయనుడిట్లు చెప్పెను.

ప్రళయకాలమున విష్ణువు జలములందు యోగ నిద్రారతి నుండి మేలుకొని లోక సృష్టి సేయ సంకల్పింప విష్ణువు నాభినుండి కమలము, ఆ కమలము నుండి బ్రహ్మయు ఉద్భవించిరి. మున్ముందు వేదములు నాల్గిటిని బ్రహ్మసృజించెను. తొలుత విష్ణువు నందున్న సత్వగుణము నుండి బ్రహ్మయు, రజస్తమముల నుండి మధుకై టభులను అసురులు జన్మించిరి. ఆ రాక్షసులు వేదములను కట్టగట్టి పాతాళమున బడవైచిరి. వేదములే తనకు బలము జ్ఞానమునని బ్రహ్మ విచారించి తానేమియు చేయలేక విష్ణువు కడమొఱలిడెను. విష్ణువు సకల వర్ణ భాసురమైన హయ శిరము దాల్చి రసాతలమునకేగి ప్రణవనాదంబు తీవ్రముగ నొనరించె. ఆ ధ్వనివిని మధుకై

టభులు ఆ శబ్దము వచ్చినదెస కేగా మఱొక దారి నేగి హయగ్రీవుడా వేదముల గొని పోయి బ్రహ్మకిచ్చెను. ఇంతలో మధుకైటభులెవ్వరినిగానక వెనుదిరిగి ఏగి తాముంచిన చోట వేదములు గానక వెదకి వెదకి శ్రీహరిని చూచి యుద్ధమునకు బిలిచి శ్రీహరిచేత జచ్చిరి. బ్రహ్మయొక్క లోక సృష్టి కార్యము వేదబలమువలన నిర్విఘ్నమైనది. శ్రీహరియే సత్వాది గుణముల కలిగింప సమర్థుడు. వేదములు గాని యజ్ఞములుగాని తక్కు పుణ్యకార్యములుగాని శ్రీ మన్నారాయణ పరములైనవే.

## ఏకాంతిక ధర్మవిధానము

వైశంపాయనుడు జనమేజయునకు చెప్పిన విధము.

ప్రప్రథమమున నారాయణుడు నిర్మలమగు ఏకాంతిక ధర్మమును బ్రహ్మకు నుడివెను. బ్రహ్మ దక్షునకు, అతడు సూర్యునకు, సూర్యుడు మనువునకు అతడు ఇక్ష్వాకునకు బోధించె. అతని వలన సజ్జనులనేకులు ఉపదేశమందిరి. నారాయణుని చేత నారదుడు విని తన శిష్యులకు బోధించెను. పదపడి యీ ధర్మము జగద్వ్యాప్తి గనెను. పాప చిత్తులకిది అలభ్యము.

సాంఖ్యయోగ పరమసార భూతమైన ధర్మము కురు క్షేత్ర రణ సమయమున కృష్ణుడర్జునునకు బోధించిన గీతలందున్నది. అహింస దీనికి మూలము. దానిచే హరియు ప్రీతుడగును. క్షేత్రజ్ఞుడతడొక్కడే. అయినను అనేకవిధ రూపముల సమయోచితముగ గోచరించును. వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అని రుద్ధుడు అను చతుర్విధాకారములు. ఇట్లు తోచిన హరి ఒక్కడే. ఇంద్రియములకు అతడందడు. తపము, శమము, దమము గల ఏకానూన భక్తి కావలయును. వీనికి తోడు చిత్తశాంతియు వలయును. ఇట్టి నిష్ఠ గలవారికే ఆ ధర్మము పొందవీలగును. చింతలనన్నిటిని బాపుధర్మమదియే.

ఇట్టిధర్మమునందాసక్తి చూపక నరులనేకపోకల పోదురు. ఇందులకు కారణము సత్వరజస్తమోగుణ వికారములే. వీనియందు సాత్త్విక గుణము మేలు. దానివలన ఏకాంతిక నిష్ఠ పడయవచ్చును. రజస్తమో గుణులు అన్యమార్గముల బోయెదరు. ఏ కాంతికులు హరిమనస్సులో నుందురు. హరికి వారికి ఏకత్వము కలదు. ఇది నేను నా గురుముఖమున విన్నది. జనమేజయా నీవును శ్రీహరినిట్లు భావించి నిరంతరానంద శ్రీయుతుడవు. కమ్ము.

జనమేజయున కొక సందియము తోచినది. వేదము సాంఖ్యము యోగము పాశుపతము పాంచరాత్రము అని బోధసాధనలు బహువిధములు. ఇవి అన్నియు

ఒక్కటియా, భిన్నములా అని ప్రశ్నించెను. వైశంపాయనుడు తన గురువగు వ్యాసుని తలచి యిట్లు నుడివెను. ఈ విధములకన్నిటికి ఆశ్రయము నారాయణుడే. హరిని పొందు సాధనములివి. వేద వ్యాసుడు వేదములకు, కపిలుడు సాంఖ్యమునకు, యోగ మునకు హిరణ్యగర్భుడు, పాశుపతమునకు శివుడు, పాంచరాత్రమునకు విష్ణువు ప్రవర్తకులు. పాంచ రాత్రమనగ వైష్ణవము.

## వేదవ్యాసునకు నారాయణ నందనత్వము

ఆదికాలమున విష్ణువు ప్రజాసృష్టి సేయదలచి నాభి పద్మమున బ్రహ్మను కల్పింపనతడు భూత సంఘముల నెల్ల సృజించెను. అతని ముఖము నుండి వేదములు ప్రసరింపజేసి వానికి వ్యాప్తి కల్గించుటకు, అపాంతరతముడను వానిని తన మనశ్శక్తిచే సృజించి అతనికాపని నప్పగించెను. అతడు సుబోధకమగునట్లు వేదముల విభా గింపగా విష్ణు వతి ప్రీతుడై నీవు వేద వ్యాసుడవు ప్రతిమన్వంతరమున నాకు తన యుడవై ఆహ్లాదము కల్పింతువు. నీకనేక జన్మములు కలుగును. నా చరితములు త్రిలోకాచరణంబులు ధర్మము సమస్తము మదింజూడగలుగు త్రికాలజ్ఞత్వము కలు గును.

తరువాతి కాలమున వసిష్ఠమునికి మనుమడుగా పరాశరమునికి తనయుడ వౌదువు. నీ వంశము వారు కురురాజ్యపాలకులై అన్యోన్యవైరమున కులమును పాడు సేయుదురు. కాల ప్రభావమున కలిసి పోయిన వేదములను మరల నీవపుడు విం గడించి వ్యాప్తిగావించెదవు. ధర్మసందేహముల నెల్ల నివారించి జగత్పూజ్యుడవగుదువు. కాని రాగము నిను విడువదు. నీకు నిర్మల వైరాగ్యము గల పుత్రుడుదయించును. వేద జ్ఞానము, సాంఖ్యము యోగము పరిపూర్ణముగ లభించును. అని చెప్పి వేద వ్యాసుని బంపెను.

ఈ విధముగ మోక్ష ధర్మ పథములు, హయగ్రీవుని లీలలు, విష్ణుని నామ నిర్వచనములు, ఏకాంతిక ధర్మములు, నారాయణుడు నారదుడు వ్యాసుడు వైశం పాయనుడు జనమే జయుడు ఒకరినుండి ఒకరికి వచ్చినవి. నారాయణీయ మనద గు ఈ ఆఖ్యానము చదివినను వినినను సంపదారోగ్యాయుస్సంపదలు లభించును.

## అత్యుత్తమ ధర్మము – భృగుని చరిత్రము

ధర్మజుడు మరల భీష్ముని కనుగొని మహాత్మా రాజధర్మము మొదలు ఎన్నియో ధర్మములు నీవెఱిగినవి మహామునులెందరో నుడివినవి నీవు నాకు చెప్పితివి. వీని యందు అత్యుత్తమ ధర్మమెయ్యది అని మరల ప్రశ్నింపగా భీష్ముడిట్లు నుడివెను.

కుమారా! అన్ని ధర్మములు మంచివే నిరర్థకమగు ధర్మమనునది లేదు. ఎవరు దేని యందిష్టపడి ఆచరింతురో దాని ఫలము వారికి లభించును. నీ ప్రశ్నకు సమాధానముగ ఒక కథ యున్నది. నారదుడు ఇంద్రునకు చెప్పినది వినుము. గంగానది దక్షిణపు తీరమున మహాపద్మమను పురమున భృగుడను విప్రుడు కలడు. అతడు సద్గుణ సంపన్నుడు, ధర్మము, సత్యము, అహింస, ఇంద్రియ నిగ్రహము, నిష్క్రోధము మున్నగు మంచి గుణములాతని యందు గలవు. న్యాయముగ సంపాదించిన ధనమునే ఆతడనుభవించును. వినయ సంపన్నులయిన పుత్ర సంతతిని కనెను.

ఒకనా డా భృగుని యింటికి ఒక బ్రాహ్మణోత్తముడు అతిథియై వచ్చెను. భృగుడు సకల మర్యాదలు కావించి మునివర్యా నాకొక సందేహమున్నది. సాధ్యమైనంత వరకు సత్ప్రవర్తనమున నుందును గాని ఆత్మావలోకన మలవడలేదు. లోకసామాన్యగుణబద్ధుడనగుట నా ఆత్మ యందు ఆత్మను చూడజాలకున్నాను. ఇది యెట్లు సాధ్యమని అడిగిన భృగునకు వచ్చిన అతిథి యిట్లనియె.

భృగూ! నీవడిగిన ప్రశ్నయే నన్నును బాధించినది. బ్రహ్మ చర్యమని కొందరు, గృహస్థ ధర్మమని కొందరు, యజ్ఞములని కొందరు ఎన్నియో విధములెందరో చెప్పిరి. ఇట్లెన్నియో ధర్మమార్గములన్నవి. అందరికి ఆత్మానందము అలవడునా. ఒక్కమాట చెప్పెదను వినుము.

నైమిశారణ్యమున గోమతి నదీతటమున పద్మ హ్రదమున పద్ముడను పేరున ఒక సర్పరాజుకలడు. నీవాతని యొద్ద కేగుమని చెప్పి ఆయతిథి వెడలెను. భృగుడట్లే మధ్యనున్న ప్రాంతములన్నిటిని దాటి పద్మ హ్రదమున సర్పరాజు పద్ముని యింటికేగుసరికి ఆతడు గృహమునలేడు. వచ్చిన విప్రవర్యునకు గౌరవముగ అర్ఘ్యపాద్యములిచ్చి పద్ముని పత్ని, తన భర్త సూర్యుని రథము మోయుటకేగెననియు పదిదినములలో రావచ్చుననియు చెప్పినది. పద్ముడు వచ్చిన తర్వాతనే నేను మరల వచ్చెదను అని చెప్పి భృగుడు సమీపమున నున్న అడవి యందు నిరాహారుడై జపతపోధ్యానతత్పరుడై యుండెను. తమయింటికి వచ్చిన విప్రుడు నిరాహారుడై యుండుట తెలిసి సర్పరాజు పత్ని తగిన బంధు పరివారముతో నేగి, విప్రవర్యా, మా గృహమునకు వచ్చినవారు నిరాహారులయి ఉండుట తగునా, మేము అతిథి పూజా వ్రతులము. మా వ్రత భంగము సేయకుడు మమ్ము రక్షింపుడని, వేడుకొనగా భృగుడు ఆమె మాటలకు సంతసించి ''దేవీ ఒక దినమాగుము మీ ఆతిథ్యము స్వీకరింతునని పంపెను. మఱునాడే పద్ముడును వచ్చినాడు.

తిరిగి గృహమునకేతెంచిన భర్తకు ఆమె సకల సపర్యలు సలిపి ఆతడు లేని దినములందు అతని యభిలాషానుసారము దేవాతిధి పూజలు సమగ్రము నెరవేరిన వనియు తెలిపి, వారికొరకు భృగుడను విప్రవర్యుడు వేచియున్నాడనియు ఆ విప్రుని కడకేగి అతనికేమి కావలెనో తెలిసికొనుట మంచిదని చెప్పెను. భార్యమాటలు విన గనే పద్మునకు ఆగ్రహము వచ్చినది. అతిశయము నెత్తికెక్కినది. భార్యవైపు జూచి మొగము చిట్లించుకొని'' ఇదియా ఇంటికి రాగానే నీవు నుడివెడు శుభవార్త. సూర్యునిచే మన్ననలందిన వాడను నేనా ఒక బాపని వెదకు కొనుచు పోయి ఆహ్వానించికొని వచ్చుట చాలుచాలు, అవసరమున్నచో ఆతడే వచ్చును. అనిన భర్త మాటలకామె నిర్ఘాంతపడి, సర్పరాజా మీరు ధీర శాంతులు, కృపాయత్త చిత్తులు, సదాచార సంప న్నులు ఒక విప్రవర్యుడు తమను జూచు మహా శతోనున్నవాని భగ్న చిత్తుని చేయు దురా, ఆశా భంగమొనర్చుట కన్న పాపమున్నదా. ఇట్టి చర్య మీ వంశకీర్తికి భంగ కరము. ఆ విప్రుడచట మిమ్ములను దర్శించు నిష్ఠలో వారముదినములనుండి నిరా హారిగానున్నాడనెను. భార్య మాటలకు పద్ముని మనసు శాంతి వహించినది. తనకు అకారణముగ కల్గిన కోపమునకు పశ్చాత్తాపపడి, భార్య సూచించిన సన్మార్గమునకు సంతసిల్లి వెంటనే బయలుదేరి వెడలి భృగుని కాంచి వినయసంభ్రమములతో కుశల ప్రశ్నగావించిన వెనుక ఇరువురును అచ్చటి చెట్ల నీడల మృదుపత్రాసీనులైరి.

## పద్ముడు భృగునకు సూర్యుని మహిమ చెప్పుట

సర్పపతి భృగునివైపుగన్గొని ''విప్రవర్యా మీరు నాకొరకిచ్చట వేచియున్నారట. నా చేయవలసిన కార్యమెట్టిదో తెలిపిన ఆ కర్తవ్యమును నిర్వహింతు''ననియెను. భృగుడామాటలకు సంతసించి సర్పపతీ? నా మనసున నున్న క్లేశమును తీర్పనీవె అర్హుడవని యెరిగి ఇట నీకై వేచి యున్నాను. నా వచ్చిన పనికేమిగాని మీరు సూర్య మండలమునకేగి అచట జూచిన విశేషముల వినదలతు నెఱిగింపుడని వేడెను. పద్ముడంతట-

విప్రవర్యా! మంచి ప్రశ్న అడిగితివి. సూర్యభగవానుని సేవకేగుట నాకు లభించిన గొప్ప భాగ్యముగా తలంతును. ఆ దేవుని మహిమవలననే ప్రాణిజాల మంతయు చైతన్యవంతమై అలరుచున్నది. ఆ దేవుని కిరణములవలననే అమరులు సిద్ధులు, చెట్టున వ్రేలాడు వాలఖిల్యాది మునులు జీవనము గడపుచున్నారు. ఎంత అద్భుతము. అ మహాత్ముని వలననే వాయువు ప్రసరించి సూర్యుని మధ్యగల కాంతిని కలసి వర్షము కలిగించును. అతడే వర్షకుడు, అతడే తనవేడిమిచే జలమును హరిం

చును చోద్యముకదా. సూర్యుని వేడిమి వలననే ఆత్మనిష్ఠ సుస్థిరముగ నుండును. చరాచరములు ధరించు పుడమికి సూర్యుని కాంతియే బలము. పరముడు, అక్షరుడు, నిరంజనుడైన పురుషుడు సూర్యుని యందే ప్రకాశించును. విప్రవర్యా నే జూచిన మఱియొక్క విశేషము వినుమని పద్మడిట్లు చెప్పెను.

## ఉంఛవృత్తి మహిమము

ఒకనాటి మధ్యాహ్న సమయమున సూర్యుని వెలుగుతో సమానమగు వెలుగుతో నొకడు వచ్చెను. వచ్చిన యాతడు సూర్యునికెదురేగి చేయిసాచగా సూర్యుడను తన చేయిసాచి యాతని చేయి పట్టుకొనెను. ఇద్దరును ఒకే రూపము. వీరిలో ఎవరు సూర్యుడు ఇతడా, అతడా అను సందియమునమేముంటిమి. వచ్చిన మూర్తి సూర్యబింబములో లీనమై అదృశ్యుడయ్యెను. నేను ధైర్యముగ జేరి సూర్యదేవునడిగితిని ఆ వచ్చిన వ్యక్తి యెవ్వరు అని. ఆ మహాత్ముడు కరుణించి యిట్లనెను. పద్మా వినుము. ఈతడు సుర యక్ష గంధర్వ గరుడాదులెవ్వరును గాదు. భిక్షుక వృత్తి వలన జీవించు విప్రోత్తముడు. నియత జీవనుడు. ఫల మూల జల వాయువులే ఇతని ఆహారము. దేనియందును ఆసక్తిలేదు. లేని దానికై ప్రాకులాడడు. అందరి యందు సమత్వబుద్ధి గలవాడు. ఈ గుణముల వలన ఇతనికీ సిద్ధి వచ్చినది అనెను.

భృగుడా కథ విని పరమాశ్చర్యమునంది, సర్ప పతీ! నీవలన చక్కని అర్థము గల కథ వింటిని. నను శిష్య భావమున జూచి పంపుము నే పోయి వచ్చెదననియెను. పద్మడది విని విప్రవర్యా ఇంత దూరము వచ్చితివి. నీ వాంఛను చెప్పిన నది నేను తీర్తును ఊరక పోవుట యేల. మఱియొక మాటను గూడ వినుము. నాయందు నీవు, నీయందు నేను ఉన్నాము ఈ సర్వలోకము నీయందున్నది. ప్రాణికోటి సమస్త మందున్న ఆత్మ ఒక్కటే నీకిక చింతయేల అనిన పలుకులు విని తదర్థము నాత్మ గతమ్మున గ్రహించిన భృగుడు, సర్పవరా! నీ చెప్పినది సత్యము. తెలిసి కొనదగినది తెలిసినది. మిమ్ము సందర్శించుటే నా వ్రతమై నిశ్చయమనస్థితికి వచ్చితిని సంతృప్తుడనైతిని. నీవు ధన్యుడవు అని సర్పవిభునికి వీడ్కోలు సెప్పి వెడలెను. భృగుడు తన యీ కథను భార్గవకులముఖ్యుడగు చ్యవనునకు నుడివి అతని ఉపదేశంబున కృతకృత్యుడయ్యెను. ఈ పుణ్యకథనే చ్యవనుడు జనకుని గృహమున నారదునకు నుడివె. నారదుడద్దానిని ఇంద్రునకు, ఇంద్రుడద్దానిని వసువులకు జెప్పెను.

ఈ కథా విశేషము సకల భూత సమదర్శిత్వ సంపాదకము ఉత్తమ ధర్మము నిరతి శయానందకరమును. పరశురాముని తోడి యుద్ధ సమయమున వసువులు నాకు వినిపించిరి అని ధర్మరాజు నకు భీష్ముడు నుడివెను.

తిరిగి వ్యాసుని పంపున తద్రచిత భారత పుణ్య కథను అతని శిష్యుడయిన వైశంపాయన మహామునీంద్రుడు జగత్తున వ్యాప్తి జేయుచు, అర్జునుని ముని మనుమడు, అభిమన్యునికుమారుడయిన పరీక్షిన్మహారాజు కుమారుడగు జనమేజయునికి బోధించెను.

ఈ పవిత్ర చరిత్రము వినినను చదివినను దీర్ఘాయురారోగ్య ఐశ్వర్య శ్రీలు లభించును.

**మహాభారతధర్మశాస్త్రమున**

**శాంతి పర్వము, షష్ఠాశ్వాసము సర్వము సమాప్తము**

**ఓమ్ తత్ సత్**



# మహాభారత ధర్మశాస్త్రము

## అనుశాసనికపర్వము : వచనము

విషయ సూచిక                                                  పుటలు

# మహాభారత ధర్మశాస్త్రము

## అనుశాసనిక పర్వము - ప్రథమాశ్వాసము

### ధర్మరాజు మనోవేదన

గంగానందనుడు భీష్ముడు బోధించిన ధర్మములన్నియు ధర్మరాజు విని ఈ ధర్మములన్నిటిలో అత్యుత్తమ ధర్మమేదియో వచింపుడని అడిగి ఆ విషయమును గూడ తెలిసికొనినాడు.

ఆ గాథలన్నియు విని ధర్మరాజు మరల మొదటికి వచ్చి, భీష్మునకు సభక్తిక ప్రణామము లాచరించి తాతా! నీవు బహు కృపాంతరంగుడవై విశదముగ సకల ధర్మోపదేశములు చేసితివి. కాని నామనసు నందింకను శాంతి కుదుట బడలేదు. ఈ పాండవ కౌరవ మహారణమునకును, అందు జరిగిన నరనృప సంక్షయమునకు కారణము నేనే అని తోచుచున్నది. దాయాది యగు దుర్యోధనుడు మాయందు ద్వేషమూని రాజ్య కాంక్షచే మాయా జూదమును కల్పించి మమ్ములను నానా బాధలపాలు జేసి మాపై యుద్ధమునకు దిగినాడు. శ్రీకృష్ణ భగవానుని సంధిరాయబారకార్యములయినను వినలేదు. నేనైనను త్యాగబుద్ధి వహించి రాజ్యమునంతయు దుర్యోధనునకిచ్చి యుద్ధమునుండి తొలగ జాలితినా? లేదు. సహాయముగ వచ్చిన నరపాలురు పరివారసహితముగ వధింపబడిరి. అటునిటుగల బంధువర్గము మడిసిరి. పుత్రులు మడిసిరి. మేమైదుగురము ద్రౌపదియు మాత్రము మిగిలితిమి. ఇంతరక్తపాతమైన ఈ రాజ్యమువలన సుఖము గన్పడదు. ఇంత మంది చావునకు కారణభూతుడనైన నాకు పశ్చాత్తాపము కూడ కలుగకున్నది. ఏదైన మార్గముపదేశింపుడని దీనుడై అడిగెను.

### గౌతమి యను విప్రాంగన కథ - భూతదయ

ధర్మజుని మనశ్చింత భీష్ముడు గ్రహించి కుమారా! చెప్పిన వన్నియు శ్రద్ధగా వింటివి. ఇంకను మనస్సున నీకీ కలత యేల? మరియొక యితిహాసమును గూడ నుడివెదను వినుము.

గౌతమి శాంతస్వభావయయిన ఒక విప్రాంగన. ఒకనాడామె కుమారుడు పాముకాటున బడి మరణించెను. అందులకామె దుఃఖముతో వగచు చుండగా ఒక కిరాతుడా సర్పమును పట్టుకొని ఆమె ముందునకు తెచ్చి తల్లీ! నీకుమారుని

చంపిన దీ సర్పమే. దీనిని తల బ్రద్దలు గొట్టమందువా, నఱికి ముక్కలు చేయ మందువా అని అడుగగా ఆమె ఓ అన్నా! ఈ పామును చంపకుము. విధివశమున నా బాలుడు మరణించినాడు. ఆ పామేమిచేసినది? ధర్మమెఱిగిన వారట్లు చంపరు. ఈ పామును జంపుట హింస. దీనిని చంపినంత మాత్రమున నా బిడ్డ బ్రదుకునా? మనకు పట్టువడిన శత్రువునైన చంపరాదు అనెను. ఆ బోయవానికామె మాటలు నచ్చలేదు. ఏమమ్మా నీవిట్లు పిఱికిమాటలు చెప్పెదవు. దీనిని వదలిన మఱొకరిని కరవదా? హింస అనెదవు. ఇంద్రుడు వృత్రుని చంపలేదా, పరమశివుడు దక్షయజ్ఞమును నాశనము చేయలేదా. అని బోయడెంత చెప్పినను పామును చంపుట కామె ఇయ్యకొనలేదు.

అంతట ఆ భుజంగమాకిరాతునితో నేనేమి చేసితినని నన్ను చంపబూనెదవు. మృత్యువునకధీనుడనై ఈ బాలుని కాటువేసితిని. ఇందు నాతప్పు లేదు. అనగా బోయవాడు సర్పమా నీవు మృత్యువునకు సాధనమైన క్రూరుడవు నిన్ను చంపితీరెదను అనునంతలో మృత్యువు అచ్చటికి విచ్చేసి యిట్లనెను.

మృత్యువు : ఓయీ బోయవాడా, ఏమినీవిట్లాడెదవు. పాముగాని నేనుగాని ఈ బాలుని మృతికి కారణము కాదు. యజ్ఞకర్త అభిలాషానుసారము ఋత్విజులు పూజ చేయింతురు. ఫలముయజ్ఞకర్తదే కదా. ఈ బాలునికి కాలమాసన్నమైనదని యముడు నన్ను పంపగా నేను పామును పంపితినంతియే. చూడుము యముడును వచ్చుచున్నాడు.

యముడు : ఎందులకీ సంవాదము నిట్లు పెంచుచున్నారు. సర్పము కాదు, మృత్యువు కాదు. నేనును కాదు. ఈ బాలుని మృతికి ఆతని కర్మములే కారణములు. కర్మఫలము తప్పుకొనువారులేరు. అనుభవింప వలసినదే. తన కర్మఫలమున బాలుడు మరణించెను. తన కర్మ ఫలముగ ఈ స్త్రీకి ఇట్టి పుత్ర శోకము సంభవించినది. మధ్యనున్న మేము నిమిత్త మాత్రులమే. సకల జనములును కర్మ వశులై పాప పుణ్యము లనుభవింతురు.

ఆబోయవానికి యముని మాటలు తెలిసివచ్చినవి. ఆ పామును విడిచి తన దారిని పోయెను.

భీష్ముడీ కథనుడివి, ధర్మజా వింటివికదా. సంగ్రామమున అంతమంది మరణించుటకు ప్రధానముగ వారివారి కర్మములే కారణము. నీవుగాని, దుర్యో

ధనుడుగాని ఇందులకు హేతువులు కారు. నీమనసు నందలి చింతవదలి సుఖివి కమ్ము అని నచ్చజెప్పెను. ధర్మజుడీ యుపదేశమునకు ఎంతయు సంతసించి మరల నొక సందేహమడిగెను.

## గృహస్థ ధర్మములకు మృత్యువును జయింప సాధ్యమా?

ధర్మజుడడిగిన ఈ ప్రశ్నకు భీష్ముడు మఱియొక ఇతిహాసము నిట్లు నుడివెను.

ధర్మజా! నీకీ విషయమున సందియమక్కఱలేదు. ఒక యితిహాసము చెప్పెదను వినుము. పూర్వము మనువంశమున దుర్యోధనుడను రాజు కలడు. సర్వజనులక్షేమము కోరి పాలన చేయువాడు. ఆ నృపతిని చూచి కామించి నర్మద యను నది పెండ్లాడి ఆయన వలన దేవకాంతా సౌందర్యమును మించు కడు సుందరి అయిన పుత్రికను కన్నది. ఆ బాలిక పేరు సుదర్శన. తండ్రి ఆ బాలికను ప్రేమతో పెంచి పెద్దదానినొనర్చెను. ఆ రాజు చేయు అగ్ని హోత్ర హోమాదుల పనులా బాలిక చూచుచుండెడిది. అగ్ని దేవుడామె యందమును జూచి మోహపడి ఆ యువతి కరము నాసించెను. ఆమె, అగ్నిదేవా, ఇట్టి విషయములు పెద్దలు నిర్ణయింపవలెనుగదాయని ఊరకొనెను. ఆ నరపాలుడొకమహాయజ్ఞము చేయుచుండగా అగ్ని హోత్రుడొక విప్రవేషమున వచ్చి తనకోరిక తెలిపెను. ఆ రాజు అన్య కులస్థునకు కూతునీయ సందేహించెను గాని, పిదప ఆ వచ్చిన విప్రునెరిగి వారి వివాహమునకు అంగీకరించెను. వారికి సుదర్శనుడను కుమారుడుదయించెను. సుదర్శనుడును ధర్మతత్పరుడైన రాజయ్యెను.

ఆ రాజునకు ఓఘవతి యను మనుమరాలు కలిగినది. ఆమె సుదర్శనుని వలచి పెండ్లాడినది. ఆ దంపతులు ధర్మనిష్ఠా పరులైగృహస్థ ధర్మమున మృత్యువునే జయింతుమను ప్రతిజ్ఞతో, కురుక్షేత్రమునందొక పర్ణశాల నిర్మించుకొని ఆదర్శ గృహస్థులై కాలము గడపుచుండిరి. ఇంటివద్ద నేనున్నను లేకపోయినను ఏతెంచిన అతిథులకేలోపమును లేని రీతిని వారి వాంఛితముల తీర్చుచుండుము. తుదకు నిన్ను గోరినను, దేహాభిమానమున సందేహింపవలదని సుదర్శనుడు భార్యకు చెప్పెను. ఆమెయునట్లే వర్తించుచుండినది. ఒకనాడా సుదర్శనుడు అగ్ని హోత్రమునకు సమిధలకై అటవికేగెను. ఆ సమయమును చూచి ధర్మదేవతయే ఒక విప్రోత్తముని వేషమున వచ్చి ఆమెచేసిన అతిథి గౌరవములన్నియు పొంది సుఖాసీనుడై, ఓఘవతిని చూచి ఓ కాంతా నీ సౌందర్యమును చూచి నీపయి నాకు మరులు కలిగినవి నీవొడంబడుమని పలికెను.

ఆ విప్రుని మాటలకామె నిర్ఘాంతపోయినది. ఆమె మహా పతివ్రత. అయ్యతిథి వర్యునకెన్నియో వస్తువులేర్పరచినది. కాని అతడు తనమాట ఎంత కునుమానడు. ఆమెకేమియు తోచలేదు. అతిథులమాట కాదు అనకుము అని భర్త చెప్పిపోయినాడు. అంగీకరించుటా మానుటా, ఇటునటు తనమనసు ఊగిస లాడి సంకోచించినది. మానినచో అతిథి పూజ తప్పును భర్తమాటను ఉల్లంఘిం చినట్లగును. తుదకెట్లో ధైర్యమున సిగ్గుతో తలవాల్చి ఆ విప్రుని మఱుగునకు తీసికొనిపోవునంతలో భర్త సుదర్శనుడేగుదెంచి తలుపు తట్టి భార్యను పిలిచినాడు. లోనుండి మాటరాలేదు, మరల పిలిచినాడు. లోనుండి ఆ విప్రుడే నేనొక అతిథిని ఈమె ఆతిథ్యమున నిచటనున్నాను. అని చెప్పుటతో సుదర్శనుడు బహు సమ్మో దపడి, తనకు అతిథి పూజా ఫలము సిద్ధించినందులకు కడు సంతృప్తి నందెను. వెంటనే ఆ విప్రుడును ధర్మదేవత రూపమున మహాతేజస్వియై ముందునిలిచి ఆ దంపతుల గృహస్థ ధర్మమునకు మెచ్చి మీ జన్మములు ధన్యములైనవి. మీరిరు వురును మీ యిచ్చవచ్చినపుడు మేనితో స్వర్గమునకేగ చ్చును. మృత్యువు మిమ్మే మియు చేయదని దీవించి వెడలెను. వారి గృహస్థ ధర్మమునకు దేవతలు సంతసించి వారిపై వర్షము గురిసిరి. పదపడి ఆమె ఓఘవతి యను నదీ రూపము వహించి భర్తకు వలయునపుడెల్ల సమీపమున నుండి పరిచర్య సేయుచుండెడిది. ఆహా! గృహస్థ ధర్మమునందింత త్యాగము, పుణ్యము కలదా అని ధర్మజుడాశ్చర్యపడెను.

## యతి ధర్మము అన్ని వర్ణములకు అలవడునా?

అని మరల ధర్మరాజడుగగా భీష్ముడు మఱియొక ఇతిహాసమును జెప్పెను. ధర్మరాజా! అన్ని జన్మములలో బ్రాహ్మణజన్మము దుర్లభము. పూర్వ జన్మము లందు ఎంతయో తపశ్శాలి అయిన కాని, బ్రాహ్మణ జన్మము రాదు అది కూడ కష్టమే. వేలాది వత్సరములు శమదమ సంపన్నుడై చిత్తశుద్ధితో తపస్సొనరించిన వ్యక్తియే ఒక్కొక్క వర్ణమునందు జనించి సిద్ధినందిన తరువాతగాని బ్రాహ్మణ జన్మ లభింపదు అట్లు లభించిన వాడు సదాచార సద్ధర్మ నిష్ఠా నిరతుడై తన బ్రా హ్మణత్వమును నిలబెట్టుకొనవలయును. లేనిచో అతనికి అన్ని విధములను కీడే సంభవించును.

ఈ నుడివిన మాటలకు నిదర్శనముగ ఒక యితిహాసమును వినుము. మతంగుడను విప్రకుమారుడు యజ్ఞార్థంబడవికేగి అచ్చట నున్న ఒకగాడిద పిల్లను అకారణముగ కట్టెతో కొట్టెను. అది ఏడ్చుచు పోయి సమీపముననున్న తల్లితో

చెప్పెను. ఆతల్లి గాడిద ఓహో! ఈతడెవడో చండాలుడుగానున్నాడు. కాక యిట్లు చేయునా అనిన మాటలు మతంగుడు విని, యింటికిపోయి తండ్రికి జెప్పెను. అటుపిమ్మట ఆ విప్రకుమారుడు తనకిట్టి చండాలత్వము వచ్చుటకు కారణము తన తల్లి ఒక నీచుని సంపర్కముచే తనను కనిన విషయమెఱిగి విచారించెను. అట్లు విచారించి తాను మహాతపస్సు చేసి తిరిగి బ్రాహ్మణత్వము సంపాదింతునని దీక్షతో అడవికేగి నిరాహార నియమ వంతుడై వాయుజలపర్ణములే ఆహారముగా గొనుచు తీవ్ర తపము నొనర్చెను. ఇంద్రుడు ప్రత్యక్షమై నీకేమికావలెను బాలకా అని అడుగగా నాకు బ్రాహ్మణత్వము వరమిమ్ము అని అతడడిగెను. అది ఇప్పటిలో అసాధ్యము మరియొక వరము కోరుకొమ్మనగా మతంగుడు నిరాకరించి ఇంకను తీవ్రతరమగు తపమారంభించెను. మరల ఇంద్రుడేతెంచి చెప్పినను, అతడదేమాట. అట్లు తపముచేసిచేసి శక్తి హీనుడై మూర్ఛిల్లెను. ఇంద్రుడు వచ్చి అతనిని తేర్చి మతంగా! నీకెట్లును నీదుశ్చేష్టవలన బ్రాహ్మణత్వము రాదు. నీకు వరమిచ్చెదను. నీవు చండ దేవుడను నామమున సద్గుణవతులగు స్త్రీల పూజలందుచు పక్షి భావమున స్వేచ్ఛగ విహరింపుమని పంపెను.

## విశ్వామిత్రునకు బ్రాహ్మణ్యము కలిగిన విధము

మతంగుని కథవిని ధర్మరాజు, వినమ్రుడై బ్రాహ్మణత్వ సంపాదనము ఇతరులకంతటి కష్టతరమైనచో విశ్వామిత్రుడు క్షత్రియుడు అతనికెట్లు కలిగినది అని ప్రశ్నించెను. భీష్ముడిట్లు సమాధానముగ వచించెను.

ధర్మజా ఆ కథను గూడ వినుము. గంగానదికి భూతలమున జహ్నుని ఆశ్రమమునుండి ప్రవహించిన కారణమున జాహ్నవియని పేరు వచ్చినది. జహ్నుని వంశమున గాధియను ప్రసిద్ధ నరపాలుడొకడుండెను. అతనికి సత్యవతి యను పుత్రిక కలదు. ఋచీకుడను మునివచ్చి సత్యవతిని తనకిచ్చి వివాహము సేయుమనగా గాధి అంగీకరింపక ఒకచెవి తెల్లనివైన వేయిగుఱ్ఱములను కన్యాశుల్కమడిగెను. ఋచీకుడు వరుణునాశ్రయించి అతని యాదేశమున గంగానది ఉత్తర తీరమున నియత తపమాచరింపగా అతని తపఃఫలముగ వేయి గుఱ్ఱములుద్భవించెను. వానిని శుల్కముగా రాజునకిడి, ఋచీకుడు సత్యవతిని వివాహమై విధి విధానముగ గృహస్థ ధర్మమును నిర్వర్తించుచు, పుత్ర సంతానముగోరి హవ్యమును సంపాదింప యత్నింతునని భార్యకు జెప్పెను. సత్యవతియు ఆ మాటను తల్లికి జెప్పగా ఆమెయు పుత్రుని బడయగోరి తనకును హవ్యము నడిగెను. తనతపశ్శ

క్తిచే ఋచీకుడు రెండిటిని సంపాదించి ఒకదానిని భార్యకిచ్చి ఋతుకాలమున మేడి చెట్టు నాలింగనము చేసి ఈ హవ్యమునుపయోగించుము. నీకు బ్రాహ్మణోత్త ముడు పుత్రుడు కాగలడు అని నుడివెను. రెండవ హవ్యమును తల్లి కిమ్మని అట్లే ఆమె ఋతుకాలమున అశ్వత్థమును కౌగిలించుకొనవలసినది. క్షాత్ర తేజముగల పుత్రుడుదయించుననెను. వారికీయబడిన రెండు హవ్యములు గుర్తు విడిపోయి ఒకరిది మరియొకరికడ నుండిపోయెను.

సత్యవతి గర్భిణి కాగా ఋచీకుడు జరిగిన మార్పు గ్రహించి సత్యవతీ! నీ గర్భముననున్నవాడు బ్రాహ్మణుడు గాడు. క్షాత్ర తేజస్వి యగు క్రూరుడనెను. సత్యవతి జరిగిన పనికి విచారించి ఋషి వర్యా! నీకుమారుడు మహా తపోమహి ముడైన బ్రాహ్మణుడు కావలె వేరు విధమైనచో వంశకీర్తి చెడునని పరిపరి విధముల ప్రార్థించి వేడుకొనగా, ఋచీకుడు దయబూని పుత్రుడు బ్రాహ్మణుడగును వాని పుత్రుడు క్షాత్ర తేజస్వి యగునని చెప్పెను. వారే జమదగ్నియు అతని కుమారు డు పరశురాముడు.

అచట సత్యవతి తల్లి యైన గాధి భార్యకుదయించిన పుత్రుడు విశ్వామి త్రుడు. క్షత్రియ గుణము కలవాడయ్యు, -హవ్యము ( ఓషధి మొక్క) యొక్క ప్రభావము వలన తపశ్శాలియయి తుదకు బ్రహ్మర్షి యనిపించుకొనెను.

## వీతహవ్యునకు బ్రాహ్మణత్వము

ఈ యితిహాసమును ధర్మజుడడుగగా భీష్ముడిట్లు నుడివెను. మను సంభవు డైన శర్యాతి వంశమున హైహయుడను వాడు వత్సదేశమునకు రాజు. ఇతనికి వీతహవ్యుడనియు పేరు. ఈ రాజునకు పదుగురు భార్యలు. వారికి పరాక్రమ వంతులైన పుత్రులు నూర్వురు.

ఆ నూర్వురు రాజకుమారులును ప్రబలులై విక్రమ కుతూహలముతో వరుసగా కాశీరాజు హర్యశ్వుని అతని పుత్రుడు సుదేవుని చంపిరి. వాని కుమారు డైన దివోదాసునిపై గూడ దాడి చేయగా అతడోడిపోయి భరద్వాజముని నాశ్ర యించెను. భరద్వాజుడు కరుణించి దివోదాసుని పుత్రకామేష్టి జేయింప తత్ఫల మున వీత ప్రతర్దనుడను సుతుడు కలిగెను. బాల్యమునందే ఆ బాలకుడు సకల విద్యలను ధనుర్విద్యను నేర్చి పరాక్రమ వంతుడై వీతహవ్యుని సుతుల నూర్విరిని వధించి వీతహవ్యుని చంపబోగా అతడు భృగువు నాశ్రమము జేరెను. భృగుఋషి యాతనికి శరణునిచ్చి తన శిష్యులలో జేర్చి కూర్చుండ బెట్టెను.

వీతహవ్యుని వెంటాడుచు ప్రతర్దనుడును భృగువుని జేరి వీతహవ్యుడను రాజును చంపవచ్చితినని భృగువునకు చెప్పగా ఇచ్చట రాజెవ్వడునును లేడు. అందరు నా శిష్యులే అని చెప్పి ప్రతర్దనుని వెనుకకు పంపెను. భృగుఋషి శరణు నందిన వీత హవ్యునికి బ్రాహ్మణత్వమబ్బినది. తత్ఫలితముగ నతడు తేజస్కులు మహా విప్రులునైన పుత్రులను బడసి కీర్తి కెక్కెను.

## దైవ పౌరుషంబుల విధము

పురుష కారము క్షేత్రము. బీజము దైవము, రెండును అనుకూలముగ కలిసినపుడే ఫలసిద్ధి కలుగును. అగ్నికి వాయుసంపర్కము చేతనే వెలుగు, జ్వాల వచ్చినట్లు పురుష ప్రయత్నమునకు దైవము తోడ్పడినపుడే యది ఫలవంతము. కేవలము పురుష ప్రయత్నము వలన ఏమియు జరుగదు. అది రిత్తనేలను విత్తనములు జల్లినట్లే. కర్మము గూడ మంచిదై ఉండవలయును. కర్మశుద్ధి లేనిచోట దైవమహిమయు ఉండదు. దైవ పౌరుషములు రెండును సమానములే.

సత్కర్మలకు మేలైన ఫలములు లభించును. అగ్ని పూజకు శ్రేష్ఠత, దానమునకు తద్వస్తుమహిమ, మౌనమునకు జ్ఞానశక్తి, తపమునకు అధిక భోగము, అహింసకు రూపబలములు ఐశ్వర్యము, బ్రహ్మచర్యమునకు పరమాయువు, ఉపవాసములకు చిత్తశుద్ధి, ఫల జలాహారము వలన అధి రాజ్యము, పత్ర భక్షతకు స్వర్గమును ఫలము. వేద పఠనము వలన సౌఖ్యము, అర్థబోధమునకు సుగతి, సత్యమువలన ముక్తియు కలుగును. తమ తమ కర్మములను బట్టియే పురుషులకు శుభాశుభ ఫలములు కలుగును. విజ్ఞులైనవారు సత్కర్మముల వలన సుఖములందుదురు వారికి ముసలి తనపు బాధలుండవు.

## ఆశ్రయమిచ్చిన వారియెడల ఆశ్రితుల కృతజ్ఞత

కాశీపతి దేశమున ఒకలుబ్ధుడు వేటకు బోయి విషము పూసిన వాడి బాణమును మృగముపై వేయగా అది గురితప్పి పూలు పండ్లు గల ఒక చెట్టును కొట్టెను. ఆ విషమునకాచెట్టు ఎండి శుష్కమైనది. ఆ చెట్టు తొర్రలో వసించు చుండిన చిలుక ఎండిపోయిన చెట్టునందట్లే కాపురముండెను. దేవేంద్రుడది గమనించి ఏమి శుకమా! ఈ అడవిలో ఫలపుష్ప భరితములైన వృక్షములనేకములుండగా ఈ యెండు మొదలును పట్టి విడువవు. ఇంద్రుని జూచి ఆ చిలుక అమరేంద్రా! పండ్లు పుష్పములున్నపుడు ఈ చెట్టు నాశ్రయించి ఉండి ఆ భోగములనుభవించి ఎండి

పోయినపుడు దానిని విడచియేగుట కృతఘ్నతకాదా, నేనట్లు చేయలేను. అనిన చిలుక వివేకమునకు ఇంద్రుడు సంతసించి ఆ పక్షితో ఒక వరము కోరుకొను మనగా, తాను వసించు చెట్టు నెప్పటి యట్లు చేయుమని చెప్పెను. ఇంద్రుని వరమున ఆ చెట్టు వెనుకటి కన్నను మిక్కిలి పొలుపు గలిగి అనేక పక్షులకాశ్రయ మయ్యెను. సహృదయులైన ఆశ్రితులిట్లే ఆశ్రయమిచ్చిన వారియెడ కృతజ్ఞులై ఉందురు.

## నరపాలు రెవరిని మన్నింప దగును

భీష్ముడిట్లు చెప్పెను. ధర్మజా! తపస్సు వేదాధ్యయనముగల విప్రులెప్పు డును పూజ్యులే. స్త్రీకి భర్తయెట్లో రాజులకు బ్రాహ్మణులట్లు. సద్బ్రాహ్మణుని రాజు పుత్రునివలె సేవించి, శిష్యుని వలె పూజించి, అగ్నిదేవునికి సమానునిగా భావింపవలెను. బ్రాహ్మణ జాతికి అవమానము, బాధకల్గించిన వారి పూర్వపు ణ్యము నశించి కీడే అగును. భూసురార్చన వలన పాపములు దుఃఖములు నశించును. ఈ వాక్యములు వేదముల వలన తెలియవచ్చినవే.

ధర్మములకెల్ల పరమ ధర్మము, విష్ణువును తెలిసికొనుటయే అతడు యజ్ఞ మూర్తి యజ్ఞకర్త యజ్ఞఫలము. కృష్ణుడే విష్ణువు. వేదవేద్యుడు, వేదమయుడు వేదార్థ ప్రియుడు. ఇతనినెఱుగుట వలన బ్రాహ్మణత్వ సిద్ధికలుగునని వ్యాసమ హర్షి మద్రపతిమున్నగు వారికి చెప్పెను. కావున సద్బ్రాహ్మణులు పూజ్యులు.

## గరుత్మంతుని వృత్తాంతము

భీష్ముడింతదనుక నుడివిన ధర్మోపదేశములను సోదర సహితుడై విని సంతస మునందిన ధర్మజుడు మరల, గంగానందనా! గురుత్మంతుని చరితము పుణ్యప్రద మని అద్దానిని వినగోరెదననగా ఆ మహాత్ముడిట్లు వచించెను.

ఔను కుమారా! గరుడుని చరిత్ర మంత పవిత్రమైనదే. గరుడుడు విహ గేంద్రుడు ఆ కథ వినుము. కశ్యప మహామునీంద్రునకు కద్రువ, వినత అను ఇరు వురు భార్యలు. పుత్ర ప్రాప్తికై మీకు వరము లిచ్చెదననియామునివర్యుడనగా కద్రువ బలవంతులైన వేయి మంది సుతులను కోరెను. వినత తేజో వంతులు, కీర్తి మం తులైన వారిరువురు చాలునని కోరినది. ఆ ప్రకారమే వారల గర్భములందు అండ ములుద్భవింప వాటిని కుండములందు బెట్టి పదునైదు వందలేండ్లు రక్షింపు చుండు డని ముని చెప్పితపస్సునకేగెను. సమయము వచ్చినంతనే కద్రువ అండములనుండి

అధికబలము గలిగిన వేయి సర్పములుదయించెను. తనసవతికి సంతతి కలిగి తనకు లేకపోవుట ఏల అను అసూయతో వినత ఒక అండమును పగులగొట్టగా అందుండి నడుము వరకు దేహము గల పక్షి ప్రభవించెను. వికలాంగుడైన పుత్రు డెందులకని వినత విచారించుచుండ ఆ పుత్రుడు తల్లిని జూచి, అమ్మా! విచారింపకుము. నీవు చేసిన తప్పిదము వలననే నిట్లయితిని. రెండవ అండము నైనను సరిగా రక్షించుకొనుము. అపార జవసత్త్వములు గలిగి కీర్తిమంతుడయిన సుతుడుద్భవించునని చెప్పెను. ఆతని పలుకులు విని వినత సమయపూర్తి వరకు వేచియుండ ఒకనాటి సుముహూర్తమున ఆ యండము నుండి బాలభానునివలె మహాతేజోవంతుడు మహా బలిష్ఠుడగు విహగుడుదయించి తల్లికి, జ్యేష్ఠ సోదరు నకును ముదముగొల్పెను. ఇతడే గరుడుడు. పుట్టినప్పటి నుండియు తల్లి వద్దనే ఉండిపోయెను. మొదటి కొడుకు అరుణుడు సూర్యునికి పరిచర్యసేయ నేగెను.

సవతుల సంతతి పెరిగి పెద్ద వారగుచుండిరి. ఒకనాడు సవతులిరువురు సముద్రతటమునకు విహారమునకేగి ఆ సమీపమున చంద్రుని కాంతిని బోలిన వన్నెతో నున్న ఒక తెల్లని గుర్రముకనుపించెను. వినత యా గుర్రమును చూచి అచ్చెరువడి అక్కా! చూచితివా ఆ యశ్వము ఒడలంతయు సర్వాంగములు ఎంత తెల్లవిగనున్నవో! అనగా కద్రువ వెకిలి నవ్వు నవ్వుచు ఇదేమి మాట వినతా! దాని తోక ఎంత నల్లగా నున్నదో అనెను. నల్లన కాదు తెలుపే అని ఆమె, తెలుపు కాదు నలుపే అని ఈమె. ఇట్లే వాదము లాడుకొని ఎవరి మాటనిజమో తేల్చుకొనుటకు పందెము వేయుదమనగా కద్రువ, నామాట నిజమైనచో నీవు నాకు దాస్యము చేయుము. నీమాట చెల్లినచో నీకు నేను దాసినగుదుననెను. వినత అందులకంగీ కరించి రమ్ము దగ్గరకేగి చూతమనియెను.

కద్రువ కుటిల స్వభావ. అప్పటికి తప్పించుకొనజూచి, ఈనాడు కాదు రేపు చూతము. నాకు పతిపరిచర్య సమయమైనదని చెప్పియేగెను. ఇంటికేగి కద్రువ వాసుకి మున్నగు తన తనయుల బిలిచి, సముద్ర తీరమున ఒక తెల్లని గుర్రమున్నది. మీరేగి దానితోకను పట్టుకొని వ్రేలాడి నల్లనగ జేయవలసినదని చెప్పి తనకు వినతకు గల పందెమును గూర్చి చెప్పినది. వాసుకి మున్నగు వారు తల్లి మాటలకంగీకరిం పక అమ్మా! యిదేమి, వినత మాత్రము మాకు తల్లిగాదా. ఇట్టి పాపమునకు మేము ఇష్టపడము అని స్పష్టముగ చెప్పగా కద్రువ కోపించి, పూజ్యురాలగు తల్లి మాటలు వినలేదు గాన, పాండవ వంశజుడు జనమేజయుడు చేయతలపెట్టిన

సర్పయాగమున మీరందరు దగ్ధమై నశింతురని శాపమిచ్చెను. ఆ శాపమునకు భయపడి వారిలో కొందరేగి ఆ గుఱ్ఱముతోకను చుట్టుకొని నల్లగా కనుపించు నట్లు చేసిరి.

మఱునాడు కద్రువ వినతను ఆగుఱ్ఱము వద్దకు తీసికొని పోయినది. వినత తన కనులను తానే నమ్మలేకపోయినది. గుఱ్ఱపు తోక నల్లగా నున్నది. వేసికొన్న పందెము ప్రకారము వినత కద్రువకు దాసియై ఆమె చెప్పిన పనులు హైన్యము లైన వైనను అణకువతో అనినమాట ప్రకారము చేయుచున్నది. ఏమి చేయగలదు. మాట తప్పని సత్యవినయాది సద్గుణవతి ఆమె.

వినత రెండవ కుమారుడు గరుడుడు పెరిగి పెద్దవాడయి మహా బలవంతుడయ్యెను. యౌవన క్రీడలందు స్వేచ్ఛగా తిరుగుచుండెను. ఆతడు ఱెక్కలు విప్పి పైకెగిరెనా, ఆ వేగధాటికి వృక్షములు కూలుచున్నవి. పర్వతము లదురుచున్నవి. గరుడుడట్లు విహరించుచుండగా ఒకనాడు దేవవముని నారదుడు చూచి, ''ఏమి గరుడా! నీవట్లు స్వేచ్ఛగా ఆటలాడుకొనుచున్నావు. నీతల్లి సకల సద్గుణవతి వినత సవతి ఆలు అయిన కద్రువకు దాస్యము చేయుచు నానా హింసలు పడుచుండగా చూచుచు అసమర్థుని వలె ఊరకున్నావు'' అని మందలించెను. గరుడునకు ఈ విషయమే ఎఱుకలేదు. నారదుడు జరిగిన దంతయు చెప్పి, గరుడా! వేగమే నీవు చేయగలిగినది చేయుము. నీ మాతృ ఋణము తీర్చుకొనుమని హెచ్చరించెను. గరుడుడు ఎట్లైనను తన తల్లి దాస్యముదీర్పకృత నిశ్చయుడై యేగి మున్ముందు తన మాతృదేవికి ప్రణతులర్పించి అటనుండి కద్రువ కడకేగి నమస్కరించి తల్లీ! నీ చెల్లెలు వినతను దాసిగా చేసికొని హింసపెట్టుట నీకు తగునా? నేను మాత్రము నీ పుత్రుల వంటివాడను కాదా, మీ పందెముల మాట నాకు తెలియదు. నా తల్లి బాధ పడుట చూడలేను. దీనికి మార్గమునీవే చెప్పుమనగా కద్రువ మొగము చిట్లించుకొని ఓహో! వ్రేలెడంత లేవు నీవు నాకు చెప్పవచ్చితివి. వినతకు దాస్యవిముక్తి వాంఛింతువేని అమర లోకమున దేవేంద్రుని రక్షణలోనున్న అమృతమును దెచ్చి నాకుమారులకిమ్ము అని పంపెను.

కద్రువ చెప్పిన మాటలు విని గరుడుడు కశ్యపునివద్దకేగి, ''తండ్రీ! నాతల్లి పడుచున్న బాధలు నీవెరుగుదువు. నేనది చూడలేను. సహించలేను. మాతృదాస్యమును అంతము జేయుటకు నిశ్చయించితిని. ఇందులకు పణముగా దేవలోకమున నున్న అమృతమును తీసికొని రావలె''నని కద్రువ అన్నది. ఈ పనికై నన్ను

దీవించి పంపుడు అనిన గరుడుని మాటలు విని కశ్యపుడు, ''కుమారా! అది అసాధ్యమైనపని. ఎవరును దరిజేరకుండ ఇంద్రుడమృతమును సురక్షితము చేసినాడు. దానిచుట్టును జలము, జలము చుట్టును మహావహ్నిజ్వాలలు. ఆ ప్రదేశమును మహాభీకర మారణాయుధములతో రాక్షసులు కావలి యుందు''రని కశ్యపుడు గరుడుని వారింపజూచెను. గరుడుడు వినలేదు. నేను సాధించి తీరుదును. నామాతృ దేవికి దాస్యవిముక్తి కల్పించెదను, అను నిశ్చయముతో నుండెను.

గరుడుని పట్టుదల కశ్యపునకాశ్చర్యము కలిగెను. అట్లయినచో కుమారా! నీవు ముందుగ తూర్పు సముద్ర తీరమునకేగుము. అచట సురము అనిన మహా పర్వతము దానివద్ద ఒక కొలను ఉన్నది. అందు ఒక పెద్ద కచ్ఛపమున్నది. అట నీరు త్రాగుటకు ఒక పెద్ద ఏనుగు వచ్చును. పూర్వము మధు కైటభులను రాక్షసులవి. ఇంకను పోరాటము మానలేదు. వానిని నీ కాళ్ళ గోళ్ళతో గ్రుచ్చి పట్టుకొని దూరమునకేగి భక్షింపుము. అవి నీకమోఘ బలము నీయగలవు నీకు జయమగును అని దీవించిపంపెను.

తనయత్నమున కన్నియు అనుకూలముగానున్నట్లు గరుడునకు తోచినది. మహోత్సాహముతో బయలుదేరి తండ్రి చెప్పిన సురము పర్వతము దగ్గరకేగునప్పటికి గజకచ్ఛపములాకొలనుగట్టున ఒకదానినొకటి పట్టుకొని పోరాడుచున్నవి. మహా శూలము వంటి తన ముక్కుతో వానిని విడగొట్టి చెరొక కాలితో చెరొక దానిని పట్టిగోళ్ళతో నొక్కిపట్టి వానిని భక్షించుట కొకమహా వృక్షశాఖపై వ్రాలెను. అది పళపళ విరిగి క్రిందపడబోగా దానిని పడకుండ ముక్కుతో కరచి పట్టుకొని ఎచ్చట దానిని విడుచుటా ఎవరికైనను ఆపదకలుగునేమో అని గరుడుడు ఆలోచించుచుండ, ఆ శాఖను బట్టి వ్రేలాడుచున్న వాలఖిల్యులను మునులు ఆహా! ఇతడు వైనతేయుడు, ఇతడు గాక వేరొకడీ శాఖను మోయజాలడని తలచి అతని ప్రయత్నమునకు విజయ మభిలషించి వేరొక చోటికేగిరి. గరుడుడా మహా వృక్ష శాఖను పుళింద ప్రాంతమున విడచి సమీపముననున్న ఒక మహా పర్వత సానువుపై వ్రాలి గజకచ్ఛపములను గోళ్ళతో చీల్చి తునాతునుకలు చేసి సంతృప్తిగ తిని ఇనుమడించిన జవ సత్వములతో దివిజలోకముల చేరుటకు ఒక్క ఉదుటను పైకెగసెను.

ఆకసమున మహావేగమున నేగు గరుడుని జూచి గగన చరులైన యక్షకిన్నర సాధ్య గంధర్వాదులు భీతిల్లి ప్రక్కలకు పోయిరి. సూటిగా గరుడుడు అమృత భాండమున్న స్థానమునకు జని అచ్చట ఆకసమున కెగయుచున్న నిప్పు మంటలను జూచి, ధైర్యముగ నచ్చటికేగుచో తన ఱెక్కలకేదైన ప్రమాదము వాటిల్లునను భయమున, ఏదైన ఉపాయము కొరకు బ్రహ్మకడకేగి తన తల్లి బాధలు, తన ప్రయత్నమును విన్నవింపగా బ్రహ్మ కరుణించి తగినంత వెన్నను దెచ్చి, ఆ మంటలపై పడవేయుము. ఆ జ్వాలలు తగ్గును లోపలి కేగుటకు నీకు వీలగునని చెప్పి పంపెను. ఆలమందలు గల ప్రదేశములకేగి గరుడుడు గుట్టలుగుట్టలుగ వెన్నను దెచ్చి ఆ మంటలపై బడవేసెను. జ్వాలలు తగ్గినవి. తన సుదీర్ఘములైన ఱెక్కలతో అటనున్న జలములను చెదరునట్లు చేసి మంటలపై జల్లెను. ఇక అట కావలిగాయు మహో గ్రాకారులు మారణాయుధ ధారులు రాక్షసులున్నారు. ఒక్కుమ్మడిగా వారు గరుడునిపై బడిరి. వారి ఆయుధములనుండి తప్పించుకొనుచు తన ముక్కుతో కాళ్ళతో గోళ్ళతో, ఱెక్కలతో ఆ క్రూర రాక్షసులను చీల్చి చెండాడి అంగుష్ఠ మాత్రుడై లోనికేగి అటనున్న అమృత భాండమును పెకల్చి తన ఱెక్కల మాటున పెట్టుకొని గరుడుడు తిరుగు ప్రయాణమైనాడు.

గరుడుని రాక అతని అవార్య శౌర్య సాహసములు, అమృత భాండాపహరణము దేవలోకమున వ్యాపించినవి. ఓహో! తానుండగా, తన దేవ సైన్యము లప్రమత్తులై యుండగా, ఒక పక్షి యింత చేయునా! అందునను తన రక్షణలో నున్న అమృత భాండమే అపహరింపబడినదా! అని ఇంద్రుడు మహాగ్రహమున తన సేనతో గరుడుని పైకి పెద్దయుద్ధమొనర్పతలపడెను. గరుడుని ఱెక్కల విసురునకు దేవసేనలు చెల్లాచెదరైనవి. ఇంద్రుని వజ్రాయుధము నిరుపయోగమైనది. గరుడు డజేయుడై సంకల్ప సిద్ధుడై తిరిగి వచ్చి అమృత భాండమును కద్రువకు జూపి, ''ఓసీ! కుటిలమానసీ! నీ మాట చెల్లించితిని. ఇదుగో అమృత భాండము. నా తల్లి దాస్యమునకు ముక్తియైనది. నేను నామాతృమూర్తిని తీసి కొనిపోవుచున్నాను. అని ఆమెనింటికి పంపి, ఎవరును తాకకుండ మఱుక్షణమే ఆ అమృత భాండమును పదిలముగా తీసి కొని పోయి దేవేంద్రునకొసగి సంతసింప జేసెను. అమృత భాండమును తీసికొని వచ్చుటలో తనవల్ల దేవలోక వాసుల కేదేని నొవ్వు కలిగిన చోదానికి క్షమాభిక్ష వేడికొనెను. గరుడుని శక్తియుక్తులకు, బలసాహసములకు కార్యదక్షతకు బ్రహ్మేంద్రాది సురలు, మునులు సంస్తుతులొనరించి అనేక వరములిచ్చి దీవించిపంపిరి.

గరుడుడు, ఇంటికి మగిడి వచ్చి తల్లి దండ్రులకు భక్తి ప్రణామము లాచరించి వారి ప్రేమాదరములకు పాత్రుడై మహా కీర్తి మంతుడై విరాజిల్లెను.

చదివినను విన్నను ఈ సౌపర్ణాఖ్యానము దీర్ఘాయురారోగ్య సకల సంపద లిచ్చును.

## బ్రాహ్మణునకు ఆశాభంగము కల్గించినవాని గతి

ధర్మజుడడుగగా భీష్ముడిట్లొక కథ దానికి నిదర్శనముగా ఇట్లు నుడివెను. ధర్మజా! ఎవరును ఎవరికిని ఆశాభంగము సేయరాదు. మాట తప్పుట వలన కీడే గాని మంచి యెప్పుడు జరుగదు. ఒక అడవిలో ఒక చెట్టుపై నొక వానరము వసించు చుండెను. ఆ చెట్టు క్రింద బొరియలో ఒకనక్క వసించు చుండెను. ఒక నాడా నక్కను జూచి వానరము, ఓ మిత్రమా! మనమేనాడో బంధువులమేమో ఇప్పుడు మిత్రులమైనాము. నిన్ను జూచి నాకు జాలి పుట్టుచున్నది. ఈ కుళ్ళిపోయిన మాంసపు ముక్క నంజుళ్ళు ఆహారమగుట నీకేల వచ్చిన దని అడిగెను. ఆ నక్కకు పూర్వజన్మ స్మృతికలదు. ఓ మిత్రుడా! నేను పూర్వజన్మమున ధనికుడనే. ఒక బ్రాహ్మణుడు అర్థియై రాగా అతనికి వలయు ధనమిచ్చెదనని ఆస జూపి తుదకు ఒక్కపైస అయినను ముట్టజెప్పలేదు. ఆ పాపఫలము నాకీ జన్మలో ఇట్లు ఫలించినది. ఆశా భంగము చేసిన వారికీ గతి తప్పదు.

## శూద్రునకు వైదిక మంత్రోపదేశము తగదు

సదాచార సంపన్నుడైన తక్కువ కులజునకు మంత్ర తంత్రాదులుపదేశించుట ధర్మ విరుద్ధమగునా యని ప్రశ్నించిన ధర్మరాజునకు భీష్ముడిట్లనియె.

హిమగిరిపై అనేక బ్రాహ్మణులు తపము చేయుట జూచి ధర్మగుణము గలిగిన ఒక శూద్రుడు ఆ బ్రాహ్మణుల గురువును తనకును తపము జేయు మంత్ర ముపదేశింపుడని వేడెను. అంత ఆ మునిపతి వైదిక ధర్మము శూద్రునకుపదేశింపకూడదు. ఆ మంత్రములను అవగాహన చేసికొనుటకు తగిన మనశ్శక్తి నీకు లేదు. నీవిచట శుశ్రూష చేయుచుండుమని నిర్దేశించెను.

ఆతడట్లే అచట నొకగుడిసె నిర్మించుకొని అచటివారికి తగు పరిచర్యలొనర్చు చుండెను. కడు నిష్ఠతో అతడు చేయువిధులు చూచి దయగలిగిన ఆ మునీంద్రుడు అతనికి చేయగూడని కార్యములు తెలిపి కొన్ని పుణ్యకర్మలుపదేశించెను. ఆ శూద్రుడునుయథావిధి పుణ్య కర్మములు జరిపి మఱుజన్మంబున ఒక రాజునకు సద్గుణ

నిధియైన పుత్రుడై జన్మించెను. ఇతని కుపదేశించిన భూసురుడును ఏవేని చెప్ప గూడని మంత్ర తంత్రములుపదేశించిన కతంబున పరమ పదము తప్పి మరల విప్రజన్మంబంది, తొలి జన్మమున చేసిన తప్పెరింగి పశ్చాత్తాపపడి అనేక దాన ధర్మములొనరించి తిరిగి తన తొల్లిటి యాశ్రమంబున జేరి తపోధనుడై పరమ పదము నందెను. వేద మంత్ర తంత్రోపదేశములు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకే తగును.

## లక్ష్మి నివాస స్థానము

ఎట్టి వారియందు లక్ష్మి వసించుచుండునని ధర్మజుడడుగగా భీష్ముడిట్లు చెప్పెను.

రుక్మిణికి లక్ష్మీదేవి చెప్పిన విశేషములు- తపము, దానము నిర్మల బుద్ధి సత్యము, గురు భక్తి, శమదమములు, సత్కార్మలు విజ్ఞానము. బ్రహ్మ చర్యము ఉన్న చోటుల నేనుందును. క్రూరులు నాస్తికులు కుమతులు, మోస గాండ్ర దరికి జేరను. మంచి నడత పరిశుభ్రత, శుచి యగు స్త్రీ యందు నిల్తును. భర్తకు ప్రతి కూలయు, పరుషవచన, అన్యగృహములకేగు స్త్రీల దరి నిలువను. తామర పూల కొలనులందు, వృక్ష సముదాయమునందు, పుష్ప వాటికలయందును ఉందును. ఈ ధర్మములు గ్రహించి స్త్రీ పురుషులు తమ జీవనముల నడపుట ఉత్తమము.

## సాంగత్యమున స్త్రీ పురుషులలో సుఖము ఎవరికి ఎక్కువ

ధర్మజుడడుగగా ఈ విషయమును గూర్చి భీష్ముడిట్లు చెప్పెను. పూర్వము భంగాస్వనుడను నరపాలుడొకడుండెను. అతడు ఇంద్రునకిష్టములేని యజ్ఞమొకటి జేసి, యజ్ఞఫలముగ నూర్వురు సుతులను గని సుఖముగా నుండెను. ఆ రాజు నెట్లైన తన వశము చేసికొనవలయునని ఇంద్రుని ఊహ. ఆ రాజొకనాడు వేటకు పోగా ఇంద్రుడాతనికి దిగ్భ్రాంతి గొలిపి దారి మళ్ళించెను. ఆతడు తిరిగి తిరిగి అలసట జెంది అటనున్న కొలనులో మునిగి పైకి వచ్చునప్పటికి తన పురుషాకృతి పోయి స్త్రీయాకారము తాల్చెను. అయ్యో ఈ ఆకారముతో నేనెట్లు నా పురమున కేగి రాజ్యము సేయుదును. ఏమి గతి అని ఆలోచించి రాజ్య పాలన పుత్రుల కప్పజెప్పి తాను తపస్సునకు పోయెను. అచట ఒక తపస్వి తనకు ప్రియుడయ్యెను. వారిరువురికి మరి నూర్వురు తనయులు కలిగిరి. ఆ శిశువులు పెద్దవారైన తరువాత వీరు నాకు పుట్టిరి మీరు వీరు అన్నదమ్ముల వలె అన్యోన్యముగ నుండుడని మొదటివారికి చెప్పెను. వారట్లే ఒకరికొకరు సహాయకులుగా నుండి

రాజ్యము నభివృద్ధి చేసిరి. ఇంద్రుడది గ్రహించి సహింపలేక ఒక విప్రవేషమున నేగి వారికి వీరికి కొండెములు చెప్పి ఒకరిపై నొకరికి ద్వేషము పుట్టింపగా అది క్రమముగా పెద్ద కలహమై వారొకరినొకరు కొట్టుకొని చచ్చిరి. వారి మరణమున కావనిత యేడ్చుచు అచటికి వచ్చిన ఇంద్రునితో తనగోడు వేటకేగిన దాదిగా నుడివి కరుణింపుమని వేడెను.

ఇంద్రుడామె దైన్యము నరసి కరుణించి వనితా! పూర్వపుత్రులనా ఇప్పటి వారినా నీకెవరిష్టమో కోరు కొమ్మనెను.

స్త్రీ : సురేంద్రా! నేను స్త్రీగానున్నపుడు పుట్టిన వారినే ఇమ్ము

ఇంద్రుడు : ఇటులేల? నీ పూర్వ పుత్రుల నెందులకు కోరలేదు.

స్త్రీ : బిడ్డలయందు ఆడవారికే మక్కువ ఎక్కువగాన అట్లు కోరితిని

ఇంద్రుడు : నీవు చెప్పినది నిజము. నీ పుత్రులందరిని బ్రతికింతును. తీసికొమ్ము. నీ పూర్వ పురుషత్వమును నీకిచ్చెదను. తీసికొని నీ రాజ్యమేలుకొనుము.

స్త్రీ : నన్నిట్లే స్త్రీగా ఉండనిమ్ము. పురుషత్వము వలదు.

ఇంద్రుడు : ఎందుచేతనీవిట్లు స్త్రీ రూపమే కోరెదవు.

స్త్రీ : సురతమునందు స్త్రీలకే సుఖమెక్కువ. అదియే కారణము.

ఈ కథ వలన తానడిగిన ప్రశ్నకు సమాధానము గ్రహించి ధర్మజుడూరకొనెను. తన పుత్రులకు రాజ్యమిచ్చి ఆమె స్త్రీగానే ఉండి తన ప్రియుని వద్దకేగినది.

## వైష్ణవ ధర్మము.

ధర్మరాజునకు మరల నొకవిచారము ఆత్మయందు పొడగట్టినది. గంగా నందనా! నీవు ప్రసన్నుడవై ఎన్నియో ధర్మములు చెప్పితివి. కృతజ్ఞుడను. నా మన స్సుననున్న సందేహము మాత్రము పోవుటలేదు. ఈ ధర్మము లన్నియు జనన జరామరణ బాధల నుండి దాటించునా. గర్భవాసమనగా నరకమే. నేనది సహింప జాలను. భవమోక్షము వైష్ణవ ధర్మము కలదని కృష్ణద్వైపాయనుడు వచించినది వింటిని. దాని నుపదేశింపవే అని వేడెను.

భీష్ముడంతట, కుమారా, పగవారినిగెల్చి పూజ్యమగు రాజ్యపాలన కీడుగా నెంచుచుంటివి. ఇది తగదు. జన్మించిన వారికి శాశ్వత సుఖము నిచ్చునది పురుష రూపయగు ప్రకృతి యున్నది. వివేకము వలననే అది తెలియబడును. కామ క్రోధ ములు మనుజు నావంకకు జననీయవు. అవి మనసున పుట్టని రీతిని పరుడవై యుండుము. సంసార భయమునశించును.

## సకల భూతాత్మకుడగు పరమాత్మ తత్త్వము

ధర్మజుడు మరల అధ్యాత్మము, అధిభూతము, అధిదైవము సర్వమునకు కర్త భర్త హర్తయయి సకల భూతాత్మకుడయిన వాని తత్త్వమెట్టిది అని అడుగగా బ్రహ్మమానస పుత్రులలో నొకడగు సనత్సుజాతుడు నారదునకు చెప్పిన యుపదేశమునే బీష్ముడిట్లు నుడివెను.

పదివేల కల్పములు విష్ణువునకు నిద్రాసమయమగు రాత్రి. అట్లే అంత కాలము పవలై జాగృతి సమయము. ఆ దేవుని దివ్యాత్మ అవ్యక్తమైనది. జ్ఞాన దృష్టి గల వారికే తెలియనగును. ఆ పరమేశ్వరుడు రాత్రి నిద్రించి ప్రభాతమున మేల్కొని జలముల సృజించి అందు తన సువర్ణకాంతి గల వీర్యమునిడ అదియొక అండముగా రూపొందును. అంతట బ్రహ్మను కల్పించి అతనికి సృష్టి కార్యమీయగా అతడహంకారమున మనసు పది ఇంద్రియములు నియోగించి ఆకాశపవనాగ్ని జల భూములగు పంచభూతముల సృష్టించి వానికి శబ్ద స్పర్శ రూప రస గంధమ్ములగు గుణములను కల్పించి తదనంతరము దేవముని దానవ గంధర్వాది జంతు జాలముల సృజించు, నవి యన్నియు అహంకార వ్యాప్తములయి అవ్యక్తసాగరమ్మున నుండును. విష్ణువునకీ సృష్టి స్థితి లయములు శుభాశుభములొక లీల. పంచభూతములు (5) ఇంద్రియములు (10) శబ్దాది గుణములు(5) మనసు బుద్ధి అహంకారము అవ్యక్తము (4) ఇవి 24 తత్త్వములు. ఇక అధ్యాత్మాదులను వినుము.

1. ఆధ్యాత్మము అధి భూతము అధిదైవతమ్ములను వినుము

| | ఆధ్యాత్మము | అధి భూతము | అధిదైవతము |
|---|---|---|---|
| (చెవి) | శ్రోత్రము | శబ్దము | దిక్కులు |
| (చర్మము) | చర్మము | స్పర్శ | మరుత్తు |
| (కన్ను) | నేత్రము | రూపము | ఆదిత్యుడు |
| (నాలుక) | జిహ్వ | రసము | ఉదకము |
| (ముక్కు) | ఘ్రాణము | గంధము | భూమి |

ఇవి యైదును బుద్ధీంద్రియ ప్రపంచము

2. ఇవి కర్మేంద్రియములు.

| అధ్యాత్మము | అధిభూతము | అది దైవతము |
|---|---|---|
| పాదము | గంతవ్యము | వాసు |
| పాయువు | విసర్గము | మిత్ర |
| ఉపస్థ | ఓల్మము | ప్రజాపతి |

| | | | |
|---|---|---|---|
| | పాణి | ఆనందము | శక్రుడు |
| | వాక్కు | కర్తవ్య వక్తవ్యము | వహ్ని |
| 3. | అహంకారము | అభిమానము | మేధ |
| | మనసు | మంతవ్యము | అమృతకరుడు |
| | బుద్ధి | నిశ్చయము | బ్రహ్మము |

ఇవియన్నియు విష్ణువునందుద్భవించి లయమగుచుండును. వీనివలన నతడు వికారము లందడు.

అవ్యక్తమనగా మూల ప్రకృతి. పురుషచైతన్యము వలన చేతన యగుచు భువన తంత్రమును నడపు చుండును. ఇట్లు లోకకర్తయగు విష్ణువు హరుని యను మతమున సృష్టి లయములు నడపుచుండును.

వీనికన్నిటికి మూలమైన విష్ణువు ఇరువది యైదవ తత్త్వము.

## మహాత్ములు తమలో పరమాత్మ నెట్లు భావింతురు

అమృతము కొరకు క్షీరాబ్ధి మథించు వేళ దేవ దానవులకు యుద్ధమైనది. అందు అమరులు అలసి బ్రహ్మవద్దకు పోయి వేడుకొనగా నతడు నారాయణుని ఆత్మయందు నిలిపి భక్తవత్సల! పరమాత్మ! సురలకు నీవే శరణమగుమని ప్రార్థింపగా ఆకసము నుండి నేనిదే వచ్చుచున్నాను అని ఒక శబ్దము వినబడినది. వెంటనే గరుడ వాహనముపై శంఖ చక్రగదాశార్ఙ్గ ఆయుధములతో వచ్చి దానవులను నిర్జించి సురలకు అమృత మందునట్లు చేసి అంతర్ధానమునందెను. సురలు ఆశ్చర్యపడిరి. ఆహా, ఈ తేజము ఈ ఆకారమెవ్వరిది ఎవరిట్లు మనకు సాయమొనర్చిరి: ఇది యంతయు అద్భుతముగా నున్నదని దిక్కులు చూచుచుండ బ్రహ్మ ఇపుడు వైకుంఠుడే వచ్చి మనకు సాయమొనర్చినాడు. ఆ దేవుని మహిమ తెలిసికొనుటకును అలవిగానిది అని చెప్పెను.

## గరుత్మంతుడు మునులకు విష్ణుదేవుని మహిమను చెప్పుట

ధర్మరాజంతట ఊరకొనక విష్ణుమహిమను కొంతవరకైన తెలిసికొన గోరుటచే భీష్ముడొక ఇతిహాసమునిట్లు చెప్పెను.

పూర్వమొకనాడు హిమగిరిపై మునులు, సిద్ధులు చేరి సద్గోష్ఠి సలుపుచుండ గరుత్మంతుడచటికి వచ్చి, వారికెల్లరకు ప్రణతులర్పించి వారిచ్చినగౌరవ ఆతిథ్యములు గైకొని సుఖాసీనుడై యుండెను. అటనున్న మునులు, సుపర్ణా నీవు విష్ణు ప్రియుడవు విష్ణుమహిమను మాకు విశదీకరింపవలయునని అడుగగా, గరుడుడు వారలకిట్లనియె.

త్రిలోకములను పోషించి రక్షించుటకా ప్రభువు లీలగా ప్రవర్తించుననిన విషయము ఎల్లరెఱిగినదే. కాని ఆ దయామయుని తత్త్వమిట్టిదని వచించుట ఎవరితరము. అది అసాధ్యమైన విషయము. నేనెఱింగినంత చెప్పుదును. నాతల్లి దాస్యమును పోగొట్టు నిమిత్తము నేను దేవేంద్రుని నిర్జించి అమృతము గొనిపోవు నపుడు ''విహగేంద్రా! నీ ధైర్యసాహసములకు జవసత్త్వములకు మెచ్చితిని నీకొక వరమిచ్చెదను కోరుకొనుము'' అని ఆకసము నుండి నాకొకసందేశము వినిపించినది. ఎవరా ఇట్లందురు అని నాకు ఆశ్చర్యమైనది.'' మీరెవరో నాకు తెలియకున్నది. మిమ్మెఱిగించి తరువాత వరమీయుడని నేను వచించునంతలో ఒక మహోజ్జ్వల తేజస్వి నవ్వుచు నా కనుల ముందు నిలచి నన్ను గూర్చి కాల క్రమమున నీ వెఱుంగుదువు. నీవు జరామరణములనునవి లేక సురాసురల గెల్వజాలిన బల ముతో వర్ధిల్లుదువని వరమిచ్చెను. ఆ వాక్యములు నాకు పరమ హర్షము కల్గించిన వి. నేనును భక్తి వినమ్రుడనై ఆ మహా పురుషునకు ప్రణామములాచరించి స్వామీ నీవరము వలన ధన్యుడనైతిని. నేను మీ వాహన మగుదును. మీరెక్కిన రథము పై కేతనముగ నుందును నా సేవలను స్వీకరింపుడని ప్రార్థించితిని. నా మాటల కు ఆతడియ్యకొని అంతర్ధానమందెను. నేనీ వృత్తాంతము నంతయు మా తండ్రి కశ్యపమునీంద్రునకు చెప్పితిని. ఆతడాశ్చర్యపడి నాయనా! నీవు ధన్యుడవు నీకు కనపడిన మహా పురుషుడు శ్రీమన్నారాయణుడు. నీతో ఆ పరమాత్మ సంభా షించునంతటి పుణ్యవంతుడవని యెంతయో సంతసించి బదరికాశ్రమంబున నున్న ఆ నారాయణుని సేవించుకొనుచు చరితార్థుడవగుమని నన్ను దీవించి పంపెను.

నేనును బదరికకేగి అష్ట భుజుడు శంకచక్ర గదాసి శా రజదారి పీతాంబర కలితుడైన నారాయణునకు ప్రణమిల్లితిని. చిఱునవ్వుతో నన్ను వెంట రమ్మనుచు తాను తూర్పుదెసగ బహు సహస్ర యోజనముల దూరమేగ బయలుదేరెను. దారి మధ్యమున మహాద్భుతములు ఉజ్జ్వలములగు మహావహ్ని జ్వాలలు, ఏమియు ఇంధనము లేకనే వెలుగు చున్నవి. అందు శివాసహితుడై శివుడు తపమొనర్చు చుండెను. అదియును దాటి చనుచుండ నాకు ప్రయాణ శ్రమ యెక్కువై చాల అలసితిని. ముందేగుచున్న శ్రీమన్నారాయణునే శరణుగా భావించి అనుసరించు చుంటిని. కొంత దూరమేగుసరికి తారా చంద్ర భాస్కర కిరణములు లేని మహా తమస్సు జొచ్చితిని. నాకు దృష్టిచెడి మూఢత్వమబ్బినది. మరల శ్రీమన్నారా యణుని నీవేగతియని ప్రార్థించితిని. చీకటులన్నియు పోయి ఒక పెద్ద వెలుగు పట్టపగలు కన్న మిన్నయైనది కనుపడినది. భాస్కరుడు లేడచట. సర్వ జంతు ప్రాణి

కోటికి సురాసురులకును అగమ్యమే అది. ఆనందకరముులైన కమలాన్విత నదు లున్నవి. లలిత మధుర సంగీతములు వినవచ్చుచున్నవి.

కొందఱు నరులు, కొందరు స్త్రీలు మాత్రమా దేవదేవుడు నారాయ ణునకు పూజలొనర్చుచున్నారు. ఆ ప్రదేశమంతయు అగ్ని తేజమయమై భీకర మయి ఉండుటగని నేను వెఱగంధితిని. భయము వీడుము, నాయందు నిశ్చల మతివై అనుసరింపుమన అట్లే చేతిసిని. వైనతేయా! నీవు నీ తండ్రి చెప్పిన విధ మున నిష్ఠతో నన్ను స్మరించి ధ్యానించుచున్నావు. నా స్థూలదేహము మాత్రమే నీకు కన్పడినది. అహంకార మమకారములింక విడువుము అని చెప్పుచునే ఆకస మునకెగసి అంతర్ధానుడయ్యెను. రమ్ము! ఇచ్చటకు రమ్ము! అని మరల పిలిచిన వాక్యములు వినబడెను. ఆదెస వెంబడి నేగితిని. అట నొకపెద్ద కొలను. బంగరు తామర పూవులందు మెఱయుచున్నవి. ఎన్నియో హంసలు అటనున్నవి. ఆదే వుడా జలమునందు స్నానమాడుట చూచితిని. నన్నురమ్మని మరల నాతడు పిలి చెను. అచటికేగితిని గాని ఏమియును నాకు గన్పడక నన్నొక విషాదము క్రమ్మి నది. దృష్టి చలితమైనది. అనేక శతములైన అగ్ని హోత్రము లట వెలుగుచున్నవి. పాలపిట్టలు ( సువర్ణ) గుంపులు గుంపులై నామీద వాలుచున్నవి. మనస్సున తీవ్ర మైన భయము తోచినది.

అట్లు భయము బొంది అచ్యుత, శివసహ స్రాక్ష, వేదమయ, అనాది నిధన, త్రిభువనైక నాధ, త్రినయన గోవింద పద్మనాభ హరకృపావిధేయ!

అని అనేక విధముల అనేక నామముల శిరము వాల్చి ప్రార్థింప వైనతేయా! భయపడకుమని ప్రసన్నుడయి పలుకు నంతలో నేను ప్రథమమున జూచిన బదరి కాశ్రమ వాసియు అష్టభుజుడగు నారాయణుని జూచితిని. నీతత్త్వ ప్రకారమెట్టి దో తెలియుట లేదు. నేను చిత్తశుద్ధిగ నీ దాసుడను. నీ దయకు పాత్రుడ నగు దునేని నీతత్త్వమును వినగోరెదననగా, కరుణామృత వీక్షణముల నా పరమాత్మ నన్ను జూచి యిట్లనియె.

## విష్ణుదేవుడు గరుత్మంతునికుపదేశించిన ఆత్మ తత్త్వము.

వైనతేయా, వినుము నీవు నామనసునందున్న వాడవు. మద్భక్తుడవు గా న చెప్పుచున్నాను నా స్వరూపమును చిత్తశుద్ధిగ నెఱిగి కొనుము.

దేవతలయినను మఱెవ్వరయినను నా రూపమెఱుగలేరు. అఖిల భూతములు నాయందు పుట్టి పెరిగి లయించును. వాని వశమున నేను సర్వమున

వర్తింతును. సర్వ విశ్వమున నా తత్త్వము చూడనగును తెలియనగును. కామము, అహంకారము, పరిగ్రహము ( ఒకరినడిగి పుచ్చుకొనుట) మూఢత్వము, హింసయు వదలి నిర్మల బోధము, సత్యము శాంతము భక్తి తృప్తి గలుగు నియతాత్ములకు ఆ తత్వము చూడనగును. సాంఖ్యయోగులు బాహ్య ప్రకృతి దర్శనులై నిశ్చయ స్థితి నందలేనిచో నన్నెఱుగలేరు. ఉపవాసములు వ్రతముల నాచరించు మోహ బుద్ధి గలవారికిని తెలియదు. ఏకాంతిక ధ్యానపరులకే తెలియనగును. రజస్తమముల వదలి కేవల సత్త్వాధీనమయిన జ్ఞానమువలన నాతత్త్వమెఱుంగ వచ్చును. సూక్ష్మవిధానమున, ఆత్మయందు వాసుదేవనామమున, బుద్ధి యందు సంకర్షనిగ, అహంకారమున ప్రద్యుమ్నునిగ, మనస్సున అనిరుద్ధునిగ ప్రాణులయందు వ్యాప్తి గాంతును. ఇది నా స్థూల ప్రకారము. నీవు నా స్వరూపమును తెలిసికొన జాలినవాడవు. ధన్యుడవుగమ్ము.

పురుష వర్యులారా శ్రీహరి కరుణ వలన వారి దివ్య చేష్టితము నేనెఱింగినది మీకు తెల్లము జేసితిని. అత్యంతాసక్తితో మునిసిద్ధ జనములు గరుడుడు చెప్పిన దెల్లను విని పరమాదరమ్మున ఆ పక్షి దేవుని దీవించి వీడ్కొలిపిరి. ఈ చరిత్రము వినిన చదివిన సర్వవర్ణముల వారికిని విజయధన శాంతి సౌఖ్యములు లభించును.

మహాభారత ధర్మశాస్త్రము

అనుశాసనిక పర్వము ప్రథమాశ్వాసము సంపూర్ణము



# మహా భారత ధర్మశాస్త్రము

## అనుశాసనిక పర్వము - ద్వితీయాశ్వాసము

## కన్యాదానమునకు వరుడు ఎట్టివాడు కావలయును

## అష్టావక్రుని చరిత్రము

ధర్మజుడడుగగా భీష్ముడీయితిహాసమును జెప్పెను.

పూర్వము వదాన్యుడను తపశ్శాలిగలడు. అతనికి సుప్రభయను పుత్రిక కలదు. ఆ బాలిక చాల సుగుణవతి. అష్టావక్రుడను బ్రహ్మచారి వదాన్యుని కడకు బోయి నీ కూతునిచ్చి నాకు పెండ్లి యొనర్పుము, ఆమెయందు నాకు మిక్కిలి మక్కువ అనగా వదాన్యుడును అట్లే యిచ్చెదను గాని బాలకా! నీవొకసారి ఉత్తర దిశకు పోయిరమ్ము ముందు కుబేరుని రాజ్యమును నగరమును చూచెదవు. దాని కుత్తరముగ హిమగిరియున్నది. అది పార్వతి శివుని కొరకు తపస్సు చేసి సంకల్ప సిద్ధి పొందిన ప్రదేశమని నుడివెను.

అష్టావక్రుడు అతని మాటల యందేదో విశేషముండవలయునని తలచి, అతడు చెప్పినట్లే యేగెను. కుబేరుని నగరము చాల సుందరమైన హర్మ్యములు వీధులు ఉద్యానవనములు దీపతోరణములతో ప్రకాశించుచుండెను. అచటనున్న యక్షకిన్నర గంధర్వకన్యలు కడు అందమైన వారు. అష్టావక్రుని చూచివారు అత్యంత శ్రద్ధతో అతిథి పూజలొనర్చి అనుకూలమైన శయ్యలుగల మందిరమున వసతి నేర్పఱచి ఎన్నియో సౌకర్యములను చూపిరి. అష్టావక్రుడును ప్రయాణ శ్రమను బాపుకొనుటకు ఆ దినమున అందుండెను. రాత్రియగు సరికి కనకరత్న భూషణాన్వితలు, సురభిళ పుష్పమాలా శోభితలు అయిన విలాసవతులు వచ్చి అష్టావక్రునకు మధుర పానీయ సహిత భోజన సదుపాయములేర్పఱచి, సుఖశయనుని జేసి ఒకరొక్కరే వచ్చి సరససల్లాపములాడి ఒయ్యారములొలికించి అంగసౌష్టవము నొక్కింత చూపుచు శృంగారచేష్టల జేయదొడగిరి. అష్టావక్రుడు ఏమాత్రము చలింపక కన్యలారా మీ యాతిథ్యమునకు మెచ్చితిని గాని మీ చూపులు మీ వికార వర్తనము నాకు నచ్చలేదు. మీ రావలకు పొండు అని వెడలగొట్టెను. అచటి వారందరు అతని నిష్ఠానియమములు గ్రహించి గౌరవ మర్యాదలతో వీడ్కొలిపిరి.

అష్టావక్రుడు నదీ పర్వత కానన ప్రదేశములు గడచి ఉత్తర దిశ చేరెను. సకల ఋతు పుష్ప భరితములైన హిమగిరి వనములను, నిర్మల జల ప్రవాహము లైన నదీ నదములను ధాతువర్ణ శోభితములైన గిరిసానువులను చూచి ముదితు

డయ్యెను. అచటనెందఱో సౌందర్య వతులైన స్త్రీలు కలరు. యౌవన విజృంభణమంతయు వారియందే ఉన్నది. వారెల్లరును అష్టావక్రుని జూచి అనేక విధముల శృంగారవిలాసములను చూపి లోగొన జూచిరి గాని ఆ బ్రహ్మచారి చలింపక తన దారిన తానేగెను. అట్లు చని చని, ఒకచోనొక సుందర హర్మ్యమును చూచెను. అది సురభిళ పుష్ప లతా కుంజముల మధ్య కనకరత్నఖచిత కుడ్యములతో విలసిల్లుచున్నది. మహా సుందరులైన స్త్రీలాతనికి స్వాగతమిచ్చి ఆరతులుగొల్పి అతిథి మర్యాదలొనర్చి లోనికి గొంపోయిరి. బహువిధ శోభాయమానమైన అంతఃపురమున సుందర హంసతూలికా తల్పమున త్రిభువన సుందరియైన యొక్క దేవతా కన్య కనుపడి అష్టావక్రు నా సుందరశయనముకడకు గొనిపోయి దానిపై కూర్చుండజేసి తాను కూడ దగ్గరగ కూర్చొని పానీయములు ఫలరసములు వేళకు రుచి సంపదలయిన భోజనములు తృప్తిగా ఏర్పాటు చేసి వింజామరల వీచుచు మరికొంత దగ్గరకు వచ్చి తాకుచు విలాసచేష్టలారంభించెను. అష్టావక్రుడిది గ్రహించి ఆమె కామ చేష్టలకు దూరముగనే జరుగుచు, యా.... ఎట్లును ముగిసినదికదా రాత్రికిచ్చటనే యుండి బడలిక తగ్గించుకొనవచ్చునని యాగెను.

రాత్రి పడినది. ఆ సౌధమునందు రత్నదీపికలు కనువిందుగామెఱయుచున్నవి. సుగంధ శీతల వాయువు లంతటను క్రమ్మినవి. అంతయు కామోద్దీపనముగ నుండెను. కొంతవడికి ఒయ్యారముగ ఆ కాంత శరీర సౌష్టవము కనుపడునట్లు వచ్చినది. ఆశయ్యపై అష్టావక్రుని ప్రక్కచేరినది. ఆతడు పరుండెను. ఆతనివైపు ఆమెయు పరుండి అతనిమీద చెయివేసి కౌగలించుకొనబోయెను. అతడా చేయి విదిలించి కొని వెనుదిరిగి పరుండెను. ఒకటి రెండు సార్లిట్లే అయినది కాని ఆతడెంత మాత్రమును చలింపక ఉండెను. అంతట ఆ సుందరి ఏమయ్యా యీ వర్తనము నేనింత అందకత్తెను. ప్రొద్దుటినుండి చూచుచుంటిని ఒక నిముసమైనను నావంక చూడవు. మఱియొకస్త్రీ కావలెనా చెప్పుము. పురుషులు కామలోలుపులు గదా. నీ చేష్ట వింతగానున్నది. అనగా ఆతడు వనితా వినుము. నాకెవరును వలదు. నేనేదియో యాత్రార్థము ఇచ్చటకు వచ్చితిని, ఉదయము కాగానే పోదును. మీరు దూరముగా నుండుడు. నేను బ్రహ్మచారిని. నేనొక మునికన్యను పెండ్లాడ నిశ్చయించితిని మరొకరివంక చూడను. అని వేరుగ పోయి కూర్చుండెను. ఆ స్త్రీ అంతట అతివినయముగా ఆతని ముందు నిలచి ఓ విప్రకుమారా! నేను ఉత్తర దిశను నీ బ్రహ్మచర్య నియమనిష్ఠలు పరిశీలింప ఇట్లుంటిని. సంతోషమైనది. క్షేమముగా నీవు నీ యింటికిపోయి నీకు నచ్చిన స్త్రీని పెండ్లాడి సుఖముగా నుండుము అని గౌరవించి పంపెను.

అష్టావక్రుడు వదాన్యునివద్దకు పోయి తన యాత్రా విశేషములన్నియు చెప్పెను. అతని నియత వర్తనమున కాతాపసవర్యుడెంతో సంతసించి కుమార్తె సుప్రభనిచ్చి పెండ్లి కావించి దీవించెను. ఆ నూతన దంపతు లత్యంత సుఖ సంపదలతో నుండిరి.

## వర్ణాంతర వివాహములు

మునుల వలన ఇతర వర్ణముల భామినులందు పుట్టిన సంతతి బ్రాహ్మణులగుదురా యని ధర్మజుడడుగ భీష్ముడిట్లు చెప్పెను. మునులు బ్రాహ్మణులు. ఇతర మూడు వర్ణముల భామినులను వివాహమాడవచ్చును. వారి తపో విజ్ఞాన విద్యా ప్రభావములచే వారి సంతతి బ్రాహ్మణులే. ఇచట యోని కన్న బీజము ప్రధానము. వసిష్ఠుడు ఋష్యశృంగుడు వ్యాసుడు ఇట్టివారే కదా. ఈ ప్రకారమే క్షత్రియులు తక్కు రెండు వర్ణముల కాంతలను, వైశ్యులు శూద్ర వర్ణమువారిని వివాహమాడ వచ్చును. ఇవి అనులోమ క్రమములు. విలోమ క్రమమున క్రిందివారు పైవర్ణములవారిని వివాహమాడుట వర్ణ సంకరమే.

## దాన పాత్రులు

సద్వర్తనము కలిగిన బ్రాహ్మణులు దానమున కర్హులు. సన్యాస వేషమున నున్నను లేకపోయినను శ్రద్ధతో నిడిన దానములవలన దురితములేదు. తపో నిత్యులయినను తత్సంబంధ క్రియా పరత లేనివారికిచ్చిన దానము వలన కీడేగాని మంచి లేదు. సత్కుల జననము, పురాణ శాస్త్ర పఠనము వలన సద్గతులు కలుగవు. శీలము ప్రధానము ముఖ్యము. ఎంత విద్యా వంతుడైనను తన విద్యచే ఇతరులకు చెడ్డపేరు తెచ్చినచో అది మహా పాపము. వేయియజ్ఞములకన్న ఒక్క సత్యము మేలు. మద్య మాంసములు మాని శమము శౌచము కలిగి యుండుట బ్రహ్మచర్యము కన్నమేలు.

## ధర్మార్థకామముల ఆచరణ

ఈ మూటిలో ధర్మము నాచరించుటకే ప్రథమ స్థానము. ఎప్పుడేది ఆచరించినను ఆసక్తి వలదు. ధర్మమున ఆసక్తి యుండుట మేలే. గురుపూజ విప్రార్చన ఉత్తమములు. అగ్నిని, వేదములను విడుచుట, విప్రుని నిందించుట పాపము.

అరిషడ్వర్గములను విడచి సత్యశమదమ అహింసా వ్రతులైన వారు శౌచులు ధీరులు అయిన వారు దాన పాత్రులు. ప్రజ్ఞ శీలముగల వారికి దాన మిచ్చుట వంశవిస్తారకము. పరమ యోగ్యుడయిన విప్రుడొకడు సంతృప్తి నందినచో ఎందరో దేవతలు సంతృప్తి నందిన యంతమేలు.

ఈ సందర్భమునందే మఱికొన్ని ముఖ్యవిషయములు వినుము.

దేవ పూజలకు పూర్వాహ్ణ కాలము యోగ్యము

పితృపూజకు అపరాహ్ణము మధ్యాహ్నము 12 గంటలు దాటవలయును

మానుషార్చనకు ఈమధ్యకాలము యోగ్యము.

దేవ పితృ సమారాధనకు కాలహీనము అమంత్రకము ఎంగిలి పనికిరావు.

క్రిమి కేశదుష్టము పనికిరాదు. రోగులు, దుష్టులు దుశ్శీలురు పనికిరారు.

నర్తకులు, గాయకులు, వేద విక్రయులు, ప్రాణివిక్రయులు, ధనమును వడ్డీకిచ్చి తినువారు పనికిరారు.

## దైవపితృ దానములకు ఉత్తములు

ఆకలి తీర్చువాడు, దొంగల వలన ధనహీనుడయిన వాడు, పూజ ఉద్యాపనము కొరకు అడుగు వాడును, భిక్షుకుడు, రోగ నివారణకు అడుగువాడు గురువు తల్లిదండ్రులు దారపుత్రులను పోషించుటకడిగినవాడు, పాపములేని బ్రాహ్మణుడు, ఉంఛ వృత్తికలవారు దైవ పిత్ర్యంబులందు దానార్హులు.

## దానమునకు అనర్హులు

సత్రము, ఇల్లు, చలివేంద్ర, గ్రామచావిడి పాడుచేయుట

గురునింద, వేదనింద, వేద విక్రయము, దానిని వ్రాయుట, కొండెము చెప్పుట

సంధిని చెడగొట్టుట ఇతరులశ్రమ వలన బ్రతుకుట, కృతఘ్నుత

మంత్ర శాస్త్ర విధ్వంసము, అనాధను బాలవృద్ధ తాపసిని వంచించుట

అతిథులకు సేవకులకు, పిల్లలకు, పెట్టకుండ తినుట

విషాయుధములు, కేశములు అమ్ముట

కన్యాజనులను విప్రులను గోవులను దఱిసి పోవుట

మార్గంబులయందు కంపలు ముళ్ళు వైచి అడ్డుపెట్టుట

నేరము లేకుండనే శిక్షించి ధనము గొను పాలకుడు

ప్రజలను రక్షింపలేనిరాజు, గోవుముక్కును కుట్టువాడు,

ఎద్దుల వృషణముల చితుకగొట్టువాడు

వీరికి దానమీయరాదు. వీరందఱికి నరక దుర్గతులు కలుగును.

ధర్మ భయము గలవానికి, దరిద్రునకు, రోగనివారణమునకు, పాప నిరోధకమునకు దేవకార్యార్థ పశుహింసకును తపశ్శాలియై వేదవేత్తయై మద్యమాంస పరస్త్రీ

సమాగమ విముఖుడై, తనకులస్థులను ఆశ్రమవాసులను భరించుచు ద్రవ్య వస్త్ర మందిర అన్నపానము లొసగినను దీనుల కాశ్రయమిచ్చినను స్వర్గలక్ష్మి సిద్ధించును.

రచ్చ కొట్టము చలివేంద్ర మాయి ఉద్యానవనము నిర్మించుట
భయార్తుని కాచుట, కన్యగోవు వాహనము దాసుని, దాసిని ఇచ్చుట
తనకు అపకారిని సైచుట, బంధు మిత్రుల బ్రోచుట
పెక్కంద్ర కొలకు చేయవలసిన పనికి దానమునకు ధైర్యమునకు భయపడకపోవుట
మున్నగు పనుల వలనను, ఏ కులస్థుడైనను, పెక్కు పుత్రులుగలవాడు, దయగలవాడు, సహస్రమాసజీవి అగుట వలన స్వర్గ పద ప్రాప్తి లభించును.

## హింసలేని వయ్యును బ్రహ్మహత్యా పాతకములు

విప్రుని, శుష్కించిన వానిని, పిలిచి తినవచ్చినపుడు పెట్టక పోవుట,
కులీనుడు, విద్యా వంతుడైన వాని సేవ గ్రహించుట
నీరు త్రాగవచ్చిన గోవులను పాఱద్రోలుట -
వేద శాస్త్రాదుల నిందించుట, చెవుడు మూగ గ్రుడ్డి వారల మోసగించుట
రూప గుణ శీలములు లెక్కగొనక అన్యులకు కన్యవిచ్చుట
పురమునకు గ్రామమునకు వనమునకు అగ్ని పెట్టుట, అసత్యమాడి విప్రునకు విచారము కలుగజేయుట ఇవి బ్రహ్మహత్యా పాపతుల్యములు.

## పుణ్య తీర్థవిశేషంబులు

గౌతమునకు అంగీరసుడు చెప్పిన విశేషములు -
చంద్ర భాగ, వితస్త ఊర్మి మాలిని, నదులవద్ద సప్తదినములువసించిన ముని సమానుడు. కాశ్మీర మండలమున ప్రవహించునదులు, పుష్కరము, ప్రభాసము, నైమిశము ఇంద్ర మార్గంబు దేవికాస్వర్గ బిందులందును స్నానము అప్సర సహిత విమాన వర్తనుల జేయును.
హిరణ్య బిందు, కుశేశయ, స్నానముల వలన పాపములు తొలగును.
గంధమాదన సమీప ఇంద్రతోయ, కురంగ దేశమందలి కరతోయ నదులందు తంత్ర ఉపవాసములు స్నానములవలన అశ్వమేధయాగఫలము లభించును.
కనఖలమున గంగా ద్వార స్నానము, నీలగిరి యందు కుశావర్తమున బిల్వకమున స్నానముల, వలన పాపములు హరించి స్వర్గమునకేగును. శివుని నెలవు నుండి పైకి వచ్చు భాగీరథియందు ఒక నెల ఉపవాసములతో స్నానపూజలతో గడిపిరేని అచటికి వచ్చు దేవతలను చూడవచ్చు.

బింబాశ్రమమున, భృగు తుంగమహా హ్రదమున, కన్యాకూపమున అగ్ని హోత్రముతో నుండిన బ్రహ్మ హత్యా దోషము తొలగి ఇహ పరముల కీర్తిమంతుడగును. సుందరికా హ్రదస్నానము అందమైన రూపము నిచ్చును.
వైమానిక తీర్థ సేవ స్వర్గ ప్రదము. కృత్తికాంగార సేవలు పాపనాశకములు
విపాశ నదీ స్నానముల బ్రహ్మచర్య నియతినున్న వారికి మరల జన్మంబు లేదు.
కృత్తి కాశ్రమమున పితృతర్పణము, శివుని పూజ ఆత్మానంద దాయకములు.
ద్రోణకర్మ, శరస్తంభము, దేవదారు వనముల స్నానము అప్సరోవరుని జేయును.
చిత్ర కూట జనస్థాన సేవలు రాజలక్ష్మిని శ్యామాశ్రమమున ఒక పక్షమున్న ఆత్మ ధ్యాన ఫలము కలుగును.
కౌశికవాలమున ఇరువది యొక దినములు సేవ ఉత్తమ గతినిచ్చును.
మతంగ వాపిక, నైమిశమున ఇరువది యొక దినముల సేవ పురుషమేధ ఫలము
ఉత్పలావనమున నివాసము సగము అశ్వమేధ ఫలము.
గంగాయమునా సంగమ స్నానము వలన మోక్షము లభించును. ప్రయాగకు సకల తీర్థములేతెంచును. అందు నరేంద్ర దర్శనము ముక్తి దాయకము.
గంగయందు బ్రహ్మ సరమను తీర్థమున నెలనాళ్ళు నిరాహారత సేవించిన చంద్ర లోకమున కీర్తి మంతుడై వసించును.
అష్టావిక్రము కలవింకము దేవ హ్రదములు బ్రహ్మ భావమొసగును.
రామ హ్రదమున 12 దినముల సేవ సకల పాపహరము.
మహా హ్రదమునందు నెలనాళ్ళు ఉపవసించి చేసిన సేవవలన ముని గమ్యుడగును.
వింధ్యమున ఒకనెల తపమున సర్వ ప్రాయశ్చిత్తము గలిగి ధర్మజ్ఞుడగును.
నర్మద స్నానము, జంబు మార్గమున మూడు మాసములు ఒక్కనాడును నిలిచిన సర్వసిద్ధులు లభించును.
గోకాముఖమున స్నానమొనరించి, తండులి కాశ్రమమున వస్త్రములు ధరించి శాకా హారియై మూడు దినములున్నవాడు అజరామరుడగును. అశ్వమేధ ఫలము నందును.
ఆర్ష్టి సేనాశ్రమమందున స్నానము పాపహరము
పిండారక మున ఒక రాత్రి నివాసము అగ్నిష్టోమ ఫలదము

ధర్మారణ్యమున బ్రహ్మసరస్సున స్నానము పౌండరీక ఫలము. పార్వతీ దేవికి పుట్టినిల్లయిన హిమాచలమునందు సన్మునుల సేవజేయుచు తపమొనరించు వానికి బ్రహ్మలోకనివాసము లభించును.

తీర్థ సేవసేయువారిలో కామ క్రోధలోభ మోహమదమత్సరముల త్యజించిన వారికే ఫల సిద్ధి కలుగును.

## అత్రి మున్నగు మహర్షులు భీష్ముని చూడవచ్చుట

ఇట్లు మహా జ్ఞానియు గంగానందనుడయిన భీష్ముడు ధర్మరాజడిగిన ప్రశ్నలకు సందేహములకు తగిన సమాధానములు నుడువుచు, అర్జునుని బాణములే శయ్యగా వీరశయనుడై యున్న సమయమున సప్తమహర్షులు, అగస్త్యుడు జమదగ్ని కణ్వుడు, గౌతముడు విశ్వామిత్రుడు మున్నగు మునీంద్రులు తమ శిష్యులతో వీర శయనంబున నున్న భీష్ముని వీక్షింపదలచి వచ్చిరి. వారి తపః ప్రభావ కాంతులు నలుదిక్కుల వ్యాపించినవి. అచట నున్న ధర్మజుడు తమ్ములును ఆ మునులను జూచి లేచి అర్ఘ్య పాద్యాది పూజలొనర్చిరి. ఆ మునివర్యులు శర తల్పగతుడు మహాత్ముడయిన భీష్ముని గుణములను స్తుతించి వెడలిరి.

## పుణ్య ప్రదములయిన నదులు పర్వతములు గ్రామములు గంగా ప్రభావము

ఈ విషయమును గూర్చి ధర్మజుడడుగగా భీష్ముడిట్లు వివరించెను.

భిక్షుక వృత్తితో జీవించు ఒక విప్రునింటికి ఒక సిద్ధుడు వచ్చి యీ విధముగ నుడివెను. భాగీరథి ప్రవహించు చోటులెల్ల పుణ్య తమములె. గంగయొక్క మహిమ వినుము. యాగము బ్రహ్మ చర్యము తపము త్యాగము గంగా జలములకు ఈడుగావు. గంగా జలపానము కల్మషములబాపును. గంగా స్నానములు అమరత్వసిద్ధినిచ్చును. మృతుని అస్థికలను గంగలో గలుపుట వలన అవి ఆజలముల నెన్నియేడులుండునో అన్నివేలేండ్లు అతనికి సద్గతులు లభించును. దేవతలకు అమృతమెట్టిదియో నరులకు గంగాజలమట్టిది. గంగలోని యిసుక తలమీద అలుకుకొనినను, గంగా మట్టిని నుదుట వ్రాసికొనినను సకల పాపహరము. అట్లే గంగమీదనుండి వచ్చు వాయువు శరీరమునకు సోకినను పుణ్య ప్రదము. మనుజుని గంగా స్నానము ఇహ పరములందు ఏడుతరముల వారికి సుగతులు కలుగ జేయును. గంగ గంగ అను పదము నుచ్చరించుచు స్నానమొనర్చుట పుణ్య ప్రదము. దేవతలే గంగా స్నానము కోరెదరు మనుజులు కోరవలదా! గంగను తలచిన రాజ, చోర, భూత, పాప భయములుండవు. శంకరుడే ఆసక్తితో, గంగ ఆకసమునుండి పడునపుడు శిరమున ధరించినాడు.

గంగ మూడు త్రోవల బోయి స్వర్గ మర్త్య పాతాళములు మూడు లోకములను పవిత్ర మొనర్చును. గ్రహములందు సూర్యుడెట్లో అట్లే నదులందు గంగా నది ప్రధానమైనది. సగరుని పుత్రులు ముని శాపమున భస్మరాశులై పడి యుండ భగీ

రథుడు గంగా జలము వానిపై ప్రవహింపజేసి వారికి స్వర్గ పదమిప్పించెను. విష్ణు పాదోద్భవయైన గంగ సూర్యమండలము చంద్రమండలము మేరుగిరి నుండి శంకరుని శిరముపై బడి హిమగిరిని ప్రవహించినది. గంగ మహత్త్వము అనంతము. సకలమునులచే కీర్తింపబడిన పూజ్య చరిత్ర గంగ. మేరువున ఎన్నిమణులున్నవో సముద్రమున ఎన్ని నీటి బిందువులున్నవో అన్ని సుగుణములు గంగకు గలవు. భక్తిమెయి మనో వాక్కాయ కర్మలచే గంగను పూజించు వాడు ధన్యుడు. అట్లు భజించిన వానికి గంగ చిర సౌఖ్యములు కలుగజేయును.

సిద్ధుని వలన ఈ గంగా చరితము విని ఆ విప్రుడు చరితార్థుడై తుదకు నాకమునకేగెను. ధర్మజా, నీవును గంగా దేవిభక్తుడవై చిరకీర్తిని బడయుమని భీష్ముడీ కథను ముగించెను.

## పూజార్హులైనవారు

నారదుడొకనాడు ద్వారకనున్న శ్రీకృష్ణుని జూడవచ్చెను. ఆ దేవమునికి అతిథి సపర్యలుగావించి శ్రీకృష్ణుడు, దేవమునీంద్రా! నీవు త్రిలోకములు తిరుగుదువు. ఎన్నో విషయములు నీవెఱుంగుదువు నీవెవరికి మ్రొక్కులాచరింతువనగా నారదుడిట్లు చెప్పెను.

వరుణిని, వాయువును, సూర్యుని, ఇంద్రుని, అగ్నిని, శివుని కుమారుని మహాలక్ష్మిని విష్ణుని బ్రహ్మను బృహస్పతిని చంద్రుని జలమును భూమిని పూజించు వారలకు మ్రొక్కుదును. వేదవేత్తలు, తాపసులు, దేవతా పూజనులు, భూధన ధాన్య గోదాన శీలురు, అతిథి పూజనులు, పితరులను పూజించువారు. భిక్షుకులు, శాంతులు, సత్య వ్రతులు పూజ్యులు. ఇంకను ధర్మార్థకామ నిరతులు, అహంకార మమకారాది దుర్గుణ రహితులు నాకు పూజ్యులు. కృష్ణా దేవకీ నందనా నీవును అట్టి వారినెఱిగి పూజింపుము. సకల శుభములు కలుగును. ధర్మరాజా నీవును ఇట్టి సుజన పూజావిధమునడపి శుభములందుమని భీష్ముడు వచించెను.

## రాజులకు ప్రధానకర్తవ్యము

ధర్మజా, పట్టాభిషిక్తుడైన నరపాలునకు బ్రాహ్మణ పూజనము ఉత్తమమైన కర్తవ్యము. ధరణికి శుభములు గలుగజేయువారు వారే. దైవమును అదైవముగ, అదైవమును దైవముగ జేయుశక్తి గలవారు విప్రులు. వారి ఆదరణ పొందిన వారే అధిపతులగుదురు. విప్రులకు శాపానుగ్రహశక్తి కలదు. వారు కోపించిన ఆపదయు, ప్రసన్నులైనచో సంపదయు ఎవరికైనను తేగలరు. ద్రవిడ కళింగాది రాష్ట్రాధి

పతులెందరో బ్రాహ్మణుల ఆగ్రహమువలననే పదవులు పోయి వర్ణ భ్రష్టులై దీను లయిరి. విప్రులకు ఈశ్వరత్వమున్నది. వారు సర్వ సౌఖ్య సిద్ధి పరులు ధర్మజా నీవెప్పుడును పూజించు చుండుము. సదాచారుడగు బ్రాహ్మణునకు తృప్తిగ భోజన మిడినచో, దేవతలు పితరులు సంతృప్తి నందెదరు.

## పాపనాశకమెయ్యది - వాసుదేవ - భూదేవీ సంవాదము

వాసుదేవుడొకపరి భూదేవిని జూచి, దేవీ నీవు ఎల్లరకును తల్లి వంటి దానవు. ప్రజలేమియొనర్చిన పాపపరిహారమగునో చెప్పుమనగా భూదేవి విప్ర పూజ విప్రసేవ విప్రులకు హితమైన పనులొనర్చుటవలన పాపములు నశించును. నరపతులకైనను కర్తవ్యమిదియే. దేవేంద్రుని రతటివానిని సహస్ర దుర్గంధములు కల పళ్ళికలుగ జేసినది, వానిని తిరిగి వేయి కన్నులుగ మార్చగలిగినది విప్రుని కోప ప్రసాదములేకదా.

బ్రాహ్మణ జన్మయే సకలోత్తమము. బ్రాహ్మణులను సృజించినపుడు బ్రహ్మ యిట్లు చెప్పినాడు. బ్రాహ్మణులార మీకు ఆత్మచింత ధర్మనిరతి తప్ప అన్య కర్మ లేదు. బ్రాహ్మణ్యము అన్ని వర్ణములవారికి తారకము. కావున బ్రహ్మ ధర్మము తపస్సు వేద పఠనము విస్తరింపజేయుడు. గంగానదికైనను అడ్డు కట్టకట్ట వచ్చు గాని విప్రులను అవమానింపరాదు, విప్రసేవనము కల్పవృక్షము వంటిది. దీనికి ఉదహరణముగ ఒక కథ వినుము.

ఇంద్రుడొకప్పుడు జటాసురుని కుమారుడైన శంబరుని కడకేగి దానవ రాజా నీకింత ఆధిపత్యము విజయ భాగ్యము ఎందుచేత లభించినవి తెలుపుము అనగా, శంబరుడు దేవేంద్రా నేనెప్పుడును విప్రులను జూచి అసూయగాని కోపము గాని పడను. నా ఉన్నతి కదికారణము. దేవాసుర యుద్ధ సమయమున, దేవతలు విప్రానుగ్రహము వలన గదా గెలిచిరి. చంద్రునడుగగా చంద్రుడును విప్రులు వేద విద్యా సంపన్నులు. తపోధనులు అట్లగుటచే వారి అనుగ్రహము ఎల్లవేళలను శుభప్రదము ఇల్లు విడిచి గురువుల వద్దకు పోయి విద్య సంపాదించి తపస్సంపన్ను లగుదురు. వారి అనుగ్రహమున శుభములు కల్గుట కెట్టి సందియము లేదని చెప్పగా విని నా తండ్రియు అట్లు విప్రుల పూజించి అధిపుడయ్యెను. నేనును అట్లే చేయుచుంటినని శంబరుడు చెప్పగావిని ఇంద్రుడు సంతృప్తి నంది వెడలెను.

హింసా క్రోధాసూయలు లేని సదాచారుల బంధు మిత్రులు, దూరాగతు లయిన క్రొత్తవారును పూజకర్హులు. వారు విద్యా వంతులు గౌరవ నీయులు వారి అనుగ్రహము శుభకరము.

## కాంతాస్వభావము

వనితలు పాప మూలములని అందురు. ఎందుచేత వనితల నిజ స్వభావ మెట్టిది. ఈ విషయము తెలియగోరుదునని ధర్మజుడడుగగా శాంతనవుడిట్లని చెప్పెను.

ధర్మజా ఈ విషయమునే నారదుడొకప్పుడు పంచ చూడ అను నొక అప్సరో భామిని నడిగెను. అపుడామె మునీంద్రా! వనితలను గూర్చి వనితలే చెప్పుట తగదు. అయినను చెప్పుచున్నాను. వనితలు దుశ్చరితలనుట కొందరికే వర్తించును. అందరు స్త్రీలకు కాదు. కులము గౌరవము కలిగి ఒకని భార్యయైన స్త్రీ పెడత్రోవ త్రొక్కినదనగా ఏమనవలెను అట్టివారు పాపమునకు పోయెదరు. వారు చెడి యితరులను చెడగొట్టెదరు. పురుషుల మంచి తనము స్త్రీ లెఱుగక పాప చిత్తులు కుత్సితులై చరింతురు. అన్య పురుషుని చూచి మోహితలగుదురు. మంచి చెడ్డ తెలియక వర్తింతురు. పంచచూడ తాను స్త్రీ. అయ్యు స్త్రీ స్వభావమును గూర్చి చెప్పినందులకు నారదుడు సంతసించి వెడలెను.

కొందఱు స్త్రీలకీ విధమగు నడవడి ఎందుకబ్బినది అని ధర్మజుడడుగగా భీష్ముడు మరల పూర్వ మొకప్పుడు జనులెల్లరు నిర్దోష చిత్తులై దేవత్వ వైభవమున నుండిరి. అప్పుడు స్త్రీలెల్లరు సాధ్వీమణులే. ప్రజల సద్గుణము చూచి దేవతల కసూయ పుట్టి వారి చింత బ్రహ్మకడ మొఱలిడిరి. స్త్రీలకు కామావేశము ఎక్కువగ గలుగునట్లు బ్రహ్మయొనర్చ పురుషులు వారి చిక్కులంబడి దుర్వర్తనులైరి. దేవతలకు అసూయ తగ్గి ప్రియంబందిరి.

## శీలవతుల రక్షణ

దురాచారములు దుష్ప్రవర్తన ప్రబలిన లోకమున శీలవతులయిన స్త్రీలకు రక్షణ లేదా అని ధర్మజుడడుగగా భీష్ముడు చెప్పిన కథ.

మున్ను దేవశర్మయను ముని వర్యుడొకడుండెను. అతని భార్య రుచియను నామె మహా సౌందర్యవతి. నరసుర గంధర్వాదులలో అంతటి సుందరి లేదని ప్రతీతి. దేవశర్మ తనకొక యజ్ఞ కార్యమున ఋత్విగునిగ దూరమేగవలసిన పని యుండి విపులుడను శిష్యుని బిలచి ''దేవేంద్రుడు మంచిచెడ్డలెరుగని భోగపురుషుడు. అతని కన్నులెప్పుడును అందమైన స్త్రీలపైననే ఉండును. నీవు రుచిని కాపాడు చుండవలసినదని'' చెప్పి వెడలెను. విపులుడును గురుని కార్యదీక్షయందప్రమత్తుడై యుండెను.

తనకొక అనువయిన ఆలోచనతోచి విపులుడామె యెఱుగకుండ ఆమెలో తన యాత్మను యోగ బలమున ప్రవేశింపజేసెను. ఆ వనితయు జడత్వము నంది పడి యున్నది. ఇంతలో దేవేంద్రుడొక సుందర రూపమున ఆ ముని యాశ్రమమునకు వచ్చి, నిశ్చేతనుడై పడియున్న విపులుని జూచి నిద్ర పోవుచున్నాడను కొని రుచి దరికి జేరి, ఓ వనితా నీ అందమును జూచి నీకై వచ్చిన దేవేంద్రుడను నన్ను పరిగ్రహింపుము. అని యెన్నియో సర సాలాపములాడుచుండగా ఆ వనిత శరీరము నుండి నీవెవడవు ఎందులకిటకు వచ్చితివి. అని గద్దించి పలికెను. ఇంద్రుడామాటలు విని కొంత వెనుకకు జంకి నిలుచుండగా విపులుడు తన నిజ దేహముతో లేచి ఏమి మహేంద్రా! నీకు సిగ్గులేదా, పరకాంతలనాసింతువు. దుర్గంధ శరీరుడవై శిక్షననుభవించితివిగదా. ముని వర్యుడు రానక్కరలేదు ఈ క్షణమే నిన్ను శపింతుననగా వెలవెలబోవు మొగముతో ఇంద్రుడు వెడలెను.

మఱునాడు దేవశర్మ తిరిగి ఇంటికి వచ్చెను. విపులుడును గురునకు తగిన పరిచర్యనడుపుచు అతడేకాంతమున నుండుట చూచి, ఇంద్రుడు వచ్చుటయు తానతనిని వెనుకకు పంపించుటయు చెప్పెను. దేవశర్మ సంతసించి ఇంద్రుని వలన శంకమాని సుఖంబుగా నుండెను.

ఒకానాడాశ్చర్యముగ ఆకసమునుండి దివ్య పరిమళ భరితమైన పూదండ యొకటి రుచిముందు పడెను. దానినామె ప్రీతిపూర్వకముగ ధరించి యుండగా తనచెల్లెలు ఆమె భర్త చిత్ర రథుండును ఏదియో ఉత్సవమునకు రుచీదేవ శర్మలను పిలువవచ్చిరి. రుచి ధరించిన పుష్ప మాలను జూచి ఆమె సోదరియు అట్టి దామ మొకటి తనకు కావలెననగా దేవ శర్మ విపులుని బిలిచి ఎట్లైనను అట్టి పూదండను సంపాదించుమని పంపెను. విపులుడును ఆ దండ పడిన ప్రదేశమును కన్గొని ఒక దండను తన యోగబలమున సంపాదించి వచ్చుచుండగా కొన్ని సంఘటనలాతని కెదురయ్యెను. ఒకచో ఒక మిధునము కరములు గల్పి నాట్య మాడుచున్నారు. ఆమె అతనితో నీవు తొందరపడి తప్పు అడుగులు వేయుచున్నావనగా నతడు లేదు అట్లు వేసినచో పరలోకమున విపులుని గతి నాకు పట్టును గాక అనెను. మఱియొకచో ఆర్గురు జూదరులు జూదమాడుచు కలహమునకు దిగిరి. అందున్న ఒకడు నేను సరిగానే ఆడితిని నాదినేరమయినచో పరమందు విపులునకు పట్టు గతి నాకు పట్టును గాక అని వాదించెను. విపులుడా మాటలు విని విచారపడి అయ్యో నేనేమి తప్పు చేసితిని, రుచిదేహమున ప్రవేశించినట్లు గురువునకు చెప్పలేదు అని విచారపడుచు ఇంటికి చేరెను.

విపులుడా పుష్ప దామమును రుచికి అందజేయ ఆమె దానిని తన సోదరి కిచ్చెను. అందరును ఆ దామ సౌందర్యమునకు పరిమళమునకు ఆహ్లాదపడిరి. దేవశర్మ విపులుని వేరుగా పిలిచి నీవు మార్గమధ్యమున ఒక మిథునమును, ఆర్వురు జూదగాళ్ళను చూచితివి. నీవేదో నేరము చేసినట్లు భావించి విచారించుచున్నావు. ఇంద్రునావలకు బంపు విషయమున నీవు రుచిదేహమున ప్రవేశించితివి. అది నేరము గాదు. ఆ వరమును నీకిచ్చుచున్నాను. మఱొక విషయము వినుము. ఆ మిథునము దినము, రాత్రియును - ఆ ఆర్వురును ఋతువులు ఇవి యెల్లవేళల మానవులొనరించు చెయిదములను గమనించు చునే యుండును. ఎవరికిని తప్పు కొనవీలుగాదు. ఎంతరహస్యమైనను అన్యులు ఎఱుగరనుకొనుట మోసమే అగును.

విపులా నీ చర్యవలన మాకులమునకు అవమానము కలుగలేదు. అది నేరము కాదు. నీవు నాకు తెలియజేయకున్నను నీవు పుణ్య లోకముల కేగుదువు. ఆ మిధునము అట్లే ఏగును.

భీష్ముడీ కథను చెప్పుచూ ధర్మజా వింటివి కదా. స్త్రీలను రక్షించుటయు అరుదైన పని - స్త్రీలలో మంచి వారును కలరు. అట్టి ధర్మవతులు పతివ్రతలున్న కారణముగ భూమి నిరపాయముగ నడచుచున్నది. పతివ్రతదైవసమానము. సద్భార్యల వలననే పురుషులకు ధర్మార్థ సుఖ ఖ్యాతులు గలుగును.

## కన్యావరణము - వివాహముల విధములు

ధర్మరాజునకు భీష్ముడీ క్రింది విధముగ వివరించెను.

బ్రాహ్మ కర్మగతి వివాహము : కులము శీలము విద్యకల వరుని ఆహ్వానించి ఉదక ప్రదాన సహితముగ కన్య నిచ్చు పద్ధతి

క్షాత్రము : కన్యపురుషుని కోరగా పురుషుడును ఆమెపై అనురాగముతో ఆస జేసి పరస్పరానురాగ ప్రమదమెసగు పరిణయము.

గాంధర్వము: కన్య వరుడు పరస్పరేచ్ఛతో చేసికొను వివాహము

ఆసురము : ధనమిచ్చి కన్యను తీసికొని పెండ్లి చేసికొనుట.

రాక్షసము : వరుడు బలిమి చూపి కన్యయొక్క బంధువులను బాధపెట్టి దుఃఖించుచున్న కన్యను తెచ్చికొనుట.

ఈ అయిదు విధములలో బ్రాహ్మము క్షాత్రము గాంధర్వము ధర్మయుతములు ఆసురము, రాక్షసము ధర్మదూరములు దోషములు.

కన్యకు తల్లిదండ్రులు లేకపోయినను, సోదరుడు లేకపోయినచో ఆ బాలిక పెండ్లికి అర్హురాలు కాదు.

బ్రాహ్మణునకు స్వజాతి యందు, క్షత్రియ వైశ్యులయందు వివాహము యుక్తము శూద్రజాతియందు సంతతికనుట పాపము.

రాజునకు రాజకుల కన్యతోడను, వైశ్యకన్యతోడను వివాహము సముచితము.

వైశ్యులు శూద్రులు తమ వంశములలోనే వివాహము చేసికొనవలెను.

రాజులు వైశ్యులు శూద్ర కన్యలను వివాహమాడుటయు కలదు.

విషమమైన పరిస్థితులేర్పడినపుడు బ్రాహ్మణుడు శూద్ర కన్యను వివాహమాడుట దూష్యంబుకాదు.

బ్రాహ్మణునకు, బ్రాహ్మణ క్షత్రియువైశ్య స్త్రీల యందు కలిగిన సంతానము ద్విజులు అనబడుదురు.

బ్రాహ్మణుని ఆస్తి 10వంతులు కాగా

4 వంతులు బ్రాహ్మణస్త్రీ కుమారునకు

3 వంతులు క్షత్రియ స్త్రీకుమారునకు

2 వంతులు వైశ్య స్త్రీ కుమారునకు

1వంతు శూద్ర స్త్రీ కుమారునకు - చెల్లును.

క్షత్రియుని ఆస్తి 8 వంతులు కాగా

4 వంతులు స్వజాతి స్త్రీ పుత్రునకు

3వంతులు వైశ్య స్త్రీ పుత్రునకు

1వంతు శూద్ర పుత్రిక తనయునకు చెల్లును.

వైశ్యుని ఆస్తి 5 వంతులుకాగా

వైశ్యస్త్రీ తనయునకు 4 వంతులు

శూద్ర స్త్రీ తనయునకు 1వంతు-

శూద్రుని ఆస్తి శూద్ర తనయులకు సమముగ వచ్చును. బ్రాహ్మణునకు బ్రాహ్మణ జాతి స్త్రీ భార్యయై పూజా విషయములందు పనిచేయవలయు. ఇతర జాతి భార్యలు పనికిరారు.

## పుత్రులలో భేదము

ఔరసుడు : తనకు ధర్మపత్ని యందు ధర్మవిధి గలిగిన పుత్రుడు
పుత్రికా పుత్రుడు : కూతురు కుమారుడు.
క్షేత్రజుడు : తాను పంపగా తనపత్ని మఱియొక పురుష సంగతి వలన కలిగిన పుత్రుడు.
దత్రిముడు: జననీ జనకులు ఉదకదాన పూర్వకముగా నిచ్చినవాడు.
కృత్రిముడు : అనాధ బాలుని తెచ్చి కుమారునిగా చేసికొనుట.
గూఢజుడు : ఎవరికి బుట్టినది తెలియకుండ ఒకనికి పరభార్య యందు పుట్టినవాడు.
అపవిద్ధనాముడు : తల్లి దండ్రులు పెంచుటకొల్లక విడిచిపెట్టబడినవాడు
కానీనుడు : పితృగృహమున కన్యకగానున్నపుడు పుట్టినవాడు.
సహోఢుడు: గర్భిణిగానున్నపుడు పెండ్లి యయిన తరువాత బుట్టినవాడు
పౌనర్భవుడు: భర్త వదలిపెట్టిన లేక భర్తను తాను వదలినగాని, విధవగా గాని పుట్టినవాడు.
క్రీతుడు : తల్లిదండ్రులమ్మగా కొనినవాడు.
ఈ పండ్రెండు విధములైన పుత్రులు అన్ని కర్మలకు యోగ్యులు వారిలో ఔరస పుత్రుడు ముఖ్యుడు.
గోళకుడు : విధవకు పరపురుషుని యందు పుట్టిన వాడు.

## స్నేహము

సహవాసము వలనను, దర్శనమున గూడ స్నేహము కలుగునని భీష్ముడీ యితిహాసమును ధర్మజుడడుగగా నుడివెను.

భృగు మహర్షి వంశీయుడగు చ్యవనుడనుముని గంగాయమునా సంగమ ప్రదేశమున జలములందే యుండి పండ్రెండు వత్సరములు తపస్సు చేసి సమాధి నిష్ఠుడై యుండెను. ఒక నాడుబోయవాండ్రు చేపలపట్టుకొనుట కచట పెద్దవల పన్ని బయటకు లాగగా చేపలతో పాటు చ్యవనుడును దరికి చేరిరి. ఆ బోయలా తపస్విని జూచి మునీంద్రా మేము మహా పాపము చేసినాము. మిమ్ము వెలికి యీడ్చినాము మా తప్పు క్షమించి మేమేమి చేయవలెనో చెప్పుడని ప్రార్థింపగా చ్యవనుడు కోపము తెచ్చి కొనక బోయలారా! ఇంతకాలము నేనీ మీనముల మధ్య

నుంటిని. మా మధ్య పరస్పర స్నేహము కుదిరినది. ఈ చేపలతో పాటు నన్నును అమ్ముకొని జీవింపుడని చెప్పెను.

బోయలు పోయి నహుష మహారాజునకీ సంగతి విన్నవింప ఆ రాజు తన మంత్రిపురోహితులతో గూడి చ్యవనుని కడకేగి నమస్కరించి మునీంద్రా నారాజ్యమున నున్న యీ బోయలు చేసిన యపరాధమునకు మమ్మెల్లరను క్షమించి నేనేమి చేయవలెనో చెప్పుడనగా యా ముని, బోయలు తమ జీవన విధానమాచరించిరి. అందు నేరము లేదు ఎప్పటియట్ల తనవెలనా బోయలకిమ్మని నుడివెను. ముని వచనానుసారము రాజు బోయలకు వేయి మాడలిండని తన మంత్రులకాదేశించెను. అది చాలదని ముని అనెను. పదివేల మాడలిచ్చెదనని రాజనెను. అదియు చాలదని ముని పలికెను. తుదకా నహుష నృపాలుడు తన రాజ్యమంతయు నిచ్చెదననగా అదియును చాలదని ముని చెప్పెను. ఇకపైనేనేమి యీయగలను అని రాజు విచారించు చుండగా కవి జాతుడను ముని యొకడచ్చటికి వచ్చి రాజా నీవు సరిగా ఆలోచింపలేదు. మునీంద్రుని ధనముతో వెలగట్టనెంచితివా. అది సరికాదు. గోవునకు మునికి వెలకట్టువారెవరును లేరు. వారి మహిమ అట్టిది. గోవు అగ్నిమయము, అమృతమయము చ్యవనుని వెలగా సలక్షణమయిన గోవు నిమ్మనగా భక్తివినమ్రుడై రాజట్లే యొనరించెను. చ్యవనుడును ఆపనికెంతయో సంతసించెను. బోయలా ఆవునుగొని పోయి మునీంద్రా మేము కఠినులమై మీ వెలగా గోవును పుచ్చుకొంటిమి. మమ్ము క్షమింపుడని వేడిరి. చ్యవనుడును ప్రియముగ వారిని జూచి, చేపలతో వాసము చేయుటవలన చేపలు నాకు ప్రియమైనవి, మీ దర్శనమున మీరును హితులే, మీ సద్గుణమునకు ముదమందితిని. ఈ మీనములకు మీకును గూడ స్వర్గవాసములభించునని ముని నుడివెను. వారట్లే దివికేగి పరలోక సౌఖ్యమందిరి.

అంతట చ్యవనుడు, కవిజాతుడును నహుషుని పిలిచి నీ త్యాగగుణమునకు మెచ్చితిమి. వరములు రెండడుగుడనగా ఆ రాజు మునీంద్రులారా మీ యనుగ్రహము కన్న నాకేమి కావలెను. అదిచాలుననగా ఆ మునులు సమ్మోదమంది నీవు మహేంద్ర విభవము పొందెదవు అని దీవించి పంపిరి.

సహవాసమున, దర్శనమున, లభించు స్నేహ భాగ్యమును గో మహిమను భీష్ముడిట్లు చెప్పగా ధర్మజుడు విని పరమ సంతుష్టుడయ్యెను.

## పరశురామ విశ్వామిత్రుల వృత్తాంతము

ధర్మజుడిట్లడిగెను. గంగానందనా నాకొక విషయము ఆశ్చర్యము కలిగించు చున్నది. మహాముని జమదగ్ని వంశమున క్షాత్ర తేజస్వి పరశురాముడుదయి ంచెను. క్షత్రియ వంశమున నుద్భవించి విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యయ్యెను. ఈ చరిత్రముల వినగోరెదననగా భీష్ముడు చ్యవనకుశికుల సంవాదము కల ఇతిహాస మిట్లుల జెప్పెను.

చ్యవనుడు మహాముని. కుశికుడను రాజు వంశము కారణముగా తన వం శమునకు సంకరము కలుగ గలదని గ్రహించి ఆ వంశమునకు విపత్తు కలిగింప గోరి ఆ రాజు కడకేగెను. కుశికుడు భార్యా సహితుడై ఆ మునికి తగిన గౌరవ మర్యాదలొనరించి, తగు సుఖాసీను జేసి మునీంద్రా తమంత తామిటకు విచ్చేసిరి. మేము ధన్యులమైతిమి. ఈ రాజ్యమును మీరే పాలించుడు. మేమెల్లరము మీ భృత్యులమే అనివేడెను. ఆ ముని వర్యుడు రాజా మ స రాజ్యము లేల సదాచార సద్వ్రతములతో బ్రతుకుదును. మీరు నాకు వలసిన పరిచర్య సేయుడనగా వారు అంగీకరించి ఆముని కొక ప్రత్యేక నివాసము, వలసిన భోజన సదుపాయములు ఏర్పఱచిరి. రాత్రి కాగానే ముని వర్యు డారాజదంపతులతో నేను నిదుర పోయెదను. మీ యిరువురు నాపాదములొత్తుచుండుడనెను. వారట్లే చేయుచుండిరి.

మునివర్యుడు నిద్రపోయి మేల్కొను నప్పటికి ఇరువది యొక్క దినము లైనది. లేచిన మునివర్యుడు ఏమియు చెప్పకుండగనే ప్రక్కవీడి యెచ్చటికో పోదొ డగెను. రాజదపంతులాతని చర్యకు ఆశ్చర్యపడి ఆ ముని వెనుక నేగిరి. వీరి రాకను ఆముని లెక్కగొనకయే పోయిపోయి అంతార్ధనమునందెను. ఆ సంఘటనకు చకితులై రాజ దంపతులు మూర్ఛపాలయిరి. అట్లు దుఃఖమున మునిగి తేరుకొని వారు రాజగృహమునకేగి మున్నా చ్యవన మునీంద్రుడు పరున్న గది కేగి చూడ, ఆ ముని వర్యుడా సెజ్జపయి మున్నుపరున్నవైపునకు గాక మఱొక ప్రక్కకు ఒత్తి గిలి పరుండుట చూచి పరమాశ్చర్యపడి వారి చరణములొత్తు చుండిరి. ఇట్లు మరల యిరువది యొక దినములేగినవి. మరల చ్యవనుడు మేల్కాంచెను. మేల్కాంచి తనకు తైలాభ్యంగన మడుగగా రాజును రాణియు సుగంధిలతైల నిర్మ లజలముల జలకమాడించిన నిముసాన ముని అంతర్హితుడయ్యెను. ఆ దంపతు లును వేరు విధమున భావింపక అట్లే యుండి ముని మరల వచ్చినంతన వివిధ రసాన్నపానముల నాతని ముందు నుంచిరి. వాని నూరక చూచుచు నతడు మరల

అదృశ్యమై ఒక పగలు రేయియుగడపి వచ్చి రాజును బిలిచి రాజా నీవును నీ రాణు లను కలసి లాగిన రథముపై నేనెక్కి గోధన ధాన్యములను ప్రజలకు పంచిపెట్టవ లయుననెను. వారట్లే ఓపికతో రథమును లాగుచుండగా తెచ్చిన వస్తువులమ ముని ప్రజలకు పంచి పెట్టుచు, రథమును సరిగా లాగుట లేదని రాజదంపతులను నె త్తురొలుక మునికోలతో మోదుచుండెను.

ఆ దృశ్యమును జూచి ప్రజలు నివ్వెఱగంది, అయ్యో, యీ మునీంద్రుని కింత దయలేదే రాజును దేవేరులు ఈ శ్రమకోర్వలేక డస్సితూలుచున్నారు, అని విచారించుచు పైకి పలుకనేరక యుండిరి. కొంత దూరమట్లేగి చ్యవనుడు ఆ రాజ దంపతులకు గల భక్తి విశ్వాసములు ఓర్పు ధీరత్వము గ్రహించి సంతసించి, రథము నాపి రాజా మీ పరిచర్యకు మిగుల సంతసించితిని వరమేదేని కోరుకొనుడు, నేనీ సమీపారణ్యమున తపస్సు చేసికొనుచుందును. అని వారి శరీరములు స్పృశించి రేపకడ వచ్చి నన్ను కలిసి కొనుడని వారినింటికి పంపెను. ముని వర్యుని స్పర్శ మాత్రమున ఆ రాజ దంపతుల శరీరములు శక్తి మంతములును యథా పూర్వ సుందరములై భాసించుటేగాక నూత్న యౌవనులయిరి. తమ అనుగ్రహము తప్ప మాకేమి కావలయును అని కుశికుడు మునికి కృతజ్ఞతలర్పించి వెడలెను.

మఱునాడుదయమున రాజదంపతులు కాల కృత్యములు స్నాన పూజా దులు ముగిసిన వెనుక ముని వర్యుడున్న చోటికి పోయి చూడగా అచ్చటనొక దివ్య సుందర సౌధము, ఉద్యానవనములు విహార స్థలములు క్రీడా వేదికలున్నవి. ఆ పరిసరముల కిన్నెర కింపురుష గంధర్వు లెందఱో నృత్య గీతాది లీలాసంచార ములతో విహరించుటకు అచ్చెరు వంది, ఆ సౌధములోనికి పోయి చూడ ఒక గదియందు మణిమయ పర్యంకమున మృదు హంసతూలికా తల్పమున ఆ మునీం ద్రుడుండుట చూచి, కుశికుడు భార్యతో ఆహా! చూచితివా స్వర్గలోక శోభ సర్వ ము ఇచ్చటనే ఉన్నది. ఇది అంతయు ఆ మునివర్యుని బ్రాహ్మణత్వ తపోనిష్ఠల ప్రభావమని చెప్పుచుండగా ఆ సుందర దృశ్యము మాయమైనది. ఒకచెట్టు క్రింద కుశాసనమున కూర్చుండి యున్న ముని సాదరముగ వారిని పిల్చినంత వారును ముకుళిత హస్తములతో మునిముందు నిలబడిరి. వారి నామునివర్యుడు ప్రసన్న దృష్టితో జూచి రాజవర్యా మీకింత ఓర్పు, ఇంద్రియ నిగ్రహము కలుగుట, బాధ లకు సహించి నాకు పరిచర్య సేయుటకు చాల సంతసించితిని. వరమేదైన వేడు కొమ్మన కుశికుడు నమ్రుడై మునివర్యా నీవు అగ్నిదేవుని సమానుడవు. నీకు

సేవయొనర్చుట కన్న మాకేమి కావలయును. అయినను ఒక్కమాట అడిగెదను. తాము మాగృహమునకు వచ్చి నిదురించి మేల్కొని ఎచటికో చనినప్పటినుండి అన్నియు అద్భుతములుగానున్నవి. ఈ విశేషముల కర్థము తెలియగోరెదనని చ్యవనుడిట్లనియెను.

ఇంద్ర సభలో గోష్ఠివశమున భృగు కుశిక వంశముల కలయిక వలన బ్రాహ్మణ క్షత్రియవంశములు వర్ణ సంకరముగానున్నవి అని ఇంద్రుడనగా ఆ పరిణామమున కోర్వక మిమ్ము పరీక్షింపనెంచి యింత చేసితిని. మీరు కోపము, శోకము అనక చేసిన పరిచర్యకు వరమిచ్చి యిచ్చుట మీకు స్వర్గలోక దర్శనము కల్పించితిని. మీరును బ్రాహ్మణత్వమును కొనియాడుచుండుట చూచి సంతసించితి. అట్లుగాకున్న మిమ్ములశపించి యుండువాడను. మీకు మూడవతరము వాడు బ్రహ్మ తేజో విలసితుడుద్భవించుననగా, అదెట్లు సాధ్యమని కుశికుడడుగ, చ్యవనుడిట్లు చెప్పెను. మా వంశీయుడు ఋచీకుడనువాడు నీకుమారుడు గాధి పుత్రికను వివాహమాడును. ఋచీకుడు తన తనయుడు జమదగ్నికి ధనుర్వేదముపదేశించును. ఋచీక గాధి భార్యల మధ్య వ్రతానుష్ఠానమున పరివర్తనము కల్గుటచే జమదగ్నికి క్షాత్ర తేజస్వియయిన పరశురాముడు, గాధికి బ్రహ్మతేజస్వి అయిన విశ్వామిత్రుడు జన్మింతురు. భృగు కుల సంబంధమున మీ వంశమునకును అగణిత కీర్తి లభించును. నీవు సుఖియై యుండుము రాజా అని దీవించి చ్యవనుడు తన తీర్థ యాత్రకు వెడలెను.

## దానవిశేషము

గోవును అలంకరించి దక్షిణయుతంబుగ సద్బ్రాహ్మణునకు దానమిచ్చినచో దాని శరీరముపైనెన్ని రోమములున్నవో అన్ని వేలేండ్లు స్వర్గసుఖము ఏడుతరముల పితరులకు సద్గతులు కలుగును.

కన్య భూమి గృహము కనకము అన్నము జలము వస్త్రము శయనము ఆసనము, వాహనము విప్రవరునకిచ్చిన ఇహపర సౌఖ్యము.

యాచకునకు కోరిన వస్తువిచ్చుట ఉత్తమదానము.

అభయదానము అన్ని భూతములకిచ్చుట అంతకంటెను మేలు.

వీర శయనము మేలు.

శత్రువైనను దీనుడైనను శరణుకోరినప్పుడిచ్చినవాడు పురుషోత్తముడు.

భార్యాబిడ్డలను పోషింపలేనివానికిచ్చిన దానము గొప్పది.

సత్ప్రవర్తన దైవపూజ గలుగు ద్విజులకు ఇచ్చిన ధన దానము పూజ్యమైన దానము.

అడిగిన వానికి దానమిచ్చుకంటె, అర్హుడైనవాడడుగక పోయినను దాన మిచ్చుట ఉత్తమోత్తమము.

బ్రాహ్మణులకు చేసిన ధనధాన్యగోభూ వస్త్ర దానము యజ్ఞములు తప ములు చేసిన ఫలములిచ్చును.

## భూదానమహిమ

భూమి యందు సర్వము ఉండును గాన భూదానము సర్వోత్తమము. భూమి ఉన్నంతకాలము భూదానకర్త సుఖించును. భూపాలుడును అగును. భూదా నము పాపిచేసినను ఫల ప్రదమే. అశ్వమేధము చేసినంత ఫలము.

దారిద్ర్యముతో క్రుంగుచున్న విప్రునకు, యాగకర్త శాంతుడునైన విప్రు నకు పిలిచి యైనను చేయుదానము అధికఫల ప్రదము. గురుపూజకులు రణ మృతులకన్న భూదానకర్తలు పుణ్యులు.

## భూగీతలు

భూదేవియే చెప్పిన మాటలివి. పరుశురాముడు వీనిని వినియే తానుగెలి చిన భూమిని దానమొనర్చినాడు. భూమాత యిట్లని ఉపదేశించినది.

నన్ను దానమిండు. రెండులోకములందును మీరు సుఖింతురు. భూదాన మిచ్చిన దుర్జనులకైనను ఉభయలోకముల మేలొనరింతును.

భూమి రత్నగర్భ, వసుధ, వసుదాయిని కావున భూదాన కర్తకు సర్వ సౌఖ్య ములు కలుగును. కనకరత్నములను దానకర్తకిడును. రాజులు పాపములకు నెల వుగాన వారు తప్పక భూదానము చేసి తరించవలెను. ఇదివరకు దానమీయబడిన భూమిని పుచ్చుకొనువాడు తనను తనకులము వారలను నరక వాసులను చేయును. విప్రునకు భూదానమిచ్చెదనని యీయనిచో అంతకన్న పాపములేదు.

## అన్నదానము

అన్నకనక పానీయ దానములు, ఇతరములు కూడ చాల ముఖ్యమైనవే.

అన్నము తోనే యజ్ఞాదులునడుచును. అన్నదానము విశిష్ట దానమని

మునులు దేవతలు పొగడుదురు. అన్ని యత్నములను పవిత్రములుగ పుణ్యములుగ చేయునది అన్నదానము.

అన్నము ప్రాణాధారము. అతిథికి, అలసిన వానికి, బాల వృద్ధులకు వికలులు వనితలు ఆకలిచే అన్నమడిగిన తప్పక అన్నము పెట్టవలయును. శునకము వచ్చినను నీచుడు వచ్చినను లేదనరాదు. దేవతలకు పితరులకు విధి విధానముగ పెట్టవల యును. విప్రులకే కాదు వర్ణ విభేదము లేకుండ సర్వులకు అన్న దానమిడవల యు. కల్పాది యందు బ్రహ్మ అన్నమే అమృతమని చెప్పెను. అన్నదానము వలన ధన ధాన్య నివాస సకల సౌఖ్యములు చిరకాలము ఇహపరములందు కలుగును.

## నక్షత్ర దానము

నారదుడు చెప్పిన విధము

1 కృత్తిక యందు పాయసము, 2 రోహిణి యందు గారెలు, 3 మృగశిర యందు నంజుమాంసము కూడిన అన్నము, 4 ఆర్ద్రలో గోవు, 5 పునర్వసున పులగము, 6 పుష్యమి యందు బంగారము, 7 ఆశ్లేషలో నాణెములు, 8 మఖను ఉప్పు తిలలు, 9 పుబ్బను చెఱకు తేనె, 10 ఉత్తరను పాలు అన్నము, 11 హస్తను ఏనుగు, రథము, 12 చిత్తను శ్రీ గంధపు చెక్క, 13 స్వాతిని తనకు ప్రియ మైనది, 14 విశాఖను ఎద్దు, 15 అనురాధను కండువా, 16 జ్యేష్ఠను కరివేము కూడిన ముల్లంగి, 17 మూలను మూలఫలము, 18 పూర్వాషాఢను పెరుగు, 19 ఉత్తరాషాఢను మాక్షికా (తేనె) ద్రాన్నము, 20-22 హరివసు జల తారకలు శ్రవణం, ధనిష్ఠ, శతభిషములందు వరుసగా కంబళము గుజ్జు లమరిన బండి యవలు, 23-27 పూర్వా భాద్ర ఉత్తరాభాద్ర. రేవతి, అశ్విని, భరణులు కొవ్వు గల మేక మాంసము, గొఱియ యెఱచి కంచుకుండతో మొదవు, అశ్వకలిత శకటము తిలధేనులును ఇచ్చుట శ్రేయస్కరము.

అన్ని నక్షత్రములందును దానముల వలన స్వర్గలోక ప్రాప్తి-

## కనకదానము

బంగారము దానమిచ్చుటవలన సకల కామ్యసిద్ధియు దీర్ఘాయువు, పవిత్రత, చిత్త శుద్ధి దాతకు కలుగును. ఇట్లు హరిశ్చంద్రుడు నుడివెను.

పానీయదానము చాల ఉత్తమదానమని ధర్మజ్ఞుడైన మనువనెను.

చెఱువులు, నూతులు, బావులు, కొలనులు నిర్మించుట వలన పుణ్యలో కములు కలుగును. ఎవరు నిర్మించిన జలాశయములందు మనుజులు మండు

వేసవి యందును స్నాన మొనరించి పూజాదికములు, యజ్ఞములు నిర్వహింతురో వారికే విధమగు కీడును జనింపదు.

నేయిని ధూపవస్తువును యాగాది కార్యములకొరకు దానమిచ్చిన అగ్ని క్రియా యాగముల ప్రియము, గరగలు (చిన్న మట్టివిగాని లోహపు విగాని పాత్రలు) ఇచ్చినచో పూజ వేళల బ్రాహ్మణులొనర్చు ఆచమనాది కార్య పుఫలములలో 2వ భాగము వచ్చును. వంట కట్టెలనిచ్చిన వానికి ధన ప్రాప్తి కలుగును.

గొడుగు దానమిచ్చినపుత్రులు కలుగుదురు

శకటము దానమిచ్చిన సకల దాన ఫలములును కలుగును.

చెప్పులిచ్చినచో శత్రువులు తన కాలి క్రిందబడినలుగుదురు.

నువ్వులు పితరులకు హితముగా నుండునట్లు బ్రహ్మచేసెను. తిలదానము వలన పితృలు శుచులగుదురు. పాపములు నశించును.

కాశ్యపముని శరీరమున నువ్వులు జనించినవి గావున యజ్ఞములందు పూజలందు నువ్వులనుపయోగించుట పరమ పుణ్య ప్రదము. తిలదానము విశిష్టమైనది. మునులెల్లరును తిలదానములచేతనే ధన్యులైరి.

## యజ్ఞములకు దానములకు అనువగు చోట్లు

యజ్ఞములు దానములు చేయువానికి అనువయినవి, తనకధీనములైన ప్రదేశములు కావలెను. మునులెల్లరు ఆయా ధర్మకర్మముల నెచట ఆచరించుట యోగ్యమని బ్రహ్మనడిగి ఆ దేవుని అనుజ్ఞ పడసి చేసిరి. భూజనులకు సాధారణముగ లభ్యములు, అడవులు కొండలు, నదులు తీర్థములు క్షేత్రములు. వారి వీలును బట్టి అచట చేయవచ్చును.

## గోదానమహిమ

తపోధనులయిన మునులు గోవును సర్వోత్తమమైన దానిగా భావింతురనగా గోమహిమ వర్ణింపతరమా. గోవులు సత్యలోకమున ఆకాశ గంగ తీరమున విహరించును. హోమములకు పాలు పెరుగు నేయి నిచ్చును. గోవు శరీరము నుండి వచ్చు చర్మము, కొమ్ములు మల మూత్రములు, అన్నియు ఉపయోగకరములే. శ్రమ ఎండవానలనక తన సాధు జీవనము గడపుకొను గోవు బ్రాహ్మణునివలె అతిపవిత్రమయిన ప్రాణి. బ్రాహ్మణునకు గోదానము ఇహపర సౌఖ్యదాయకము.

గోలోక వాస ప్రాప్తియు కలుగును. గోవులు ప్రాణమనియు గోదానము ప్రాణదాన సమానమని పెద్దలు చెప్పుదురు. మోక్ష ప్రాప్తి అనియు కూడ చెప్పుదురు.

## అన్నపానీయదానము

అన్నదానము జలదానము అత్యుత్తమమైనదే. అవియును ప్రాణదానసమానములు. సురలందు, నాగ కులమునందు, పితృ కోటియందు అమృత సుధ స్వధానామములు చెల్లును. అట్లుగాక అన్నముకేవలము ప్రాణ సమమే. వానికి ఉపాశ్రయము జలమేకదా. జలమునుండి చంద్రుడు పుట్టెను. చంద్రుడు ఓషధులను పోషించును. తనకున్న అన్నమున సుర పితృ తర్పణములు అతిథి పూజలు, అత్యుత్తమములు.

## గో, భూ, విద్యా - తిలదాన విశేషములు

మధ్యదేశమున పర్ణశాలయనునొక గ్రామమున శర్మియను పేరుగల విప్రుడొకడు నివసించుచుండెను. యముడొకనాడు ప్రీతితోన తనిని పిలిచి, తిలదానము చాల ఉత్తమమైనది. పితృకోటికి తిలలు దానమిచ్చుచో ఎట్టి పాపములును రావు. పుణ్యము కోరువారు విప్రులకు తిలలు దానమిత్తురు. అదియుగాక వస్త్రములు దానమిచ్చుటయు చాల లాభకరము అని ఉపదేశించెను.

మఱియును భూమి, సరస్వతి ( విద్య) గోవు దానవిధికి అత్యుత్తమములు. ఈ మూడు దానములును మహిమయందు సమానములే. కొంచెపు వెలకు కొనిన గోవును దానమిచ్చినను సరియే ఫలమధికమే. దేవ పితృ పూజాస్థలములు గోవు విడిచిన వస్తువులచే శుచియగును. అది సుఖ ప్రదము. లేదూడలు పాలు కుడుచుటకు ముందు గోవులకు మంచి గ్రాసమిచ్చినను గోదానఫలమబ్బును. దాతకు గోదానము వలన సకల సౌఖ్యములు శుభములు కలుగును.

## దుష్ట గోదానము కీడు - నృగ చరిత్రము

దుష్టమగు గోదానము వలన నృగ మహారాజునకు కష్టములు కలిగిన కథ యిట్లున్నది.

ద్వారకానగరమున ఒక నూతిలోనున్న తొండను జూచి అచటిజనులు, ఇది ఈ నీరమందున్నచో నీరు పాడగునని తలచి పలువురు గూడి దానిని పైకి

లాగ జూచిరి. ఎంత ప్రయత్నించినను లాగలేకపోయిరి. అందులకాశ్చర్యము నొంది యా జనులు కృష్ణుని కడకేగి చెప్పగా కృష్ణుడు వచ్చి దానిని బయటకు లాగి పడ వేయగా అది, దేవా నేను నృగుడను రాజును అని నుడివెను. అంత శ్రీకృష్ణుడును నృగరాజా నీవనేక గోవులను విప్రులకు దానమిచ్చితివని వింటిని. నీకీ పాడు జన్మ ఏల వచ్చినదని అడుగగా నృగుడిట్లు చెప్పెను.

దేవా ఉత్తమ విప్రుడొకనికి నేనొక గోవు నిచ్చితిని. మేత అలవాటు చొప్పున అది తిరిగి మా గోవులలో కలిసెను. మఱియొకనాడు గోదానములు చేయునపుడు గోపాలకు లా విషయమెఱుగక ఆ గోవునే మరల తెచ్చిరి. విధి వశమున దానిని గూడ దానమిచ్చితిని. గోవును మొదట దానము గొనిన విప్రుడా యావును వెదకి కొనుచు రెండవసారి దానముగొనిన విప్రుని గూడ తోడ్కొని వచ్చెను. ఆ విప్రులిర్వురును ఈ గోవు నాది అనగా నాది యని తగవులాడి కలహమునకు దిగిరి. నా తప్పునెఱిగి చాల విచారించి మొదటి విప్రవర్యుని, ఈ గోవును వదలుము నీకు నూఱు గోవులను కావలసిన ధనమిచ్చెదనంటిని. ఆతడంతట ఈ గోవే నాకు కావలయును. ఇది లక్ష్మివలె మాయింటికి వచ్చినది. మా పిల్లవాడు దాని పాదుగు కుడిచినను పాలిచ్చును, నీ ధనములు నాకు వలదని కోపించి వెడలెను. రెండవ విప్రుని గూడ అట్లే అడిగితిని. అతడును నీ రాజ్యమిచ్చినను నా కక్కఱ లేదు. ఈ గోవును విడువను అని వెడలెను కాల ప్రాప్తిని పొంది నేను యమునికడ నా యావేదననుడివితిని. యముడును రాజా నీవు పుణ్య కర్మములు పెక్కు చేసితివిగాని విప్రుని ధనము తీసికొనుట వలన నీకీ పాపము ఘటిల్లినది. పొమ్మనగా ఈ తొండ పుట్టువునంది ఈ నూతిలో బడితిని. యముడును తుదకు దయా హృదయుడై శ్రీకృష్ణుని వలన నీకీ పాపవిముక్తి యగుననిచెప్పెను.

శ్రీకృష్ణుడును దయ జూచి నృగునకు పూర్వ రూపమునిచ్చి ఊర్ధ్వ లోకముల కంపెను. భీష్ముడీయితిహాసమును జెప్పి, ధర్మజా విప్రునికిచ్చిన ధనము, తెలియక పోయినను, మరల తీసికొనుట వలననే యింత ముప్పు భూ వరునకు వచ్చినది.

## గో ప్రభావము - ఔద్దాలకి - నాచికేతుడు

ధర్మరాజు గోమహిమ గోదానమును గూర్చి ఇంత వినియును గో ప్రభావ మును గూర్చి ఇంకను గల విశేషములను వినగోరగా ఔద్దాల కునిపుత్ర చరిత్రము నిట్లు చెప్పెను.

ఔద్దాలకి యను నొక ముని గలడు. ఆతడు స్నానమునకు నదికరిగి తన దర్భలు కలశము సమిధలచ్చట మఱచివచ్చి కుమారుడైన నాచికేతుని మడుగు నుండి ఆ వస్తువుల దెమ్మని పంపెను. నాచికేతుడేగు సరికి వరదనీరు వచ్చి అవి కొట్టుకోని పోగా ఆతడూరకయే తిరిగి వచ్చెను. తన పూజ భోజనము ఆలస్య మైనదని కోపించి ఆ ముని నాచికేతుని నీవు యమ సదనముకేగుమని శాపమి చ్చెను. వెంటనే ఆ బాలుడు నిశ్చేష్టుడై పడెను. అయ్యో నా కొమరునకు నేనే యిట్లు చేసితిని అని దుఃఖించి తానును తన తనయుని గుండెలకద్దుకొని మూర్ఛిల్లెను. రెండు దినములతడట్లే యుండి మూర్ఛనుండి తేరుకొని తన తనయునికై విచారిం చుచుండ అతని కన్నీరు పడి తడిసిన తనయుడు తెలివి వచ్చి కన్నులు దెఱచి తండ్రిని చూచెను.

తనయుని తెలివి వచ్చుట జూచి, ఔద్దాలకి కడు సంతసించి తనయా! నీవు మునుపటికన్న మిక్కిలి తేజస్వివై కనుపడుచున్నావు. నీ వూర్ధ్వ లోకముల కేగితివా! ఏగినచో అచట ఏమేమి చూచితివి ఆ విషయములను జెప్పుమనగా నాచికేతుడిట్లు వచించెను.

తండ్రీ! నీమాట ననుసరించి నేను యమలోకమునకేగితిని. అప్పుడా ధర్మ మూర్తి ధగద్ధగాయమానముగ వెలుగు మణికాంచన భవనమందు నిండు కొలువున నుండెను. నన్ను జూచినంతనే యముడు నీయందున్న గౌరవముచే నాకు అర్ఘ్య పాద్యాది సకల మర్యాదలొనర్చి సుఖాసీను జేసెను. నేనును కొంత వడియటనుండి నేనేలోకములకు పోవలయునని అడిగితిని. బాలకా నిన్ను నీ తండ్రి యముని జూడు మనగా వచ్చితివి. నీ పనియైనది నీవింటికి పొమ్ము అనెను. అట్లు కాదు నేను పుణ్యలోకములను తప్పక చూచికాని ఇంటికి పోవనని పట్టుబట్టితిని. యముడు ధర్మమూర్తి దయామయుడు. నన్నొక వాహన మెక్కించి తానును అందు గూర్చొని అనేక పుణ్య లోకములవెంట ద్రిప్పెను. వానిని జూచి నాకు అ ద్భుతాశ్చర్యము లయ్యెను. అవియన్నియు మహా కాంతిమయములు సర్వ సంప

దలతో నిండి యున్నవి. ఎచట జూచినను ఉన్నత హర్మ్యములు విహార స్థలములు ఉద్యాన వనములు సర్వ సంపద్సమృద్ధి కలిగి యున్నవి. ప్రత్యేకముగ నొక్క లోకమున నేయి నదులు, క్షీర నదులు, సకల సస్య ఫల సంపదలు కల ప్రదేశములున్నవి. వానినన్నిటిని జూచి ఎట్టి పుణ్యములు జేసిన వారిచ్చట వసింతురని అడిగితిని. సర్వలోక విషయములు జెప్పి యముడు ముఖ్యముగ బాలకా! నీవు చూచిన భక్ష్య భోజ్య వస్తుగిరులును ఘృతక్షీర నదులును గోదానము చేసిన వారివి. ఆ దానకర్తలిచట వసింతురు. గోవులనగా సూర్యుని గోవుల వంటివి. అందుచే గోదాన పరులు సూర్యుని తేజస్సు కలిగి వర్తింతురనియెను. తండ్రీ ఆ లోకముల జూచి నాకు బహుళానందకరమైనది. నీ వలన గదా నాకీ పుణ్యలోక దర్శనభాగ్యమబ్బినది. గోదాన ప్రభావము కూడ తెలిసినది. అని తండ్రికి ప్రణామములర్పించి యమునికి గూడ వందనములర్పించెను.

## గోదాన వైశిష్ట్యము

ఇంద్రునకు బ్రహ్మ చెప్పిన వాక్యములు

గోదాన కర్తలు వసించు లోకమును గూర్చి ఆ లోక సంపదను గూర్చి ఇతరులెరుగరు. సువ్రతాత్ములయిన మునులు మహాపతివ్రతలు ఎరుగుదురు. అచ్చట కాల క్రమము, దప్పి, రోగము, ముసలి తనము లేవు. అది అవ్యయము నిరంతర ప్రమోదకరము. దానిపేరు గోలోకము. గురు శూశ్రూషకులు, సత్య సంధులు, శమదమ గుణాత్ములు అందు గోదాన పరులతో కలిసి వసింతురు.

మఱియును, గో పూజనములకు ధర్మసముపార్జితమైన ధనమే యోగ్యమైనది. ఇతరములు పూజకనర్హములు. గోలోకమున కంటె ఉత్తమలోకము లేదు. గోదాన విధికి, వేదవిద్య, సువ్రతము శీలము, గురు పూజ మాతృ పితృ రక్షణము ముఖ్యములు. ఈ విధముగ నుడివిన బ్రహ్మ వాక్యములు విని ఇంద్రుడు గోయజ్ఞములు నడపి ధన్యుడయ్యెను.

**మహాభారత ధర్మశాస్త్రము**

**అనుశాసనికపర్వము రెండవఅశ్వాసము సమాప్తము**



# మహా భారత ధర్మశాస్త్రము

## అనుశాసనిక పర్వము - తృతీయాశ్వాసము

### ఆచరణీయములెట్టివి

మనుజున కాచరణీయ ధర్మములను భీష్ముడిట్లు నుడివెను

నియమముతో వేదాధ్యయనము తాను చేసి ఒకరికి బోధించుట, ఇంద్రియ నిగ్రహము, పరులనుండి ఏమియు తీసికొనకుండుట, సత్యనిరతి, దాన పరత్వము బ్రహ్మచర్యము పితృసేవ మాతృ సేవ గురు శుశ్రూషణ అనుకంప గో వ్రతము ఇవి ఆచరణీయములు. గో ప్రదాన విధిని గూర్చి బృహస్పతి మాంధాత చక్రవర్తికిట్లు చెప్పెను. అదియును వినుము.

పర్వదినములందు, ఉపవసించి గోవుల మందకడకేగి రేబవలచ్చటనుండి మఱునాడుదయమున శుచియై మంచి గోవును ప్రీతితో పిలచి గోవు నా పాపములను నశింప జేయుగాత. ఉత్తమ పదము నాకు ప్రసాదించునుగాక యని బ్రహ్మ నుడివిన వాక్యము పఠించి, ఇదిగో గోవు నిచ్చుచున్నాను అని విప్రుని చేతిలో ఉదక ధార విడువవలయును. ఈ విధముగ సత్పాత్రదానము చేసిన వానికి చంద్రలోక సౌఖ్య ప్రాప్తికలుగును. మఱియును ఆశ్వయుజ బహుళాష్టమి నాడు గోశాలయందు మూడు దినములుపవసించి గోవుపేడ అన్నముగ, మూత్రము పాలుగ సేవించిన సర్వ కామ్య ఫలములనిచ్చునని బృహస్పతి నుడివెను.

ఆ విధముగ నిష్ఠతో మాంధాత భరత దిలీప భగీరథ దశరథులు గో వ్రతములొనర్చి జగద్వంద్యులైరి. ధర్మజా నీవును అట్లే రేపే యీ గో వ్రతము నాచరింపుము. గోవులలో కపిలగోవు శ్రేష్ఠమైనది.

### కపిల గోవు శ్రేష్ఠత

గోవులకు శ్రేష్ఠత నిచ్చిన కపిల వర్ణమెట్లబ్బినదియు వినుము.

దేవతలకొకపరి ఆకలి ఎక్కువయి బ్రహ్మను వేడగా అతడు అమృతమిచ్చెను. వారది త్రావిరి. అందుండి సురభి కామధేనువు పుట్టినది. దానినుండి ఎన్నియో గోవులుద్భవించినవి. హిమగిరియందవి విహరించుచుండ, ఒకగోవు నుండి లేగ పాలు త్రాపు సమయమున దాని నోటి నురుగు గాలికి ఎగసి అచటనే తపమా

చరించుచున్న శివుని శిరముపై బడెను. శివుడందులకు కోపించి చూచి నంతన ఆ గోవునకు నల్లని వర్ణము కలిగెను. ఆ కపిల వర్ణము చూచి గోవులన్నియు బెదరి పారిపోయినవి. బ్రహ్మ దానినెఱిగి శివుని కడకేగి ప్రణామములాచరించి, దేవా! నీవు అమృతముచే తడిసినవాడ వైతివి. గోవు చంద్రునితో సమానము. చంద్రుని నుండి.అమృతము కురిసినట్లే గోవు నుండి వచ్చిన పాలు అమృత ప్రాయములు. అందునను లేగ నోటినుండిన రాలిన నురుగు అతి పవిత్రమైనది. ఆ గోవును నీవు కరుణింప వలసినది. అని ప్రార్థించి ఒక వృషభమును కానుకగా నిచ్చెను. శివుడు ప్రసన్నుడై ఆ వృషభమును తనకు వాహనముగను, తన కేతనమున చిహ్న ముగ దాల్చెను. ఆ కారణమున శివుడు వృషభ వాహనుడు వృషభకేతనుడు అని పేరొందెను. ఆ గోవు లన్నియు తిరిగి హిమగిరికి వచ్చునట్లును, తన కోపమున కపిలమైన గోవు అన్ని గోవుల కన్న ఉత్తమ మైనదని వరమిచ్చెను. మరల సౌరభే యులన్నియు హిమగిరిని స్వేచ్ఛగా విహరించెను.

ఈ కపిలాఖ్యానము చదివినను వినినను కలిదోషములు సమసి పుణ్యుడగును.

## సౌదాసుడు గో పూజ

ఇక్ష్వాకు వంశీయుడు సౌదాసుడను నృపతి తన పురోహితుడు వసిష్ఠుని ఏది పవిత్రమైనదని అడుగగా గోవు పవిత్రమైనదని చెప్పి, గోవు హవిస్సులకు జన్మభూమి, ఎల్ల ప్రాణులకు ఆధారము, పూజనీయము, లక్ష్మికి మూలము, పాప హారము, గోసేవ స్వర్గ ప్రాప్తినిచ్చునని నుడివెను. గోవులను ఉదయమున లేవగానే తలచుట, భక్తితో చూచుట పుణ్య ప్రదము. గోమల మూత్రములకు ఏవ పడరాదు. ఎట్టి మాంసము తినువారికైన గో మాంస భక్షణ మహా పాపము. గోమయము కొంత గలిసిన జల స్నానముత్తమము. గో కీర్తనము వలన దుస్వప్న ములు నశించును. భయము వేసినపుడు గోవును దలచి ప్రార్థించిన భయము లుండవు. ఎఱుపు తెలుపు నలుపు రంగుల గోదానములు సూర్య, వాయు, అగ్ని దేవలోకపదమునిచ్చును. ఏ వర్ణము గల గోవైనను సరియే దానమునకు యోగ్య ము. గోదాన ఫలము స్వర్గ లోక సుఖము. వసిష్ఠుని ఈ ప్రబోధము లన్నియువిని తదనుసారముగ గోవ్రతము లాచరించి సౌదాసుడు దేవలోక సౌఖ్యములందెను.

## శుకునకు వేద వ్యాసుని ప్రబోధము

ధరణిలోనున్న వస్తువులన్నిటికన్న అధికమెయ్యది అని శుకుడడుగగా వ్యాసర్షి

గోవు అన్నిటికన్న అధికము, యజ్ఞమూలము, బ్రహ్మ వరము వలన గోవులకు స్వర క్షణకై కొమ్ములు మొలిచెను. గోవును జూచిన పవిత్రులగుదురు. గోదానము వలన స్వర్గ ప్రాప్తి యనియు బ్రహ్మ దేవతలకు చెప్పెను. గోవిచ్చు వస్తువులన్నియు శ్రేయోదాయకములే. గో మహిమ వలననే దేవతలు రాక్షసులను గెలిచిరి. పెరుగు పాలు, వెన్న, నేయి ఇవన్నియు దేవ పూజార్హములైన పదార్థములే. గోవుల మధ్య నుండుట సకల సంపత్కారము. శుకుడు తండ్రి చెప్పిన యీ వాక్యములు విని గోవ్రత తత్పరుడై చరితార్థుడయ్యెను. గోవుల నేయిదానమిచ్చుట, హోమము చేయుట ఉత్తమము.

## గోలోకము

బ్రహ్మ నివాస లోకమునకన్న గోలోకము ఉత్తమము. విశ్వకర్మ తపోనియతుడై యజ్ఞార్థము మోక్షార్థము అమృత మయము కామ రూపిణి యగు సురభి యను కన్యను మనోబలమున కల్పించి తేజస్వియైన ఒక్క పురుషుని గూడ సృజించెను. అతడా కన్యను వలచి కోరగా బ్రహ్మయే అతనికి మార్తాండుడని పేరిడి, ఆ కన్యనిచ్చెను. వారి సంతానము యజ్ఞోపయోగ ప్రదములగు క్షీరాదుల నిచ్చు చు తన స్థానమునకు మీదుగా నున్న లోకమున వసించుమనని చెప్పెను. ఆ సౌరభేయులు సకల జగద్వంద్యములై వర్ధిల్లెను. అది కారణముగ గోపూజ సకలాభీష్టదాయక మయ్యెను.

## సురభీ మార్తాండుల సంతతి – ఏకాదశ రుద్రులు

ఆ దంపతులు తమ తపము వలన పదునొకండ్రు పుత్రులను బడసిరి. వారు వేద కీర్తనీయులు నిఖిల లోక పతులైన ఏకాదశరుద్రులు బ్రాహ్మణులకు ప్రకృతి. వారి నామములు అజ పాదుడు, అహిర్బుధ్న్యుడు త్ర్యంబకుడు, వృషాకపి, శంభుడు, కపాలి, రైవతుడు, హరుడు, ఉగ్రుడు బహు రూపుడు, విశ్వ రూపుడు లోక పూజితులైన వారి తర్వాతనే సౌరభేయీ నిచయము ప్రభవించెను.

గోవులకు ముఖమునందు, జిహ్వ యందు, కొమ్ములయందు ఇంద్రుడు; రంధ్రముల వాయువు; నూపురమున శివుడు, పదముల యందు మరుత్తులు కడుపు అగ్ని, చన్నుల పొదుగునందు సరస్వతి, పేడయందు లక్ష్మి, మూత్రమున కీర్తి నెత్తురు నందు చంద్రుడు, హృదయమున భగుడను దేవత, పాలయందు బ్రహ్మ, వెండ్రుకల యందాచారములు, తోక ధర్ముడు, అక్షుల సూర్యుండు, చర్మమున తపము సిద్ధి తేజము; సంధి పట్ల సిద్ధులు గల గోమహిమ వర్ణనాతీతము.

# గోవుల ప్రభావము - సుమిత్రుని చరిత్రము

త్రిశిఖరమను పర్వతప్రాంతమున రుద్ర కల్పితమగు కూలహ అను నది కలదు. అచ్చట భృగువంశతాపసులు ఆశ్రమము లేర్పరచుకొని యుండిరి. వారిలో పరమాచార భవ్యుడగు ఒక మునికి అతని మిత్రుడు అంగిరసుడు గోశర్కరనిచ్చెను. సుమిత్రుడా ఓషధిచే, తనగోవును మేపెను. ఆగోవు ఆమేతను తిని బలిసి సుపుష్టయై ఒక వృషభంబు వలన రెండు లేగలను కనెను. ఒకటి పెయ్యి రెండవ ది కోడెదూడ. ఆ మిధునము వలన క్రమముగా ఆతని గో సంఖ్య పెరిగెను. అత డు నిత్యము గుమ్మపాలనురువును ప్రీతితో త్రావుచు గోవులను కడుశ్రద్ధతో పెం చుచుండెను. అందువల నతనికి ఫేనపుడను పేరును గౌతముడిచ్చెను. కొన్ని గోవు లు స్త్రీలుగా కామ రూపిణులై అచటికొలనులో స్నానమాడుచుండ ప్రక్కలను న్న సుమిత్రుని గోవులు వచ్చి మీరెవ్వరని అడిగినవి. అపుడా అంగనలు, మేము హవ్య కవ్యములకు అతిథి పూజలకు వలయుక్షీరము నిత్తుము. సస్యకృషికి మా పుత్రులను పంపుదుము. మేము గోలోకమున నుందుము. మీకును ఇట్టి సుగ తులు వలసినచో రంతిదేవుడను రాజు వేయేండ్లు సేయు యాగమునకు పశువు లై అరుగుడని నుడివెను.

సుమిత్రునిగోవులకీ మాటనచ్చి అచటికేగుటకు నిశ్చయించినవి. తమ యజ మాని యయిన సుమిత్రుని అనుమతి కూడ అడుగుటెట్లు అని ఆలోచించి సుమిత్రుని చంపిన గాని ఆ పనిచేయలేక నిశ్చయించుకొని తిరిగి వచ్చినవి. కొల నులో స్నానమాడు, కపిలగోవులు, అంగనల రూపుమాని పూర్వరూపమున వచ్చి మేము సుమిత్రుని చంపి గోలోకవాసుని చేయుదుము, మీరు మాకేమి మేలు చేయుదురు. అని అడుగగా మిగిలిన గోవులు, గోకులమునకెల్ల అధికమైనది, కపిల గోవు. ఒక కపిల గోవు దానము వేయి సామాన్య గోవుల దానమునకు సరి పోవునని వరమిచ్చినవి. కపిలగోవులంతట యోగ బలమున సుమిత్రుని పైకి గొం పోయి అతనిని గోలోకమునకంపి నిర్జీవ కళేబరమును క్రిందికి బడవేసినవి. గోలో కమున నతడు గౌరవ సమ్మానములందెను.

సుమిత్రుని గోవులు రంతిదేవుని కడకేగి మేము యజ్ఞ పశువులుగా వచ్చితిమి. మమ్ము జ్ఞానులైన వారే పంపిరనగా, రంతిదేవుడు తుదకంగీకరించి, ఏదైన ఒక గోవు దీక్షమాని ఇతర వ్యామోహమునున్నచో అంతటితో యజ్ఞము నాపుదునని నుడివెను. యజ్ఞాగ్ని క్రియకు కొన్ని గోవులు వినియోగింపబడినవి. వానియందున్న

ఒక గోవు తన బిడ్డకు ప్రక్కకేగి పాలిచ్చు చుండుట జూచి అంతతో రంతి దేవుడు యజ్ఞము నాపెను. అగ్నికాహుతియైన గోవులు గోలోకమునకేగినవి. వాని చర్మాస్థులు వాని రక్తంబుతో కలసి చర్మణ్వతియను నదియైనవి.

రంతిదేవుడును ఫేనపుడును శాశ్వతులై గోలోకమున నుండిరి. ఈ ఫేనో పాఖ్యానము చదివినను వినినను సకల సంపత్ప్రదము.

ధర్మజునకు గోసమారాధన ఫలమిట్లు నుడివి మరల వ్యాసుడు శుకునకు పదేశించిన కపిల గో ప్రభావమును భీష్ముడిట్లు నుడివెను.

సకల భూత జాలము సుస్థితి నుండుటకు గోవులే మూలము. గోవులను తిరస్కార భావమున చూడరాదు. గోమహత్త్వము నెఱిగిన యతడు బ్రహ్మలోక గోలోకములకు స్వగృహమునకేగినట్లేగుదురు. గోవుల కంఠధ్వనులు వినుట కానంద ప్రదములు. వాని పాలు పెరుగు నేయి అమృత సమరూపములే యజ్ఞములందు దేవతా ప్రీతికరములు. గోసమర్చనము ఒక ధర్మయ[illegible]ము. ఆవుల నేయి తినుట, గోవుల మలము పేడ గలిపిన నీటస్నానమొనర్చుట, గో కథలు వినుట అఖిల పాపహరము. శ్రీ కరము. శత్రుజయము, చోరభయములేకుండుట, మొదలగు సౌఖ్యములు లభించును.

అగ్ని యొకమారు దేవతలకు కనుపడకుండ, గోవుల నర్థించి గోవులందు దాగియుండుట, దేవతలు గ్రహించి గోవులను ఏల మీరిట్లు చేసితిరి అగ్ని సకల జనారాధకుడుగదా! యని వేడగా గోవులా యగ్నిని సురలకు చూపిరి. దేవతలు సంతసించి గోవులకు వరంబీయ వాయువును వేడగా, నతడు తానుగోవులయందుం డుటచే గోవులకు కపిల వర్ణము కలుగుననియు కపిల గోవులు సర్వజన పూజనీ యములనియు జెప్పెను. గోవును దానమిచ్చినను దానము తీసికొనినను అధిక పుణ్యా వంతులగుదురు.

కపిలగోవునకు కొమ్ములు, చెవులు, కళ్ళు, ముక్కు రంధ్రములు నలుపు మెడ, ముష్కములు గూడ నలుపుగ నుండును. ఇది ముఖ్యలక్షణములు. గోదే హమున నలుపు రంగెచటనున్నను కపిలత్వమే.

కపిల గోవు పాలు హోమమునకే, గాని వేరుగా ఉపయోగింపరాదు. కపిల గోవును దండింపరాదు. బరువులు మోయించరాదు. వసుధ, దివి, గాయత్రి, సత్యము, సువర్ణము, వసంతములు గోవులు ఒక పుట్టువుగానే పుట్టినవి. కావున భూ దానము సువర్ణ దానము గోదాన తుల్యములే.

సువర్ణ దానము సకల కిల్బిషహరము పావనమని నుడివెను. సువర్ణము అగ్ని మయము, దేవతలు అగ్ని తేజము వలననే మహిమాతిశయులైరిగాన సువర్ణ దానము విప్రులకిచ్చిన ఏ కొఱతయు నుండదు.

భీష్ముడు మఱియొక వృత్తాంతము, బ్రహ్మచెప్పగా వసిష్ఠుడు విన్నది నుడివెను. పార్వతీ పరమశివులొకళ్ళొకళ్ళకై అన్యోన్యాభిలాషతో తపస్సు చేసి, దంపతులై సుఖముగ నుండిరి. పార్వతి తన వద్దనుండగా శివునకు వీర్యస్ఖలనమై దానిని అగ్ని యందు దాచెను. తారకుడను మహోగ్ర దానవుడొకడు విజృంభించి దేవతలను ఋషులను బాధించసాగెను. వారేగి బ్రహ్మవద్ద తమ గోడును విన్నవింపగా అతడు శివవీర్యముగల అగ్నిని ప్రార్థించుడని నుడివెను. దేవతలా అగ్ని కొరకు వెదుకసాగిరి గాని యెచ్చటను అగ్ని కనుపించలేదు. అంతట నొక కప్ప, అగ్ని పాతాళముననున్నట్లు తెలుపగా అగ్నియు మీరెప్పుడును నాలుక మాటలేక జలము నందు పడియుండెదరని కప్పకు శాపమిచ్చెను. దేవతలు ఆ కప్పలనూఱడించి నీకు భయములేదు, ఎంత ఎండ కాసినను, నీవున్న చోటు ఎండిపోయినను నీవు చావవు. తిరిగి వర్షము పడగానే నీవు గొంతెత్తి అరవగలవని వరమిచ్చి వెడలిరి. ఒకయేనుగు తొండము సాచి అగ్నియున్న దెస చూపెను. అగ్ని మరల కోపించి నీనాలుక మడత పడుగాక అని శపించి జమ్మిచెట్టును దాగెను. ఏనుగును దేవతలనుగ్రహించి నీ నాలుక మడతపడినను రుచి తెలిసికొనునని వరమిచ్చి ముందునకు కదలిరి. అచ్చట నొక చిలుక కన్పడి అగ్ని యున్న ప్రదేశమును చెప్పెను. నీకు మాటలాడు శక్తిలేకుండగాక యని అగ్ని చిలుకను శపించెను. దేవతలు చిలుకను జూచి భయములేదని చెప్పి నీవు జనులకు సురలకు హితముగా నుండునట్లు పలుకగలవని వరమిచ్చి అగ్నియున్న చోటికి వెడలిరి.

అగ్నివారిని జూచి మీకేమి కావలయును నన్ను వెంటాడి వత్తురనగా, దేవతలు మునులు ఏకవాక్యమున దేవా! మమ్ముర‌క్షింపుము తారకాసురుడు మమ్మునానా హింసల పాలు జేయుచున్నాడు. వానిని చంపు ఉపాయము నీవే చూపవలయును. నీ కీర్తి నలు దిక్కుల వ్యాపింప గలదని ప్రార్థించిరి. ఎట్టకేలకు ప్రసన్నుడై అగ్ని తనయందు వెలుగు శంభు వీర్యమును గంగా గర్భయుతమైనదానినిచ్చి దీనివలన మీకు మేలగుననగా వారది కొంపోయి మేరుపర్వత తటమున దట్టముగనున్న శర వణమున (రెల్లున) బెట్టిరి. ఆ పర్వతమంతయు మహా ప్రకాశమానమై ఒక బాలుని రూపమయ్యెను. కృత్తికలార్వురును వేగముగ వచ్చి వీడు నా పుత్రుడని ఆ బాలు

నెత్తుకొని పాలుకుడిపిరి. ఆ బాలుడు ఆరుమొగములతో ఒక్క సారిగ వారి చనుబాలు గ్రొవెను. ఆ కారణమున ఆ బాలుడు షణ్ముఖుడయ్యెను. కృత్తికలు పెంచుటచే కార్తికేయుడని పేరొందెను. ఇంతలో బ్రహ్మాదులు వచ్చి దేవసేన కధిపతిగా అతనిని నియమించిరి. షణ్ముఖుడును మహాబలుడై అర్చిర్మహిత యను శక్తిచే తారకుని పరి మార్చి లోకముల కానందమొసగెను.

వసిష్ఠుడిది నుడివి పరశురామా! ఆ శంకరుడే పురుషుడు అతడు హిరణ్మయుడు, తానే తన తనయునిగ తోచెను. శివరేతో ధారణమున వహ్నిహిరణ్యాత్మక రేతోమూర్తియై హిరణ్య రేతుడని పేరొందెను. పుర హరునకు వహ్ని రేతుడను నామము కలిగినది. ఈ విధమున సువర్ణము రూపవంతమై జాతరూప నామకముగా భాసిల్లినది. సువర్ణము తేజోమహనీయము. సువర్ణదాన మహిమ శివుడే యెఱుగును. సకల కల్మషహరము, శుచిత్వ ప్రదము సువర్ణమని వసిష్ఠుడు నుడువగా పరశు రాముడా దానములను పరంపరగ జేసి శుచిత్వ మందెను. భీష్మని వలన ధర్మజుడా మాటలను విని సువర్ణ మహిమను గ్రహించి సమ్ముదితుడయ్యెను. పితృ పూజా విధానమును గూర్చి ధర్మజుడడిగెను.

## పితృ పూజా విధానము

భీష్ముడిట్లు చెప్పెను.

ప్రతి అమావాస్యనాడు పిండ ప్రదాన సహితముగ పితృయజ్ఞము చేసినచో ప్రతిదినము చేసినట్లగును. తిథులను బట్టి పితృయజ్ఞఫలములున్నవి. పాడ్యమి నాడు అందమైన కాంతలకు పతి, విదియనాడు కాంతలకు తండ్రి, తదియ; వాజి ధనకుడు, చవితి : పశుభాగ్యము, పంచమి : బహుసుతుడు, షష్ఠి : ప్రకాశము కలవాడు, సప్తమి : కర్షకుడు, అష్టమి : వాణిజ్య లాభము, నవమి : గుఱ్ఱములు, దశమి : గోవులు, ఏకాదశి : దాచదగిన వస్తువులు, ద్వాదశి : బ్రహ్మ వర్చస్వి పుత్రులు, త్రయోదశి : ధనము, చతుర్దశి : రణధీరుడు, పౌర్ణమి, అమావాస్య : కామితసిద్ధి.

బహుళ పక్షమున అపరాహ్ణము మేలు. పాడ్యమి, దశమి, చతుర్దశి నింద్యములు.

## పితృ పూజా ద్రవ్యములు

తిలలు, పాయసము, నేయి ఉత్తమములు. అన్నము మహా ఫలము.
విధి ప్రకారము మత్స్యములు మాంసము ఫలదాయకములు. గొఱ్ఱె మాంసము గండమృగము మాంసము, మేక మాంసము ఒకదానికన్న ఒకటి మేలు.
**నక్షత్ర విశేషములు :**- కృత్తిక - శత్రు నాశనము, రోహిణి - పుత్ర లబ్ధి, మృగశిర - ఓజస్సు ( బలము), ఆర్ద్ర - క్రూరుడు, పునర్వసు - వ్యవసాయఫలము, పుష్యమి - సుపుష్టి, అశ్లేష - వీరతనయులు, మఖ వంశాభి వృద్ధి, పుబ్బ - సౌభాగ్య సిద్ధి, ఉత్తర - బహు సంతానము, హస్త - కర్మ సఫలత, చిత్త - సుందరులైన పుత్రులు, స్వాతి - వాణిజ్య ఫలము, విశాఖ - పెక్కు పుత్రులు, అనూరాధ - రాజ్యాధి కారము, జ్యేష్ఠ - ప్రభుత్వము, మూల - ఆరోగ్యము, పూర్వాషాఢ - ప్రసిద్ధి, ఉత్తరాషాఢ - శోకనాశనము, అభిజిత్తు - విద్య, శ్రవణము - పరమగతి, ధనిష్ఠ - రాజ్యము, శతభిషము - ఆరోగ్యము, పూర్వా భాద్ర - కార్య ఫలము, ఉత్తరా భాద్ర - గోవులు, రేవతి - దాచు వస్తువులు. అశ్వని ఆయుర్వృద్ధి, భరణి ఆరోగ్యము.

పితృపూజకు తగినవి : అర్హులైన వారినే నియోగింప వలయును.

కులవయో రూప శీలములు విద్య ఉన్నవారు పూజకు అర్హులు. ఈ సద్గు ణములు లేనివారు అనర్హులు.

**శ్రాద్ధమున పంక్తి దూషకులు :**- జూదరి, మూర్ఖుడు, వేదములు చదువని వాడు, గ్రామసేవకుడు ఇళ్ళు తగులబెట్టువాడు, కుష్ఠురోగి, వస్తువులు అమ్మువాడు, సోమము ( జలము) విక్రయించువాడు. సముద్ర వర్తకుడు, రాజ భృత్యుడు, తాను భార్య పుత్రులను పంచుకొన్న వాడు, పెక్కు పశువులున్నవాడు, దొంగ వంచకుడు.

తలపాగ పెట్టుకొని చెప్పులు తొడుగుకొని భోజనము చేసినచో రాక్షసులకు చెందును. వంటకములు అశుచియయిన యెడల తత్ఫలము రాక్షసులకు చెందును. తిలలు ఆ వంటకములపై జల్లిననవి శుచి యగును.

**శ్రాద్ధ పంక్తి కర్హులు :**- శాంతుడు, వ్రతశీలుడు, ఇంద్రియనిగ్రహుడు, దేశికుడు దయగలవాడు, శాస్త్ర పురాణ విదులు బ్రహ్మ బోధము కలవారు పావనులు స్నేహితులు కానివారు అనర్హులు.

మునుముందు అర్హులయినవారినే ఎంచుకొని శ్రాద్ధ పంక్తికి పిలువ వలయును. పిలిచి కూడదు అనరాదు.

## అత్రిమహాముని నిమికి చెప్పిన శ్రాద్ధ క్రియావిశేషములు

అత్రి బ్రహ్మమానస పుత్రుడు. నిమి అతని వంశీయుడు. తనకుమారుడు శ్రీమంతుడు చనిపోగా నిమి అతనికి శ్రాద్ధవిధి నెరవేర్చుచు అత్రిని దలచెను. అత్రివచ్చి చెప్పిన విశేషములు.

బ్రాహ్మణులు అర్హులైనవారు కావలెను. వారికిడినవి, క్రియకు వాడినవిదర్భలకొనలు దక్షిణమునకు సాగి ఉండవలెను. మునగ, ఉల్లి, దుర్మాంసము, మలినమైన ఉప్పు, నల్లజీలకర్ర, కరివేప ఆకు, ఇంగువ, గురుజ ఆకు పనికిరావు. శునకము, రజస్వల, అంత్యజాతి వాడు దరికి రాగూడదు.

శ్రాద్ధ భాగములు - సూర్య, వరుణ, చంద్రులకు అగ్నికిని చెందును, అని బ్రహ్మ వచించెను.

పితృదేవతలతో విశ్వదేవతలు కూడ అక్కడ ఉందురు. ఇంకను ఎంతో మంది దేవతలను భాగార్హులుగ బ్రహ్మ నిర్దేశించెను. గిరివనదుర్గములందు నదిని దాటునపుడు శ్రాద్ధవిధి సమయమున ఆ దేవతలను మనమున దలచుట శుభము. పూరిపంట బియ్యము, ఆరిక బియ్యము, జంబూఫలము శ్రాద్ధ విధికి పనికి రావు. తుమ్ముట, ఏడ్చుట తగదు. శ్రాద్ధ విధి సమయమున ప్రశాంతితో ఉండవలెను. ఇంకను మఱికొన్ని విశేషము లత్రియిట్లు చెప్పెను.

ఒక శ్రాద్ధ బోజనము మునివర్యులు చేసి అది జీర్ణము కాక పితృ దేవతలు బ్రహ్మకడకుపోవ, అగ్ని ముఖ్యము ఆతరువాతనే భోక్తలు భుజింప వలయునని నిర్దేశించెను. అగ్నిలేని శ్రాద్ధ పూజ పితృ దేవతలకు పనికిరాదు. శ్రాద్ధ దినమున పితృ పితామహ ప్రపితామహుల పూజలవసరము. జ్ఞాతియిచ్చిన జందెముతో శ్రాద్ధ విధి నెరవేర్చవలయు. గయ క్షేత్రమున పిండ ప్రదానము సుగతుల నిచ్చును. ఈ కారణమున నొక్కకొడుకైనను గయను పిండము వేయడా అని పెక్కుపుత్రులను తల్లి దండ్రులు కోరుదురు.

## ఉపవాసము - తపము

పెక్కు దినము లుపవసించిన మాత్రమున తపముకాదు. అందువలన నరుడు తపస్వియు కాడు. కారణము ఉపవాసములచే దేహమును శుష్కింపజే

యుట ఆత్మను బాధించుటే. సత్యము, బ్రాహ్మచర్యము, శుచిత్వము మౌనము దయ శ్రద్ధ త్యాగము ఇవి తపస్సుయొక్క రూపములు.

### సప్తర్షి వృషాదర్భి సంవాదము. అప్రతి గ్రాహ్యతా విశేషము

అప్రతిగ్రాహకుని విశేషము ధర్మజుడడుగా భీష్ముడు సప్తర్షి - వృషాదర్భి నృపుల మధ్య జరిగిన ఒక సంఘటనను విశదీకరించి యిట్లనుడివెను.

పెద్దలు తపస్సు అను విషయము పల్కుదురు. ఉపవాసమనగా తపమా లేక మఱొకటా అని ధర్మజుడడుగగా భీష్ముడీ యితిహాసము నుడివెను.

కశ్యపుడు అత్రి విశ్వామిత్రుడు గౌతముడు, భరద్వాజుడు జమదగ్ని, వసిష్ఠుడు వీరు సప్తర్షులు. వసిష్ఠుని భార్య అరుంధతి. వసిష్ఠుని తోనే ఎప్పుడు నుండును. వారందరికిని గండయను స్త్రీ పరిచారిక. ఆమెయు ఆమె భర్త పశుసఖుండును వారి పనులు చేయుచుందురు. ఒకసారి మహా క్షామము వచ్చి, తినుట కన్నము దొరకక అల్లాడు చుండిరి. శిబి వంశీయుడు నీలు ‍ శను వాడొకడు మరణింపగా అతని శవము చితిపై పెట్టిరి. ఆ ఋషులాకటిబాధ కోర్వలేక ఆ శవమునే తినుటకాలోచించుచుండ వృషాదర్భి యను రాజు వచ్చి ఆ ఋషులను జూచి మీరు పవిత్ర చరిత్రులు మీకీ తలపేల. నేను మీకు ఫలములు భక్ష్య భోజ్యములు సమకూర్తునని కృత్రిమ ఫలములను దెప్పించి వారి కిచ్చెను. మౌని వర్యులది గ్రహించి వానిని తిరస్కరించిరి.

ఋషుల చేష్టకు ఆరాజు ఆగ్రహించి కృత్తియను శక్తిని సృష్టింపజేసి ఆ మునుల పైకి పంపెను. కందమూలముల వెదకుచు వారు అడవుల బడియుండ శునస్సఖుడను సన్యాసితోడయ్యెను. సప్తఋషులును క్షుద్బాధ పడలేక తామర తూండ్లు తినుట కొరకు కొలనులోనికి పోవుచుండ కృత్తి వారి నడ్డగించెను. అడ్డగించి మీ నామములు చెప్పుడు చెప్పిన తర్వాతనే మీరు కొలనిలోనికి పోవచ్చుననగా, వారు ఆ వచ్చినది. వారిని వధింప వచ్చిన రాక్షసిగా నెఱింగి దానికి అర్థముగాని రీతిని వారి నామములు చెప్పిరి. ఆ నామములు కృత్తికేమియు బోధపడలేదు. శునస్సఖుడు తన పేరు స్పష్టముగ చెప్పెను. అట్లు చెప్పినను నీవు తప్పు చెప్పుచున్నావు. సరిగా చెప్పుమని గర్జింపగా శునస్సఖుడు కోపించి దండమెత్తి యాశక్తిని వధించి భస్మము చేసెను.

కశ్యపాదులు కొలనులోదిగి తామర తూండ్లు సేకరించి ఒక పోగుగా ఒక మూలను బెట్టి వారివారి నియమ నిష్ఠలు నిర్వర్తించుకొని తామరతూండ్లను తిను

టకు రాగా అవి యచ్చట లేవు. వారిలో ఒకడెవ్వరో వీనిని దొంగిలించుకొని యుం డునని శంకించి ఒకరి నొకరు శపింపదలచిరి. ఆ మునులును, అరుంధతి, గండయు ఒకరి తర్వాత ఒకరు లేచి తానాతామర తూండ్లనపహరించినచో, అతి నికృష్ట వులమై సర్వ పాపములొనర్చి నరకముననుభవింతుమని శపథము జేసిరి. శునస్సఖుడు మాత్రము నేనపహరించినచో నా పుత్రికను వేదపండితుడయిన యజ్ఞకర్తకిచ్చి పెం డ్లిగావించి యానందింతునని వింతగ పలుకుట జూచి మునులందఱు శునస్సఖుడే తామరతూండ్లు దాచి యుంచెనని గ్రహించి మా తామర తూండ్లు మాకిమ్ము మమ్ము ఇబ్బంది పెట్టకుమని వేడుకొనిరి. శునస్సఖుడంత తానే తామర తూండ్లు దాచితి నని వారికిచ్చి, మీకు కొలనిలో అడ్డు వచ్చిన రక్కసిని మిమ్ము వధించు టకై హోమ వహ్నిలో పుట్టించి వృషాదర్భి పంపినాడు. నేను ఇంద్రుడను. చంపవ లెననియే ఆశక్తిని చంపినాను. మీరిటునటు ఈ అడవులబడి తిరుగుటెందులకు. రండు మీకు అఖిల సౌఖ్యములును కలుగునని వారి నందరిని దివికి తీసికొనియేగెను.

అంత ఆకలి బాధలో నుండియు వారెట్టి లోభము స్వార్థము పడక సద్గుణ వర్తులగుటచే ఆ మునులును వారివారి పరి చారకులును మహేంద్రునిచే సంస్తు తింప బడిరని ధర్మరాజునకు భీష్ముడు వచించెను.

## శ్రాద్ధ సమయమున చెప్పులు గొడుగు దానము

శ్రాద్ధ కర్మలయందు చెప్పులు గొడుగు దానము చేయుట విశేషము. ఈ విషయమును గూర్చి ధర్మజుడడుగగా భీష్ముడిద్దానికొక నిదర్శనముగా నొక యితి హాసము నిట్లు నుడివెను. జమదగ్ని ముని - సూర్యుల మధ్య జరిగిన వృత్తాంతమిది.

జమదగ్ని మహాముని భార్యా పుత్ర సహితుడై ధనుర్బాణములను ధరించి విహారార్థము అరణ్యములకేగి, ధనుర్బాణములొకచో పెట్టి తన పుత్రుని అగ్నికి అర్హమగు సమిధలను తెమ్మని పంపి తాను కూడ ఫలమూలాదులకు వెడలెను. భార్య అచ్చటి ప్రదేశము శుభ్రమొనర్చు చుండెను. అంతకంతకు ఎండ తీవ్రము దుర్భరమై సూర్యుడు నడిమింట తీక్ష్ణముగ ప్రకాశించుచుండెను. జమదగ్నియు భార్యయు కూడ ఎండవేడిమికి తాళలేక చెమటలు కార్చు చుండిరి. సమిధలకేగిన పిల్లవాడు చాల ఆలస్యముగా వచ్చుట జూచి కారణమేమని అడుగగా ఎండకు తాళ లేక ఒకచో విశ్రమించితిననెను. ముని చంద్రునకు పట్టరాని కోపము వచ్చినది. ధనుర్బాణములెత్తి సూర్యుడింత బాధ ప్రజలకు కలుగజేయు చున్నాడా వాని విజృం భణము నాపెదనని లేచెను. ఇంతలో సూర్యుడొక బ్రాహ్మణ వేషమున వచ్చి

మునీంద్రా! సూర్యునిపై నింత ఆగ్రహమేల. అతనివలన కాదా జీవనాధారములైన జలము ఓషధులు పెరుగుచు హవ్య మహిమ గలిగి దేవతలకు ప్రీతిగానున్నవి. సూర్యుని తేజముడిగినచో ఇవన్నియు నశించును. నీ కోపముడుగుమని ఎంత వేడినను మునీంద్రుడు శాంతింపలేదు. అప్పుడా విప్రుడు మునీంద్రునితో మహాత్మా నేనే సూర్యుడను, నాయెడల తప్పున్నచో సైరింపుమని శరణువేడి తన మనశ్శక్తి వలన గొడుగు చెప్పులు తెప్పించి మునికి సమర్పించి, మునీంద్రా ఇవి నూతన సృష్టి. శిరమునకు పాదములకు వేడిమి లేకుండ చేయును. ఎవ్వరేని విప్రునకు వీనిని దానము చేసిరేని ఐహికాముష్మిక సుఖములు కల్గునని చెప్పి ఆ మునీశ్వరునానందింప జేసెను. శ్రాద్ధ సమయమున ఈ వస్తువులను దానమిచ్చినచో అధిక పుణ్యప్రదము. ఇవి సూర్యసృష్టి మునీంద్రుని ప్రీతి పాత్రములయినవిగాన సాధు వృద్ధ సజ్జనులకు దానమిచ్చిన వానికి గోలోక ప్రాప్తియని భీష్ముడు చెప్పెను.

## శూద్రున కాచరణీయములైన ధర్మములు

శూద్రునకు ఇహపర సౌఖ్యములెట్లు గలుగును. అందులకు ఆచరణీయంబులగు ధర్మములెట్టివి? అని ధర్మజుడడుగగా భీష్ముడిట్లు చెప్పెను.

మున్ను పరాశరమహాముని తన శిష్యులకు చెప్పిన ధర్మములివి. ఇంద్రియ నిగ్రహము, కామక్రోధలోభాది దుర్గుణమ్ముల నణచి పెట్టి గర్వము మాని తక్కిన వర్ణములయందు భక్తి సేవాగుణముకలిగి వర్తించుట శూద్రునకు ఇహలోక సుఖ ప్రదము. వేదాధ్యయనము తపము తగదు.

బ్రాహ్మణులకు అధ్యయనము, నరపాలురకు బల సమగ్రత, వైశ్యులకు వాణిజ్యము, శూద్రులకు అనుచరత్వము అధిక ధన ప్రదములు. ఈ సదాచారములను నాలుగు కులముల వారును ఆచరించునెడల ఇహపర సౌఖ్యము లొందుదురు. ఇట్లుగాక ఆత్మ ధర్మములు వదలి చరించువారికి సద్గతులు రావు.

## శుచిగా నుండుటకు విధులు

మూత్ర పురీషములు రాత్రి పగలు దక్షిణోత్తర దిశాముఖముగనే సలుపవలయు. శౌచక్రియసలుపు ముందు మాటలాడరాదు. సలుపునపుడు నీరు తొడలపై పడరాదు. శుభ్రమగు మట్టిచే అపానమును మలినములేకుండ చేయవలయు. ఆ స్థలమును నొవ్వువచ్చునట్లు తోమరాదు. వాసన పోవునట్లు చూడవలెను. ఈ పని మెల్లగనే చేయవలెను. ఎడమచేతిని త్రివారమృత్తికచే శుభ్రము చేసి రెండు చేతులను మఱిమఱి కడుగుకొనవలెను. మర్మావయమును జలములచే

శుభ్రము చేసికొని మరల చేతులు శుభ్రమొనర్చుకొనవలెను. మలమూత్ర విసర్జ నము జనులు చూచుచుండ జరుపరాదు. ఈ పనులకు మరుగు స్థలములు కావ లెను. ఆపత్సమయమున ఇట్టి శుద్ధి పనులు సాగవు, మల మూత్ర దుర్గంధములు పోవు నట్లుపాయమున చేయవలెను.

నిర్మలమైన ఉదకము బుడగలు లేకుండ ముమ్మాఱు త్రావి, మొగమున పాదములందు శిరమున జల్లుకొని పెదవులు తడిపి ముక్కు కళ్ళు చెవులు బుజ ములు బొడ్డు నాభి శిరము తాకి చేతులు పాదయుగము మధ్యనుంచి తూర్పుగ తిరిగి, ఆచమానము సేయవలెను. త్రావిన నీరు డెందమున జేరును. ఇది వేద సమ్మతము. ఆర్యమతము. శాస్త్ర హితము. కన్నులు ముట్టినపుడు సూర్యు డును, పాదములపై నీరు జల్లినపుడు విష్ణువును ప్రీతి చెందుదురు. వస్త్రయ జ్ఞోప వీత ధారణముల తరువాత అన్నపాన తంత్రముల పిదప ఈ ఆచమన ప్రయో గమనుష్ఠింపవలెను. నోరు కడిగికొన్నపుడు ఏవైన నలుసులు పండ్లమధ్య మిగిలి నచో మరల కడుగుట శ్రేయుము. ఈ శౌచవిధి సమస్త వర్ణ సామాన్య ధర్మము. విప్రులకు అధ్యయనము అధ్యాప కత్వము, రాజులకు పాలన దండోపనీతి, వైశ్యు లకు వాణిజ్యము నాల్గవ వర్ణమునకు శుచిత్వము తోడి తక్కిన వర్ణముల వారి యెడ విధేయత యజ్ఞముల వంటివే. యతి సర్వాశ్రమ స్థితులకు శ్రేష్ఠుడు. సాధు సంభాషణము, శాంతి, దాంతి, అనాలస్యము, శీలము నలవరచుకొని భిక్షుక జన ముల యెడల ప్రీతి, ధర్మ విధార్జిత ధనము వలన సేవ శూద్రులకిహ పర సాధన ములు. యతుల యెడల గౌరవ సమ్మానములవశ్యము కావలెను. కేవలదానోప వాసములు చాలవు. యతులు రోగ గ్రస్తులయి యున్నపుడు సాదరముగ చేసిన సేవయే పరమగతినిచ్చును. ఏవిధమగు పరిచర్య సేవ చేసిన యతులకు మనః ప్రీతియో ఆ విధమున అణకువతో నడచుకొనుట శూద్రులకు సుగతి ప్రదము.

పరధనములకాస, జంతు హింస, కల్లు త్రావుట, గురువు నెడల అపచారము, ఇవి మహా పాతకములు. ఎన్ని దానములొనర్చినను పోవు. తనకు కీడు కలిగినపుడు ప్రాయశ్చిత్తమవసరము, అందరి మేలు కోరి అందరి యెడల సమహితము కలిగి యుండుట శ్రేష్ఠతరము.

## మరణ సూచనలు

దక్షిణముఖుడు హిరణ్మయుడైన పురుషుని ఉత్తరమున చూచువానికి మూడు సంవత్సరములలో, సూర్యమండలము కాంతిలేనిదిగా చూచిన రెండేండ్ల లోను, వెన్నెల తన నీడను తూటగునట్లు చూచిన వత్సరములోను, దానిని సిగ

( కొప్పు) లేనట్లు చూచిన ఆరు నెలలో, చెవులు మూసికొనినపుడు ధ్వని వినబడక పోయినను నెలలో, చెవులు ముక్కు పట్టువదలి, కనులు పండ్లు వికార వర్ణము కలిగినపుడు వెంటనే మృత్యువగును. అట్టి సందర్భములందు సంసార సంగము వదలి భగవద్ధ్యాన నిష్ఠలోనున్న వానికి సద్గతులు ఇహపర సుఖములు కలుగును.

ఆ విధమగు ధ్యాన నిష్ఠగల వాడు సంపదలు గలిగిన వంశములజన్మించి, కర్మఫలమననుభవించుచు, కర్తవ్యము నాచరించుచు, జనన మరణ కలితములైన సంసార విషయములశాశ్వతములని యెఱిగి వానికి లోను గాక సత్కార్మ లాచరించుచు, దేవపితృ కోటుల తృప్తి గావించి, గురు శుశ్రూష జేసి యోగ శాస్త్రాభ్యాసియై వైరాగ్యమున భిక్షుక వృత్తితో ఒకచోటనక ఏకాంత వాసియగు నాతడు, గుణాతీతుడై మాయను వీడి శాశ్వతము అచలమగు పదమునందును. ఆశ్రితులకు కూడ అట్టిపదవి లభింప జేయగలవాడగును. అట్టి విరాగికి ప్రియకారియై సేవించిన శూద్రునకును శివతత్వ పదవి లభించును.

## గురు మహిమ – పరశురాముడు వచించిన ధర్మము

ఇంద్రియ వ్యాపార నిగ్రహము ఎల్లరకు కావలెను. దానితో తృప్తి బొంది మరియొక ఆసక్తి లేనివారు పాపులైనను సుగతి బొందుదురు. పాపవర్తనమున తిరుగు వానికి ఇట్టి బోధము అవగతముకాదు. గురుసేవ వలననే జ్ఞానోదయమగును. గురు బోధమును ఎంత ఎక్కువగ తెలిసికొనిన అంతమేలు. ఇంద్రియములు పాటవమును చంచలత్వమును అణచు కొని, మనమును సరియగు మార్గమునందుండునట్లు జేయువాడు వికృతిషోడశకము. ప్రకృతి సప్తకము మూల ప్రకృతిని అరయు వాడయి వికృతి ప్రకృతిగాని మహేశ్వరుని చూడగల వాడగును. గురు శుశ్రూష ఫలముగనే ఇట్టి కైవల్యపదము లభింపగలదు.

## నరులకును సురలకును వందనీయులు

ఈ విషయమునే దేవేంద్రుడు మాతలికెఱిగించిన విధము బీష్ముడు ధర్మజునకు నుడివెను. ధర్మార్థకామములు ధర్మమార్గమున నడప గులుగువారు సుందర రూపములు పొందుదురు, వాంఛలు లేక వారికి గల విద్యా ధనైశ్వర్యములకు గర్వ పడనివారు, పరకాంతను ఆశింపనివారును సత్యము శుచిగల వారు తనకును వంద్యులని ఇంద్రుడు నుడివెను.

## తటాక నిర్మాణ ఫలము

ధర్మరాజంతట తటాక నిర్మాణ రూపమగు ధర్మము తత్ఫలవిశేషము నడుగగా భీష్ముడిట్లు చెప్పెను.

తటాకము దేవతలకు జంతువులకు మనుజులకు శ్రేష్ఠమయిన ఆశ్రయము. గోవులందరి నీరు త్రావుట వలన అవి తటాక కర్తకు ఈ లోకమున సుఖము కీర్తి, పితృ చయమునకు ఊర్ధ్వ లోకములు ప్రాప్తించును. సంపద లిచ్చును. మూడు కాలములందు నీరున్నయెడల వాజపేయ యజ్ఞఫలము నిచ్చును. చెరువుగట్టున తగిన చెట్లను పాతినచో మఱింత ఫలము

## వృక్ష విశేషము

వృక్షములు పాతిన వానికిహలోక సుఖము. అవి పక్షులు మొదలగు జీవులకు వాసయోగ్యము. మఱియు చెట్లనీడలు అతిథులకు, పూవులు దేవతలకు, పండ్లు పితరులకు ప్రమోదమునిచ్చును. అందుచే వృక్షములు నాటుట, గొప్ప ధర్మము.

## గృహస్థ ధర్మము

ధర్మజుడడుగగా భీష్ముడిట్లు నుడివెను.

ఒకప్పుడు విష్ణువు భూమిని బుజ్జవములు మున్నగు వాని గురించి నడిగెను. భూమి, దేవా! అగ్ని హోత్రమున హోమాదికములు చేయుట వలన దేవతలు తృప్తి నందుదురు. అన్నము పాలు పళ్ళు నిర్మల జలము దేనితోనైనను పితృ కార్యములు సలిపి శక్తి కొలది దానము భిక్షువులకు చేయవచ్చును. వారు లేకపోయిన బంధు మిత్రులను భోజనముచే దృప్తులనొనరించుట శ్రేయము.

ఇట్టి బలి సమర్పణము రెండు విధములు.

ధర్మాధర్మౌషధీవన రక్షోజనాది విషయంబైనది శ్రౌతబలి. ఇప్పుడు చెప్పినది పశుపక్షి చండాల పశుగోచరంబైన స్మార్తబలి ఇదియంతయు గృహస్థ ధర్మము. ఈ విధమగు బలి పూజనడపి భోజనము సేయు విప్రునకిహ పర సౌఖ్య సంపదలు కలుగును. ఈ విధముగ భూదేవి చెప్పిన యుపదేశము విని కృష్ణుడు గృహస్థ ధర్మ నిష్ఠాతత్పరుడయ్యెను. ఈ గృహస్థ ధర్మము పాపహరము, పుణ్య యశస్సంపద, అభ్యుదయానందము ఊర్ధ్వలోక ప్రదము కావున దీనిని ఆచరింపుమని భీష్ముడు ధర్మజునకు బోధించెను.

**మహాభారత ధర్మశాస్త్రము**

**అనుశాసనికపర్వము తృతీయాశ్వాసము సమాప్తము.**



# మహాభారత ధర్మశాస్త్రము

## అనుశాసనిక పర్వము - చతుర్థాశ్వాసము

## ధూప దీప నైవేద్యముల ఫల విశేషములు

దేవతా పూజలు పూవులు ధూపము దీపము నైవేద్యాదులచే చేయుచుందుము. వీని విశేషములు వినదలతునని ధర్మజుడడుగగా భీష్ముడిట్లు చెప్పెను. ప్రథమమున వీనిని శుక్రుడు బలికి, బలి మనువునకు, మనువు సువర్ణ మునికి సువర్ణుడు నారదునకును నుడివిరి. నారదుడు చెప్పగా భీష్ముడు వినిన ధర్మములివి.

పూవులు : ఓషధులమృతమయమైన ఉత్తమ వస్తువులు. అందు పూలు గలిగినవి మేలు. పూవులతో పూజమనుజులకు మంచి మనసునిచ్చును. ఆ కారణమున పూవులకు సుమనము అను పేరు వచ్చినది. అట్టి పూజలొనర్చు వారి కోర్కెలు దేవతలు మంచిమనస్సుతో తీర్తురుగాన దేవతలకు సుమనస్కులను పేరు వచ్చినది. ముళ్ళులేని చెట్టున సుగంధములు తెలుపురంగు గల పూవుల పూజలు సురలకిష్టము. నీటియందు బుట్టిన పూలు యక్షులకిష్టము. తామర జాజులు తులసీ దళములు దేవతలకు సంతోషమొసగును.

ముండ్ల చెట్టునకు పూసినవి, ఎఱ్ఱనివి, చేదు వాసనగల పూవులను అధర్వ మంత్రములతో శత్రువుల నిర్జించుటకు హోమ పూజలు సేయుదురు.

తీక్ష్ణములు వెగటువాసనగల పూవులు భూత రక్షోగణములకు తృప్తి నిచ్చును. మంచి రంగు పరిమళము తీయన గల పూవులు మనుజులకిష్టము.

దేవాలయమున, శ్మశానమున పూయు పూవులు, వివాహములు శాంతిక పౌష్టిక పూజలకు స్త్రీల శిరోజాలంకారములకును వాడరాదు.

పూవుల వాసన వలన దేవతలు, వానిని చూచుట వలన యక్షులు, వానిని అనుభవమువలన సర్పములు, ఈ మూడు గుణముల వలన మనుజులకును సంతృప్తి.

పూవుల పూజలవలన దేవతలు తృప్తిపడి నరులకు మేలు సేయుదురు. వారి కోర్కెలను ఫలింపజేయుదురు.

ధూపదానము : అందుగు చెట్లనుండి వచ్చు జిగురు ధూపము దేవతలకు తృప్తి. అంతకంటె గుగ్గిలము మేలు. అగరు చందనము గంధర్వయక్ష నాగులకు ప్రియము. వీని యన్నిటికన్న కర్పూర ధూపమధిక ఫల ప్రదము.

మధురగంధము గల ధూపము దేవతలకు, వెగటుకలిగించునది యక్షులకు తీక్ష్ణమైనది. రక్షస్సులకు వారి సంబంధముగలవారికిని ఇష్టము. ఈ విధముగు ధూపములచే కర్తకు పరమ పుష్టి ఆయువు దేవత లిచ్చెదరు. యక్ష రక్షోరగగంధర్వులును కోరిక లిత్తురు.

**దీపదానము** :- దేవతార్చన సమయమున నిచ్చుచో తమోగుణులగు భూత ప్రేత రక్షస్సులణగి దూరమేగుదురు. దీపదానము ఆలోకన దానమనబడును. కర్తకు ధర్మవిచక్షణ శీలమలవడును. దీప దానమున ప్రకాశము దృఢముగ నుండ వలయును. వత్తికి నేయి తక్కువయి కాంతి తగ్గినచో మరల మరల నేయి పోయ వలెను. రాజమార్గమునందు, సభలో, కొండపై, గుడి వెలుపల లోపల దీపమిడు వానికి ఐశ్వర్య సంపద లభించును.

దీపమునకు ఆవులనేయి శ్రేష్ఠము. గేదె మేక పాలనుండి వచ్చిన నేయి మధ్యమము, అస్థిమాంసముల రసము నింద్యము అన్వర్థము. దీపదానము, దేవతా పూజయే. దాతకు జ్యోతిర్లోక యోగము కులాభివృద్ధియు కలుగును.

**నైవేద్యము** :- చేసిన వానిలో ముఖ్యమగు మొదటి భాగము దేవతలకు నైవేద్యమిడి తరువాతనే తాను భుజింప వలెను. అట్లు చేయని వాడు రాక్షసుడు. పూజ చేయువాడు, నువుల చలిమిడి, పాలు, పెరుగు బలిగా నీయ గలిగినచో దేవతలు మిగుల సంతోషింతురు. ఇల వేల్పులకు నిత్య నైవేద్యము శుభ ప్రదము. అట్లు చేయనివాని యత్నములు వ్యర్థములు. రక్తమాంస పిండములు ఎఱ్ఱని రంగు అన్నము కల్లు బలి యిచ్చినచో సర్ప యక్షరాక్షస భూతములకు ప్రియమొసగును. నైవేద్యమిడిన వస్తువుయొక్క సౌమ్యా సౌమ్య గుణములను బట్టి ఫలితములుండును. ఉత్తమమైన నైవేద్య దాతకు బుద్ధి, బలము ప్రజాదరణ జ్ఞాన నిష్ఠ, శత్రు నిగ్రహ శక్తి కలుగును.

## ధూపదీప నైవేద్య విశేషము - నహుషుని చరిత్ర

నహుషుడను రాజు చాల సద్గుణవంతుడు. అతిశయమేమియు లేక ప్రజలను దయతో పాలించి దేవతలకు పితరులకు సాత్త్వికులగు విప్రులకు యథావిధి తర్పణములు, అర్చనలు, ధూపదీప నైవేద్యము లర్పించుచు, యక్షరాక్షస భూత గణములకును తగిన రీతి పూజలిచ్చుచుండువాడు. తాను చేయు దేవ పితృ పూజాదికముల ఫలముగ దేవేంద్ర పదము నందియు తన పూజలు మఱవక చేయు

చుండుకతన అతని పుణ్యాధికఫలముగ మునులు మోయు పల్లకి నెక్కి ఉత్తమ పదమునందెను. రాజు లెవ్వరికిని లభ్యము కాని ఉన్నత పదవి తనకబ్బెనని గర్వమునంది దుర్వర్తనుడగుటచే ముని శాపమున పెద్ద కొండ చిలువ రూపమంది ఒకగోతిలో పడి తన దుస్థితికి దుఃఖించుచుండెను. అతని దైన్యమునకు సదయుడై మున్ను శపించిన ముని వరుడే నహుషునికి శాపవిముక్తి కల్గించెను. సద్బుద్ధి గలిగి మరల యథావిధి భక్తితో పూజలు దానము లొనర్చుకతన నహుషుడు అమరలోకముకేగి సర్వ సుఖములందెను.

## బ్రాహ్మణ ధనాపహరణము

అన్ని పాపములలోను విప్రుని ధనము వంచనజేసి అపహరించుట మహా పాపము. దానికి ఫలము కులనాశనము నీచ జన్మయును. దీనికి నిదర్శనముగ నొక యితి హాసమును భీష్ముడు వచించెను.

విప్రుని పొలములు స్థలములనుండి ఒక మట్టి రేణువును తీసికొనినను మహా పాపమే. కడు దీనుడై యున్న నీచ జన్ముడొకడు ప్రక్కనున్న విప్రక్షేత్రమునకు దూరముగ చనుచుండుట జూచి క్షత్రబంధుడను రాజు ఇట్లేల దూరము పోదువని అడుగ అతడు తన కథను ఆ నృపతికిట్లు చెప్పెను. పూర్వ జన్మమున నేనొక విప్ర కుమారుడనే. బ్రహ్మ చర్యము భిక్షుకాది వర్తనములు పాటించువాడను. ఒక నాడు నేను భిక్షు కాన్నమును గంగాతీరమున తినుచుండ ప్రక్కనున్న విప్రక్షేత్ర మునుండి ధూళి యెగిరి వచ్చినా అన్నమున దట్టముగ పడినది దానిని తింటిని. ఆ పాపము వలన నాకీ దుర్జన్మ వచ్చినది. అని విచారించుచు నుడివెను. అందుచే తాను బ్రాహ్మణ భూమిని త్రొక్క కుండ చను చుండుట చెప్పెను. అతడు మృతుడయి తొల్లిటి సత్కర్మ ఫలమున ఊర్ధ్వలోకములకేగెను.

## స్వర్గలోక ప్రకారము

ఏక విధమా, బహు విధములా అని ధర్మజుడడుగగా భీష్ముడిట్లు నుడివెను.

పుణ్య కర్మము లనేకవిధములు. అట్లే పుణ్య ఫలములనేకములుగా కర్మములననుసరించి యుండును. అవియన్నియు దుఃఖరహితములు సుఖ ప్రదములును. ఇందులకు నిదర్శనముగ గౌతమ మునీంద్రునకు ఇంద్రునకు జరిగిన సంభాషణము వినుము అని నుడివెను.

గౌతముడను విప్రుడొకడు వనమున తపస్సు చేసి కొనుచు ఒకచోట తల్లిలేని ఏనుగు పిల్లను చూచి దయతో దానిని తన యాశ్రమమున బెంచుచుండెను. అది పెరిగి పెద్దదైనది. ఇంద్రుడాదేశపు రాజైన ధృత రాష్ట్రుని వేషమున వచ్చి ఆ మునిని జూచి ఏనుగును తనకిమ్మని అడిగెను. దానికి బదులు వేయి గోవులు కోటి ధనము ఇచ్చెదనని కూడ ఆశ జూపెను. నాకీ ఏనుగు సమిధలు తెచ్చియిచ్చును. నేను లేనపుడు నా ఆశ్రమమును కావలి కాచును, చిన్న పిల్లనాటి నుండియుదీనినాప్యాయముగ పెంచుచుంటిని. నీ గోవులు ధనము నాకక్కరలేదు. నీకీయజాలనని ముని నుడివెను.

మరల ఆరాజు ఓ విప్రవర్యా, ఇంతపెద్ద ఏనుగును పెంచుట అంతకంతకు నీకు కష్టము. నాకు వాహనము ఏనుగే గదా. లేదనక ఇమ్మనెను.

గౌతముడు : సరే ఇచ్చెదను. మంచిప్రదేశమున ఈయవలెను. నీవు ధర్మాత్ముడైన యముని సదనమునకు రమ్ము అచట నిచ్చెదననెను.

ఇంద్రుడు : అదినాస్తికులకు పాపాత్ములకు నెలవు నేనురాను.

గౌతముడు : మందాకిని తలమునకు రమ్ము అచట ఇచ్చెదను.

ఇంద్రుడు : అతిథి శిష్టాన్నభోజులు, అప్రతిగ్రహులు అచట నుందురు. నాకు కుదరదు.

గౌతముడు : మేరు పర్వతము వద్దకు రమ్ము ఏనుగును తీసికొమ్ము.

ఇంద్రుడు : సత్యవచస్కులు, మృదుభాషణులు, సదయులు, భూతహితులు అందేగుదురు. వేరొక మంచిచోటు చెప్పుము.

గౌతముడు : నారదముని విహారస్థలము నీకిష్టమా. అచటికి రమ్ము.

ఇంద్రుడు : సంగీత నృత్యముల నేర్పరులందరు అచటికి వత్తురు. నాకుకుదరదు.

గౌతముడు : ఉత్తర కురుభూములు దేవతలకిష్టము. అందు ఇంద్రుడు సర్వ వాంఛలు తీర్చును. అటకురమ్ము ఏనుగునిచ్చెదను.

ఇంద్రుడు : అదియు అనుకూలము కాదు. కామము హింస లేనివారే అందు పోగలరు. నేనెట్లు రాగలను.

గౌతముడు : చంద్రుని భవనమునందిచ్చెదను వచ్చెదరా

ఇంద్రుడు : అచ్చటికి దానదాతలు, పుచ్చుకొనుటకిష్టములేనివారు అచట నుందురు. ఆ చోటు నాకు అనుకూలము కాదు.

గౌతముడు : రవి యింటిదగ్గర తమకిష్టమా రండు పోదము.

ఇంద్రుడు : వలదు, అచ్చట నందరు వేదాధ్యయనపరులే.

గౌతముడు : వరుణుని పురము తమకనుకూలమా

ఇంద్రుడు : కాదు అచటికేగు వారందరును యజ్ఞ కార్య తత్పరులే.

గౌతముడు : ఇంద్రుని కడ మర్త్యులనేకులుందురు. అటకు పోదమా

ఇంద్రుడు : అచట శూరులకు జ్ఞానులకు, యజ్ఞకర్తలకు నెలవు నేను రాను.

గౌతముడు : ప్రాజాపత్యలోకమున నీ యేనుగును తీసికొమ్ము.

ఇంద్రుడు : అది అశ్వమేధ యాగకర్తలచోటు. అటకు పోవలదు.

గౌతముడు : అయితే గోలోకమున్నది. అచటికి పోదము.

ఇంద్రుడు : అదిమాత్రము నాకేల, తీర్థయాత్రా పరులు గోదాన నిరతులు బ్రహ్మ చారులు పోవు ప్రదేశము. నాకది హితము కాదు.

గౌతముడు : బ్రహ్మలోకము పరమ ప్రశాంతము సుఖదుఃఖములు లేనిచోటు అటకు రమ్ము రాజవర్యా. ఈ మేటి యేనుగును తీసికొని పొమ్ము.

ఇంద్రుడు : అదియును హితము కాదు. అది విరాగులు, అధ్యాత్మ నిరతులేగు స్థలము నాకేల

గౌతముడు : ఓహో! ఇన్నివిధములుగా వచ్చితివి. నీవు ఇంద్రుడవని నేను గ్రహించితిని నాకు పుత్రుని వంటివాడు ఈ అడవి ఏనుగు నీ కెందులకు నావద్దనే ఉండనిమ్ము.

ఇంద్రుడు : మునీంద్రా నిజము, నేనింద్రుడను నన్ను దాచెదనన్నచో ఎవరికిని తెలియకుండ దాగగలను. నీవు అత్యుత్తమ బోధకలవాడవు గాన తెలిసికొన్నావు. ఈ జంతువునెడల నీకు గల ప్రేమకు మిగుల సంత సించితిని. ప్రతిదినము నీకు సాగిలి మ్రొక్కు, ఈ యేనుగు ధన్యుడు శాశ్వత సుఖసంపదలిచ్చు స్వర్గలోక నివాసము నీకునునీ పుత్రుడీ ఏనుగునకు నిచ్చుచున్నాను రండు.

ఏనుగు ముందుగా నడువ తరువాత గౌతముడు తానును ఇంద్రలోకము నకు జనెను. వారిని జూచి ఇంద్రుడును సమ్మోద భరితుడయ్యెను.

## తపస్సు ధర్మము

తాతా! ధర్మములకు సారము తపమని చెప్పితివి. దానికన్న అధికము లేదా! అని ధర్మజుడడుగగా భీష్ముడు చెప్పిన ఇతిహాసము.

ధర్మములన్నియు సత్క్రతులే. తపము అనగా కడుమితమైన భోజనము. ఒకనాడు తన సభకు వచ్చిన భగీరథుని జూచి బ్రహ్మ ఓరాజా! నిర్మల తపశ్శాలులే ఇచ్చటకు రాగలరు. నీవెట్లు వచ్చితివని అడుగగా, భగీరథుడు, దేవా నేను గో భూ కన్యకాదానము లెన్నో చేసితిని. అశ్వమేధాది యాగము లొనర్చితిని. నేనిటకు రాగల్గుట కదిగాదు కారణము బ్రాహ్మణులొకప్పుడొక క్రతువు చేయుచుండ ఎన్నో విఘాతములు పొడసూపినవి. నేను వాటిని తొలగజేసితిని అందులకు వారు సంత సించి బ్రహ్మలోక ప్రాప్తినిచ్చిరి. ఆకలిదప్పులను లెక్కచేయక నేను వారి పని నిర్వ హించితిని. మితభోజనము దక్క తపమువేరు గాదు కదా. ఆ వృత్తాంతము విని సంతుష్టాంతరంగుడై భగీరథునకు బ్రహ్మ తగిన మర్యాదలొనర్చెను. ధర్మరాజా నీవును విప్రులకు సేవ ఆ విధముగా సేయుమని భీష్ముడు నుడివెను.

## పూర్ణాయువు అల్పాయువు

ధర్మరాజు భీష్ముని జూచి తాతా! పురుషుడు శతాయువని శాస్త్రము వచించును, కొందరు బాల్యముననే మృతి జెందుదురేమి కారణముచే నని యడుగగా భీష్ముడు ఇట్లు నుడివె. ధర్మజా! మనుజుని ఆయువు అతని ఆచారమును పట్టి యుండును. వర్ణాశ్రమ సదాచారము కలవానికి చిరాయువే కాదు సంపద, కీర్తి యు గూడ లభించును. దురాచారములు గలవానికి దీర్ఘాయువు లభింపదు. గురు వును లెక్క గొనకుండుట, ఉదయాస్తమయముల సూర్యుని చూచుట వలన ఆయువు క్షీణించును. క్రోధము హింస అనృతము లేని వానికే చిరాయువగును. సంధ్యలందైనను అపరాహ్ణమైనను సుర పూజనము చిరాయుఃప్రదము. పరకాం తాభిలాష ఆయుక్షీణము. మహా పాపము. ఈ నుడివిన గుణములు మంచి చెడ్డ లను బట్టి ఆయువును పెంచుట, త్రుంచుట చేయును. చేయరాని పని అలవడి పిదప పశ్చాత్తాపమున మానినచో ఆయుర్వృద్ధియే.

దేవాలయములందు, వీధులలో, గోశాలలందు సస్యములందును మల మూత్ర విసర్జన పనికిరాదు. భోజనము తూర్పుమొగమై చేయుట మంచిది. నిలిచి తినుట మంచిది కాదు. నిలిచి మూత్రము విడుచుట చెడ్డపని. ఎంగిలి చేతితో

చంద్రార్కుల చూడరాదు, అగ్నిని ఆవును బ్రాహ్మణుని ముట్టరాదు. అట్లే కూరు చున్న పీటను, మంచినీటి పాత్రను ముట్టుకొనరాదు.

బాలుడు భయపడునట్లు చూచుచు వచ్చు వృద్ధునకు బాలుడు నమస్కారములర్పించె నేని వృద్ధుడు ప్రసన్నుడై ఆ భయము తగ్గును.

చదువుకొనునపుడు నిద్ర, శిరము గోకుట తగదు. రెండు చేతులతో శరీరమునకు నూనె వ్రాయుట తగదు.

గురునితో వైరము తగదు. అతడు కోపించినను అది పోవునట్లు చేయుట మేలు. గురువుతో అనృత మాడుట ఆయుక్షీణము.

మార్గమున బోవునపుడు విప్రగో బ్రాహ్మణులకు దుర్బలులకు గర్భిణులకు త్రోవ నీయవలయును.

శుభ కార్య సమయములందు విప్రునకు, పూయకుండ కాయు చెట్టునకు (అశ్వత్థము మొదలైనవి) ప్రదక్షిణము చేసి వెళ్ళవలయు.

పౌర్ణమి అమావాస్యలు, చతుర్దశి, జన్మతిథులు, సూర్య వసుతిథుల యందు భార్యాసంగమము వలదు.

పాదములు ఒక దానితో నొకటి తోమగూడదు.

దంతధావనము, మూత్ర పురీషములు వదలు నపుడు మాటలాడరాదు.

మునుముందు తండ్రికి, తరువాత గురువులకు మ్రొక్కవలయు.

గర్భిణీ సంభోగము దోషము. వివాహమునకు ముందు సంభోగము దోషము. ఇది ప్రాయశ్చిత్తము వలన నశించును.

నిదురలోనున్నపుడు తల పడమర, ఉత్తరము పనికిరాదు. పక్క శుభ్రముగ చిరుగు బట్టలు లేకుండ వలెను.

పూవులయందు తెల్లనివి పసుపు రంగువి ధరింపదగినవి.

రాత్రులందు స్నానము కూడదు.

స్నానమునకు ముందు చందనము మున్నగునవి పూయరాదు.

తడిగానున్న బట్టను విదులుపరాదు. ఒకరు కట్టివిడిచిన బట్ట కట్టరాదు. బట్ట మాసినదను తలపుతో మడత మార్చి కట్టరాదు.

మఱ్ఱి, రావి, మేడిచెట్ల పండ్లు కాయలు తినరాదు.

ఆవు మేక నెమిళుల మాంసములు తినరాదు. అన్యులు చూచినవి, వాసన

చూచినవి పదార్థములు తినరాదు. ఆహారమును నిందింపరాదు. భుజించునపుడు అన్య చిత్తము పనికిరాదు. పదార్థములు ఒక మొత్తముగా చేసి తినుటయు దోషము.

ఉప్పును చేతితో తీసికొని నమలుట తప్పు. రాతి పయి నుంచిన ఉప్పు మంచిదికాదు. రాత్రి పెరుగుతో తినుటయు పేలపిండి తినుటయు మంచిది కాదు. మనము తినునప్పుడు చూచుచున్నవారికి పెట్టకుండ తినుట దోషము. మన పంక్తిని గూర్చున్న బంధువులకు వేఱొక్క రీతిగ పెట్టరాదు. మనము తినగా మిగిలిన ఎంగిలి ఆహారము మరియొకరికి పెట్టరాదు.

చిటికెన వ్రేలు మొదలు, తక్కిన వ్రేళ్ళకొనలు దేవఋషి తీర్థములందురు. పితృ తర్పణముజలము బొటన వ్రేలు చూపుడు వ్రేలు మధ్యనుండి విడువలయును. ఆచమన పూర్వకముగ చేయుతర్పణసమయమున క్రోధముగాని పరుష వాక్యములు గాని పనికిరావు.

పగటి వేళ స్త్రీ సంభోగము కూడదు. నగ్న స్త్రీని చూడరాదు. చెడిన స్త్రీ సంగతి పనికిరాదు.

ఉమ్మువేసినయపుడు తుమ్మిన యపుడును ఆచమనము చేయవలెను. అది కుదరని యెడల ఓం మంత్రము స్మరించి కుడిచెవి ముట్టుకొనినచో శుచియగును. పేదయైన సోదరికి, గురువునకు, మిత్రునకు, పండితునకు బందుగునకు తన యింటి యందు ప్రియముగ ఆశ్రయమిచ్చుట ఆయువు, సిరి యిచ్చును. పావురములు చిలుకలు గోరువంకలు, పూదీవలు బంగరుతో జేసిన పరికరములు గృహమునకు మంగళ ప్రదములు. గువ్వ పిట్ట, గ్రద్ద, గుడ్లగూబ, దీపము నార్పు పురుగు ఇంటిమీద వ్రాలుట కీడు.

సంధ్యలందు చదువుట, తినుట మంచిదికాదు. రాత్రి వేళ పితృకార్యములు చేయగూడదు.

కుల రూప శీలములు చూచి వరించి పెండ్లాడిన కన్యయందుదయించు సంతతితో గూడి చేసిన దేవ పితృ పూజలు హితకరములు.

తూర్పు దిక్కు- ఉత్తరపు దిక్కు- దేనికైనను మంచిది. నక్షత్రము తిథి వారము పురోహితులెఱిగించిన మంచిదినముల క్షౌరముతలంటు చేయవలయు. పితృ శ్రాద్ధమున, సపిండీకరణము సంవత్సరాంత శ్రాద్ధము భోజనము వర్జనీయము. పిలువక విందునకు పోరాదు. తల్లి దండ్రులు సుతులకు నెమ్మదిగ హితము జెప్ప దగినవారు. చెప్పిన పనులును చేయదగినవిగా నుండవలెను.

వర్ణాశ్రమ ధర్మములు ఆయుర్వృద్ధి కరములు గాన మరల చెప్పుచున్నాను వినుము. క్షత్రియునకు రథ గజ తురగములనెక్కి నడిపించు నైపుణి ఉండవలెను. ఆయుధాభ్యాసము యుద్ధ తంత్రము నేర్వవలయును. దండనీతి మొదలగు పద్ధతులు గాంధర్వ వివాహవిశేషము కామ శాస్త్రము మున్నగు శాస్త్రముల అధ్యయనము, ధర్మ విధి ప్రజలను రక్షించు పాటవము, క్రతువు లొనర్చుట నేర్వవలయును.

రజస్వలస్త్రీతో సంగమము దోషము, ఋతుస్నాతయిన సతిని నాల్గవ దినమున రాత్రియందే పొందదగును. అయిదవదినమున ఆడ శిశువు ఆరవ దినమున పొందిన పుత్రుడు కల్గుదురు. ఇట్లే పదునారు దినముల వరకు సరిదినముల సంగతి పురుషుడును బేసి దినముల సంగతిని స్త్రీ శిశువు కలుగును.

ధర్మమునకాచారము మూలము. ధర్మము వలన ఆయుర్వృద్ధి యశము సంపద కలుగును. అన్ని ఆచారములలో అఖిల భూతములందు దయ గలిగి యుండుట అధికతరమ్మైనది. ఎల్లరయందు ఎల్లరు దయను కలిగి యుండుట ఆయు శ్రీ ప్రదము.

## సోదరుల మధ్య అన్యోన్యత

ఆయు శ్రీవృద్ధి కరమగు ఆచారములను వినిన ధర్మజుడు సోదరులమధ్య అన్యోన్యత ఎట్లుండవలయుననగా భీష్ముడిట్లు నుడివెను.

అన్నగారియందు తమ్ములకు భయభక్తులు, తమ్ములయందు అన్నలకు అనురాగము సంపదలకు నెలవు. పెద్ద అయిన వానికి కార్య జ్ఞానము లేనిచో తమ్ములకు చిక్కులగును. ఉన్న ఆస్తిని అన్యోన్యము సమ్మతితో పంచుకొని అనుభవించుట మేలు. ప్రజలు సంతసింతురు. అన్యాయముగ ఎవరైన ఎక్కువ భాగము తీసికొనజూచినచో ప్రాణానికే చేటు. మనము కౌరవులవల్ల పడినపాట్లు అవియే కదా. తండ్రి తరువాత అన్నగారే తండ్రి, తల్లి తరువాత వదినగారే తల్లి. అన్నదమ్ములలో ఎవరైనను తక్కినవారికి కీడొనరింపజూచినచో దండనార్హుడగును.

అప్పగారు తల్లితో సమానము. చనుబాలిచ్చి పెంచిన తన్వి తల్లితో సమము.

ఉపాధ్యాయునకన్న తండ్రి పదిరెట్లు అధికుడు. తండ్రి కన్న పది రెట్లు తల్లి అధికము.

జననీ జనకుల వలన జన్మము కలుగును. ఆచార్యుని వలన అజరా మరమ్మైన స్థితి కలుగును. అందుచే గురువు గౌరవనీయుడు సర్వాధికుడు.

## ఉపవాసవిధి

బ్రాహ్మణులకును క్షత్రియులకును ఉపవాసవిధి యున్నది. అన్యులకును ఇది చెల్లునా అని ధర్మజుడడుగగా భీష్ముని సమాధానము.

ధర్మజా అంగీరసుడు నుడువగా నేనిది వింటిని. నీకది చెప్పెదను వినుము. మూడు రాత్రులు బ్రాహ్మణ క్షత్రియులకు తగిన విధి. శరీరమునకు బాధ కలుగకుండ మాత్రమే అంతకన్న ఎక్కువ చేయగలిగినచో చేయవచ్చును. వైశ్య శూద్రులకు నాలుగు పూటల ఉపవాసముకన్న ఎక్కువ తగదు. పౌర్ణమిని శుక్లపక్ష అష్టమి చతుర్దశల రెండు పక్షములవచ్చు పంచమి షష్ఠి దినముల ఉపవాసము మంచిది. దినమున కొక్కమారే భుజించునుపవాస వ్రతము ఒక మాసము సల్పిన శుభ ప్రదము. ఒక యేడు సల్పిన సకల శుభములు సత్సంతతి కలుగును. దినము విడచి దినముపవాస వ్రతము కడుమేలు. ఎంత నిష్ఠ యున్నను మాసములో ముఖ్యమైన దినముల యందే ఉపవాస వ్రతము సకల ప్రయోజనకరము. యోగము చేతను, పురుషుని మహానుభావ విశేషమున ఉపవాసము ఎక్కువ కాలము చేసినను అత్యంత ఫల ప్రదము. తల్లి, వేదము, ధర్మము వీనిని మించిన శాస్త్ర లాభములు లేవు. ఉపవాస వ్రతము కన్న తపములేదు.

ఉపవాస వ్రతము వలన దేవతలు మునులు మహాలాభము నందిరి. ఉపవాసము శరీరమునకు మనస్సునకు మంచిది. వేయి వత్సరములు ఏక భుక్తముగా నుండియే విశ్వామిత్రుడు బ్రాహ్మణత్వమునందెను. ఈ వ్రతము వలన పక్షి జంతువుల భాషలను వినవచ్చును. ఉపవాస వ్రతమువలన ఐహిక సుఖము పరలోక సౌఖ్యమును లభించును.

## పుణ్య కర్మము

పుణ్యప్రదమైన యజ్ఞము నొనరించి శుభములందుట ధన ధాన్యములు సంపదలు, పరివారముగల వారికే శక్యము. తక్కిన పేదవారికి అట్టి పుణ్య కర్మ ఉన్నదా అను ప్రశ్నకు భీష్ముడిట్లనియెను.

ధర్మజా, సంపన్నులుగాని సామాన్యులకే గదా అంగిరసుడుపవాస వ్రతము పదేశించెను. ఉపవాసము నీకును ఆయాసముగనున్నడేని దీని యందు గల సులభ పద్ధతి నుడివెద వినుము. రెండు పూటలు భుజించి తుష్టిగ నీరము త్రావి మధ్య మధ్య మరలనేమియు తినక హోమ విధి నెరవేర్చుచో సద్గతులు గలుగును. ఇదియు కష్టమైనచో అంగిరసుడు చెప్పిన పద్ధతి ననుసరించుట ఉపయుక్తము.

## ఆధ్యాత్మిక విద్యా ప్రకారము హరసనత్కుమార సంభాషణ

ఉపవాస వ్రతానుష్ఠానము వినిన ధర్మజుడు, గంగానందనా, శ్రీకృష్ణునెఱిగి యున్నచో సకల ధర్మము లెఱిగి యున్నయట్లేనని వ్యాసుడు శిష్యులకు జెప్పెను. ఆ విషయము నాకెఱిగింపుమనగా భీష్ముడిట్లు చెప్పెను.

ఒకనాడు శివుడే సనత్కుమారుని వద్దకేతెంచి, మునీంద్రా, ధ్యాన ఫలంబుగ ఏయది దర్శింపదగును. సాంఖ్య తత్త్వము యోగము అననెట్టివి అని అడుగగా ఆ మునీంద్రుడిట్లు చెప్పెను.

తత్త్వములనునవి ఇరువది మూడు, ఇరువది నాల్గు, ఇరువది యైదు అని కూడ చెప్పుదురు. తత్త్వములు ఇరువది మూడు అనువారు ప్రాకృతులు. మనస్సు బుద్ధి రెంటిని ఒకటిగానే భావింతురు. ఇరువది నాల్గు అను వారలు వానిని వేరుగనే జూతురు. ఇరువది యైదవది, అన్నిటికిని విలసనమునిచ్చి తనయందు లీనమగునట్లు జేయును గాన అవియన్నియు ఉన్నను లేనియట్లే.

**ఇరువది నాల్గు తత్త్వములు :** పంచ భూతములు 5, వాని గుణములు 5 కర్మజ్ఞాన ఇంద్రియములు 10 మనస్సు, బుద్ధి, అహంకారము, ప్రకృతి మొత్తము 24. వీనిని అధిష్ఠించి యుండు తత్త్వము వినుము. కర్ర యందున అగ్ని యున్నట్లు పురుషుడుండును. అతడే తానుగ అనుకొనగలిగిన వానికే అది తెలియును. తపో నిష్ఠ కలిగినను, రాగద్వేషముగల మానవులు దానిని తెలియలేరు. అన్ని తత్త్వములకు అధిష్ఠానము, ఈశ్వరమయిన అమృతార్థ తత్త్వము. దానిని చూడగలిగినట్లయిన మృత్యువును దాటినట్లే. అన్ని తత్త్వములకు సృష్టి లయములందును వానిని తప్పించుకొనినచో బ్రహ్మమును కలియుట ఏకత్వమొందుట. ఉత్తమ శ్రద్ధ ఏకాగ్ర చిత్తము వేదవిద్య ఇంద్రియ జయము లేకున్నచో ఈ యేకత రాదు. తరువాత అధ్యాత్మ అధిభూతము అధిదైవతము గూర్చి నీకుమున్నే చెప్పితిని. అయినను వినుమని అంగిరసుడు శివునకిట్లు చెప్పెను. దేవగంధర్వాదులకైనను అన్నిటికిని అధిష్ఠానమైన తేజమును కనుగొనుట అసాధ్యము. అధ్యాత్మమున్నగునవి జంతువులకన్నిటికి సామాన్యము. వానిని తెలిసి కొనుటవే గొప్ప. ఓంకార వాచ్యమైన బ్రహ్మమునెఱుగుట సామాన్యము కాదు. అహంకారము లేని చిత్తశుద్ధిచే ధ్యానింపదగినది. ద్వంద్వాతీతము. నారాయణునకే విదితము. ఆ దేవుని వలననే సుర ఋషీంద్రాదులకు సుబోధకమైనది. ఆతత్త్వము బంధముక్తునకే గోచరము. ఇంద్రియములు మనస్సుబుద్ధి అహంకారము నశించినపుడే పరతత్త్వమునందతడు లీనమగును.

భూతములన్నియు అణగినవెనుక తనను తాను తెలిసికొనగలిగిన జ్ఞానమే ఆ తత్త్వమునకు అనుకూలమైనది.

## దేహాంతర్గత దైవతములు

ఈ వివరములను సనత్కుమారుడు శంభునకు చెప్పెను.

జిహ్వయందు చంద్రుడు, వాక్కునందు అగ్ని, ప్రాణమున వాయువు, ఉదానమున మెరుపులు, వ్యానమున మేఘము, స్తన ప్రదేశమున ఆకాశము, బల మునందు విశ్వామిత్రుడు, మనస్సున శివుడు, అపానమున బుద్ధి, సమానమున కుబేరుడు, అప్సరసలు, కనులందు సూర్యుడు, దేహమున భూమి, పాదముల పర్వతము, చెవియందు దిక్కులు, ఉపస్థమున ప్రజాపతి, బుద్ధి యందు బ్రహ్మ.

వీనియన్నింటిని తెలిసికొనదగిన అధిష్ఠాత ఆత్మ. యోగి తననిశ్చలనిష్ఠతో ఈ దైవత మూర్తులను కనుచు శీర్షస్థానమున ప్రాణములనిలుపును. అవ్యక్తము శ్రేష్ఠ మైన తత్త్వము నతడప్పుడు తెలిసికొనును. ఇవి ఆత్మదశలు. యోగులకు దక్క ఆ చివరి దశ అన్యులకెఱుక బడదు. ఇరువది యైదు తత్త్వముల పురుషుడతడు. నిశ్చలులయిన యతులే దానిని కోరుదురు. క్షరుడు అక్షరుడు పరుడు అతడే. ప్రకృతి సంగమెఱిగిన వాడు తనకు తానుగా ఆ తత్త్వమెఱిగి ఇరువది యైదు తత్త్వముల సంయుతుడతడు. వాక్కునకు గాని మనస్సునకు గాని అందదు. ప్రకృతి సంగమెఱిగిన వాడతడు. శంకరా! నీకీ తత్త్వమున గల మూ డవ స్థలను తెలియ జెప్పుట యతులకెల్లరకు తెలియజెప్పుటైనది.

ఇక మునిజనకర్మముల జెప్పుదును వినుడని సనత్కుమారుడిట్లు నుడివెను.

## మునుల కృత్యములు

వనమునందు గాని గుహయందుగాని, ఎవరు లేనిచోటగాని పద్మాసనా సీనుడై అన్యచింతలను మఱచి భగవత్ ధ్యానమున నుండును. గురూపదేశమున చరించును. ఆకలి దప్పులు మల మూత్ర విసర్జనము లాయనకుండవు. రుచి యైన ఆహారము కొరకు చూడడు. ఆహార సమయమున యోగము కుదరదు. మనశ్చలనములేని నిష్ఠ కావలయును. ఆ నిష్ఠ ఉన్నపుడే గాలికి కదలని దీపము వలె చిత్తము ఏకాగ్రము కాగలదు. హృదయస్థుడైన దేవుని దర్శించుటకు జనము, శబ్దము లేని స్థల మవసరము. జనులున్నచో సజ్జనులైనచో సమ్మతులే. అట్టి ధ్యాన రతులే గుణుడు నిర్గుణుడయిన తత్త్వమును చూడగల్గుదురు. ఆ తత్త్వమును

గని సర్వ సిద్ధులు పొందుటయే గాక చావు పుట్టుకలు లేని పదము నందుదురు. యక్ష గంధర్వాదులకంటె యోగులే తమ యిష్టమున వర్తింతురు. మేము నలువు రము సనక సనందన సనత్సుజాత సనత్కుమారులము ఇట్లుందుము. యోగ ధర్మము పరమ పద ప్రాప్తి కరము. ఇంత కంటె తత్త్వములేదు.

## సాంఖ్య యోగము

ఇంద్రియములకంటె మనస్సు, అంతకంటె అహంకారత్వము, దానికంటె బుద్ధి, బుద్ధి కంటె ప్రకృతి వీనన్నిటికంటెను పురుషుడధికము. పృథివ్యాది భూత ములు, గంధాదిగుణములు, జ్ఞాన కర్మేంద్రియములు మనము అహంకార బుద్ధులు ప్రకృతితో గలసి ఇరువది నాల్గు తత్త్వములు. చేతనము గల పురుషుని పొంది నిశ్చే తన ప్రకృతి చేతనత్వమునందును. ఇవన్నియు ఆ తత్త్వమునందలి భిన్న భాగ ములు, పురుషుడు నిర్గుణుడు, గుణ సంయుతమైన ప్రకృతియే తన గుణములు ఆ పురుషునకిచ్చును. ఇవియన్నియు అసత్తులు వీనిన్నిటిని ఉపేక్షించి, తనకు తానెవరో తెలిసికొనినపుడు పురుషుడు నిర్మల ప్రకాశవంతుడై వెలుగును. అట్లు గాక అహంకార భావముతో నున్న యెడల ప్రకృతి తానే యనుచు సృష్టిలయముల కర్తృత్వ భావ వికారము, ప్రకృతి వికృతులు లేని ప్రభువునకు అంటగట్టుటయే. అది ప్రకృతికి వశమై సుఖమతి అగుటే. ఆ సుఖ భావుకత వదలుకొనినపుడు ఇ ర్వదియైదు తత్త్వములు గల పురుషుడు షడ్వింశుడు ప్రసన్నాత్ముడు విమల మతియు నగును. సత్యము తత్త్వము నెఱిగిన నిస్సంగుడయి జ్ఞాన స్వరూపము నాతడు పొందును. వైవిధ్యము ఏకత్వము, విద్య అవిద్య కానివే ఇరువది యైదు అవస్థలు. వానియందు అనాసక్తుడు కేవలము ఆత్మ రూపుడు అయిన ఇరువది యారు తత్త్వముల వాడు. అతడే అచ్యుతుడు అనంతుడు. జ్ఞానాజ్ఞానములకు అతీతుడు. ఈ విధమగు సాంఖ్య యోగులకు కీడును తెలిసికొనగలుగు శక్తియు కావలెను. మృత్యువును జయించువారట్టి యోగులే.

ప్రకృతినుండి వేర్పాటు గలిగి, నిస్సంగత, అజరామర పదము నందిన జీవాత్మ పంచవింశుడు ఇరువది యారవ భావమును పొంది, నిరంజన శివస్వ రూపము నందును. అదియే ముక్తి. ఈ సాంఖ్య యోగము కపిలుడు చెప్పినది. ఆతని శిష్యులు నా శిష్యులు గూడ దీనిని విని అభ్యసించి జ్ఞానులైరి. గర్గ గౌతమ కాత్యాయనాది మునులు దీనిని తెలిసికొని చరితార్థులైరి. విషయములతోడి సం గము బంధము. నిస్సంగత మోక్షము. అని నుడివి సనత్కుమారుడు గగనమున కెగసి చనెను. శివుడును ఆ మునీంద్రుని వలన ప్రబుద్ధుడై నిజనివాసమునకు జనెను.

## ఉత్తమ తీర్థము

ఎక్కువైన శుచిత్వము నిచ్చు ఉత్తమ తీర్థము ఎట్టిది అని ధర్మజుడడుగగా భీష్ముడిట్లు నుడివెను.

కుమారా తీర్థము లన్నియు మంచివే. ఎవరికైనను మనస్సు అనునది శ్రేష్ఠమైన తీర్థము. సుస్థిరతతో, ఇంద్రియములనణచి, రజోగుణమును నశింప జేసి సత్యము నెఱిగిన శమము తపము అహింసల వలన శుచియైన మనో వికాసమే ఉత్తమ తీర్థము. రిత్తయగు జలముల స్నానమాడుట వలన మేలు జరుగదు. లభించినది గదా అని దానిని కోరక, లభించిన దానియందు మమత్వములేని నిస్సంగులు శుచులు. వారికి తీర్థములేల? అన్ని తీర్థముల సిద్ధి అతనికి లభించును.

**ఉత్తమ పదమునిచ్చు వర్తనము ఎట్టిది మరణానంతరము జీవుడు ఎచటి కేగును అను ధర్మజుని ప్రశ్నలకు భీష్ముడిట్లు నుడివెను.**

ధర్మరాజా, నీవడిగినవి చాల రహస్యార్థములు కలవి. వీనిని బృహస్పతి యొక్కడే తెలియ జెప్పగల వాడు అను నంతలో ఇంద్రుని గురుడు బృహస్పతి యునచటి కేతెంచెను. అచటనున్న శ్రీకృష్ణుడు ధర్మజుడు తమ్ములు కొందరు రాజులు ఎల్లరును లేచి అమహాత్మునకు ప్రణామములాచరించి సుఖాసీనుంజేసి కుశల ప్రశ్నలయిన వెనుక, ధర్మజుని సంశయము విని బృహస్పతి యిట్లు నుడివెను.

బ్రతికినన్నాళ్ళను ఉత్తమ పథము ధర్మము. జీవితము ధర్మాయత్తము కావలెను. మరణించిన వారికి వారి ధర్మమే సహాయము. జన్మించినపుడు మనుజుడు తనకు దానువచ్చెను. మరణమునందును జననీ జనకులు బంధు మిత్రులు ఎవరును వెంట రారు. ధర్మము ఆచరించనివానికి నరకమే గతి. మఱియును కొన్ని విశేషములు వినుము.

**మృత దేహము విడచి పంచ భూతముల శక్తి, బుద్ధి అతని ధర్మములతో కలసి జీవుడు అరుగును.**

దేహ గతములగు పంచ భూతముల శక్తి, మనసు అని సంతృప్తి బొందిన నరునకు రేతస్సు జనించును. స్త్రీ సంగమమున నది గర్భత్వము నొందును. నరుని సుఖ దుఃఖములు పుణ్యా పాప ఫలితములు. సుఖము నిచ్చు ధర్మవర్తనమే మేలు. పాపాచరణగలవాడు, కృమి కీటక నీచ జంతు జన్మలుపొందును.

కర్మ విశేషము ఆ విధముగనుండును. పాపకర్మములనేక విధములు. గురువునకు, జననీ జనకులకును చేసిన కీడు వలన కలుగు దుఃఖము బాధలు ఇంతింతని

చెప్పలేము. అవి అనుభవించవలసినదే. ఇతరులకు చేసిన కీడును ప్రాయశ్చిత్తము వలన కొంత తప్పించుకొనవచ్చును.

## పాపకర్మములెట్టివనగా వినుము

ధాన్యమునపహరించుట, పరపురుషుని స్త్రీ నభిలషించుట. కన్యకను ఒకని కిచ్చిన మాట మార్చి అన్యునకిచ్చుట, దేవకార్యముతో బాటు పైతృకముచేయక పోవుట, అన్నను తిట్టుట, బ్రాహ్మణ స్త్రీని శూద్రుడు కవయుట, నిరాయుధుని జంపి ధనమునపహరించుట, స్త్రీని చంపుట, పండ్లు ఇనుము, బంగారము వెండి అపహరించుట, వస్త్రములు దొంగిలించుట, నమ్మికుదువ యుంచిన సొమ్మును అపహరించుట, సుగంధ వస్తువులను దొంగిలించుట, ఇవి మహా పాపములు వీనిని చేయువారు నీచ పక్షి జంతువుగనో, పురుగుగనో, ఎలుక చుంచు మున్నగు జీవులు గనో పుట్టి దుఃఖమనుభవింతురు. స్త్రీలు చేసినను ఈ పాప శిక్ష ననుభవించవలసినదే.

## పాపములను పోగొట్టు విధము

దానముల వలన పాపము పోవును. అన్నదానము అధికము. న్యాయార్జితమగు అన్నము వేయి మంది విప్రులకు బెట్టిన పాపములు తొలగును. బిచ్చమెత్తుకొనియైన ఆకలిగొన్న విప్రునకు భోజనమిడుట సద్గతులిడును.

వేద విద్య నొసగుట వలన విప్రుడు, భూదానమువలన క్షత్రియుడు పాపములను మాయింపగలరు. అన్యాయ వ్యాపారము జేసిన విప్రుడైనను, మోసమునసిరి తెచ్చుకొనిన శూద్రుడైనను అన్నదానము వలన ఉత్తమ గతులు పొందుదురు.

ధ్యానము, ఇంద్రియ నిగ్రహము, గురుపూజ, తపము, అహింస వీని యందేది ఆచరింపదగినది అని అడుగగా, ఇవి యన్నియు సత్ఫలములే. అహింస ఉత్తమ మైనదియు తక్కిన ధర్మములకు పవిత్రత నీయగలదనియు బృహస్పతి నుడివి, వారి సందేహములను తీర్చి దేవ నగరమున కేగెను.

## అహింసా స్వరూపము

ధర్మజునకు భీష్ముడు నుడివిన విధము

ఏనుగు యొక్క వెడల్పైన అడుగులో తక్కిన జంతువుల అడుగులు యిమిడి పోయినట్లే అహింసకు తక్కిన ధర్మము లన్నియు లోనగునవియే. అహింస నాలుగు

విధములు. ఏది తప్పినను అహింసా ధర్మము కుంటుపడినట్లే. మనసు, వాక్కు, కామము, హింస కారణమైన మాంస భక్షణము నాలుగు తెఱగులు. మాంసము తినుట హింసతో గూడినది కనుక మాంస భక్షణము పాప భూయిష్ఠము. మాంసము రుచి మరిగినవాడు అందున్న పాపమెఱుగడు. పితృ దేవతలకు శ్రాద్ధంబున మాంసము ప్రియము గదా హింసలేక మాంసమెట్లు లభించును అని ధర్మజుడడుగగా, పితృ కార్య యజ్ఞములయందు వేదవిధి ననుసరించి చేసిన జంతువధ నింద్యము కాదు. మాంసము చవిగోరి చేసిన హింస పాపమని వేదములు నుడువును.

ఎండు కట్టె యందును ఱాతియందును మాంసముండునా! ప్రాణుల యందు గాక, తన నాలుక రుచికై ప్రాణులను చంపి వాని శరీరముల చీల్చు వారు తన శరీరమునకు కత్తిదెబ్బ తగిలిన యెట్లుండునో గ్రహింపవలయును. దయార్ద్ర చిత్తుడైన మానవుడు, ప్రాణి హింసమానును. అతడుత్తముడు. అఖిల భూతముల రక్షణ అతనికి కలుగును. స్వాయం భువమనువు చెప్పిన నీతి యిది. మాంసాహారము మానుట ఆయు శ్శ్రీకరము అని మార్కండేయాదులును నుడివిరి.

దానము ధర్మము తపము, యజ్ఞము అహింస యొక్క ఆకృతులే. మాంసాహారము వర్జించుట నూరేండ్ల తపముతో సమానము. బ్రహ్మలోక నివాసము మాంసము తినని వారికే లభించును గాని అన్యులకు గాదు. ఆషాఢముతో మొదలైన నాలుగు నెలలయినను మాంసము తినుట మానినచో సద్గతులు లభ్యమగును. సగరుడు నలుడు దిలీపుడు నృగుడు భగీరథుడు మున్నగు నృపులీ నాలుగు మాసములు మాంస భక్షణమాని నందుననే సద్గతులు బడసిరి.

తాతా నీవు చెప్పినది అంత సులభముగా నున్నచో జనులు ఆ నాల్గు మాసము లెట్లో గడపి సద్గతులు పొందరాదా. అదిమాని మాంసము నేల కోరు చున్నారు. అని ధర్మజుడడుగగా భీష్ముడు ఔను ధర్మజా, నీ వన్నది నిజమే కాని మాంసము తినమరిగిన వారు మానలేరు. మాంసము శరీరమునకు బలము పుష్టినొసగును. శాకాహారము లందా విశేషము లేదు. మాంసమును తినిన దోషము మహిత దానమున పోగొట్టుకొనవచ్చును.

రాజులకు వేట తప్పుగాదని అగస్త్యుడు నుడివిన ధర్మమే. జంతువును చంపవలెనను ఉత్సాహముగాని, కోపముగాని లేక క్రూర జంతువులను వేటాడుట నింద్యముగాదు. తన విక్రమముచే సంపాదించిన మాంసముతో దేవ పితృ గణంబులకు

ప్రీతి నొందించుట తప్పులేదు. కర్మములందు మాంసమును మానుట ఉత్తమము తన శరీరమును పోషించు కొనుటకు ఇతర ప్రాణిని చంపునంతటి పాపము మఱి లేదు. తనకెంత ప్రాణభయమో అన్యులకు పశుపక్ష్యాదులకు సమానముగనే ప్రాణ భయము ఉండునని తెలిసికొని మాంస భక్షణ మానుట అత్యుత్తమము. అట్టి దయామయునకు బ్రహ్మలోకము ఆటపట్టు, భూతములకు అభయమిచ్చిన అఖి ల భూతములు తనకు అభయమిచ్చును. ఇప్పుడు చెప్పినది అహింసా వ్రత ఫల మున కొద్ది భాగమే. ఇంకను ఎంతయినను చెప్పవచ్చును.

### యుద్ధమున మృతులయినవారి గతి

మహాత్మా భీష్మ మేమొనరించిన యుద్ధము నందు పెక్కు మంది మరణించిరి. వారి గతి యేమి? అని ధర్మజుడడుగగా భీష్ముడొక కథనిట్లు వినిపించెను.

వెనుకనుండి ఎద్దుల బండ్లు వేగముగా వచ్చుట జూచి అవి తన మీద పడునేమో యను భయమున ఒక పురుగు వీధి దాటుటకు పరుగిడుట జూచి వ్యాసమునీంద్రుడు ఎందుకిట్లు పరువిడుచున్నావు అని అడిగెను. ఆ పురుగు తన భయము చెప్పి చచ్చుటెందులకు బ్రతుకు పరమ సుఖము గదా యనెను. అది విని వ్యాసుడు, ఇంద్రియ సుఖములు పురుగులకునూ ఉండునా, దుఃఖ ప్రదమగు నీకీ పుట్టువెందుకు అని ప్రశ్నించెను. మునీంద్రా మనుజునకున్నట్లే పురుగుల కును ప్రాణ భీతి వాని వాని విధమున వానికిని కలదు. నా కథ వినుడని పురుగు చెప్పెను.

మునీంద్రా, నేను పూర్వ జన్మమున శూద్రుడను. ధనికుడను. ఆ ధన మంతయు వంచనలతో సంపాదించినదే. అందువలన పురువు పుట్టుక వచ్చెను. అతిథియై వచ్చిన ఒక విప్రునకు భోజనమిడి పూజించితిని. తల్లిని పూజించు వాడను. ఈ సుకృతములచే పూర్వజన్మ స్మృతి కలిగినది. మంచి కార్యములు మేలొనర్చునని తెలిసినది. నాపయి దయజూడుము మునివరా అనియెను. దయా మయుడు వ్యాసుడు కనికరించి ఆ పుర్వునకు నీచజన్మబాపి మనుష్య జన్మమిచ్చెను. నాలుగు వర్ణములందును వరుసగా జన్మించి సత్కార్మలొనరింపుమని యుపదేశిం చెను. ఆ కీటకమట్లే శూద్ర వైశ్య క్షత్రియ జన్మంబులంది, తన పూర్వ స్మృతి హేతువున, రాజ వేషము ధరించి పరివారమును వెంట నిడుకొని వ్యాసుని యాశ్ర మమునకేగి వినతుడై మ్రొక్కెను. వ్యాసుడతనికి సముచిత మర్యాదలు సలిపి యతని

సత్కర్మదీక్షకు సంతసించి, రాజా! నీకీ జన్మమున తపమొనరించుట సాగదు గాన, సమయము నెఱిగి గోవుల కొరకైనను విప్రుల కొరకైనను రణరంగముననైనను నీ ప్రావీణ్యము జూపి ప్రాణములిమ్ము. సద్గతులు కలుగునని చెప్పెను. వ్యాసర్షి ఉప దేశమును ఆ రాజవర్యుడు మనసార పాటించి బ్రాహ్మణ జన్మమంది ధర్మ తత్వ రుడై అనేక దాన ధర్మాధ్వర కార్యములొనర్చి ఊర్ధ్వలోకముల కరిగి దేవేంద్రునకిష్ట సఖుడై సుఖములందుచు విలసిల్లెను.

ఈ కథను సవిస్తరముగ నుడివి, భీష్ముడు ధర్మజునిజూచి కుమారా నీ సందియము విడినది కదా, మీరొనర్చిన యుద్ధమున మడిసిన వారు వారి స్వ ధర్మ నిర్వహణ మందసువులు రాల్చితిరి గాన వారికి ఊర్ధ్వలోక సుఖ నివాసమే. సందేహము లేదు అని నుడివెను.

## విద్యాదాన తపోదానములలో ఏ దానము గొప్పది

ఈ సందేహమును తీర్చుమని ధర్మజుడడుగగా వ్యాసమైత్రేయ సంభాషణ కథనిట్లు భీష్ముడు నుడివెను.

వారణాసి పురమందున్న మైత్రేయ మునీంద్రుని చూచుటకు వ్యాస మహర్షి తాను వచ్చుచున్నట్లు తెలియజేయ కుండ అరిగెను. కాని వ్యాసుని రాక ఆమునీం ద్రుడెఱిగి గౌరవ మర్యాదలతో అతిథి పూజలొనర్చి ఇష్ట భోజనమిడి సంతృప్తుని జేసెను. మైత్రేయుని మొగము ఎంతో సమ్మోదము వికాసము నందినట్లుండ, కారణమేమని యడుగ ఇది యంతయు అన్నదాన ఫలమని యాతడు నుడివె. ధర్మజా వింటివికదా, తపోధ్యాన మహిమలు మనో నిర్మలత గూర్చును. దానము లలో అన్నదానము గొప్పది. దానమువలననే తపము విద్యయు వృద్ధి పొందును. ఆ విద్యలను దానమే పోషింపగలదు. ప్రాణములు అన్నమయములు శరీరబలము అన్నము వలననే కలుగునని చెప్పెను.

## స్త్రీల ప్రవర్తన మెట్లుండవలెను

ఈ విషయమున భీష్ముడీ క్రింది సమాచారమునుడివెను.

సుమనయను భామిని స్వర్గమున నున్న శాండిలి యను స్త్రీని జూచి నీకిం తటి యున్నత పదమెట్లు వచ్చినది అని అడుగగా ఆమె తన ప్రవర్తన విధమిట్లు నుడివెను.

మామకు అత్తకు మారుపలుకలేదు. దేవ పితృతిథి పూజలొనర్చితిని. వాకిలి గుమ్మము దాటి యెఱుగను. ఎక్కువగను అనవసరముగ నవ్వను. విప్రులకు

భిక్ష శుచిత్వముగ పెట్టుదును. ఇంటిపనులు వలయునట్లు చేయుదును. భర్త ఇంటికి రాగానే ఆసనము పానీయములు మున్నగు సౌకర్యములు కూర్తును. బిడ్డల ఆలన పాలన చదువు చూచితిని. భర్త కిష్టమగు వంటకములు చేయుదును. భర్త గ్రామాంతర మేగి తిరిగి వచ్చువరకు గంధమాల్యాది అలంకారములు రుచి కర ములగు వంటకములు మానుదును. బంధువులు వచ్చినపుడాదరింతును. గోవు లకు కావలసిన వస్తువు లమర్తును. అత్తవారికి భర్తకు అనిష్టములు బాధ కలిగించు మాటలెవ్వరి తోడను పలుకను. అగ్ని హోత్రము ఆరకుండ చూచెదను. గర్భిణిగా నున్నపుడు రుచియగు పదార్థములు మాని ఆరోగ్యమునకు తగిన వస్తువులే తిందును.

ఈ విధముగ వర్తించిన స్త్రీ అరుంధతికి వలె ఇహపర లోక సౌఖ్య భాగ్యము లొందవును. స్త్రీ పురుషులు భక్తితో ఈ కథ వినినను చదివినను బహు పుణ్య ప్రదము. ఆయు శ్శీకరము కూడను.

శాస్త్ర సమ్మతము శ్రేష్ఠము అయిన ఆచారము. ''ఓంనమో నారాయణాయ'' మంత్రము. ప్రకృతికన్న పరమైన ఇరువది యైదవ తత్త్వమే జీవా త్ముడు. సర్వ భూతాత్మకుడు ఆతడే నరుడు. ఆ నరుని వలన గలిగిన నారములు (జలములు) అన్య తత్త్వము ఆశ్రమముగ ప్రకాశించు నారాయణుడు పర బ్రహ్మము పరతత్త్వము, ఈశ్వరుడు, విష్ణువు, వాసుదేవుడు, ఆత్మ అను వేదాంత వాక్య ములచే పిలువబడువాడు అతడే. జగత్తును భరించుట యాతని విశేషము. సర్వ జగత్తు తనయందు ఆవిర్భవించి లయము నొందుచున్నను తాను ప్రభువై ప్రకాశించు చుండును. సర్వ శాస్త్రముల సారము పరిశీలించి నిర్ణయించిన పేర్లవి. వానికి నామాంతరములు అర్థాంతరములు లేవు.

సకల శ్రేష్ఠమైన ఆచారము నారాయణుని నిత్యము తలచి ఆ నామమును జపించు చుండుటయే. అట్లు తలచుట సకల శాస్త్రార్థములను తలచుటే. కడు నిష్ఠతో ఆచరింపదగినది ఆ మంత్ర జపమే. నమోనారాయణాయ అను అక్షర ములే ప్రణవము. అవియే మంత్రరాజము. అత్యంత హిత ప్రదము పరమ పదము నిచ్చు మంత్రరాజమది. ఆ మంత్ర తత్పరుడైన నరుడు తనకు తాను మేలొనర్చు కొనుటే కాదు, తన్నాశ్రయించిన వారికిని మేలొనర్చగలడు. బ్రహ్మచర్య గృహస్థ వాన ప్రస్థ సన్యాస ఆశ్రమములు నాల్గింటియందును అనుష్ఠింపదగినది ఆ మంత్ర జపము. విష్ణువు భక్తవత్సలుడు. భక్తులకు కనుపడును. పుండరీకుడట్లే నారా యణ జపతత్పరుడై భక్తుడై ధన్య జన్ముడయ్యెను.

అట్టి భక్తునకు, శంఖ చక్ర, గదా, శారిజ ( ధనస్సు) ధారి, పద్మ పత్ర సమాన నేత్రుడు, కిరీట కుండలములతో మనోహరమైనవాడు, శ్రీ వత్సమను నల్లని మచ్చ వక్షమందు కలవాడు, కౌస్తుభ మణిహార సుందరుడు అయిన నారాయణుడు స్వప్నమున గోచరింపగలడు. భక్తులకు చిరకాలము ఈయనుభూతి భాగ్యము కలుగును.. ఈ విష్ణు సాక్షాత్కారణ ఫలముగ శుభములు, పరమ పదస్థితి లభించుటకు సందియము లేదు. నారాయణ మంత్రమహిమ నిట్లు విని పరమ హర్షమున పులకితాంగుడైన ధర్మరాజు భీష్మునికి ప్రదక్షిణము లాచరించి మ్రొక్కెను.

## దానము, ప్రియ వచనములు

భీష్ముడిట్లు నుడివెను. ధర్మరాజా! ఈ రెండు విధములును మంచివే. కాని యెదుటి వాని స్వభావము నెఱిగి వర్తించుట ఉచితము. దానము రంజకమైనది. కావున దెలుప గూడదు. ఒక కథ వినుము. ఇవి సామ వాదమున సాధించదగినవి. బుద్ధి శాలియగు ఒక బ్రాహ్మణుడు, తన పనికై వనంబున కేగ అచట నొక రాక్షసుడు ఆతని మాంసము తినుటకు చంపనుంకించెను. ఆ విప్రుడు కలత చెందక ధైర్యముతో నుండుట గ్రహించి యా దానవుడు ఓ విప్రవర్యా, నా శరీరము అలసి పోయి తెలతెలబారుటకు కారణమెద్దియో చెప్పగలిగినచో నిన్ను విడిచెద ననెను. ఆ విషయము నా విప్రుడిట్లు విశదీకరించెను.

చుట్టములను నీ చెడుబుద్ధిచే విడచి దానికి పశ్చాత్తాపము నొందుట. లేనప్పుడు తనకు లభింపని ధనముల కాశించుట. మొగ మాటమునకు నీవు ఒకరికి లోబడుట వలన అతడు తానుగెలిచితినని సంతసించుట. నీవు ఒకని వలన ఉపకారము నందిన వాడే అది తనగొప్పతనమని భావించుట. పెద్దవారు నిన్ను పొగడినపుడు సిగ్గుపడి మంచివారిచేత పొగడ్త పొందుటకు చాటునకు పోవుట. నీవునలువురిముందు మంచి మాట నుడివినను వారు అంగీకరింపనిచో కోపించిన నీ భార్యకు నచ్చచెప్ప మాట త్రిప్పుట. నీ సొమ్ము నపహరింప బోవు వానినుండి తప్పించుకొనగా వాడు నిన్ను నిందించు మాటలు నీ బంధువులు నమ్ముట. నీవు మంచి వాడవయినను నిన్ను మోసకారిగా స్నేహితులు భావించుట అది నీవు పైకి చెప్పుకొనలేక పోవుట.

భార్య, పుత్రుడు, అల్లుడు సద్వర్తన లేక తిరుగు చుండుట. తల్లి దండ్రులు సోదరులు కలతనొందుట. విప్రుని గోవును చంపుట, దేవ బ్రాహ్మణుల ధనము హరించుట, ధనము పోగొట్టుకొనుట, బంధు జనమృతి, మొగమాటమునకు

బాలురచే పనిచేయించుకొని తాను చేయించుకొనిన పని ఒక పగవానిచే పాడగుట. ఇట్టివి ఏయొక దానిచే నైనను కృశించుట శరీరము తెల్లబడుట జరుగునని చెప్పగా ఆ రక్కసుడా విప్రుని ఓదార్పు మాటలు విని మెచ్చి వదలి పెట్టెను.

## శ్రీకృష్ణుని చరిత్రము

ధర్మరాజీమాటలన్నియు విని, నమస్కరించి తాతా! నీ కరుణచే మేము మంచిమాటలు వినుచున్నాము. నరుడెన్నియో పాపములొనర్చును. వానిని తప్పించు కొనుటెట్లు. ఆ పైని మహానుభావుడయిన శ్రీకృష్ణుడే నిన్ను మహా జ్ఞానిగా నెంచుచున్నాడు. ఆ శ్రీకృష్ణుని చరిత్రము వినగోరెదము చెప్పుమనగా భీష్ముడు శ్రీకృష్ణుని చిత్ర చరిత్ర మిట్లు నుడివెను.

తనయుని పొందగోరి రుక్మిణీ కృష్ణులు హిమాద్రికి తపమొనర్ప చనిరి. ఆ సమయమున నారద పర్వత వ్యాస దేవలాది మహామునులు శ్రీకృష్ణుని జూడ నేతెంచి సద్గోష్ఠి జరుపు చుండగా శ్రీకృష్ణుని వదనము నుండి మహా వహ్ని జ్వాలలు నిప్పుమంటల జూచి భయమంది, శ్రీకృష్ణుని జూచి దేవా! నీవు సర్వ సమర్థుడవు, నీవలననే యీ విశ్వమంతయు ఉద్భవించును నీవలననే అణగిపోవును. ఇపుడీ మహాగ్నులేల పుట్టినవి. మాకు భయమగుచున్నది. విశదీకరింపుడని వేడగా శ్రీకృష్ణుడిట్లు నుడివెను.

జగత్తును నాశనము చేయగల దనుజుడొకడిచ్చట నున్నాడు. వానింజంపుట కొక తనయుని గోరి తపమొనర్ప నా ఆత్మనుండి అగ్ని బయల్వెడలి బ్రహ్మ కడ కేగెను. బ్రహ్మయు నా పుత్రునిగా మన్మథునిచ్చెను. ఆ యగ్ని జ్వాలలును సమసినవి. అని నుడివి శ్రీకృష్ణుడా ముని వర్యులజూచి, మహాత్ములారా, లోకములందు మీరెఱుగనిది లేదు. మీరు త్రికాల వేదులు. ఉత్తమమైన పూర్వ వృత్తాంతమేదైన మీ వలన వినదలతునని వేడగా నారదుడు ఉమామహేశ్వరుల సంవాదము నిట్లు చెప్పెను.

## ఉమామహేశ్వరుల సంవాదము

నారాయణుని అనుగ్రహమున నేనీ కథ వింటిని. దానిని మీకు వచింతును. నేను నా త్రిలోక సంచార మధ్యమున ఒకనాడీ అతి సుందరము పుష్పలతా శోభితము కోకిల కులనాదము లెనయు హిమాద్రి కేతెంచితిని. ఇంకొక చోట చారుమణీ వేదికపై మహాదేవుడు సురలు మునులు గణములు సేవించుచుండ, ఆసీనుడై యుండ నేనును అటజేరితిని.

ఇంతలో గౌరి వెనుక నుండి వచ్చి చిరునవ్వు చుతన రెండు చేతులతో పరమ శివుని రెండు కన్నులను మూసినంతనే జగమంతయు అంధకారమయమై సంక్షోభించినది. హరుడు తన ఫాలలోచనము తెరువగా మరల ఆ హిమాద్రియు జగము సర్వము యథా పూర్వస్థితికి వచ్చినది. గౌరి ఆశ్చర్యపడి దేవా నీ కనుమూసి కను విప్పునంతలో ఇంతయైనది యిదెట్లు సంభవించినది అని అడుగగా శివుడు పార్వతిని జూచి దేవీ! నేను సర్వజగదాత్మకత్వము కలవాడను నాకేది కలిగిన అది జగత్తునకగును కను మూసిన లోక మంతయు చీకటి అయినది తెరువగనే చైతన్యవంతమైనదనెను. పార్వతియు శివుని మాటలకు ముదమంది ఇంకను తనకు గల సందేహములను అడిగి తీర్చుకొనెను.

## శివునకు నాలుగు ముఖములు

ఎట్లు కలిగినవని పార్వతి అడుగగా శివుడిట్లు చెప్పెను.

సుందోపసుందులను ఇరువురు రాక్షసులు మహాబలవంతులుండిరి. వారి వినాశనమునకై మయుడు తిలోత్తమ అను సౌందర్యవతిని సృష్టించి నావద్దకు తీసికొనిరాగా ఈ మెదేవ కార్యము సేయవలయునని వెనుక కంపితిని. ఆమె అట్లేగిన దిక్కులు నాలుగింటివైపు నేను చూచుటచే నాకు నాలుగు ముఖములు కలిగినవి.

## శివునకు కంఠమునందు నలుపు

దేవ దానవులు అమృతము కొఱకు మథించుచున్న సముద్రము నుండి ముందుగ హాలాహలమను విషముద్భవించి లోకములు తగుల బడునట్లు వ్యాపింపగా ఆ విషమును గ్రహించి తన కంఠమునందు బిగబట్టి యుంచుటచే ఆ నలుపు కలిగినదనియు, ఇట్లు జగద్రక్షణ సల్పుటచే తనను అందరును సంస్తుతించి నీలకంఠుడని పిలచిరని శివుడు నుడివెను.

## శివుడు పినాకపాణి

ఆదియుగమున కణ్వుడను మహాముని దీర్ఘకాలము మహా నిష్ఠతో తప మొనర్చెను. తనపై పుట్టలు పుట్టుట గూడ ఎఱుగని అమ్మహా ముని తపస్సునకు మెచ్చి బ్రహ్మ ప్రత్యక్షమై కోరిన వరమిచ్చి ఆ పుట్టనుండి పెరిగిన వెదురును తీసికొని దానినుండి లోకకళ్యాణార్థము పినాకము అను ధనువునొనర్చి శివునకిచ్చెను. శారజమను ధనువునొనర్చి విష్ణువునకిచ్చెను. ఆ వెదురు కొన భాగమునుండి గాండివమను విల్లొనర్చెను.

## శివుడు వృషభ వాహనుడు

లోక హితార్థము శివుడు హిమవత్పర్వతమున తపమొనర్చు సమయమున అందున్న గోవులు చుట్టును జేరి చిక్కుగలిగించుటకు శివుడు కోపించి చూడగా ఆ గోవులన్నియు చెల్లా చెదరైనవి. ఆ విపరీతమున కడలి విరించియు అమరు లేతెంచి శివునకు వృషభము కానుకనిచ్చి శాంతింప జేసిరి. శివుడా వృషభమునే తన వాహనముగా, కేతన చిహ్నముగా నొనర్చుకొనెను.

## శివునకు శ్మశాన వాసము

పుడమిపై నెన్నియో ప్రశాంత ప్రదేశములు సుందర స్థలములుండగా తమకేల అశుచియు పుఱ్ఱెలుగల దుర్గంధ శ్మశాన వాసమని పార్వతి అడుగ శివుడిట్లు చెప్పెను.

క్రూర గుణములుగల భూతములనేకములు శ్మశానమున జేరి ప్రజలను బాధ పెట్టుట చూచి బ్రహ్మాదులు తన వద్ద కేతెంచి ఈ పిశాచ బాధ నివారింపవే యని వేడుకొన, తన కావిజన ప్రదేశమే మనమున కింపయి శివుడందు చరించుచు పిశాచాదుల బాధ లేకుండ లోకులను కాపాడు చుండెను.

## శివుని భీకరాకారము

ఒడలిపై భస్మము, పాములు, శూలాది భీకరాయుధములు కలిగిన ఉగ్ర రూపము మీకేలనని పార్వతి అడుగగా శివుడిట్లు నుడివెను.

లోక స్వరూపము రెండు విధములు. శీతము ఉష్ణము. శీతగుణము సౌమ్యము, ఉష్ణ గుణము ఆగ్నేయము అయి జగము నిండును. సౌమ్య గుణము విష్ణుదేవుడు, ఆగ్నేయమును నేను ధరించి లోక రక్షణ చేయుదుము. ఈ ఆగ్నేయ గుణకారణమున నాకీ భీకరాకారమును ధరింపవలసి వచ్చినదని శివుడు నుడివెను.

## శివుడు చంద్ర మౌళి

దక్షుని యజ్ఞభంగ సమయమున అచట జేరిన దేవతలను తాను తరిమి కొట్టు చుండగా చంద్రుడు తన కాలిక్రింద బడి నలిగి తన్ను శరణువేడగా కనిక రించి యా చంద్రుని శిరమున తాల్చితిని

పరమ శివుడీ విషయములనన్నిటిని వివరముగా నుడువగా ఆలకించి పార్వతి హర్షము నొందెను. అచట జేరిన మునులును శివుని మహిమమును విని యా మహాదేవుని సంస్తుతించిరి. నారదుడీ కథలనెల్ల కృష్ణునకు చెప్పినట్లు భీష్ముడు ధర్మరాజునకెఱిగించెను.

మహాభారత ధర్మశాస్త్రము

అనుశాసనికపర్వము చతుర్థాశ్వాసము సమాప్తము

# మహాభారత ధర్మశాస్త్రము

## అనుశాసనిక పర్వము - పంచమాశ్వాసము

## వర్ణాశ్రమ ధర్మములు

లోకహితార్థంబుగా వర్ణాశ్రమ ధర్మము లెట్లుండవలెను అని పార్వతీ దేవి వినగోరగా పరమ శివుడిట్లు వచించెను. ఈ కథను నారదముని శ్రీకృష్ణునకు జెప్పినట్లు భీష్ముడు ధర్మజునకు తెలియజేసెను.

పూర్వము లోక శ్రేయము కొరకు బ్రహ్మ తన వదనము నుండి బ్రాహ్మణులను పుట్టించి తదుపరి తన బాహువులనుండి క్షత్రియులను తొడల నుండి వైశ్యులను పాదములనుండి శూద్రులను కల్పించెను.

బ్రాహ్మణులు సదా పూజ్యులు లోకమునకు ఆధారము. బ్రాహ్మణు నెడల ఎట్టి అపరాధము చేసినను అది పరమ శివునకు చేసినట్లే, వేదాధ్యయనము వేద విద్య బోధించుట, సత్యము శౌచము, తపము ప్రశాంతి బ్రాహ్మణులకు వలయు ఆచారములు - తపమునకు సాధనగ, ధర్మమునకు మూలముగ వారిని బ్రహ్మ సృజించెను.

విప్రులకు రక్షణ నిడుట, ధర్మయుతముగ ధరణీ పాలనము క్షత్రియులకు కర్తవ్యము. అధ్యయనము దానము యజ్ఞము సాధురక్షణయే కాక దుర్జన శిక్షణయు నృపుల ధర్మములు.

అన్యాయార్జనలేని వాణిజ్యము పశుపాలన కృషివైశ్యులకు ఆచరణీయ ధర్మములు. పై మూడు వర్ణముల యెడల వినయ విధేయతలు, జీవనమునకు వలసిన వస్తువులు సమకూర్చుట వృత్తి విద్యలు సేవ శూద్రులకు ధర్మము.

సర్వ వర్ణములవారును వారివారి వర్ణ ధర్మముల నెఱపుట వలన పాప రాహిత్యము జన్మజన్మముల సౌఖ్య విభవము నందగలుగుదురు.

### ఆశ్రమ ధర్మములు

బ్రహ్మచర్య నిష్ఠ, గురుసేవ, అధ్యయనము, అగ్నికార్యము, గురువు కొరకై సంచారము, భిక్షాశనము - బ్రహ్మచారికి ధర్మములు.

గృహస్థ ధర్మము అన్ని ఆశ్రమములకు ఆదరణీయము. శుచిత్వము కుటుంబ సంతుష్టి, పంచ యజ్ఞములు (బ్రహ్మ, పితృ, దేవ, భూత, మనుష్య యజ్ఞములు వేద విధులు, దయ అతిథి పూజ దాన హోమములు గృహస్థ ధర్మములు.

వాన ప్రస్థము, వనవాసము, వన్య భోజనము బ్రహ్మచర్యము, ఆత్మ చింతన అగ్నిహోత్రము జటాజిన ధారణము వాన ప్రస్థాశ్రమ ధర్మములు.

యతి (సన్యాసి) ధర్మములు: కోపము, విషయాసక్తి, ధనలోభము లేకుండుట, ఓర్పు, బ్రహ్మధర్మము, ఆత్మ చింతనము, శుచి, భైక్ష్య భోజనము, నేలపై పరుండుట, సౌమ్య వర్తనము ఈ ఆశ్రమ ధర్మములు.

### తపస్స్వరూపము

సామాన్యముగ తపమును భోగము లాసించి చేయుదురు. వాన ప్రస్థులు ఇంద్రియ కర్మ నిగ్రహముతో యోగసేవతో తపమును నిరంతరముగ జరిపి తత్ఫలముగ స్వర్గమున కరుగుదురు. అచట తమ పుణ్య ఫలమనుభవించి మర్త్యులుగ తిరిగి వత్తురు. ఉపవాసము జపము పంచాగ్ని (అహవనీయ దక్షిణాగ్ని, గార్హపత్యము సభ్యము అపనథ్యము) మధ్యవాసము గల తపము అప్సరలకు ప్రియము. తపశ్శాలులు తాము ఇతరులు సమాన రూపులేనను కరుణ చూపుదురు. కుటుంబ సౌఖ్యముగల వారై ఊర్ధ్వలోక వాసము ముగిసిన వెనుక తిరిగి వత్తురు.

### వనవాస వ్రత విశేషము

ఉపవాసము, మౌనము, నేలపైన పరుండుట నియమితాహారముల నిష్ఠ గల వారికి దేవతాస్థల నివాసములభించును. బహు సౌఖ్యములతో పెక్కు వత్సరములచట నుండగలరు. పాపములు నశించి పుణ్య గతులు గల వారందరును తీర్థ పరాయణులు. అనేక తీర్థ జల స్నానముల వలన జడలు ఎల్లబడి భిక్షాశనము వలన మేను కృశించి వారి తపో నియమము ప్రకాశించును. మాసోపవాసము నీవార ధాన్య భుక్తి ఫలముగ దేవతలకు లేని సౌఖ్యములు వీరల కలవడును.

### వైఖానసుల విధము

వైఖానసులనగా వాన ప్రస్థులు, కష్టజీవులు. నీవారి ధాన్యమును ప్రోవు చేసి రాళ్ళపై చితుకగొట్టుకొని, పళ్ళతో కొఱికి గాని, కొందరప్పటి కప్పుడు నోట వైచుకొని గాని తిందురు. కొందరు పర్ణ భక్షకులు జల భక్షకులు వాయు భక్షకులుందురు. అట్లుగాక కొందరు ఆహార పరులుగా నుందురు. వీరందరు ఇంద్రునకు పూజనీయులై చిరకాల సుఖము లందగలరు.

ఇట్లు పై నుడివిన వివరములన్నియు తపమును గూర్చినవియే. తపము వలన సర్వ సౌఖ్యములు సమకూడును. తాపసులు లోక హితము నభిలషించు ఉదారులు. వాలఖిల్యులను ముని వర్యులు రూపమున అంగుష్ఠ మాత్రులు. చిర తపశ్శాలులు. సూర్య దీప్తులతో గూడి చరించు చుందురు. వారి తపోవైభవము చేతనే జగములు సుస్థిరములై యున్నవి.

## జీవన ధర్మములు - ప్రవృత్తి నివృత్తి

శివుడు చెప్పుచుండగా పార్వతి శ్రద్ధగా వినుచున్నది.

లోక ప్రవృత్తి ధర్మమునకు గృహస్థము అర్హమైనదిగ బ్రహ్మ ఏర్పఱచెను. విజ్ఞులు మెచ్చిన విధానమది. సమచిత్త వృత్తితో, అధికాశలేక, ధర్మము ముఖ్యముగ అర్థము కామము నెఱప వలయును.

నివృత్తి ధర్మమును గూడ బ్రహ్మయిట్లు వివరించెను. నివృత్తి అనగా విరాగము. అదియు మోక్షణోపాయము. భూతదయ సత్యదృష్టి ఇంద్రియ నిగ్రహము చిత్తశాంతి ముఖ్యములు.

మఱియును ఆకలితో వచ్చిన అతిథికి కడుపు తృప్తిగ అన్నమిడ వలయును. దీనినాచరించుటకు గృహస్థత నెలవు. దీనికి తక్కిన ఆశ్రమములు సరికావు.

నరులకు జననీ జనకులసేవ చాల ఉత్తమము. స్త్రీకి పతి భక్తి ముఖ్యధర్మము. జననీ జనకులు లేని మనుజుడు, భర్త లేని స్త్రీయు చేయదగిన ధర్మములున్నవి. చిత్త శుద్ధితో దేవ అతిథి పూజలు, బ్రహ్మ చర్యము ఆచరణీయములు. మనుజుడు నిజదారతోడనే పరితృప్తుడై, తనకుగల ధాన్యము పక్షియెలుక మున్నగునవి తినినను దండింపక ఉదారుడై యుండవలెను.

ఎచట వసించి ఏమి చేసినను నిస్సంగి అయిన యతికి మోక్ష పద ప్రాప్తి సులభము.

## రాజత్వ మహిమ

పార్వతి మఱియొక ప్రశ్న అడిగినది. దేవా! రాజు-ఆసువానికి అభిలాషలు, సామాన్య జనునకున్నటులుగా ఉండియు అతడు సర్వ జనులచేగౌరవింపబడుటకు కారణమేమి అనగా శివుడిట్లు వివరించెను.

అధిక తపఃఫలముగ రాజత్వమబ్బును. నిగ్రహానుగ్రహసమర్థుడగుటచే అతడు ప్రజల పూజలందుకొనును. అతని నీతివర్తనమే అతనిని వినయపరుని జేయును. ఇంద్రియ నిగ్రహము, నేరస్థులను శిక్షించు తెలివి, శత్రుజయమును రాజు పొందును. తన మేధాశక్తిచే అమాత్యుల సమర్థత నెఱుగును. తగిన సేన చేకూర్చుకొని తన దుర్గమును రక్షించుకొని ధనము కూడబెట్టును. పాపరహితుడయి వర్తించును. అర్హులైన వారి కొఱకే ధనము వ్యయించును. తగిన గూఢచారులవలన శత్రు ప్రయత్నములనెఱిగి ఆత్మదేశమునకు జనులకు శ్రేయమును గూర్చును. ప్రియవాదిత్వము విద్యా నిష్ఠ సంధి విగ్రహ సూత్రములనెరిగి కయ్యమునకు తానయి కాలు ద్రవ్వడు. రణమవసరమేని శూరుడై ధైర్య సాహసములు చూపును. దాన విధి పరాయణుడగును. ఈ విధమగు సత్ప్రవర్తనలేని రాజులు పాపులై నిరంతర నరక బాధ నొందుదురు. చిత్త శుద్ధితో దయాంతరంగుడై ప్రజల రక్షించుచు తన ధర్మము నిర్వర్తించు నరపతికి, సంపద, కీర్తి, పుణ్యగతులు తప్పక కలుగును.

## హింస అహింస

దేవా! అహింస ఉత్తమధర్మమందురు. హింసను వర్జింపలేని వారుందురా అని పార్వతి అడుగగా శివుడిట్లు నుడివెను.

పేను నల్లి దోమ సీరపేను కండచీమలు లోనైనవానిని చంపకుండ ఎవరును ఉండలేరు. అహింసాత్మకులైన వారికే హింసావర్జనము చెల్లును. అట్టివారు ఆకు తొడిమను కూడ త్రెంపరు, రాలిన పండ్లనే తిందురు. విధివశమున కాలము చెల్లి మృతి జెందిన జంతువునందు అహంకారము లేక వర్తించువారికి పాపములేదు. దీపపు ప్రమిదలో పురుగు పడి చచ్చిన దీపమెత్తిన వానికి పాపమురాదు. అట్లే భూమి దున్నునపుడు నాగలి మొనదగిలి, ఎన్నో ప్రాణులు చచ్చును. దున్నువానికి పాపము అంటుగట్టరాదు. పుణ్యపాపములకు బుద్ధియే మూలము.

ఒక యితిహాసము కలదు వినుము. గోవులు కొన్ని వేరు విధమున చావును బొందుట ఇష్టములేక, దైవ కార్యగతముగ ప్రాణములర్పించుటుత్తమమని రంతిదేవుడు చేయు యాగమున యజ్ఞపశువులయ్యెను. ఎన్నో గోవులట్లు మృతి జెందగా వాని రక్తము ఒకనది, వాని చర్మములు నదిగట్లయ్యెను. ఆ నదికి చర్మణ్వతియను పేరు వచ్చి మహా పవిత్రమైన నదిగా ప్రసిద్ధి గాంచెను. అందుస్నానపాన ములు ఆనంద ప్రదములు. ఆనది గోసంతానము దివి కరిగి సౌఖ్యములు పడసె

ను, యుద్ధము లందు ఇరువాగుల వారును శత్రుబలముల జంపుదురు. పోరిలో మరణము పుణ్యలోక ప్రదము. మృగములు సస్యములను నాశనము జేయును. జగము నిర్మానుష్యమయినచో తమకు మంచి దని మృగములు కోరుకొనును అందుచే వేటలందు మృగహత్య రాజులకు దోషము కాదు.

నేరస్తుని దండింపకుండుట, నిరపరాధిని దండించుట విప్రునకు బాధ కలిగించుట రాజునకు హింసయే అగును. విప్రులకు బాధ కలిగించిన నహుషాది నృపులు చెడిపోయిరి. విప్రారాధనము నృపుల కెల్లవేళల శ్రేయము.

మంత్రయుక్తంబుగ పశువులు యజ్ఞ స్తంభమునకు కట్టబడుటచే అవి పవిత్రములగును. విహిత వధచే అవి మేను విడచి దివ్య సుఖములందును. వాని మాంసములు అగ్నిష్టోమాది పూజల అమరులకు తృప్తి కలిగించి యజమానులకు సకల సౌఖ్యములు నొసంగును. వేదవిహిత హింస, హింసకాదు, అది పాపముల బాపుసుకృతమని మునులు కొనియాడుదురు.

## జీవన విధానము

పృథ్వి మనుష్యము, కర్మభూమి. సుఖదుఃఖమూలమైనది. వారి మనుగడకు ధనము ఆవశ్యకము. విత్తమువలననే ధర్మము కాని కామము గాని నెఱవేరును. ధనలబ్ధికి విద్య, వార్త సేవ మూలములు. విద్య అన్నిటికి గౌరవము నిచ్చును. కర్షకునకు కూడ కాలజ్ఞానము (వర్షాగమనాదులు) కావలయును. వర్తకునకు లాభకరమగు అమ్మకము తెలియవలయు. అది తెలియక పోయినచో వ్యయమే. పశువులను కాచువానికిని పశువుల కనువగు గడ్డిని చూచి మేపు సమర్థతవలయును. మోసము, ఆలస్యము లేక ప్రభువు ఇష్టమెరిగి పనులు నెరవేర్చువానికి అధిక ధనము సుఖము లభ్యమగును.

పరధనము అపహరించుట పరస్త్రీలను లోగొనుట జనులకు మహాపాపములు. కరుణ, అతిథి పూజ, దేవ పితృ సమారాధనము యెల్లవారికి ఆచరణీయములు, శుభ ప్రదములు.

## వర్ణ కర్మ పరిపాకము

గుణవృత్తి మూలముగ జనులు నాలుగు వర్ణములు. ఎవరి ధర్మము వారు యథా విధిగ నెరవేర్చుచో దేవలోకముల సుఖమునంది, తిరిగి స్వజాతి యందు జన్మింతురు. ఈ క్రమము ఎవరైన మరియొక వర్ణధర్మము నొనర్చిన తత్కాలము

నందే జన్మములభించును. ఎంతెంత మేలు చేసిన అంతగా అగ్రకుల జన్మము కలుగును. విప్రుడయినచో అత్యంతానంద ప్రదమగు ఊర్ధ్వ లోకవాసము కలుగును.

మనుజుడు తనకు గలుగు ఆపదలకు క్రుంగక, సిరి కలిగినచో గర్వపడక, తన శౌర్యముచే పాపులనడంచి ఆర్జించిన ధనము బంధువులకు, మంచి వారికి ఇచ్చును. దీనులను సాధ్యమయినంతగా బ్రోచి క్రోధములేక జీవించినచో దేవతాంశ జన్మములభించును.

## సుఖ దుఃఖములకు హేతువులు – పూర్వ జన్మ ఫలము

కొందరు మనుజులు సంపదలతో సుఖింతురు, కొందరు దారిద్ర్యముతో బాధపడుచుందురు. ఇందులకు కారణములున్నవి.

దయతో బిచ్చగాండ్రకు తగిన భిక్షములిచ్చి, దీనులయిన బంధుమిత్రుల దీనత బాపి పాపరహితమగు తమ పూర్వజన్మ వాసనగల వారికి సుఖసంపదలు విరించి కలుగజేయును. లోభియు భూతదయలేనివానికి దుర్గతి దుఃఖములే కలుగును. బ్రహ్మకు ఒకరియందు ప్రేమ మఱొకరియందు కోపము లేదు. ఆ దేవుని కందరు సమానమే. వారి వారి పుణ్య పాపముల ఫలానుభవము తరుణము జూచి బ్రహ్మ ఏర్పాటు చేయును. ధనవంతులైనను తాము తినక, కట్టక ఒకరికి పెట్టని వారు కష్టముల పాలగుదురు. వారు తమ పూర్వజన్మయందు ఉపకారులైమనిన వారు. తమకు ధనములేక పోయినను తమ సౌఖ్యములు పరులవలన పడయు వారు, పూర్వజన్మమున పేదవారయ్యు ఒకరికి పెట్టవలెనను ఔదార్యము మనసున కలుగువారు. ఎక్కువ కష్టము ఆయాసము లేకుండ ధనలబ్ధి గలవారు, అర్థులైన జనులను పిలిచి పూర్వ జన్మమున సాయమొనర్చిన వారు. మిక్కిలి ప్రయత్నము లేకనే వారికి ధనము లభించును. పూర్వజన్మమున దయాదాక్షిణ్యములు లేక యాచకులకు ఆశపెట్టి పిదప ఈయనివారు ఎంత ప్రయత్నించినను ధనలాభము పొందరు. ధనవంతుడు ముసలియై తన ప్రాయమునందు దానమీయని వాడు తొంటి జన్మమున దానము చేయ తలపు గలవాడు. పూర్వజన్మమున రోగిష్ఠులై చచ్చిపోవు క్షణమున దానము చేసినవారు, వ్యాధి గ్రస్తులై తమకు కల్గినదియు తినలేరు. పూర్వ జన్మమున మాంస భోజనము విడచిన వారు ఈ జన్మమున సౌందర్యవంతులగుదురు. వికార రూపము కలిగినవారు పూర్వజన్మమున అందగాండ్రయ్యు అంగవిహీనుల నిందించి నట్టివారు. పూర్వ జన్మమున భార్యను ప్రీతిగా జూడనివానికి ఈ జన్మమున భాగ్యము కలుగదు.

పూర్వ జన్మమున భార్యను ప్రీతిగ జూచిన వాడే ఈ జన్మమున కుటుంబ సౌఖ్యము కలిగి ధనవంతుడగును.

పూర్వజన్మమున దానమును గూర్చి వినియు దానపరుడు కానివాడు ఈ జన్మమున జ్ఞాని విజ్ఞాని అయ్యు పేదవాడగును. పూర్వజన్మమున ప్రజ్ఞ లేకపోయినను దీనులను దయతో రక్షించిన వాడు ఈ జన్మమున సంపదగలవాడగును. తొలి జన్మమున గురుసేవజేసి ఒరులకు తన పాండిత్యమిచ్చిన వాడు ఈ జన్మమున మేధావియై విద్యావంతుడగును. పూర్వమున విద్యావంతుడై వినయ విహీనుడై మంచి వారిని సభలలో అవమానించిన వానికి ఈ జన్మమున విద్యాసక్తి కలుగదు.

తొలి జన్మమున సదాచార సంపన్నులై సత్యము పాత్రదానము పాటించిన వారు ఈ జన్మమున తాము తమ కుటుంబము ధన సౌఖ్యములు ఆరోగ్యము కలిగినవారగుదురు. పూర్వము క్రోధ లోభములు కలిగి భగవంతుని యందు విశ్వాసములేని వారే, ఈ జన్మమున దుశ్శీలురైన భార్యాపుత్రులతో వ్యాధి గ్రస్తులై బాధ పడుదురు. తన గొప్పతనమును ప్రకటించుచు పరస్త్రీని చూచిన వాడు పుట్టు గ్రుడ్డి వాడయి పుట్టును. మంచివానిని పరుష వాక్యములచే నొప్పించినవాడు చెవిటి వాడయి పుట్టును. ఒకరికి విషాన్నము పెట్టినవాడు కడుపున తెగులుతో బాధ పడును. కామాంధుడై అన్య సతిని స్త్రీని తుదకు గోవు మున్నగు జంతువుల కలియబోవు వాడు అన్నకోశమున జలబాధ శర్కర బాధలు పడుచు బ్రతుకును. అందముగ నున్న వారిని బంధించి గొట్టి బాధించినవాడు కుష్ఠరోగి యయి పుట్టును. సాధుజనులను కాలుసేతులు విరిచి బాధించిన వాడు కుంటి వాడయి పుట్టును. అశుభములగు పాదములతో దేవాలయమునకు బోయినవారు, అల్పు లయిన వారిని నిష్కారణముగ తన్నినట్టివారు పాదరోగులయి పుట్టుదురు. నిర్దయులై వినోదముకొరకు జీవులను జంపువారు, గురువులకు బాధ కలిగించువారు జ్వరము, అతి సారము, కడుపులో పుండ్లు, మహోదరము మున్నగు బాధలు పొందు వారగుదురు. గూని కుంటు గుజ్జు వికారము గల వారు సజ్జనులను మోస పుచ్చి ధనము పొందినవాడు వెఱ్ఱివాడయి పుట్టును. సంతతిలేని వారు పూర్వము పితృకార్యము చేయని వారు బాలురను బాధించిన వారును. నపుంసకులు పూర్వ భవమున ఎద్దును బట్టి అవయవము ఛేదించి కామసుఖము లేకుండ చేసినవారు. తొంటి జన్మమున భర్తకు వంచన జేసిన స్త్రీ విధవరాలై జన్మించును. పరిశుద్ధులయి పుట్టియు గర్వము చేతను అహంకారము చేతను అసహ్యామగు పనులు చేసి నందున తుచ్ఛులు ఋలువలై పుట్టుదురు. గర్వాహంకారముతో జనులను నిష్కారణముగ

కొట్టి తిట్టువారు, మఱుజన్మమున ఒకరికి దాసులై తిట్లు పడుచు కష్టముల పాల గుదురు. భోగలాలసుడై మాననీయులను హీనముగ జూచిన వాడు మఱుజన్మ మున తన అవసరమునకు అడ్డులు వచ్చి విఫలుడగును. ప్రభుత్వముచే శిక్ష బొందిన వాడు తొలిపుట్టుకలో నిరపరాధులను దండించిన వాడు. తమవద్ద నమ్మియుంచిన సొమ్మును తిరిగి యీయక ఏదో నెపమున తామే వాడుకొనిన కుత్సితులు మఱు జన్మమున వారి సకల ధనములు నష్టపోదురు. బంధు సమేతముగ ఒకేసారి మడిసి వారు పూర్వజన్మమున నరమేధము చేసిన దురాత్ములు.

ఈ విధముగ పాపమొనర్చిన వారెల్లరకు నరకమేగతి. అందరి కష్టముల న్నియు పడవలసినదే. నరులకు తాజేసిన కర్మఫలము తప్పదు కాని అదే జన్మమున అనుభవము రాదు. మునులు యతులు వారివారి తపఃఫలములు ఆ దేహముతోనే అనుభవింతురు.

ఈ విషయములన్నియువిని పార్వతి మరల ఒక ప్రశ్న అడిగినది. దేవా! మీ చెప్పిన విశేషములన్నియు గ్రహించితిని. తప్పులు చేసిన వారిని ప్రభువులు శిక్షింతురు, ఆ నేరగాండ్లీ జన్మముననే శిక్ష ననుభవించుచున్నారుగదా అదెట్లు అనగా శివుడిట్లు చెప్పెను.

నేరస్తులను దండించుట ప్రభువుల విధి; మఱెవ్వరును అట్టి నేరము చేయ గూడదని తెలియ జెప్పుటకును. అదియును ఆ తుంటరుల పూర్వకర్మఫలమే. ప్రభుదండన మందినవానికి యమదండన ఉండదు. తప్పులేకుండ శిక్షించిన వానికి యమ బాధ తప్పదు. తప్పుచేసిన వానిని శిక్షింపకున్నచో యమ బాధ పడవలసినదే. అందరును వారివారి కర్మఫలమును అనుభవించవలసినదే అందుండి తప్పుకొనలేరు. మరల పార్వతి యిట్లడిగినది. దేవా! కర్మఫలము అనుభవించవలసినదే అంటిరి ప్రాయశ్చిత్తమున పాపము పోవునందురు. అశ్వమేధయాగంబున అన్ని పాపములు పోవునందురు గదా. ఈ విషయము విశదీకరింపుడనగా పరమశివుడిట్లు పలికెను. కామ కృత్యఫలమనుభవింపవలసినదే. ప్రాయశ్చిత్తము వలన కామ కృత్యము సెడును సందేహము లేదు. దేవాసుర మునులకైన కర్మఫలము తప్పదు. పుణ్య కర్మముల వలన నరుడు స్వర్గమునకేగును. పుణ్యము తక్కువైన నరుడుగనే, ఉండి సౌఖ్యము లనుభవించును.

**గ్రహచారము :-** నరుడు చేయు మంచికి చెడ్డకు గ్రహముల ప్రభావము కలదు. చేయువాడు తానేకాన తన కర్మఫలములు తాను అనుభవింపవలయు.

**మరణము** :- ఆత్మ అనునది నిత్యము. దేహము అనిత్యము. వయసు చెల్లిన కొలది దేహము పట్టు దప్పినపుడు ఆత్మ అందుండి వెడలి పోవు దశ మరణము. జీవుడు మఱియొక దేహమును పొందుటే పుట్టుక.

**ఆయుర్వృద్ధి క్షయములు**

దేహము జీర్ణమగునుగాని మరణమును తీసికొనిరాదు. మనుజుని ఆయుః ప్రమాణమున కతని పూర్వకర్మములు కారణము.

ఆయువును వృద్ధి చేయునవి = ఓర్పు, సత్యము, దయ, శౌచము గురు భక్తి తపము బ్రహ్మచర్యము మితభోజనము ఔషధము.

ఆయువును తగ్గించునవి = తన శక్తిని మించి పనిచేయుట, అపథ్యమైన భోజనము.

పూర్వకర్మముల వలననే ఈ గుణము లలవడును. పుణ్యములొనర్చిన వారు స్వర్లోకమున చిరకాలముండి మర్త్యులై జన్మించి చిరాయువు కలిగిన వారగుదురు. ఇతరులకు అల్పాయువు నరకమే గతి.

**పురుష స్త్రీ విధములు**

పురుషత్వము స్త్రీత్వములనునవి శాస్త్ర యుక్తముగ లేవు. వారి వారి చేయదగిన కర్తృత్వము వారికి భావించదగిన విధి. ఆత్ముడు కర్మములకు కర్తగాదు. అతని సత్వరజస్తమోగుణములు వాతపిత్త గుణములు మనుజునిలో ఉన్నవిధమున అతని కర్మములు జరుగును.

సాత్వికము : సత్యము, శౌచము, దయ

రజోగుణము లోభము ఆసక్తి మోహము, క్రోధము

తామసము : అసత్యము, హింస, భయము, మందబుద్ధి, అధైర్యము, నిద్ర ఇవి అనేక విధముల బురుషునిలో గొని కర్మలాచరింప జేయును. ఈ గుణములే మనుజుని నరకమున ద్రోయును. నిర్గుణుడు మోక్ష లక్ష్మి కర్హుడు. నరులకు వారివారి కర్మములననుసరించియే శుభాశుభములు కలుగును. హితమును గోరి వచించు పల్కులొకింత పరుషములైనను మేలొనరించును. ప్రభువు భృత్యులను దేశికుడు శిష్యులను, వైద్యుడు తగు ఔషధములిచ్చి తీసికొనుడని రోగార్తులను తర్జించుట పుణ్య ప్రదములై భాసించును.

చెమట వలన బుట్టినవి, భూమి నుండి పుట్టినవి. మావి వలన పుట్టినవి వివిధ ప్రాణులున్నవి. అందు నరజన్మముత్తమము. అజ్ఞానము పోవుటకు బ్రహ్మయే తపమొనరించెను. జ్ఞానము సన్మార్గముల వినికి వలన కార్యాకార్యముల స్వభావము వలన తెలియనగును. అతడు చేసిన పుణ్య మల్పమైనను వినికిడి అధికఫలము నిచ్చును. సత్కర్మమెంత జేసినను అజ్ఞాని కది నిష్ఫలమే. మృతినంది మరల జన్మించిన వానికి పూర్వ వృత్తాంతము బుద్ధియందుండును. పెద్దయైన కొలది ఆ గుణము నశించును. పూర్వ దైహికముల నెఱిగి వారును ఒక్కొక చోట నుందురు. అట్టి వానిని యముని దూతలు కొనిపోయినను యముడు కరుణించి వారిని తిరిగి పంపివేయును.

## స్వప్నములు

**1.** స్వప్నములు :- నరుడు నిద్రావస్థనున్నపుడు మనస్సు యొక్క చేష్టకల, కలలు రాబోవు శుభాశుభములు సూచించును.

**2.** కర్మవర్తనము :- దైవము కర్తగాదు. నరుడు చేసిన పూర్వకృతము దైవ నామకమున పరగును. పురుష ప్రయత్నము చేతనే అది యగును. వర్షము వాయువు ఏర్పడినట్లు త్రవ్వినపుడు జలము, సమిధ మధించినపుడు అగ్ని వచ్చునటుల నరుని చేష్టదైవ యోగమున సిద్ధిబొందును.

**3.** గర్భము :- (జీవుడు) గర్భమున ప్రవేశించుటకు సంభోగ బీజము, రక్తము దైవము ఇవి కారణములు. మాయారహితుడైన ఆత్ముడు అహంకారముచే పుట్టువు అనుచెఱలో పడును.

**4.** దైవరహస్యము :- తొల్దొల్తనరులకు పూర్వ జన్మ స్మృతి ఉండెడిది. దానివలన అందరు పాపరహితులై అమరులు అగుట వలన స్వర్గమున సందడి రద్దీ ఎక్కువైనది. దానిని గమనించి బ్రహ్మమనుజులకు పూర్వ జన్మ జ్ఞానము లేకుండ చేసినాడు. ఇదికారణమై నరకము నిండిపోయినది. మనుజులు పాపవర్తనులైనారు. ఇదియు బ్రహ్మకు నచ్చలేదు. మనుజునకు మనస్సు, బుద్ధితో పాటు ధర్మ శాస్త్రమునిచ్చినాడు. సర్వము నరుని వర్తనముపై ఆధారపడి యున్నది.

**5.** పునర్జన్మము :- ఉన్నదా, లేదా అను సంశయము మనుజులను బాధించు పెద్ద సమస్య. ఆ విషయము నిశ్చయముగ దేవతలకే తెలియదు. నరులకేమి తెలియును. వేద పాఠముల నవగాహన చేసికొని క్రమముగా జ్ఞానియైన వానికే అది తెలియగలదు.

**6. మృత్యులైనవారికి ఆకారము లేదు** :- యమభటులా జీవుని ఎట్లు కొనిపోదురు. యముడు వారినెట్లు శాసించును. శిధిలము జీర్ణము అయిపోయిన శరీరము నుండి విడిపించి మాయా శరీరము కలుగ జేసి తీసికొని పోదురు. ధర్మ వర్తనులను సుగంధము మృదువైన బాటను, మధ్య తరగతి వారిని ఎట్టి బాధలు పెట్టకుండను, పాపాత్ములను ముళికి కఠినమైన మార్గమున యీడ్చి తేసికొని పోయి యముని ముందు బెట్టగా, యముడు ధర్మవర్తనులను పుణ్య లోకములకు మధ్య వారిని మర్త్యలోకమునకు పాపాత్ములను ఘోర నరకమునకు పంపును.

**7. నరకము ఎట్టిది** :- భూమి క్రింద రౌరవము దాని క్రింద మహా రౌరవము దానిక్రింద కంటకావనము కలవు. నరకతలములైదు. పాప క్రియా తారతమ్యము లూహించి యముడు వారిని తగు చోటికి పంపును. పాపులకు అగ్ని కుండము మున్నగు పంచ కష్టములుండును. యమ భటులు దండన తోను కత్తి కోతల బాధ పెట్టుదురు. కుక్కలు కఱచును, గ్రద్దలు పీకి తినును. విష క్రిములు దొలుచుకు తినును.

నరక బాధల వలన పాపము తొలగగనే క్రమముగ పురుగు పక్షి జంతువు మానుష జన్మముల తిరిగి పుట్టుదురు.

**8. త్రివిధ పాపములు** :- మనస్సుచేత - పరధనములందు అపేక్ష, పాపమును సహించుట ధర్మద్వేషము మొదలైనవి.

వాక్కుచేత - అబద్ధమాడుట, పరుష నిందాభాషణములు మొదలైనవి.
కాయికములచేత - హింస, వధ, నిర్బంధము, తినకూడని పదార్థములు తినుట, పరస్త్రీ సంగము, మద్యపానము మొదలైనవి.

**9. మద్య పానము** :- పాపములలోకెల్ల మద్యపానము అతిహేయమైనది. నింద ప్రాణహాని, కీడు, నరకము మద్యపాన ఫలితము. సజ్జనులు మధుపానము చేసినచో లోకమున మర్యాదయే ఉండదు. అన్ని వర్ణముల వారును మద్య పానము విడిచి పెట్టవలసినదే. అట్లు విడిచిపెట్టుటే సంపద కీర్తి వైభవము లభించుటకు మార్గము.

**10. సుకృతములు (పుణ్య కార్యములు)** :- ఇవియు మూడు విధములు.

1. ఔపరమికము : పాపములు చేయుకుండుట. పెద్ద యత్నము దీనికక్కరలేదు. ధన వ్యయము లేదు. ఈ సౌలభ్యము అజ్ఞానులెఱుగరు. ఎఱుగక నరకమునకు పోదురు. పరలోక భీతిచే గాని, ఇంద్రియ నియమములవలన గాని ధర్మాభి యుక్తి కలిగి పుణ్యలోకముల చేరవచ్చును.

2. నిరుపకరణము : శౌచము, సత్యము, శాంతి, దాంతి ఆర్జవము, వ్రతము, ఉపవాసము, బ్రహ్మచర్యము, దీని నియమములు. శౌచము రెండు విధములు. హృదయమున చెడు తలపులు లేక నిర్మలముగా నుండుట. అభ్యంతరము. ఆహార శుద్ధి శరీర శుభ్రత బాహ్యము. కనినది వినినది ఉన్నరూపున నుడువుట సత్యము. శాంతి అనగా బుద్ధిని సౌమ్యముగా నుంచుట. దాంతి కర్మేంద్రియముల యోగ్య ప్రవృత్తి. ఆర్జవమనగా మోసము లేని సంపాదన. మంచిపని పూని చేయుట వ్రతము. మితాహారము ఉపవాసము స్త్రీ సంగమేచ్ఛ లేకుండుట బ్రహ్మచర్యము.

తీర్థ సేవ : విశిష్టమైన నియమము. అన్ని నదులు తీర్థములే. సముద్రమున కలియు నదులు ఉత్తమ తీర్థములు. అవి అధిక ఫలము నిచ్చును. ముని వాటికలు, అబ్ధిసంగమము గల నదీ ప్రదేశములు, నదులు అన్యోన్యము కలిసి ప్రవహించు ప్రదేశములు పరమ తీర్థములు. శుచిగా స్నానాదులు చేయవలయును. వెంటనే దేవార్చన విప్రార్చన ముఖ్యములు. దగ్గఱగానున్న తీర్థముకన్న దూరముగానున్న తీర్థములు మేలు. సముద్రమే ఒక మహాతీర్థము. అందు మునులు కొనియాడిన స్థలములు చాల పుణ్య ప్రదములు.

3. సోపకరణము : వైదిక క్రియలందు పితృ క్రియలందు ధనధాన్యాదులను సమృద్ధిగ దానమునకు వినియోగించుట. అర్హులు పండితులునగు విప్రులకు, పుణ్య కాల ప్రదేశములందు దానము మేలు.

ఉత్తమ దానము : విప్రుని కోర్కె ప్రకారము పితృకార్యమున వస్తువును భక్తితో నిచ్చుట.

మధ్యమదానము : చేయవలసిన దంతయు చేసి వ్యయమునకు విచారించుట

అధమ దానము : చేసినందులకు తన్నుతాను పొగడుకొనుట.

ఈ చివరి రెండు స్వభావములను మానవలెను.

**దాన ఫల విశేషములు.**

పార్వతి ఈ విషయమడుగగా శివుడిట్లు వివరించెను. దానముచేయవలసిన వస్తువులలో, అన్నము, జలము చాల ముఖ్యమైనవి. అవి అన్ని జంతువులకు మను జులకును ప్రాణమిచ్చునవి. ఆ దానము వలన స్వర్గలోకమున చిర సౌఖ్య వాసము కలుగును. బంగారము అగ్నితో సమానము. ఆ దానము వలన కామితార్థ సిద్ధి. గోదానము, అందునను కపిల గోదానము అత్యంత శ్రేష్ఠము. తరువాతి పెక్కు

తరముల వారికిని శ్రేయఃప్రదమేకాక ఊర్ధ్వలోక ప్రాప్తి కలుగజేయును. భూమి వలన పెక్కు సంపదలు లభించును. దానమిచ్చిన భూమి పెంపుగా నున్నంత కాలము దాతకు ఊర్ధ్వలోకములందు చిరకాల సౌఖ్యమమరును. కన్యను దానమిచ్చినచో యమునకు సంతృప్తి, దేవతలు సంతోషపడుదురు. కన్యా దాతకు తేజము సంపద యశము కలుగు జన్మ లభించును. విద్యను ఇచ్చినను, పేదలకు విద్య చెప్పించినను అవ్యయానంద సిద్ధి కలుగును.

తిలాదానము = అగ్ని ష్టోమ ఫలమిచ్చును. వాసోదానము చిరత రాయుఃప్రదము గొడుగు దానము పీడలు లేకుండ చేయును. దాసదాసీ జన దానము కర్మ విమోక్షము. దీపదానము విమలమైన ఆత్మ భావమునిచ్చును. నదిని దాటించు సేవ వ్యసనములకు దూరము సేయును. ఔషధ దానము రోగములు రానీయదు. బాటసారికి స్థలము నిచ్చుట శరీర సౌఖ్యము నిచ్చును.

అంతఃకరణ శుద్ధిగ చేయు దానము అల్పమైనను అధికఫలము నిచ్చును. శ్రద్ధ శుద్ధి లేని దానము పెద్దమొత్తమైనను నిష్ఫలమే.

యజ్ఞము రెండు విధములు. వైదికము, లౌకికము. రెండును దేవతా ప్రియములు.

1. వైదికము - వర్ణమునకు తగిన యోగ్యమైన ఆర్జనతో, ఋత్విగర్చన చేయు యజ్ఞము దేవతలకు తృప్తిగావించునది.
2. లౌకికము - దేవతలకు ఉత్సవము, నృత్తగీతాదులు, గంధమాల్య ధూపములు భక్ష్యభోజ్యంబులు కలది.

యజ్ఞకర్తకు ఇచ్చుట అతని నుండి పుచ్చుకొనుట అధిక పుణ్యము. యజ్ఞ కర్త లోకోత్తరుడు. ఏ యితర ధర్మదానములును యజ్ఞమునకు సరిపోవు. ధ్యాన తత్పరతతో యజ్ఞము చేసినచో ఫలమిచ్చును గాని, మనస్సు ఎక్కడనో పెట్టుకొని యజ్ఞము చేసినను ఫలము లేదు. మనమనస్సులలోనున్నది సర్వము దేవత లెఱుగుదురు.

## పైతృక కర్మలు

గంగ కురుక్షేత్రము మున్నగు చోటులను, మాఘ భాద్రపదమాసముల లోను బహుళ పక్షము అమవాస్య త్రయోదశి నవమి తిథులలో ఈ కర్మములు దేవతలకు తృప్తినిచ్చును.

దర్భలు తిలలు పవిత్రములైనవి. పితృక్రియలకు అర్హములు. శుచి, అక్రోధము శ్రద్ధ పితృ క్రియలకు ముఖ్యము. శుక్ల పక్షము పూర్వాహ్ణములు తిథి

ద్వయము జన్మదినములు ముఖ్యములు. నేయి పెసర పాయసము అప్పములు గారెలు ముఖ్యములు. భోక్తలుగా, శ్రోత్రియులు, రోగము లేనివారు, శరీర సౌష్టవము కలవారు సజ్జనులు అర్హులు. సగోత్రీకులు, భార్యలేని వారు, ఇతర కులములవారు పనికిరారు. గంధ పుష్ప ధూపదీప వస్త్రములిచ్చి భోక్తలను పూజ చేయవలెను. సమృద్ధిగ భోజనము నీవలెను. పిండ పూజయథావిధి జరుపవలెను.

జనులు మృతి బొందగనే ఆ జీవులు వెన్వెంటనే పునర్జన్మము నందుదురు. ఎవ్వరికని ఈ శ్రాద్ధ విధులు చేయుదురని పార్వతి సందేహము వెలిబుచ్చగా శివుడిట్లు చెప్పెను.

ఇది చాల రహస్య విషయము. వినుము. పితృ దేవతలును దేవ బృందము ఉత్తర దిశనుందురు. వారికి చేయు పూజలు హవ్యము అనబడును. పితృ గణము దక్షిణదిశ నుందురు. వీరికి చేయు పూజ కవ్యము అనబడును. మరణించిన వారికి శ్రాద్ధము చేయగా పితృ గణము హర్షమొంది కర్తకు ఆయువు శ్రీ కీర్తి ఇహలోక సుఖములిచ్చి సుగతులు కల్పింతురు.

## ధర్మవిశేషములు

రోగ గ్రస్తులకు ఔషధ మిచ్చుట, దీనులకు సహాయపడుట, తీర్థ యాత్రి కుల నాదరించుట, అనాధ శవదహనము, దుఃఖమునందున్న వారిని ఓదార్చి ఆద రించుటయు ప్రశంసనీయములైన గొప్ప ధర్మములు.

ధర్మము వివిధ రీతులనుండును. జాతి ధర్మము, దేశ ధర్మము కుల ధర్మము గణ ధర్మము ఆ పద్ధర్మము అని ధర్మమైదు తెఱగులు.

## పుణ్యలోక భోగములు

అన్ని తెఱగుల పూవులయందును వికసించి సౌరభము విరజిమ్ము కల్ప వృక్షపు పూత ఆహారముగ అమృత సమముగా నుండును. ఆకాశము నిర్మలముగా నుండును. ధరించిన ఆభరణములు మిగుల ప్రకాశించును. సుందరులు మృదు స్వభావులు మంచి గుణములు కలిగి స్త్రీ పురుషులు క్రోధములేక అన్యోన్యమై త్రితో, ముసలితనము ఏరోగ బాధ లేకుండ, ఆలోకములందు నిరంతరానంద భోగము లనుభవింతురు.

## సుగతి దుర్గతులను బొందు వారిని తెలిసికొనుటెట్లు

ఇతరులకు కీడు తలంపక, ధర్మ వర్తనులయి సత్యము పలుకుచు దయా

మయులై దీనులను పోషించుచు, అతిథులను ఆదరించుచు, సజ్జనులను గురువులను పూజించు వారు సుగతులంది స్వర్గలోకమున కేగుదురు.

దుర్గతి బొందువారు: పరుషము, అసత్యములగు పల్కులు, అన్యధన మభిలషించువారు పరస్త్రీ లోలురు, బంధువులకు సజ్జనులకు చెడ్డ చేయువారు దుర్జనులు దుష్టసాంగత్యముకలవారు ధర్మపరుల యెడల అసూయ గలవారు ఘోర నరకము పాలగుదురు.

### పరమ ధర్మము - సాంఖ్యము - కపిల మహర్షి సేవితము

ధర్మములు పెక్కులున్నవి. ధర్మార్థ కామములిచ్చు సౌఖ్యములు శాశ్వత మైనవి. మోక్షధర్మమే నిత్యమహా సౌఖ్యము కలుగ జేయును. మోక్ష పదము లభించు మార్గము వినుము. గృహస్థ ధర్మమున చేయదగిన సత్క్రతులొనరించి శాంత చిత్తులై వనమునకేగి సద్గురువు వద్ద సాంఖ్య యోగమును తెలిసికొనవలెను. పంచ వింశతి ( ఇంద్రియాది ఇరువదియైదు) గుణముల జ్ఞానమే సాంఖ్యము. నిశ్చల ధర్మమనస్కతతో వీనినన్నిటిని ఒకే ఆధారముగ చేసికొనుట యోగము.

ఇందులకు సాధనము శీతోష్ణములు. హర్షదుఃఖములు మొదలైన ద్వంద్వ ముల కతీతుడై యుండుట. శౌచము, బ్రహ్మచర్యము శాంతి, మితాహారము, ఇళా నాడిని జూచుచు అంతరాత్మ చింతనకు భగ్నము రానీక భక్తియుక్తిని ఆయం తరాత్మ దర్శనము పొందుట మోక్షము. దీనికి నిశ్చలమైన సదాభ్యాసమావశ్యకము. సంసార శోకమోహ వశుడైన వాడీ యోగమును పొందలేడు.

సంసారమున ధననష్టము బంధు మరణములు మున్నగు ఏవో కష్టములు వచ్చుచుండును వానికై శోకించుట మనస్తాపము తక్క వేరు లేదు. సుఖదుఃఖములు వచ్చుచు పోవుచుండును. ఎచ్చటికి పోయి దాగుకొనినను మృత్యువు తప్పదు. అన్ని యజ్ఞ దానఫలముల మించినది మోక్ష దర్శిత్వమొక్కటే. మంచి అన్నది విలంబ నము లేక ముందుగనే చేయవలెను.

వైరాగ్యము ప్రశాంతిని, ప్రశాంతి ముక్తిని ఇచ్చును. సంసృతి దుఃఖమును పాయజేయునది అదియొక్కటియే. సాంఖ్యులు జ్ఞానమున విముక్తి నందుదురు. ప్రకృతికి అవ్యక్తనామకమును కలదు. అందు - మహదహంకార (1+1) తన్మాత్రలు (5), మనము (1), ఇంద్రియములు (11), భూతములు (5) జన్యములైనవి.

| | | |
|---|---|---|
| ఇంద్రియములు | 12 | త్వక్కు, చక్షు, శ్రోత్ర, జిహ్వ, ఘ్రాణ ( జ్ఞానేంద్రియములు) మనస్సు, బుద్ధి, వాక్కు, పాణి, పాదము, పాయువు ఉపస్థము ( కర్మేంద్రియములు). |
| భూతములు | 5 | పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము |
| తన్మాత్రలు | 5 | గంధ, రస, రూపము, స్పర్శ, శబ్ద |
| మహత్తు | 1 | |
| అహంకారము | 1 | |
| | 24 | |

పంచవింశకమను ఇరువది యైదవది క్షేత్రము. ఆతత్త్వమునుండి వచ్చిన శక్తి సత్త్వ రజస్తమ గుణము లాధారముగ లోకములను సృజించును. అట్టిది అవ్యక్తము అణువు నిత్యము ఏకము, అక్రియము, అహైతుకము, అగోచరము అయి ప్రధానమైనది.

సాత్త్వికములు - సౌఖ్యము, తృప్తి, ప్రకాశము

రాజసము - మోదము, ఖేదము, రాగము, ద్వేషము, ద్వంద్వములు.

తామసములు - అప్రకాశము, దుఃఖము, మోహము, ఆలస్యము

ధైర్యము, విజ్ఞానము, శ్రద్ధ, దయ, హర్షములు కలిగి ఉండుట మోహలోభములు లేకపోవుట సాత్త్వికగుణమును వృద్ధి చేయును. సత్త్వగుణము పోయినచో అవియును తగ్గును.

రజోగుణమును క్రోధలోభకామ అనృత ద్రోహ తాపగుణములు వృద్ధిచేయును. అవి తగ్గినచో రజోగుణము తగ్గును.

తమోగుణమును సంశయము విచారము నిద్ర జడత్వము వృద్ధి చేయును. అవి తగ్గినచో అదియు తగ్గును.

ఈ త్రిగుణములు ఒకదానిని మించి ఒకటి మానవుని లొంగజేయును. వానిని ఉపేక్షసేయరాదు. ధర్మార్థ కామములకు మూలము సత్త్వగుణమే. బుద్ధి అనగా మహత్తత్త్వము వివేక విజ్ఞానములకు చిహ్నము. అహంకృతి తొలగుట ఇది మోక్షకారణము. ఇంద్రియములనడగింప మనశ్శక్తి చాలును. దేహమున కన్యుడు దేహి అందుండును. దేహము దేహి వేఱు అని తెలిసి కొనుట చాలును. మనసును

అన్యచింతల పోనీక ఉంచుటే నిర్మనస్కృత మోక్షకారణము. అపుడు ప్రకృతి నుండి తొలగు పంచవింశతి తత్త్వము ప్రకాశించును. అతడు పరమహంస అనబడును. ఆ విజ్ఞానము పరమ శాంతి ప్రదము. పంచతన్మాత్రలగు రస గంధాదులు లేని నిర్వికారత సర్వ వ్యాపియై అణువును మహత్త్వమును తానై జ్ఞానేంద్రియములకు ఆలంబమై ప్రకాశించు తేజము పరమాత్మ షడ్వింశము. ఇరువది ఆరవతత్వము. సమతా బుద్ధితో దానిని జూచు వాడు మోక్షాతీతుడు.

## యోగ ప్రకారము

ఇంద్రియములు మనసు బుద్ధి ఆత్ముడు ఒకటిగానగుట యోగ జ్ఞానము. అగ్ని సమారాధన, ఎక్కువగా మాట్లాడకపోవుట-సత్య సంధత, సాత్త్విక వర్తన - దానము అధ్యయనము శౌచము పాపముల బోగొట్టును. పాపరహితుడై యోగ సాధన బూనవలెను. శుభ్రము ఏకాంత మగుచోట, నేలపై ఆసీనుడై అయిదింద్రి యములను నిశ్చలముగ నుంచి, మనసున ఆత్మ చింతనసేసి, ప్రాణమును అపానమున ( మూడిగాలి) కలియజేయుట యోగసిద్ధికి సాధన. అట్టి యోగసిద్ధి పొందినవానికి అపానమిశ్రము కలిసిన ప్రాణము శీర్షముననున్న సహస్రారచక్రమునకు రప్పించినచో అతడె జీవుడు పరమాత్ముడు. ఇట్టి యోగ సేవకు సోమరితనము చంచలమతి, తిండి పోతు తనము వ్యాధి కలలు కామ క్రోధములు లోభము మోహము భయము విరోధులు. వీనిని విడనాడిన వానికి అష్టసిద్ధులు ప్రాప్తించును.

## శివుడు పార్వతికి తెలిపిన ఆత్మ సాయుజ్య ప్రాప్తి

దేవతలు మునులైనను పరమాత్మనయిన నన్ను ( శివుని) ఊహించలేరు. యోగము సాంఖ్యము రెండును నేను చేసినవి. నేను ఈశుడను అవ్యయుడను సత్యుడను. సనాతనుడను నిష్ఠతో ధ్యానము, స్తుతి, వందనము కీర్తనలతో నన్ను పూజించు వారికి అన్ని కోరికలు సమకూర్తును. ఆశ్రమ ధర్మములు, పాశుపతి మహా వ్రతము విప్రులకు నేను పూర్వము జెప్పితిని. నానాటికి లోకమున శిష్య ప్రశిష్యుల వలన అవి ప్రసిద్ధి కెక్కినవి. శుభము, రక్ష, శుచి, లింగార్చన సఫలమగుటకు భస్మమును, నేను సృజించితిని. దానిని దేహము నిండ పూసికొనినవారు కపాల ధారులయి బ్రహ్మచర్యము భిక్షుకులై, జడలు పెంచుకొనిగాని, తలలు బోడిగ జేసి కొని గాని స్థిర చిత్తమున నన్నె తలంచు భక్తులకు పరమానంద సుఖము నిచ్చెదను. ఆ విధానమున నా సాయజ్యములభించును.

శివలింగ స్థాపనము పూజ, జగత్తున పరమ శ్రేయః ప్రదము. నన్ను లింగముగా జేసినాను. శక్తి కొలది పాలు నేయి జలములతో లింగమునభిషేకించి గంధ మాల్య ధూప దీపములతో నర్చించి నైవేద్యము పెట్టు భక్తులకు మోక్షము సమ కూరును. ఓ పార్వతీ! నీవును త్రిలోక స్త్రీ జనములు పూజింపదగినదానవు. నీవు పరమ వివేకము గల దానివి. జ్ఞానివి. వ్రత విధాన నిష్ఠలు గలదానవు. కాంతా ధర్మము ఎట్టిదియో పార్వతీ నీవలన వినగోరుచున్నాను. నాకావిషయము విపుల ముగ తెలియ జెప్పుము.

## పతివ్రతా ధర్మములను పార్వతి శివునకు దెల్పుట

పరమ శివుడే తనను ఇట్లడుగగా పార్వతి కొంత సిగ్గుపడి, వినయముతో ఇట్లనెను. సర్వజ్ఞా! సర్వేశ్వరా! మీకు తెలియనివి ఏమి కలవు. అయినను, గంగ గోదావరి యమున, కృష్ణ కావేరి పెన్న నర్మద కౌశికి మున్నగు నదులన్నియు నావద్దనే ఉండుగాన వానితో ఆలోచించి నుడివెద నను నంత, గంగాదేవి పార్వతితో దేవీ! ఈ విషయమును తెలియజెప్పుటకు నీవే తగుదువు. నీవు చెప్పగా మేమును విని ఆనందింతుము అనియెను. పార్వతి ఏమి చెప్పునో వినుటకు కౌతుకముతో సురలు మునులు సురసిద్ధ సాధ్యాంగనా జనములు అచ్చటికి చేరిరి. పార్వతి ఇట్లు నుడివెను.

ఋతుమతిగాని కన్యను, తల్లి దండ్రులు మేనమామలు మున్నగు పెద్దలు అర్హుడగు వరుని జూచి వానికిచ్చి పెండ్లి చేయవలెను. ఆమెకు భర్తయే దైవస మానము. ఆతని అభిప్రాయానుసారమె ఆమె దేవతా పితృ పూజలు అతిథులకు ఆదరణ సలుపుట విధి. తనంతట తాను స్వతంత్రించి ధర్మకార్యములనైనను సేయరాదు. గృహమున పతికి వలయు పరిచర్య, భోజనాది సౌకర్యములు, పతి దెచ్చి యిచ్చిన ధన వస్తుసముదాయము, దాంపత్య సుఖము వీని అన్నిటియందును పతికి అనుకూల అయివర్తించుటే స్త్రీ ధర్మము. పతికి మరియొక భార్య యున్నను ఆమె యెడల విరోధ భావము తగదు. ఈ విధముగు పతివ్రతా ధర్మమే సతికి శుభ ప్రదము.

## పతివ్రత చేయుగూడని పనులు

పరమేశ్వరా, అధర్మమార్గమున బోవు స్త్రీకి రాక్షసి పైశాచి అనుపేర్లు గలవు. వారు చంచలాత్ములు భోగ లాలసలు, వ్యభిచార తత్పరలు ధనధాన్యములు విచ్చల విడి వెచ్చింతురు. అసత్యములాడుదురు కలహమునకు సిద్ధపడుదురు. నిద్రామ

గ్నులు, లజ్జ ఉండదు. భర్తను పుత్రులను తూలనాడుదురు. పాపముల నుండి బయట పడుటకు వారికొకటే మార్గము. వారు చేయు తప్పు తెలిసికొని పశ్చాత్తాపపడి ధర్మమార్గమున చరించుటయే. అట్లుగాక పతితోడనే మంచితలంపులతో మరణించిరేని పరలోకమున వారికి సుగతులు కలుగును. ఇట్టి అనుమరణము బ్రాహ్మణ స్త్రీలకు తగదు.

ఇట్లు కాంతా ధర్మములు వినమ్ర శిరస్కయై శివునకు నుడివి, తలయెత్తి నమస్కరించిన పార్వతి వచనములకు అటజేరిన దేవాంగనలు మునులు సంతసించి వేవిధముల పొగడిరి.

అంతట శివుడు దేవీ మన యిర్వురికి జరిగిన సంభాషణమునెవ్వడాదరమున చెప్పునో వానికి నిత్య స్వర్గలోక భాగ్యము సిద్ధించును. విను వారికి సిరి సంపదలు ఆయురైశ్వర్యములు కలుగును.

## పరప్రాప్తి విశేషము - సజ్జన సంరక్షణము

నారదుడట్లు శ్రీకృష్ణునకు నుడివిన శివపార్వతీ సంవాదమును భీష్ముడు ధర్మరాజునకు సవిస్తరముగా వివరించి ధర్మజుడడుగగా జప విశేషమునిట్లు నుడివెను.

ధర్మజా, నారాయణ ధ్యాన పూజా సంస్తుతులు పరలోక సద్గతులకు హేతువు. విద్వజ్జనుల కలుషముల బాపి సంరక్షయొసగును. ఒక చిన్న కథ గలదు. ఒకనాడొక విప్రుని తలవరులు పట్టుకొని దొంగయని తలచి కొట్టబోవగా వేశ్యయొకతె అడ్డువచ్చి కాపాడిన కర్మఫలముగ నామె మఱుజన్మమున బ్రాహ్మణియై జన్మించెను. సజ్జన సంరక్షణము సద్గతులకు హేతువు. ధర్మజా నీవును విద్వజ్జనులకు సహాయపడి ధన్యుడవగుము.

## దారిద్ర్య వ్యాధి శోకంబుల నివారణము

ఈ శోకముల బాపుటకు జపమేదైన యున్నదా అని ధర్మరాజడుగగా భీష్ముడిట్లు నుడివెను.

ధర్మజా సర్వదైవములను, సర్వ నదులను, సర్వదేవతలను సర్వ మునులను సర్వ ఋషులను సర్వ క్షేత్రములను తీర్థములను, నైమిశాది పుణ్యారణ్యములను, గరుత్మంతుడు మున్నగు పుణ్య పురుషులను, హిమవత్కైలాసాది పర్వతములను, భూమ్యాకాశములను పుణ్య వృక్షములను బ్రాహ్మణులను చక్రవర్తులను పరమ భక్తిందలచి కీర్తించి నమస్కరించి ఈ సమూహమంతయు నన్ను రక్షించి నా కాయురైశ్వర్యములనిచ్చుగాకయని మనసార కోరుకొని ఓమ్‌నమో భగవతే వాసుదేవాయ

''ఓమ్ నమో పురుషోత్తమాయ....... అని పఠించుట మహా జపంబు - సర్వసిద్ధి కరమైన ఈ జపమువలన పాపములు భయములు ఆపదలు తొలగి శుభములు ప్రాప్తించును ధర్మ తత్పరత కలుగునని భీష్ముడా మహా జపమునుపదేశించెను.

## విష్ణుమంత్ర ధ్యానమహిమ - విష్ణు సహస్రనామములు
## (విష్ణు సహస్ర నామములు ఈ గ్రంథమునకు తుదిని అనుబంధముగ జేర్చబడినవి.)

ధర్మజుడు మరల దేవకీ నందనా! ఏ దైవము సర్వలోకములకు పూజనీయుడు, ఎవనిని భక్తితో సేవించిన శుభములు శ్రేయములు కలుగును ఎవని నామము జపించిన జన్మ సంసార బంధము లుడుగును. ఎవరా ఒక్క దైవము నాకెఱిగింపు మనగా భీష్ముడిట్లు చెప్పెను.

ధర్మజా వినుము. శ్రీ మహా విష్ణువు పరమదైవము. ఆయన అఖిల జగత్ప్రభువు. దేవదేవుడు పురుషోత్తముడు. భక్తి నిరతి నాదేవుని దలచి నిశ్చల ధ్యానమున ఆ పుండరీకాక్షుని సహస్రనామములతో కీర్తించుట ధర్మముల కెల్ల పరమ ధర్మము. ఆతడు బ్రహ్మణ్యుడు సర్వధర్మజ్ఞుడు, వరదుడు, విశ్వలోక ప్రధానుడాతని వేయి నామములు సర్వ దుఃఖహరములు. అయ్యది పరమతేజము పరమ పదము, బ్రహ్మము, పరమ పరాయణము, పవిత్రములకెల్ల పవిత్రము మంగళముల కెల్ల మంగళము. దేవతల కెల్ల పరమదైవము భూతజాలమునకు అవ్యయ జనకుడు. ఆ మహాత్ముని నామములు ఋషి సమాజ పరిగీతములు, భూరి గుణయోగ్యములు. శుభప్రదములు అని పలికి ఓమ్ విశ్వమ్ విష్ణుర్వషట్కారో భూత భవ్య భవత్ప్రభుః మొదలు... ఓమ్ నమయితి'' అనుతుది వరకు నుడివి, దీనినెల్లవేళల జపింపమని చెప్పెను.

## విష్ణు నామ ప్రభావము

విష్ణునామములు వేయియు నిత్యము వినినను పఠించినను ఇహపరము లందును ఏ కష్టములు లేక అత్యంత శుభములు లభించును. ఏకాంత భక్తి వీనిని విని, పఠించిన విప్రునకు వేద జ్ఞానము, రాజునకు విజయము వైశ్యునకు ధనము శూద్రునకు సౌఖ్యములు లభించును. ధర్మార్థకామసిద్ధియు లభించును. భయ దుఃఖములు సర్వము తొలగును. వీర్యము తేజము కాంతి బలరూప గుణములు కీర్తియు కలుగును. వ్యాస సంప్రణీతములయిన ఈ నామములను భీష్ముడుపన్యసింపగావిని ఆలించి ధర్మజుడా మహనీయునికి మ్రొక్కి సంతుష్టాంతరంగుడ

య్యెను. సకల విశ్వము సకల వస్తువులు నర సురము న్యాది సకల జీవులు హరివ శవర్తనులు వీనిని విని పఠించువారలకు ఇది ఆయు(శ్శీ విభవారోగ్య సంపద లొసగును.

## బ్రాహ్మణ పూజా నమస్కారము

భీష్ముడు మరల చెప్పుచున్నాడు.

పూజా నమస్కారములకు బ్రాహ్మణులు అర్హులు. వారికి కీడు చేసినచో ఇంద్రుడును కష్టముల పాలగును. బ్రాహ్మణులు సంతసించినచో శుభములెల్లను ప్రాప్తించును. విప్రులు ధర్మ ప్రవర్తకులు. తపోధనులు. ధనము వాక్కు, విప్రుల కొక భోజనమునకిచ్చినను అది ఎన్నో పాపముల బాపును. వారు దేవతల వంటి వారు. బ్రాహ్మణుల పూజించుట వలన విశిష్ట భాగ్యములు కలుగును. దీనికి ఒకకథ కలదు వినుము.

మున్ను కార్త వీర్యార్జునుడను ఒక రాజు గలడు. అతనికి వేయి చేతులున్నవి. మహా బలుడయి ఏడు దీవులు పాలించుచు గర్వమున తనకంటె బలవంతులెవ్వరు లేరని విఱ్ఱవీగుచుండెను. ఒకనాడొక ఆకాశవాణి కార్త వీర్యా! నీ వెఱుగక పలుకు చున్నావు. బ్రాహ్మణులు అందరి కంటె అధికులు సుమా, అని చెప్పగా రాజులనా శ్రయించి బ్రతుకు బ్రాహ్మణులు అధికులెట్లగుదురు, కారు, నేనే సర్వ భూత ములను పోషించగలను అని ఎదురు చెప్పెను.

అంతట వాయుదేవుడే కార్య వీర్యునితో, రాజా నీవు బ్రాహ్మణులను అంత చుల్కన చేయవలదు. రాజులు ప్రజలను రక్షించుచుండిరనగా అది బ్రాహ్మణుల శక్తివలననే. అహల్యను వలచిన ఇంద్రునకు గౌతముని శాపము తగులలేదా, సాగరుని గర్వము అగస్త్యుడణగింపలేదా. అగ్ని కూడ భృగుని శాపమున కష్టపడెను గదా. ఇంకను వినుమని వాయువిట్లనియె.

ఉచథ్యుడను ముని భార్యను వరుణుడెత్తుకొని పోయి, నారదునిచే కబు రంపినను ఆమె నీయక నారదునే వరుణడవమానించెను. ఆముని కోపించి సముద్ర మందలి జలమంతయు త్రావెను. వరుణుని నగరము ధూళితో నిండి పోయినది. ఏమియు చేయలేక వరుణుడు ఉచథ్యుని కాళ్ళపై బడి అతని భార్యను తిరిగి యిచ్చెను.

గంగాతీరమున దేవతలొకప్పుడు యజ్ఞము సేయుచుండ రాక్షసులు వచ్చి వారి క్రతువును పాడుచేసి వారిని బాధించుండ వారేగి సమీపమున నున్న వసిష్ఠు నకు చెప్పిరి. వసిష్ఠుడొక్కపరి తనకోపదృష్టులతో రాక్షసులను చూచినంత మాత్ర మున రాక్షసులందరును ధ్వంసమైరి.

ఒక తఱి దేవదానవులకు పెద్దయుద్ధమైనది. ఆ యుద్ధమున రాక్షసుల ఆయుధ హతికి సూర్య చంద్రులు బలహీనులైరి. జగమంతయు చీకటి కాగా రాక్షసులు మరింత ఘోరమునకు దిగిరి. మిగిలిన దేవతలేగి అత్రిమహాముని వద్ద మొఱబెట్టగా నతడు సూర్య చంద్రుల గాయముల మాన్పి దీవించి తేజో వంతులను చేయగా, దేవతలుత్సాహవంతులై రక్కసి మూకల నణగించిరి.

కార్త వీర్యా ఈ కథలను వింటివి కదా! బ్రాహ్మణులు అల్పులందువా అధికులందువా అను వాయువు మాటలకు మారుపలుక లేక కార్త వీర్యుడూరకొనెను.

వాయువు మరల నొక నిదర్శనము చెప్పెను. కార్త వీర్యా వినుము. ఇంద్రుడు ఒకపరి ఆశ్వినులు సోమ పానమున కనర్హులని వారినవమానించెను. దానికి చ్యవనుడను ముని కోపించి తన మంత్రములచే దేవతలకు కీడొనరించెను. ఇంద్రుడందులకాగ్రహించి వజ్రాయుధమును ఒక పర్వతమును గైకొని మునిపైకి రాగా ఆ మునీంద్రుడు కొన్ని జలములను వానిపై జల్లినంత అ భస్మమయ్యెను. ఇంద్రుడు మూర్ఛ పోయెను. కొంతసేపటికి ఇంద్రుడు తెలివిగొని మునిపైకి రాగా, ఆముని అతిదార్ఢ్యములైన క్రూర దంతములు గల వానిని సృజించి ఇంద్రునిపైకి సురలపైకి పంపెను. ఆరక్కసి ఇంద్రునితో సహా దేవతలను మ్రింగబోగా వానికి భయపడి సురలు ఇంద్రుడు దీనులై వచ్చి చ్యవనుని కాళ్ళపై బడిరి. చ్యవనుడు కరుణించి వారిని విడచి పెట్టెను. ఎట్టి ఆటంకమును చెప్పక ఇంద్రుడు అశ్వినులకును సోమ పానము నిచ్చెను.

వాయువు మరల కార్తవీర్యా! నీ విప్పుడు బలవంతుడవని విఱ్ఱవీగుచున్నావు. నీకీ బలమెచ్చట నుండి వచ్చినది. దత్తాత్రేయునికి శుశ్రూష చేయుట వలనగదా ఇది మఱవకుము బ్రాహ్మణులు దైవ స్వరూపములు. ఇది తెలిసికొని వర్తింపుము అని నుడువగనే కార్తవీర్యుడు పశ్చాత్తపుడై బ్రాహ్మణులయందు గౌరవాదరములు కలిగి వర్తిల్లెను.

## శ్రీకృష్ణుని ప్రభావము - భీష్ముడు తన ఉపదేశమును విరమించుట

భీష్ముడు నుడివిన ఈ కథలన్నియు వినిన ధర్మజునకు బ్రాహ్మణుల శక్తి సామర్థ్యములను ఇంకను వినవలయునని ఆసక్తి జనించి తనకోరిక భీష్మునకు విన్నవించెను. ఆ మహానీయుడు ధర్మజుని జూచి కుమారా! నీ ఆసక్తికి సంతసించితిని. కాని నేనిప్పుడు చెప్పజాలని స్థితి యందున్నాను. చాల అలసిపోయి ఉన్నాను. ఇం

ద్రియములు వాఙ్మనములు దుర్బలములైనవి. సూర్యుని దక్షిణాయనము ముగి యుచున్నది. నేను దేహము వీడుట కెంతయో తడవు లేదు. శ్రీకృష్ణు డిచటనే యున్నాడు. నీ ప్రశ్నను శ్రీకృష్ణుని అడుగుము. శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు, ఆ మహాత్ముని మహిమను వినుమని భీష్ముడిట్లు చెప్పెను.

శ్రీకృష్ణుడు ఎన్నో లీలలను ప్రదర్శించెను. జలధిలో మునిగిన పృథ్విని క్రీడా వరాహమై ఎత్తినాడు. తన బొడ్డు తామరనుండి బ్రహ్మనుద్భవింపజేసి అతనిచే సకల చరాచర భూత సంఘమును సృజింపజేసినాడు. ధర్మమునకు హానికలిగి నపుడు శ్రీకృష్ణుడు జనించి దుష్టులదునిమి సజ్జనులను కాపాడును. ఆతడు విశ్వమందంతటను కలడు. అతడే శివుడు. దిక్పాలురునతడే. కాలము దిక్కులు నతడే. యజ్ఞకర్తలు శ్రీకృష్ణుని స్తుతించి శ్రేయస్సు ఙ్ఞందుదురు. ఋగ్వేదము శ్రీకృష్ణుని స్తోత్రమె. వేదములు నిరూపించు పరమాత్మ వస్తువాతడే. యజ్ఞకర్త, అగ్ని, ఆహుతులు అన్నియునతడే. యజ్ఞ ఫలరూపమతడే. సూర్య చంద్రుల తేజము అతడే. శ్రీకృష్ణుని మహిమమునిట్లు విని ధర్మరాజు భీష్మునకు ప్రణా మములాచిరించి తనకిన్ని ధర్మ మార్గములుపదేశించినందులకు వినతుడై వేవిధ ముల సంస్తుతించెను.

### కృష్ణుడు ధర్మరాజునకు బ్రాహ్మణ ప్రభావంబు చెప్పుట

భీష్ముని వచనానుసారము ధర్మజుడు కృష్ణునకు భక్తిమెయి ప్రణామము లాచరించి దేవా! బ్రాహ్మణుల యందున్న విశిష్టత్వము నీవలన గూడ విన నాకా సక్తిగా ఉన్నది. అనుగ్రహింపుమని వేడగా కృష్ణుడిట్లు నుడివెను.

ధర్మజా వినుము. బ్రాహ్మణులు సర్వ సమర్థులు. ఐహిక సుఖములకు, దేవ పితృ వర్గమును సత్కార్యముల ద్వారా ప్రీతిగలవారినిగా జేయుటకు, ధర్మ అర్థ కామముల మూలమున భవముక్తి సాధనకును బ్రాహ్మణుల ఆశ్రయము ముఖ్యము. దేవతలకైనను అట్టి చేరుగడ ఆయువు సంపద కీర్తి చేకూర్చును. బ్రాహ్మ ణులు కోపించినచో విరోధులను బూడిద పాలొనరింప గలరు, అనుగ్రహించినచో అభ్యుదయము ప్రసాదింపగలరు. ఐహికాముష్మిక సుఖములు కలుగ జేయగలరు. కావున బ్రాహ్మణులకెపుడు కీడుగాని కోపము వచ్చు పనులు గాని చేయరాదు.

నాకాశ్చర్యము కలిగించిన ఒక ఉదంతమును వినుము. ఇది ఒక నాడు నేను ప్రద్యుమ్నునకు చెప్పినది. మునీంద్రులలో అత్యంత స్వతంత్ర వర్తనము కలవాడు

దుర్వాసుడు ఒకనాడతడు నా నివాసమునకు వచ్చి చిత్రమైన చేష్టలారంభించెను. నవ్వును, వెంటనే మొగముచిట్లించి కోపపడును. విసువు కొమును. చిరపరలాడును. శయ్యపై పెట్టిన ఫలహార భోజనాదులు తానే తినును. ఇవి చాలవు నాకు పాయసము తినవలెనని ఉన్నది అనెను. వెంటనే తెప్పించితిని. కొంతతిని కొంత తన దేహమునకు పూయమనగా పూసితిని. నా ప్రక్కనున్న రుక్మిణి దేహమునకు తానే పూసెను. అటనున్న రథమెక్కి బలిమిని రుక్మిణినెక్కించి తీసికొని పోవుచు ఆమెను ములుగఱ్ఱతో పొడిచెను. ఆమె క్రిందపడినది. దుర్వాసుడు క్రిందికి దిగి రుక్మిణి పైనింత దుమ్ముజల్లి దక్షిణ దిశకు పోయెను. ఇవన్నియు చూచుచు మారు మాట్లాడక నేనా ఋషీంద్రుని వెంట ప్రార్థించుచు వెడలితిని. ఆముని మరలి వెనుదిరిగి వచ్చి ప్రసన్నుడై ఓహో కృష్ణా మిమ్ములను నేను బాధించితినా! ఇదంతయు సహించితిరి. ఒక చిన్నమైనను కోపమును చూపలేదు. కోపమును జయించితివి గాన నీకొక వరమిచ్చుచున్నాను. స్వీకరింపుము. ''ప్రజలెల్లరు తమకొరకు తాము ప్రియమును ఎట్లు వాంఛింతురో అంత ప్రియము నీయందు చూపుదురు గాక. సర్వలోకము నిన్ను పూజించును. ఎందును ఎదురులేని మహామహిమతో నీవు వర్ధిల్లుము.'' మఱియు దుర్వాసుడిట్లనెను. ''కృష్ణా! నాదేహమున పాయసము పూసి నా పాదములకు పూయవైతివి గాన నీ అఱకాలున నీకు అపాయము రాగలదు. అదియును పరమపద ప్రాప్తికి అనుగుణమేగాన అశుభము గాదు. బ్రాహ్మణ జనములయందు నీవెప్పుడును ఈ విధముగనే సహనము సేవ చూపుము.'' రుక్మిణియు మాననీయత యందు సౌందర్య సౌభాగ్యములందు అందరికన్న మిన్నయై యుండును. ఈ వాక్యములు నుడివి దుర్వాసుడంతర్హితుడయ్యెను. ఇదియంతయు ఆతని కఠిన పరీక్షయే.

నేనును రుక్మిణియు మా దేహములందొక కాంతి సంపద అతిశయిల్లినట్లు కనుగొంటిమి. మందిరమున నున్న సకల వస్తువులు మరింత శోభాయమానములైనవి. ధర్మజా చూచితివా బ్రాహ్మణులెట్టివారో. కావున నీవును బ్రాహ్మణులకు భక్తుడవై యుండుము.

### కృష్ణుడు ధర్మజునకు శివుని మహిమ జెప్పుట

కృష్ణుడు నుడివినదంతయు విని సమ్మదము నందిన ధర్మజుడు మరల ఇట్లడిగెను. కృష్ణా! దుర్వాసుడు మహాశివునంశసంభూతుడని వింటిమి. శివుని మహిమ వినదలతుననగా కృష్ణుడాదరమున నిట్లనెను.

ధర్మజా నీవు అడుగవలసిన ప్రశ్ననే అడిగితివి వినుము, అని శివుని దలచి మ్రొక్కి ఇట్లు నుడివెను.

శివుడు మహాదేవుడు. అతనిని మించినదేదియు లేదు. శివుని కోపదృష్టి ధర్మవిరోధులనెల్ల దునుమాడును. శివుని గౌరవింపక మునులు ఒకప్పుడు చేసిన దక్షయజ్ఞము శివుని కోపమున ధ్వంసమైనది కదా తుదకు వారు శరణువేడగా శివుడే రక్షించెను. శివుని లీలల నింకను వినుము.

రాక్షసులు నివసించు మూడు పురములున్నవి. ఆరాక్షసుల నాయకులు మహాబలవంతులై దేవతలను సైతము హింసించుచుండ దేవతలేగి తమ బాధల ను శివుని కడమొఱలు బెట్టిరి. శివుడు వారి యెడల కరుణతో ఒక్క నిశితాస్త్ర మున ఆ పురత్రయమును దానవ సహితముగ భస్మమొనరించి ఆ బాణమును తన తొడయందు పెట్టుకొనగా అదియొక బాలుని రూపు దాల్చెను. ఆ బాలుని తేజమరసి దేవతలే వెఱగందిరి. ఆ బాలుడే దుర్వాసుడు. ఈ అసురుల విధ్వంస మువలననే శివునకు త్రిపురాసుర సంహారుడని కీర్తి వచ్చినది.

ధర్మరాజా! శివుని నామములు వానియర్థములనడిగితివి. వానిని విశదీ కరించి నుడువ నాకును బ్రహ్మకును గూడ శక్యము కాదు. శివుని మనము నందు నిల్పి, శతరుద్రీయము, ఆ దేవుని నామములు పఠించిన వారికిహపర సౌఖ్యములు సులభము. శివుడు సర్వదేవతామయాత్మకుడు అతనినామము సర్వార్థ సాధకము.

మహేశ్వరుడు : మహత్త్వము, ఈశ్వరత్వము కలిగి యుండుటచే ముని జనములు ఈ నామమున శివుని పూజింతురు.

రుద్రుడు : ఉగ్రుడు మహా ప్రతాపము గలవాడగుట ఈ నామము కలిగినది.

మహాదేవుడు : దేవసంఘమున కంతకు మహనీయదేవత

శివుడు : సత్కర్మలన్నిటికి ఫలములయిన శుభములనిచ్చువాడు

స్థాణుడు : సుస్థిరమైన తేజము కలుగువాడు.

బహురూపుడు : సకల చరాచర భూత రూపముననున్నవాడు

ధూర్జటి : ధూమ్రము (పొగ) ఛాయ అనగా నలుపు ఎఱుపు కలిగిన రంగుగల జటలు గలవాడు.

విశ్వరూపుడు : విశ్వులను దేవతలాయన యందు పుట్టిరి.

త్రిపుర మర్దనుడు: త్రిపురములను ధ్వంసము జేసి అందలి రాక్షస నేతలను చంపినవాడు.

సర్వతశ్చక్షువు : బహునేత్రములు కలవాడు.
పశుపతి : భూతములెల్ల పశువులు వానికధిపతి.

ఇంకను వేదోక్తములైన శివనామములు పెక్కులున్నవి. వాని మహిమ వేద విదులెఱిగి సౌఖ్యములందుదురు. ఈ నామములు వినినను పఠించినను నరులు ఇహపర లోక సుఖానందము నందుదురు.

వ్యాస మహాముని శివుని గూర్చి పఠింపదగిన స్తోత్రములు వ్రాసెను. వానిని వినుము. శివుడు సర్వజగములకు నిత్యసాక్షి, లోకములకు శుభ ప్రదుడు, నిరామయుడు, ప్రప్రథమ భూతము, తన ముఖమున అగ్ని జనించినవాడు. భక్తి శ్రద్ధల నియమముతో తనను పూజించు వారికి భవమోక్షములొసగు కుతూహలముగలవాడు. చతురాత్మకత్వము గలవాడై ఆయారీతుల తనను సేవించు వారికి గౌరవనీయ పదవుల నొసగును. ఈ స్తోత్రములను నిశ్చలమనస్సు శివలింగ సన్నిధానమున పఠించువారికి ఆయురారోగ్య సకల కామ్య వైభవములు కలుగును.

### భీష్ముడు ధర్మజునకు ధర్మ సూక్ష్మ ప్రకారము నుడువుట

కృష్ణుని ప్రసంగము విని సంతుష్టాంత రంగుడైన ధర్మజుడు మరల గాంగేయునికి మ్రొక్కి, తాతా! ధర్మ విధానములు పెక్కులున్నవి. అందు ప్రధానముగ ఆచరింపదగినదేది అని అడుగగా భీష్ముడిట్లు నుడివెను.

ధర్మము యొక్క రూపము ధర్మ తత్పరులే చెప్పనర్హులు. కాల ప్రభావమున అవి మరుగు పడుచుండును. సూక్ష్మమైన గ్రాహ్యత లేనిచో అధర్మము ధర్మముగా గన్పడును. చెప్పెడు వారును స్పష్టముగ నుడువలేక పోయినచో ధర్మ విధానము తప్పును. ధర్మ శాస్త్రములను వినువారిని త్యాగబుద్ధి కలిగినవారిని లోభమోహమదగుణములు లేనివారిని అడిగి ఈ ధర్మసూక్ష్మమును తెలిసికొనుము. కామార్థములు మోహమయములని ఎఱిగి తెలిసికొనుము. వేదాధ్యయనము యజ్ఞము సదాచారము లోపము లేకుండ నడుపు వారిని కూడ అడుగుము. ఈ మూడును ధర్మ సూక్ష్మత నెఱుగుటకు ముఖ్య మార్గములు.

అహింస, దానము, సత్యము, కోపమును వదలుట ఈ గుణములను మది యందుంచుము. బ్రాహ్మణారాధనయును ముఖ్యమైనవిధి.

ఎవరు ధర్మమును ద్వేషింతురో, ఎవరు ధర్మము ననుసరింతురో అదియు వినుము. రజస్తమోగుణ వికారములు గలవారు ధర్మమును ద్వేషింతురు. వారికి నరకమే గతి. సత్త్వగుణులు ధర్మపరులు ఊర్ధ్వలోక సౌఖ్యములకు అర్హులు.

## సాధు జనులు - అసాధు జనులు

అసాధు జనులు తమంత తాము ధర్మము నెఱుగరు. సదుపదేశమున కూడ గ్రహించరు. ఈ రెండు విధములను ధర్మమును సాధుజనులెఱుంగుదురు. అంతేకాదు సాధు జనుల గుణ విశేషములను వినుము.

మల మూత్రములు మఱుగుచోట గాని విడువరు. అతిథులకు ముందు భోజనాదులిడుదురు. నడచునప్పుడు పెద్దలకు ముందు దారినిచ్చి వారికి ప్రదక్షిణముగ నరుగుదురు. సత్కార్జవములు నడపుదురు. అర్థులకు సహాయమొనర్తురు. దాంపత్యము గుప్తముగ నుంతురు. గురువు నెడల గౌరవముంతురు. భార్యా పుత్రులకు తృప్తి చేయుదురు. ఇంద్రియాకర్షణకు లోబడరు. తప్పును తెలిసికొని పశ్చాత్తాపము నందుదురు. ఆడంబరము లేక ధర్మమాచరింతురు. అఖిల భూతములందు దయ గలిగి యుందురు.

ధర్మజునకు, పెద్ద సందేహమే మరల వచ్చినది. దేవకీనందనా! జనులందు కొన్ని అనూహ్యములగు పరిస్థితులు గన్పడును. అవెట్లు సంభవించును. ప్రయత్నము లేకయే కొందరకు ధనములభించును. ధర్మపరులు, నీతి విదులు బలవంతులు కూడ సర్వ ప్రయత్నములొనర్చియు ధనము సిద్ధింపదు. కొందరు జనులకు ధనములభించినను అనుభవమునకు రాదు. ఎక్కువగా నేర్చుకొనకపోయినను కొందరకు అలవోకగా విద్యలలవడును. పెక్కు సాధనలు చేసినను మరి కొందరకు విద్య రాదు. రోగ గ్రస్తులై, దెబ్బలు తినినను కొందరు మరణింపరు. పూరి పుడక తాకి నంతనే కొందరు బలవంతులు మరణింతురు. వీనికి కారణమరయలేకున్నాను. అని యడిగిన ధర్మజునకు భీష్ముడిట్లు నుడివెను.

## శుభాశుభములు పూర్వ కృత పుణ్య పాపఫలములు

ధర్మజా! మనము గింజలు నాటినపుడు గదా మొక్కలు మొలచును. పూర్వ జన్మమునందొనర్చిన దాన ధర్మముల ఫలితమీజన్మమున కన్పడును. మున్ను జేసిన తపము వలన, సత్కార్యములవలన, గురు విప్రవృద్ధ సేవల వలన నరునకు భోగ సంపదలు వెదకు కొనివచ్చును. పూర్వజన్మమున అహింస పాటించిన వానికి ఈ జన్మమున దీర్ఘాయువు కలుగును. ఇట్టి మంచి గుణములు లేనివాడు కీడులనుభవింప వలసినదే. ధర్మజా! నేను నుడివిన సద్గుణములను అలవరచుకొనుము నీకు మేలగును. ధర్మగుణమును మనమునందుంచి సుస్థిర భావ శుద్ధి గలిగి ధర్మ తత్త్వము

నెఱిగి దేవతాపూజాదికముల నొనర్చుచు పైని నుడివిన సద్గుణములతో మనుగడ సాగించు నరునకు సత్యము నిత్యము అవ్యయము ఆముష్మికానంద ప్రదమగు పదములభించును. వేదవ్యాస మహాముని సన్నిధిని మహాత్ముడైన కృష్ణుని సన్నిధి నుంటివి. నీవిచారములనెల్ల మాని శాంత వృత్తితో నుండుము. ప్రజలయందు నీకు విజయము లభించును.

## భీష్ముడు ధర్మజునూరడించి ఇంటికి పంపుట

భీష్ముని ఉపదేశామృతమును సర్వమును గ్రహించి ధర్మజుడు ఆనంద పుల కితుడయ్యెను. అంతట వ్యాసమునీంద్రుడు భీష్ముని జూచి గాంగేయా! నీ యుప దేశము వలన ధర్మజుడు వివేకవంతుడయ్యెను. భీమార్జునాదులు ధృతరాష్ట్రుం డును ఇచటనున్న అన్య రాజన్యులును నీదయకు పాత్రులైనారు. ఎల్లరును నిన్నుపాసింతురు. నీ ఆశీస్సులతో ధర్మజుని తక్కుజనులను వారి గృహములకు పంపుము. ధర్మజుడు మరల నిటకు వచ్చుననగా, భీష్ముడు, మనుమడగు ధర్మ జుని వాత్సల్య భావమున జూచి, ధర్మజా నీవిక పురికి జని శుభపరంపరలనందుము. అని ఆదరించి పలికి మఱియు నిట్లనియె.

కుమారా! నీ బుద్ధి ధర్మనిష్ఠ యందుండుగాక. యథావిధి అనేక యజ్ఞములు యయాతి మహారాజువలె చేయుదువు గాక. ప్రజారంజకముగ రాజ ధర్మము నెఱ వేర్పుము. పండిన వృక్షమును పక్షికులము ఆశ్రయించిన రీతిగ బంధు మిత్రులు నిన్నాశ్రయించి సుఖములందుదురుగాక. ఉత్తరాయణము రాగానే నావద్ద కురమ్ము నీవుతల్లి తమ్ములు ధృతరాష్ట్రుడు సుఖముగా నుండుడు.

భీష్ముని పలుకు లాలించి ధర్మజు డామహాత్మునికి దండ ప్రణామము లాచ రించి గంగానందనా! నీ వచనానుసారమే చేయుదునని చెప్పి, మునివరు లనుపగా, కృష్ణుడు తమ్ములును తనతోడ రాగా పురికేగెను. ధర్మజునకెదురేగి పుణ్యాంగనలు ఆరతులెత్తుచుండ విప్రులు దీవించి అక్షతలు జల్లగ పౌరులెల్లరు పరమ సంతో షమున స్వాగత మిచ్చి పురమునకు తోడ్కొని పోయిరి.

ఇట్లు నిరుపమాన మహిమోద్భాసితుడై ధర్మరాజిల్లు చేరగనే మున్ముందు గాంధారికిని తల్లి కుంతికిని ప్రణామములాచరించి, ద్రౌపదికి ప్రియంబొనరించి, తమ్ములనాదరించి తనను గౌరవింపవచ్చిన పురజనులను జానపదులను ఆదర మున జూచి వీడ్కొలిపెను.

అనంతరము ధర్మజుడు భూసురులను పిలిచి దానంబులొసగి, పెద తండ్రి ధృతరాష్ట్రుని పూజించి సంతుష్టుని జేసి, యుద్ధమందు భర్తలను పోగొట్టు కొనిన స్త్రీలనోదార్చి తగిన రీతి ధనములొసగెను.

విజయుడై, తాతగారు భీష్ముని వలన ధర్మోపదేశము నంది వచ్చిన మహా రాజును జూచి కృష్ణుడును తమ్ములును పరమానంద మందిరి. ధర్మజుడును తానా క్షణమున హస్తినాపుర సామ్రాజ్య పట్టాభిషేక మంగళము నందినట్లు మానస మున దలచి పూర్వపు చింతల నన్నియుమాని శాంతచిత్తమున శోభిల్లి, అచటి వారినెల్లరను వారివారి నివాసములకనిపి తాను తన అంతఃపురమందిరమున కేగెను.

## భీష్ముని మహా ప్రస్థానము

సకల జనరంజకుడై ధర్మజుడిట్లు రాజ్యపాలన మొనర్చు చుండ ఏబది దిన ములు గడచినవి. సూర్యుని ఉత్తరాయణమారంభమైనది.

భీష్ముని చూడవలసినదినమేతెంచినది. గాంధారీ ధృతరాష్ట్రులను కుంతిని విదురుని ముందిడు కొని ధర్మరాజు కృష్ణునితో తమ్ములతోడను బయలు దేరెను. యు యుత్ససంజయులు కృపాచార్య ధౌమ్యులు, మంత్రవేత్తలు యాజకులు కూడ వచ్చిరి. నూతన వస్త్ర చందనాగురు పుష్ప ఫల ఘృత భాండములు, అగ్ని, మున్నగు సంభారములతో పరిజనులతో ధర్మరాజరుదెంచి, కొంత దూరమందుననే రథము డిగి కృష్ణాదులతో వీరశయనమందున్న భీష్మనకు ప్రదక్షిణ ప్రణామములాచరించి, ధ్యాన తత్పరుడైన భీష్మునితో నిట్లని ప్రార్థించెను.

మహాత్మా గాంగేయా! మేమందరమును వచ్చితిమి. వ్యాసనారద దేవలాది పరమ సంయ మీంద్రులిటనున్నారు. కనుదెఱచి చూడుమని ప్రార్థించెను. భీష్మ డును అందరిని జూచి ధర్మరాజు చేతిని గ్రహించి, కుమారా! నీవు మేలు చేసితివి. సంతసించితిని. ఇది మాఘ మాస శుక్ల పక్షమని నుడివి, ధృతరాష్ట్రుని జూచి తనయా వ్యాసమునీంద్రుడు నుడువగా సకల ధర్మములు, దేవ రహస్యములు గ్రహించి నిష్కళంకుడవైతివి. భవితవ్యమునకు కలత బొందకుము. ధర్మజాదులు నీకు పుత్ర సమానులే నిన్నతి గౌరవమున జూచి పూజింతురు. నీ తనయులు దుర్యోధనాదులు అవినీతి పరులయి చెడిరి. అందులకిక విచారింపకుము. ధర్మ రాజు, భీమాదుల యెడల వాత్సల్యము జూపి పనులు చేయించుకొనుము.

అని ధృత రాష్ట్రునూరడించి, భీష్ముడు కృష్ణుని జూచి

''దేవదేవ! జీవాత్మక దేవ వంద్య!
శంఖ చక్ర గదా పద్మచారుహస్త!
వాసుదేవ! త్రివిక్రమ! వరద! పరమ
పురుష! ప్రణతి యొనర్చెద గరుణజూడు

బలము నీవ నాకు భక్తుండనీయెడ,
నాలు బిడ్డలేని యట్టి వాడ.
గావునన్ను నధికకారుణ్యమున నిమ్మ
నుజ్ఞ గమలదళమనోజ్ఞ నయన!

అని ప్రార్థించి మాధవా! ధర్మజాదులకు నీవే దిక్కు. కరుణించి వారిని రక్షింపుము. నీవెచ్చటనున్న అచటనే జయము, శ్రీయు వర్థిల్లును. దుర్యోధనునితో పెక్కు మార్లు చెప్పితిని. అతడు నామాట వినక సర్వ నాశనమయ్యెను. అర్జునుడు నీవును నరనారాయణు లను మహామునులు జగద్రక్షణకిట్లు జన్మించిరి అని కృష్ణుని వైపు జూచుచు ధ్యాన పరాయణుడయ్యెను.

కృష్ణుడు భీష్ముని వైపు ఆదరమున జూచి గాంగేయా నీవు పరమ పుణ్యుడవు ఎవరిపైనను కీడెరుగవు, తండ్రిపై భక్తి వలన సర్వ సుఖములుత్యజించితివి. నీకు మృత్యువు వశమైనది. నేననుజ్ఞనిచ్చితిని నీ సోదరులు వసువులను చేరుమనియెను. ఆ మాటలకు పరమానందమునందిన భీష్ముడు ధృతరాష్ట్రుని ధర్మజాదులను తక్కుమునులను జూచి, మీ యనుజ్ఞయు నాకైనదిగదా అని వారిని కౌగిలించుకొని, మీరు ప్రేమ సత్యము నిత్యములుగా భావించి బ్రతుకుడని చెప్పి, తాను మున్నురాజులగెల్చి తెచ్చిన ధనమంతయు విప్రవర్యులకు దానమొనర్చెను. ధర్మరాజును వాత్సల్యమున జూచి, కుమారా! వినుము బ్రాహ్మణులెల్లరును పూజనీయులు ఆచార్యులు ఋత్వికులు వృద్ధులును పూజనీయులు. వారి నెల్లవేళల గౌరవించి పూజించి ధర్మైక నిష్ఠతో ప్రజారంజకుడవై రాజ్యమేలి ధన్యుడవగుమని దీవించెను.

కారణజన్ముడైన మహాత్ముడు భీష్ముడు - అతడు జన్మించిన కార్యము పూర్తియైనది. ధర్మజుని ద్వారా జగతికి ధర్మప్రబోధము చేసినాడు. తానిక దేవలోకమున వసువుల జేరవలయును. ఆ క్షణము వచ్చినదని తలచినాడు. ఇంత దనుక మృత్యువును తనదరికి చేరకుండ శాసించినాడు. సమాహితాత్ముడయి యోగ మార్గమున

ప్రాణవాయువుల నాపెను. అవి ఊర్ధ్వ గతికి పోయినవి. ప్రాణంబుల నెడ బాయ జేయుచున్న అవయవములొక్కొక్కటియు ఎముకలు లేకుండ మిగిలిపోయినవి. దేహమట్లగుట జూచి కృష్ణాదులు అద్భుతాశ్చర్యచకితులై కీర్తించిరి. ఆ సంయమ యోగంబున భీష్ముని ఆత్మ శీర్షమును భేదించి మహాగ్ని ప్రకాశ పుంజము వలె ఆకాశమున కెగసి చాలయెత్తునకు బోయి అదృశ్యమైనది. దేవతలతనిపై పుష్ప వృష్టిగురిసి దేవ దుందుభులు మ్రోగించిరి. సిద్ధ సాధ్యాది గగన చరులు ప్రమోదా తిశయమున భీష్ముని కీర్తించిరి. దేవవ్రతుడు పరమపదసాయుజ్యము నందెను.

దేవ వ్రతుని జీవరహిత శరీరమును పవిత్ర జలముల శుచి గావించి నూతన వస్త్ర చందన మాల్య భూషణాలంకృతము గావించి తలదిక్కు నకులసహదే వులును, పాదంబులదెస ధృతరాష్ట్రుడు ధర్మరాజు పాడెను బట్టి భీమార్జును లిరు దెస వింజామరులు వీచుచుండ చితిపై నుంచిరి. యయుత్సుడు ఛత్రంబును బట్టెను. వృద్ధ కౌరవ స్త్రీలు ఆలపట్టముల బట్టిరి. (వస్త్రముతో గుండ్రముగా జేసిన విసన కర్రలు) యాజకులు సామగానయుక్తముగ అగ్నిని రగుల జేసిరి. కుల పురోహితుడు ధౌమ్యుడు యథావిధి క్రియాకలాపంబు నడపెను. అట్లు వేదోక్త విధిని దేవ వ్రతుని దేహమును, బహుభాండంబుల ఘృతము నెత్తి ప్రయోగించి, శ్రౌతాగ్ని కాహుతి యొనర్చిరి. ధర్మరాజు శ్రద్ధా భక్తి వినయములతో కాంచనమణి ధనరాసులు భూసురులకు జన సంఘమునకు దానమొసగి ఆ అగ్ని సంస్కారము పూర్తి గావునర్చెను.

## గంగా దేవి విచారము

ధర్మరాజాదులారీతి భీష్ముని దేహమునకు అగ్ని సంస్కారము నిర్వర్తించి గంగానదికి జని యథావిధి తిలోదకములిచ్చిరి.

వసువులను వారెనమండుగురు ఒక తెగ దేవతలు. ఒక శాప వశమున వారు మర్త్యులై గంగాదేవికి పుట్టవలసివచ్చినది. గంగ సుందర స్త్రీ రూపమున విహరించు చుండ హస్తినకు రాజు శంతనుడామెను మోహించెను. తనకు పుట్టిన సంతతిని పుట్టగనే నీటిలో త్రోయుదును అను నియమమునకు శంతనునొప్పించి గంగ వివాహమాడెను. వసువు లామె గర్భమున జనించిరి. మొదటి ఏడ్గురిని పుట్టిన వెంటనే గంగ జలమందు పడవైచెను. ఎనిమిదవ సంతతి మహాతేజస్వియైన దేవ వ్రతుడు. ఈ శిశువునట్లు చేయుటకు శంతనుడంగీకరింపక బోవుటచే ఆ బిడ్డను శంతనువద్ద విడనాడి గంగవెడలెను. ఆ దేవ వ్రతుడే భీష్ముడు.

దేవ వ్రతుని మరణము విని గంగ స్త్రీ రూపమున జలముల నుండి వచ్చి పుత్ర శోకమున విలపింపసాగెను. అకటా మహా వీరుడు, పరాక్రమ వంతుడు, యుద్ధమున ఒక శిఖండి యెదుట నిల్వలేక చనిపోయెనా. బుద్ధి శాలి మహాజ్ఞాని, కార్యదక్షుడు, ధర్మతత్పరుడు, దయామయుడు తండ్రి సౌఖ్యములకై తనసుఖములను విడనాడు కొనిన త్యాగి, తన తమ్ముల వివాహ సందర్భమున కాశిరాజు కన్యలను తీసికొని వచ్చునపుడు అడ్డు తగిలిన ఎందరో రాజుల నోడించిన వీరుడు, పరశురాముడు గూడ అతని ముందు నిలువజాలక పోయెనే. అంతటి మహా ఘనునకా యుద్ధమున మరణము అని ఎలుగెత్తి ఆమె విలపించినది.

కృష్ణుడంతట, తల్లీ! నీవేల యిట్లు దుఃఖింతువు. నీ సుతుడు స్వచ్ఛంద మరణమున పరమపదమునొందెను. శిఖండి ఏల మహేంద్రుడైనను ఆ మహా వీరుని సాటిరారు. తనకు మరణేచ్ఛ వరకు మృత్యువును దరిజేరనీయని శక్తి మంతుడు ధర్మమూర్తిగా, కీర్తి సంపాదించిన ఘనుడు. అతని కొఱకు నీకీ విషాద మేల అని ఊఱడించెను. వ్యాసమహామునియు ఆదరణీయ వాక్యములతో నామె కూఱట కలుగునట్లునుడివెను. తనకుమారుని మహోన్నతిని, ధర్మ ప్రబోధమును అతులిత కీర్త్యతిశయమును విని సమ్మోదిత స్వాంతయై గంగా మాత అటనున్నవారి నెల్ల ఆశీర్వదించి తన జలములందు జేరి అదృశ్యయయ్యెను.

భారత చరిత్రలో భీష్ముడు సాటిలేని ధర్మవీరుడు. ఈ మహా భారతేతిహాసము ద్వారా ఆ మహానీయుని కీర్తి ఎల్లెడల వ్యాపించినది. ఆ మహాత్ముడు జగద్వంద్యుడు, ఆతని చరిత మతిపవిత్రము చిరస్మరణీయము. సర్వజన శ్రేయోదాయకము. ఆతని ధర్మోపదేశములు లోక కళ్యాణ ప్రదములు

శుభమ్

మహా భారత ధర్మశాస్త్రము

అనుశాసనిక పర్వము పంచమాశ్వాసము, సర్వము సమాప్తము.

# శ్రీ విష్ణు సహస్ర నామములు

## భీష్ముడు ధర్మరాజునకు ఉపదేశించినవి

హరిః ఓమ్

ఓం విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః,
భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః

పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమా గతిః
అవ్యయః పురుషః సాక్షీ క్షేత్రజ్ఞో ఽక్షర ఏవ చ.

యోగో యోగవిదాం నేతా ప్రధానపురుషేశ్వరః,
నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః.

సర్వః శర్వః శివః స్థాణుర్భూతాదిర్నిధిరవ్యయః,
సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః.

స్వయమ్భూః శమ్భురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః,
అనాధినిధనో ధాతా విధాతా ధాతురుత్తమః

అప్రమేయో హృషీకేశః పద్మనాభో ఽమరప్రభుః,
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః.

అగ్రాహ్యః శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః,
ప్రభూత స్త్రికకుబ్ధామ పవిత్రం మంగళం పరమ్.

ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః,
హిరణ్యగర్భో భూగర్భో మాధవో మధుసూదనః.

ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్. 9

సురేశః శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః 10
అహః సంవత్సరో వ్యాలః ప్రత్యయః సర్వదర్శనః

అజః సర్వేశ్వరః సిద్ధః సర్వాదిరచ్యుతః,
వృషాకపిరమేయాత్మా సర్వయోగవినిస్సృతః

వసుర్వసుమనాః సత్యః సమాత్మాసమ్మితః సమః,
అమోఘః పుణ్డరీకాక్షో వృషకర్మా వృషాకృతిః

రుద్రో బహుశిరా బభ్రుర్విశ్వయోనిః శుచిశ్రవాః
అమృతః శాశ్వతస్థాణుర్వరారోహో మహాతపాః

సర్వగః సర్వవిద్భానుర్విష్వక్సేనో జనార్దనః,
వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః

లోకాధ్యక్షః సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః
చతురాత్మా చతుర్వ్యూహశ్చతుర్దంష్ట్రశ్చతుర్భుజః

భ్రాజిష్ణుర్భోజనం భోక్తా సహిష్ణుర్జగదాదిజః,
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః

ఉపేన్ద్రో వామనః ప్రాంశురమోఘః శుచిరూర్జితః,
అతీన్ద్రః సంగ్రహః సర్గో ధృతాత్మా నియమో యమః

వేద్యో వైద్యః సదాయోగీ వీరహా మాధవో మధుః,
అతీన్ద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః,

మహాబుద్ధిర్మహావీర్యో మహాశక్తిర్మహాద్యుతిః,
అనిర్దేశ్యవపుః శ్రీమానమేయాత్మా మహాద్రిధృక్.

మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాం గతిః,
అనిరుద్ధః సురానన్దో గోవిన్దో గోవిదాం పతిః 20

మరీచిర్దమనో హంసః సువర్ణో భుజగోత్తమః,
హిరణ్య నాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః. 21

అమృత్యుః సర్వదృక్ సింహః సన్ధాతా సన్ధిమాన్ స్థిరః,
అజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా.

గురుర్గురుతమో ధామ సత్యః సత్యపరాక్రమః,
నిమిషోఽనిమిషః స్రగ్వీ వాచస్పతిరుదారధీః.

అగ్రణీర్గ్రామణీః శ్రీమాన్న్యాయో నేతా సమీరణః,
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్.

ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః,
అహః సంవర్తకో వహ్నిరనిలో ధరణీ ధరః.

సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వ ధృగ్విశ్వభుగ్విభుః,
సత్కర్తా సత్కృతః సాధుర్జహ్నుర్నారాయణో నరః.

అసంఖ్యేయోఽప్రమేయాత్మా విశిష్టః శిష్టకృచ్ఛుభిః,
సిద్ధార్థః సిద్ధసంకల్పః సిద్ధిదః సిద్ధిసాధనః

వృషాహీ వృషభో విష్ణుర్వృషపర్వా వృషోదరః,
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః శ్రుతిసాగరః

సుభుజో దుర్ధరో వాగ్మీ మహేన్ద్రో వసుధో వసుః
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః

ఓజస్తేజోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః,
ఋద్ధః స్పష్టాక్షరో మంత్రశ్చంద్రాంశుర్భాస్కరద్యుతిః

అమృతాంశూద్భవో భానుః శశబిందుః సురేశ్వరః,
ఔషధం జగతః సేతుః సత్యధర్మపరాక్రమః 31

భూతభవ్యభవన్నాథః పవనః పావనో౽నలః,
కామహా కామకృత్కాన్తః కామః కామప్రదః ప్రభుః. 32

యుగాదికృద్యుగావర్తో నైకమాయో మహాశనః
అదృశ్యో౽వ్యక్తరూపశ్చ సహస్రజిదనంతజిత్

ఇష్టో౽విశిష్టః శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః,
క్రోధహా క్రోధకృత్కర్తా విశ్వబాహుర్మహీధరః.

అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః,
అపాం నిధిరధిష్ఠానమప్రమత్తః ప్రతిష్ఠితః.

స్కన్దః స్కన్దధరో ధుర్యో వరదో వాయువాహనః
వాసుదేవో బృహద్భానురాదిదేవః పురన్దరః

అశోకస్తారణస్తారః శూరః శౌరిర్జనేశ్వరః
అనుకూలః శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః

పద్మనాభో౽ రవిన్దాక్షః పద్మగర్భః శరీరభృత్
మహర్ధివృద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః,

అతులః శరభో భీమః సమయజ్ఞో హవిర్హరిః,
సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్సమితింజయః

విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదరః సహః,
మహీధరో మహాభాగో వేగవానమితాశనః.

ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః,
కరణం కారణం కర్తా వికర్తా గహనో గుహః,

వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః,
పరర్ధిః పరమస్పష్టస్తుష్టః పుష్టః శుభేక్షణః. 42

రామో విరామో విరజో మార్గో నేయో నయోఽనయః,
వీరః శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః. 43

వైకుణ్ఠః పురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః,
హిరణ్య గర్భః శత్రుఘ్నో వ్యాప్తో వాయురధోక్షజః

ఋతుః సుదర్శనః కాలః పరమేష్ఠిః పరిగ్రహః,
ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః.

విస్తారః స్థావరస్థాణుః ప్రమాణం బీజమవ్యయమ్,
అర్థోఽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః.

అనిర్విణ్ణః స్థవిష్ఠోఽభూర్ధర్మయూపో మహామఖః
నక్షత్రనేమిర్నక్షత్రీ క్షమః క్షామః సమీహనః

యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుః సత్రం సతాం గతిః,
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్.

సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్,
మనోహరో జితక్రోధో వీరబాహుర్విదారణః.

స్వాపనః స్వవశో వ్యాపీ నైకాత్మా నైకకర్మకృత్,
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః.

ధర్మగుబ్ధర్మకృద్ధర్మీ సదసత్ క్షరమక్షరమ్,
అవిజ్ఞాతా సహస్రాంశుర్విధాతా కృతలక్షణః

గభస్తినేమిః సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః,
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః

ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః,
శరీరభూతభృద్భోక్తా కపీన్ద్రో భూరిదక్షిణః. 53

సోమపో౽మృతపః సోమః పురుజిత్పురుసత్తమః,
వినయో జయః సత్యసంధో దశార్హః సాత్వతాం పతిః. 54

జీవో వినయితా సాక్షీ ముకుందో౽ మితవిక్రమః,
అంభోనిధిరనంతాత్మా మహోదధిశయో౽న్తకః,

అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః,
ఆనన్దో నన్దనో నన్దః సత్యధర్మా త్రివిక్రమః

మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః,
త్రిపదస్త్రిదశాధ్యక్షో మహాశృఙ్గః కృతాన్తకృత్.

మహావరాహో గోవిన్దః సుషేణః కనకాఙ్గదీ,
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః.

వేధాః స్వాంగో౽జితః కృష్ణో దృఢః సంకర్షణో౽చ్యుతః,
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః.

భగవాన్ భగహానందీ వనమాలీ హలాయుధః,
ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుర్గతిసత్తమః.

సుధన్వా ఖణ్డపరశుర్దారుణో ద్రవిణప్రదః,
దివిస్పృక్ సర్వదృగ్వ్యాసో వాచస్పతిరయోనిజః.

త్రిసామా సామగః సామ నిర్వాణం భేషజం భిషక్,
సన్న్యాసకృచ్ఛమః శాన్తో నిష్ఠా శాన్తిః పరాయణమ్.

శుభాంగః శాన్తిదః స్రష్టా కుముదః కువలేశయః,
గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః,

అనివర్తీ నివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః,
శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాం వరః 64

శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః,
శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాంల్లోకత్రయాశ్రయః. 65

స్వక్షః స్వఙ్గః శతానన్దో నన్దిర్జ్యోతిర్గణేశ్వరః,
విజితాత్మావిధేయాత్మా సత్కీర్తిశ్ఛిన్న సంశయః.

ఉదీర్ణః సర్వతశ్చక్షురనీశః శాశ్వతస్థిరః,
భూశయో భూషణో భూతిర్విశోకః శోకనాశనః.

అర్చిష్మానర్చితః కుమ్భో విశుద్ధాత్మా విశోధనః,
అనిరుద్ధోఽప్రతిరథః ప్రద్యుమ్నోఽమితవిక్రమః.

కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః,
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః.

కామదేవః కామపాలః కామీ కాన్తః కృతాగమః,
అనిర్దేశ్యవపుర్విష్ణుర్వీరోఽనంతో ధనంజయః.

బ్రహ్మణ్యో బ్రహ్మకృద్ బ్రహ్మా బ్రహ్మవివర్ధనః,
బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణప్రియః.

య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్,
నాశుభం ప్రాప్నుయాత్కించిత్సోఽముత్రేహ చ మానవః.

వేదాంతగో బ్రాహ్మణః స్యాత్ క్షత్రియో విజయీ భవేత్,
వైశ్యో ధనసమృద్ధః స్యాచ్ఛూద్రః సుఖమవాప్నుయాత్,

ధర్మార్థీ ప్రాప్నుయాద్ధర్మమర్థార్థీ చార్థమాప్నుయాత్,
కామానవాప్నుయాత్కామీ ప్రజార్థీ ప్రాప్నుయాత్ప్రజామ్.

భక్తిమాన్యః సదోత్థాయ శుచిస్తద్గతమానసః,
సహస్రం వాసుదేవస్య నామ్నామేతత్ప్రకీర్తయేత్. 75

యశః ప్రాప్నోతి విపులం జ్ఞాతిప్రాధాన్యమేవ చ,
అచలాం శ్రియమాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్. 76

న భయం క్వచిదాప్నోతి రోగాద్భుద్ధో ముచ్యేత బంధనాత్,
భవత్యరోగో ద్యుతిమాన్బలరూపగుణాన్వితః.

రోగార్తో ముచ్యతే రోగాద్బద్ధో ముచ్యేత బంధనాత్,
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః

దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్,
స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః.

వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవ పరాయణః,
సర్వపాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్.

న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్,
జన్మమృత్యుజరావ్యాధిభయం నైవోపజాయతే.

ఇమం స్తవమధీయానః శ్రద్ధాభక్తిసమన్వితః,
యుజ్యేతాత్మ సుఖక్షాంతి శ్రీధృతి స్మృతికీర్తిభిః.

న క్రోధో నచ మాత్సర్యం న లోభో నాశుభా మతిః,
భవంతి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే.

ద్యౌః సచంద్రార్క నక్షత్రా ఖం దిశో భూర్మహోదధిః,
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః.

ససురాసురగంధర్వ సయక్షోరగరాక్షసమ్,
జగద్వశే వర్తతేదం కృష్ణస్య సచరాచరమ్.

ఇంద్రియాణి మనో బుద్ధిః సత్త్వం తేజో బలం ధృతిః,
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రః క్షేత్రజ్ఞ ఏవ చ. 86

సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పతే,
ఆచారప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః. 87

ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః,
జంగమాజంగమం చేదం జగన్నారాయణోద్భవమ్.

యోగో జ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాది కర్మ చ,
వేదాః శాస్త్రాణి విజ్ఞానమేతత్సర్వం జనార్దనాత్.

ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః,
త్రీఁల్లోకాన్వ్యాప్య భూతాత్మా భుంక్తే విశ్వభుగవ్యయః.

ఇమం స్తవం భగవతో విష్ణోర్వ్యాసేన కీర్తితమ్,
పఠేద్య ఇచ్ఛేత్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ.

విశ్వేశ్వరమజం దేవం జగతః ప్రభవాప్యయమ్,
భజంతి యే పుష్కరాక్షం న తే యాంతి పరాభవమ్. 92

న తే యాంతి పరాభవం ఓం నమ ఇతి